నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

నన్ను "నేను" చేరుకోవటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి. కనుక తమవంతుగా భక్తి,జ్ఞాన ప్రచారార్ధం మహానుభావులైన **ద్వారకాదీష్ వాస్తు** వెబ్ సైట్ వారు ఉచితంగా విలువైన గ్రంధాలను ఆన్ లైన్ ద్వారా eBOOK(PDF) రూపంలో అందిస్తున్నారు. వారు చేస్తున్న జ్ఞాన యజ్ఞానికి సాయి రామ్ కూడా తమవంతుగా సహాయం చేసే కార్యక్రమంలో భాగంగా వారి గ్రంధాలను సాయి రామ్ ద్వారా కూడా అందచేస్తున్నాము, ఇందుకు మేము వారికి కృతజ్ఞత తెలియచేసుకుంటున్నాము. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం చేసిన అర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in),మైక్రోసాఫ్ట్ సైట్(http://www.microsoft.com) వారికి కూడా మేము ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) **ద్వారకాదీష్ వాస్తు** వారి వెబ్ సైట్: http://dwarkadheeshvastu.com
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) అర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com

సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement

సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంధ వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము.

గమనిక: భక్తి,జ్ఞాన ప్రచారార్ధం ఉచితంగా eBook రూపంలో **ద్వారకాదీష్ వాస్తు** వెబ్ సైట్ వారు అందించటం జరిగింది. ఈ గ్రంధముపై వ్యాపార,ముద్రణ హక్కులు వారికి గలవు,కనుక వారిని సంప్రదించగలరు.

**SaiRealAttitudeManagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)**

* సర్వం శ్రీ సాయి నాథ పాద సమర్పణమస్తు *

ద్వారకాదీష్ వాస్తు వారి వెబ్ సైట్:

http://dwarkadheeshvastu.com



# అతి విశిష్టం ఈ దానం!

“దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం” అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, ఐవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన ‘ఇచ్ఛ’ (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. “నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది” అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# విషయ సూచిక

## శివపురాణ మాహాత్మ్యము



## విద్యేశ్వర సంహిత

## రుద్రసంహిత

# శతరుద్ర సంహిత

## కోటిరుద్ర సంహిత

## కైలాస సంహిత

## వాయవీయ సంహిత



శ్రీ విఘ్నేశ్వరాయ నమః

# శ్రీ శివ మహాపురాణము

శివాయ గురవే నమః

## శివపురాణ మాహాత్మ్యము

## శౌనకాదుల కోరికపై

## సూతుడు శివపురాణమును ప్రవచించుట

శ్రీలు పొంగిన జీవగడ్డయు పాలుగారిన భాగ్యసీమయుగా వాలిన యీ భరత ఖండంలోని పుణ్యక్షేత్రాలన్నింటా అగ్రస్థానం వహించి వున్నది. ప్రయాగ, శ్రీమహావిష్ణు పాదోద్భూతయైన గంగానదీ శ్రీకృష్ణరాసవేణు రాగసమ్మిళిత కల కలారావయైన యమునా నదీ- యీ రెండు నదులూ సంగమించే మహాద్భుతమైన క్షేత్రమిది.

చాలాకాలానికి పూర్వం శౌనకాది మహర్షులందరూ కలసి, యీ ప్రయాగక్షేత్రం లోని గంగా యమునా సంగమం వద్ద మహాసత్రాన్ని ఆరంభించారు. అఖండం గానూ, అద్వితీయంగానూ సాగుతున్న ఆ యజ్ఞదర్శన కాంక్షులైయెందరో

యోగులు, ఋషులు, మునులు, తాపసులు తరలివచ్చారు. వారితో బాటే వేంచేశాడు సూతుడు.

సూతుడు రోమహర్షణుని కుమారుడు, వేదాలను విభజించి పద్దెనిమిది పురాణాలను ప్రవచించి, పంచమవేద మనదగిన మహాభారతేతిహాసాన్ని ప్రజలకు అందించిన శ్రీ వేదవ్యాసులవారి యొక్క ప్రియతమ శిష్యుడు, యోగిజన శిరోరత్న మైన శ్రీశుకయోగీంద్రులతో కలసి వ్యాసులవారి వద్ద పురాణ రహస్యాలనన్నింటినీ తెలుసుకున్నాడు. ధర్మాలు, శాస్త్రాలూ, వేదాలూ, వాదాలూ అన్నీ క్షుణ్ణంగా నేర్చు కున్నాడు. ఆయనకు తెలియనిదంటూ యేమీ వుండేదికాదు. ఆయన చెప్పలేని పురాణగాథ, విప్పలేని ధర్మసందేహం ప్రపంచంలోనే లేవు. అడిగిన వారందరికీ తన అపూర్వ కథాకథన విధానంతో ఆయా పురాణాలను వినిపించడం, వారిని ధన్యులను చేయడం, తాను చరితార్థుడనయ్యాననుకోవడం, యిదే ఆయన లోకం. అటువంటి సూతమహర్షి ప్రయాగలో జరుగుతున్న యాగానికరుదేరడంతో ఋషు లంతా ఆనందించారు. అర్ఘ్యపాద్యాదులిచ్చి సత్కరించారు. అనంతరం ఆయనను పరివేష్టించి కూర్చున్నవారై "హే సర్వపురాణ కథా కథక జననేతా సూతా! నీ రాకతో మా యాగానికి మాకు కూడా క్రొత్త వెలుగు వచ్చినట్లుగా వుంది. గతంలో నీ నుండి ఎన్నో కథలూ, గాథలూ విని వున్నాము. అయినా మాకు తృప్తిలేదు. నీ దర్శనం లభించినప్పుడల్లా నిన్ను యేదో ఒకటి అడగడం- నీద్వారా విని ధన్యులం కావడం జరుగుతూనే వుంటుంది. అందుచేత ఇప్పటి మన సంగమం కూడా వృథాపోకుండా వుండేందుకుగాను, మాయందు దయగలవాడవై- ఏదైనా ఒక మహత్తరమైన పురాణాన్ని వినిపించు. మీదు మిక్కిలి కలి ప్రభావమగ్నులూ, పాపకార్యాచరణలగ్నులూ అయిన మానవుల సర్వయాతనలనూ భగ్నం చేసేది, పుణ్యాన్ని ప్రసాదించేదీ మాకు తృప్తిని కలిగించేదీ అయిన సద్విషయాన్ని వినిపించవే' అని కోరారు.

'శుభం క్షేత్రమా ప్రయాగ! తీర్థమా గంగా యమునల సంగమం! సమయమా సవనవేళ! సందర్భమా శివేచ్ఛ! ఇంత మంచి సమ్మేళనంలో సాధారణ గాథ లెందుకు? దేన్ని స్మరించినంత మాత్రంచేత జన్మ జన్మాంతర పాపాలూ కూడా నిప్పుల్లో పడ్డ ప్రత్తిపోగుల్లా కాలిపోతాయో, ఏది తెలుసుకున్నంత మాత్రాన జీవకోటిని కప్పిన అజ్ఞానం కుదుళ్ళతో సహా పెకలించుకుని పోతుందో- అటువంటి శివ మహాపురాణాన్ని చెబుతాను వినండి.


మహాకాలేశ్వర జ్యోతిర్లింగం



పార్వతీ పరమేశ్వరులు
శ్రీ గణపతి, కుమార స్వామి



వైద్యనాథ్ ఆలయ సముదాయం, వైద్యనాథ్

శ్రీ నాగేశ్వర జ్యోతిర్లింగం, ద్వారక





శ్రీ నాగేశ్వర ఆలయ సముదాయం, ద్వారక



వైద్యనాధ్ జ్యోతిర్లింగం, వైద్యనాధ్



త్ర్యంబకేశ్వర ఆలయ సముదాయం



కేదారనాథ్ ఆలయం



ప్రయాగే మాధవేశ్వరీ



కొల్హాపురే మహాలక్ష్మీ



మాహూర్యకా ఏకవీర్యే



కామాక్షీ కాంచికాపురీ



హరిక్షేత్రే కామరూపా



ఓఢ్యాణే గిరిజాదేవీ



మాణిక్యా దక్షవాటికే



అలంపురే జోగులాంబా



ఉజ్జయిన్యాం మహాకాళీ



జ్వాలాయాం వైష్ణవి దేవి



ఇంద్రకీలాద్రి పై కొలువున్న కనక దుర్గమ్మ

సాక్షాత్తూ శివునిచేతనే పన్నెండు సంహితలుగా చెప్పబడిన యీ శివ మహా పురాణం యావత్తూ బ్రహ్మకు అనుగ్రహించబడింది. ఆయన దానిని తమ మానస పుత్రులైన నారదమహర్షికి ప్రసాదించారు. నారదులు సనత్కుమారులుకి అంద జేశారు. ఆ సనత్కుమారులు మా గురువుగారైన వ్యాసులవారికి ఉపదేశించారు. అంతటితో శివ జ్ఞానాన్ని పొందిన ఆయన- లక్ష శ్లోకాల విస్తారమైన ఆ శివ పురాణాన్ని 24 వేల శ్లోకాలకు కుదించారు. పన్నెండు సంహితల శివపురాణాన్నీ కూడా 1. విద్యేశ్వర, 2. రుద్ర, 3. శతరుద్ర, 4. కోటిరుద్ర, 5. ఉమా, 6. కైలాస, 7. వాయవీయ అనే యేడు సంహితలుగా మలిచారు. అలా ఆయన రచించిన ఆ అద్భుత శివ మహాపురాణాన్ని వారి కుమారుడూ, సర్వజనవంద్యుడూ అయిన శ్రీ శుకయోగీంద్రులకూ నాకూ కలిపి బోధించారు. అయ్యా! ఆ విధంగా గురు ముఖతః నేను నేర్చుకున్నటువంటి ఆ శివ పురాణాన్ని శివేచ్ఛాపరంగా యధాశక్తి మీకు చెబుతాను. శ్రద్ధగా వినండి.

# శ్రీ శివ మహాపురాణ మాహాత్మ్యము

మీరు విన్న యెన్నో గాథలకన్నా విభిన్నమైనదీ, నిర్ద్వంద్వమైనదీ, గొప్ప మహిమాన్వితమైనదీ యీ పురాణం.



ఓ పురాణ విషయ జిజ్ఞాసువులారా! పుణ్యాత్ములారా! సర్వోప నిషత్సార చషకమూ, సకలాఘవిభంజకమూ, అసమాన పుణ్యప్రదాయకమూ, ఆయురారోగ్య మహైశ్వర్య విద్యాభోగ భాగ్యకారకమూ, ఆద్యంత మంగళ ప్రదమూ, ఆపాత మధురమూనైన యీ శివపురాణాన్ని మించి చెప్పుకో దగినది, వినదగినదీగాని, తెలుసుకో దగినది గాని మరొకటి లేదు.

ఈ శివపురాణంలోని ఒక్క గాథనుగాని, అందులో సగాన్నిగాని- నిత్యమూ భక్తి ప్రపత్తులతో పఠించి

నట్లయితే వారు తప్పనిసరిగా జీవన్ముక్తులవుతారు. ఇచ్ఛా పూర్వకంగా గాని, లేదా యాధాలాపంగాగాని ఒక్కసారైనా యీ పురాణాన్ని చదివినా, వినినా, పాపరహితులవడం ఖాయం చతుర్దశీ తిథినాడు ఉపవాసం వుండి శివ భక్తుల యెదుట యెవరీ పురాణాన్ని ప్రవచిస్తారో- వారు అత్యంత పూజనీయు లవుతారు.

ముఖ్యంగా యీ మహాపురాణంలోని రుద్ర కైలాస సంహితలు రెండూ మహా మహిమాన్వితాలైనవిగా తెలుసుకోండి. ఎవరైతే సమాహితమనస్కులై రుద్ర సంహితను పఠిస్తారో- వారు బ్రహ్మఘ్నులైనాసరే, మూడే మూడురోజుల్లో సర్వ పాపాలనుంచీ విముక్తులైపోతారు. ఈ రుద్ర సంహితను భైరవమూర్తి యెదుట రోజుకు మూడు పర్యాయాలు చొప్పున మౌనంగా పారాయణ చేసేవారికి సమస్త మైన కోరికలూ సిద్ధిస్తాయి. మర్రిచెట్టుకుగాని, మారేడుచెట్టుకుగాని ప్రదక్షిణం చేస్తూ రుద్రసంహితను పఠించినా, వినినా కూడా బ్రహ్మహత్యాది పాపాలనుంచి కూడా బయటపడతారు.

రుద్రసంహిత కన్నా శ్రేష్ఠమైనది కైలాస సంహిత. దీని మహిమ పూర్తిగా తెలిసినవాడు ఒక్క శివుడు మాత్రమే. ఆ పరమేశ్వరునికి కైలాస సంహితా మాహాత్మ్యం పూర్తిగా తెలుసును. బ్రహ్మకీ, నారదులకీ, సనత్కుమారులకీ మా గురువుగారైన వ్యాసుల వారికి కూడా సగం మాత్రమే తెలుసు. ఒక పావుభాగం మాత్రమే నాకు తెలిసి వుంటుందని భావించుకుంటున్నాను నేను. అది కూడా శివేచ్ఛ ప్రాణకోటి సమస్తాన్నీ తరింపజేసే పంచాక్షరీ మహామంత్రము- దాని ప్రభావం- జపవిధి- విధానం ధర్మార్థ కామములచె త్రివర్గ ఫలప్రాప్తికి తగు ఉపాయాలూ, మోక్షసిద్ధికి అవసరమైన సమస్త విషయాలూ క్రోడీకరించి చెప్పబడిన యీ శివపురాణం యొక్క మాహాత్మ్యాన్ని విశదీకరించడం యెవరివల్లా అయ్యే పనికాదు ఐనా నా శక్తి మేరకు ప్రయత్నిస్తాను.

## దేవరాజు కథ

చాలా కాలానికి పూర్వం కిరాత నగరంలో దేవరాజు అనే బ్రాహ్మణుడు ఒకడుండేవాడు. పేరుకైతే బ్రాహ్మణుడేగాని ఆచారవ్యవహారాలు ఏ ఒక్కటీ కూడా పాటించేవాడు కాదు. కనీసం స్నానసంధ్యలైనా సమంగా ఆచరించేవాడు కాదు. పైగా వైశ్యవృత్తి పరాయణుడై ధనార్జనే పరమార్థంగా పెట్టుకున్నాడు. అదైనా వాణిజ్య రూపంలో సాగించలేదు. ఎవరైనా తనను నమ్మిరావడం ఆలస్యంగా వాళ్ళని దగా



చేసేవాడు. కులకలహాలు పుట్టించి, తాను లాభపడేవాడు ఇలాగ డబ్బే దైవంగ భావించి తాను యెనలేని సంపదలు గడించాడు. ఒక నాడు స్నానార్థియై జలా శయానికి వెళ్ళి అక్కడ 'శోభావతి' అనే పేరుగల వేశ్యను చూశాడు. ఆమె వెర్రిలో పడిపోయాడు. ధనికులు దొరికితే గణికలు వదలరు గదా! ఆ వెలయాలు కూడా అతణ్ణి బాగా ఆకట్టుకుంది. ఇద్దరూ స్వేచ్ఛగా కామవిహారాలు సాగించారు. ఎలా వచ్చిన సొమ్ము అలాగే పోవాలని ఊరికే అన్నారా చెప్పండి. పనికిమాలిన పాపాలు చేసి సంపా దించిన సొమ్మంతా ఆ శోభావతి నిమిత్తమై ఖర్చు పెట్టసాగాడు. ఇంట్లో వృద్ధులైన తల్లిదండ్రులు వారించారు. ఆరోగ్యవతీ, అనుకూలవతీ, అనుభవ యోగ్యురాలూ, యౌవనవతీ, సవయస్కాయైన భార్య కూడా వారించింది. అయినా అతడు వినలేదు. ఒక రాత్రికి రాత్రి - భార్యనూ, తల్లిదండ్రులను కూడా హత్య చేసి ఉన్న సంపదంతా మూటకట్టుకుని ఆ కులటపంచకే వెళ్ళిపోయాడు. సొమ్ము లైపోగానే ఆ సోకులాడి అతనిని తరిమివేసినది అతడు ప్రతిష్ఠానపురం చేరాడు.

అక్కడ అతనికి జ్వరం క్రమ్మింది. కాలం కూడా చేరువైపోయింది. ఒక శివాలయంలో విశ్రమించి-లేవలేని స్థితిలో అలాగేపడి వున్నాడు. ఆ శివాలయంలో రోజూ జరిగే శివపురాణ ప్రవచనం వినడంతప్ప మరేమీ పనిలేదా దేవరాజుకి. సరిగ్గా గుళ్ళో శివపురాణం- ఇక్కడ దేవరాజుకు ఆయుర్దాయం రెండూ ఒకసారే పూర్తయ్యాయి. తక్షణమే యమదూతలు వచ్చి దేవరాజు యొక్క సూక్ష్మదేహాన్ని యమపురానికి గొని పోబోయారు. అదే సమయంలో దిగారు శివదూతలు. యమదూతల్ని వారించి- దేవరాజును తమతో తీసుకో వెళ్ళబోయారు. ఆశ్చర్యపడ్డ అంతక కింకరులు దేవరాజు యొక్క పాపాలన్నీ గుక్క తిప్పుకోకుండా వప్ప గించారు. "ఇంత పాపాత్ముడికి ఈశ్వర సన్నిధానమేమిటి?" అని అడిగారు. అప్పుడు శివదూతలు "ఎంత పాప-త్ముడైనా యేమైనా, చివరి ఘడియల్లో కర్మ రహితుడై శివపురాణం విన్నాడు. అదే శివ సన్నిధానాన్ని ప్రసాదిస్తోంది' అని చెప్పి

- దేవరాజును తీసుకొని కైలాసం వెళ్ళిపోయారు. యమదూతలు తమలోకం చేరి ధర్ముడికి యీ విషయం చెప్పారు. ధర్ముడు వాళ్ళకి శివపురాణ మాహాత్మ్యం వినిపించాడు. శివపురాణం చదివినా, విన్నా, తెలుసుకున్నా అటువంటి వారిజోలికి వెళ్ళవద్దని దూతలను శాసించాడు. ఓ మహాత్ములారా! ఈ శివపురాణాన్ని విన్నా, చదివినా అటువంటి మహత్తు కలుగుతుంది. ఉదాహరణకు మరోకథ కూడా చెబుతాను వినండి.

## చంచులోపాఖ్యానము

'బాష్కలం' అనే వూరుండేది. ఆ వూర్లో బిందుగుడు అనే బ్రాహ్మణుడున్నాడు. వాడు పరమనీచుడు. వాడేనన్నమాటేమిటి, ఆ వూరి తరహాయే అలా వుండేది. అందరికంటే అఖండమైన పాపాత్ములు వాళ్ళు. వాళ్ళందరిలోకి ముందుండేవాడు. యీ బిందుగుడు. ఒకానొకనాడతను ఒకానొక వేశ్యను చూసి దానిని మరిగాడు. భార్య ముఖం చూడడమే మానేశాడు. బిందుగుడి భార్య 'చంచుల' భర్త ప్రవర్తనకు ఆమె యెంతగానో బాధపడింది. కొన్నాళ్ళు ఎదురు



చూసింది. కాని, తన వయసు యొక్క తొందరను అణచుకోలేక తాను కూడా పరపురుష సాంగత్యంలో పడిపోయింది.

భార్య జారిణిగా మారిన సంగతి బిందుగుడికి తెలిసింది. తక్షణమే యింటికి వచ్చి భార్యను కొట్టాడు. ఆమె ఏడుస్తూనే - తన బాధను చెప్పింది "నువ్వు సుఖ పెడతావని నిన్ను కట్టుకున్నాను. రోగమో రొష్టో అయితే నాకర్మ అనుకునేదాన్ని, ఆరోగ్యంగా వుండి కూడా నువ్వు వ్యభిచారిణిలతో సుఖపడుతూ నన్ను నిర్లక్ష్యం చేస్తే నేనేమైపోవాలి? నువ్వు తిన్నగావుంటే నేనిలా యెందుకు చేస్తాను?"అని అడిగింది. బిందుగుడు చాలా విశాలహృదయంతో భార్యను అర్థం చేసుకున్నాడు. అందువల్ల 'చంచులా! నేను వ్యభిచరించనిదే వుండలేను. నీవు పురుష సంపర్కం లేకుండా వుండలేవు. అందువల్ల ఒక ఒప్పందం చేసుకుందాం నువ్వు జారిణిగానే తిరుగు. జారులదగ్గర డబ్బులు గుంజి నాకు యియ్యి. నేను వ్యభిచారం చేసుకుంటాను. అప్పుడు మనిద్దరికీ గొడవలుండవు. నువ్వు సంసార స్త్రీలాగా, నేను నీ భర్తలాగ చలామణి కావచ్చు అని సలహా యిచ్చాడా మేధావి. చంచుల అందుకు అంగీకరించింది.

రోజులలాసాగుతుండగా, బిందుగుడు ఒకనాడు హఠాత్తుగా మరణించాడు. చంచుల విధవరాలైపోయింది. అయినా జారత్వం మానలేకపోయింది. కాలవశాన చంచుల గోకర్ణక్షేత్రం వెళ్ళింది. అక్కడ మహాబలేశ్వరాలయంలో పురాణ శ్రవణం చేసింది. పాపులు ఎలా నరకానికి పోతారో- యెలా హింసించబడతారో వింది. అది వినగానే ఆమెకు భయం వేసింది.

ప్రవచనానంతరం ఆ పౌరాణికున్ణి కలిసి తన కథనంతా చెప్పింది. తన పాపానికి పరిహారం చెప్పమంది. అతడామెను శివపురాణ శ్రవణం చేయమన్నాడు. ఆమె అలాగే ఆచరించింది. ఫలితంగా దేహాంతంలో కైలాసం చేరి గౌరీదేవి యిష్ట సఖులలో ఒకరిగా మసలసాగింది.

## చంచుల తన భర్తకు కైలాసవాసము కల్పించుట

ఒకనాడు చంచుల అమ్మవారిని చేరి స్తోత్రం చేసింది. తన నరజన్మ గురించి చెప్పి- బిందుగుడి విషయమై ప్రశ్నించింది. అమ్మవారాలోచించి- "అమ్మాయి! నీ భర్త మరణించి నరకం చేరాడు. అక్కడ అనుభవించవలసినదంతా అనుభవించాడు. ప్రస్తుతం వింధ్యపర్వతం మీద పిశాచమై సంచరిస్తున్నాడు"అని చెప్పింది.

చంచుల బాధపడింది తన భర్తకు కూడా ఉత్తమగతులను అనుగ్రహించుమని కోరింది. అమ్మవారు దయాపూర్వకమైన దరహాసం చేసింది. తక్షణమే గంధర్వు డైన తుంబురుణ్ణి రప్పించి -చంచులతోబాటు వింధ్యాద్రికి వెళ్ళవలసిందిగా- ఆజ్ఞాపించింది. అక్కడ బిందుగ నామకమైన పిశాచం వుంది. ఆ పిశాచానికి శివ పురాణమును వినిపించి- శుద్ధుణ్ణి చేసి కైలాసం తీసుకురా' అని చెప్పి - శివదూత లను తోడిచ్చి పంపింది.

వాళ్ళు వింధ్యపర్వతం చేరారు. అక్కడ పిచ్చిగంతులు వేస్తూ వెర్రి మొర్రి చేష్టలు చేస్తూ- తిరుగుతున్న బిందుగ పిశాచాన్ని చూసారు. తుంబురుడు పిశాచాన్ని చేరదీసి శివపురాణం వినమన్నాడు. 'విననుగాక వినను' పొమ్మన్నాడు బిందుగుడు. 'ఇదిగాదు పని' అనుకున్న తుంబురుడు- చంచుల, శివదూతల సాయంతో బిందు గుడి కాళ్ళూచేతులూ కట్టిపడవేశారు. కదలకలేక, మెదలకలేక పడివున్న బిందుగుడి ముందు ఆసీనుడై- తన వీణ సవరించి అదిలోకమనోహరంగా శివపురాణాన్ని గానం చేయసాగాడు. ఆ గానానికి ముగ్ధులైన వియచ్చరులంతా వింధ్యకు దిగి వచ్చారు. శివపురాణాన్ని ఆసాంతం విని ధన్యులయ్యారు.

తుంబురుడు చేసిన శివపురాణ గానం పూర్తయ్యేసరికి బిందుగుడి పిశాచ రూపం పోయింది. అతడు కూడా దివ్యరూపుడూ, గౌరవర్ణుడూ అయ్యాడు- చంచుల భర్తతో సహా కైలాసం చేరి శివపార్వతుల సేవ చేసుకుంటూ ఆనందంగా వుండసాగింది.

అంతటి మాహాత్మవంతమైన పురాణం యిది. మనం ఎవరినైనా బాగు చేయదలచుకుంటే, వారిని కట్టి కొట్టి అయినాసరే శివపురాణం వినిపించాలి. వింటే చాలు- వాళ్ళు శుద్ధులైపోతారు.

అపురూపమూ, ఆనందదాయకమూ అఘవిదారకమూ అయిన అంబికాపతి యొక్క అద్భుత పురాణాన్ని వినిపిస్తున్నాను. శ్రద్ధగా వినండి సుమా!" అంటూ- ముందుగా, పైఁజెప్పిన స్కాంద పురాణాంతర్గత శివపురాణ మాహాత్మ్యాన్ని వినిపించి- ఇక శివ పురాణ ప్రవచనాన్ని ఆరంభిస్తున్నాడు సూతుడు.

★★★



# శ్రీ శివ మహాపురాణము

## విద్యేశ్వర సంహిత

### శివ పురాణ ప్రవచనారంభం

సీ॥ ఉండు మిన్నును మన్ను నిండి యొక్కండయి
శ్రుతి శిరమ్ములు నూరుమ్రోయ నెవడు
నే యొక్కనికె చెల్లు నీశ్వర శబ్దం
బనన్యార్థమై యథార్థాక్షరముగ
గాలింతు రెవ్వాని లోలో ముముక్షువు
లాయా ప్రాణేంద్రి యాధ్వములను
దిక్కాలములు లేని యొక్కటియైనను
స్థిరభక్తి యోగంబు జేర్చునెవని॥

తే॥ నజుడు హరియందు తుది మొదలరయ లేని
తైజసస్తంభమైనిల్చి స్థాణువయ్యు
మూర్తు లెనిమిది ప్రత్యక్షములుగ వెలుగు
శివుడు మీకిడుగాక! నిశ్శ్రేయసంబు॥

(శివశ్రీ మల్లంపల్లి శరభేశ్వరశర్మ కృత విక్రమోర్వశీయము నుండి)

# మునులు బ్రహ్మతో భాషించుట

శౌనకాదులారా! శ్రద్ధగా వినండి, సృష్ట్యాదిగా యెన్నోకల్పాలు గడిచిపోయాయి. ప్రస్తుతం మనం ఉన్న కల్పం పేరు శ్వేతవరాహ కల్పం. ఈ శ్వేతవరాహ కల్పం ఆరంభంలో - ఆరు గొప్ప గొప్ప గోత్రాలకు చెందిన ఆరుగులు మునులు ప్రోగు బడి- ఇదే ప్రయాగలో కూర్చున్నవారై- "పరబ్రహ్మమెవరా" అని తర్కించుకున్నారు. ఎన్నాళ్ళు గడిచినా వాళ్ళ తర్కం తెమలకపోవడంవల్ల సరాసరి సృష్టికర్తయైన బ్రహ్మను కలిశారు/"అందరినీ సృష్టించిన వాడివి నువ్వే. గనుక మాకెవరికి తెలియని విషయాలు నీకు ప్రత్యక్షంగా తెలిసి వుంటాయని నమ్ముతున్నాము. కాబట్టి చతుర్ముఖా! మా సందేహం తీర్చు పరబ్రహ్మ పరమపురుషుడూ, అని పిలువబడు తున్నవాడూ, చెప్పబడుతున్నవాడూ యెవరు? నువ్వు తప్ప మా సందేహం తీర్చగల వారెవరూ మాకు తోచడంలేదు" అని ప్రాధేయపడ్డారు. అప్పుడు వారి మధ్య సంభాషణ యిలా జరిగింది.

**మునులు:-** హే ధాతా! పరుడు - పరు-డని చెప్పబడే పరముడు ఎవరు?

**బ్రహ్మ:-** రుద్రుడు - ఆయన సదాశివుడు.

**మునులు:-** ఆ శివతత్త్వం ఎలా తెలుస్తుంది.

**బ్రహ్మ:-** శివానుగ్రహం వల్లనే తెలుస్తుంది. ఆయన యొక్క అసాధారణమైన అనుగ్రహం వల్ల శివభక్తి యేర్పడుతుంది. భక్తి వల్ల క్రమక్రమముగా సంపూర్ణాను గ్రహం సిద్ధిస్తుంది. దానివల్ల సాధ్యసాధన సాధకజ్ఞానం సమకూరుతోంది. తద్వారా శివతత్త్వం తెలుసుకోవాలి.

**మునులు:-** సాధ్యాలలో ముఖ్యమైనది ఏది? సాధనం అంటే ఎటువంటిది? సాధకుడు అంటే ఎవరు?

**బ్రహ్మ:-** సాధ్యాలన్నిటిలోనూ అత్యంత ప్రధానమైనది శివపదప్రాప్తి ఒక్కటే. అందుకు సాధనం శివారాధన చేయడం మాత్రమేనని తెలుసుకోవాలి. శివా నుగ్రహం వల్ల యేర్పడిన శమదమాది సంపత్తులు కలవాడే సాధకుడు అని చెప్పబడుతున్నాడు. వేదాలలో చెప్పబడినట్లుగానూ, తన కుల ఆచారవ్యవహారాల రీత్యానూ, తన ఆశ్రమ ధర్మనిర్ణయాలకు అనుగుణంగానూ- కర్మాచరణగావిస్తూ ఆ సర్వకర్మల ఫలములనూ శివార్పణం చేస్తూ వుండే సాధకుడు జన్మాంతరాన

- శివా వాసమైన కైలాసపదమందుకుంటాడనడంలో సందేహంలేదు. ఇక సాధన దీనికి శ్రవణం, కీర్తనం మననం- అనేవి మూడు చాలా ముఖ్యమైనవి.

**మునులు:-** ఆ మూడింటి గురించి మరింత విపులంగా తెలియజెయ్యి.

**బ్రహ్మ:-** వినండి. పరమేశ్వరుని లీలావిలాసాదులను మనసారా వినడమే శ్రవణం. మనం మన కంటితోనే లోకాన్ని పరిశీలిస్తాం. అలా కంటికి తోచని వాటిని గురించి వినాలని కుతూహల పడతాం. అటువంటప్పుడు, కేవలం కంటికే కాదు వాక్కులకీ, మనస్సుకీ కూడా గోచరంగాని ఆపరమేశ్వరుడి గురించి వినాలని యింకెంత తపనగా వుంటుంది. అదిగో అలా తపించి ఆ సర్వేశ్వరుడి గురించి



గురుముఖత వినాలి. అది నాంది. అటుపై - ఎక్కడ శివనామం వినపడినా, శివ పరమైన విషయం చెవిసోకినా తొలగిపోకుండా- యువతుల సోయగాలు గురించి యువకు లెంత తన్మయంగా వింటారో- అలా వినాలి. అది శ్రవణం- ఆ తరువాతది కీర్తనం. అనగా ఆది దైవతమైన ఆ పరమేశ్వరుని- దుష్టశిక్షణ, శిష్ట రక్షణాది గాథలను లీలలను నిత్యం కీర్తించుతూ వుండాలి. వాటినే గానం చేస్తూ వుండాలి. అది కీర్తనం కేవలమనోగతంగా ఆకైవల్యదాయకుని భావించుట - అర్చించుట అనేవే మననం. ఈ మూడింటికీ మూలం- సజ్జన సాంగత్యం, అనునిత్యమూ కూడా వృద్ధులూ, జ్ఞానులూ, సద్బుద్ధి కలవారూ అయిన వారితో సంచరించడంవలనా, వారితోనే కూడా వుండడం వలనా- నాలుగు మంచి ముక్కలు వినడం జరుగుతుంది. అలా ఆరంభమవుతుంది. శివపరమైన శ్రవణం, వింటున్న కొద్దీ కీర్తనానికి పునాది దృఢతరమౌతుంది. కీర్తనం- పరిపక్వస్థితికి చేరుతున్నకొద్దీ మననానికి బీజం పడటం, మనసు మననోన్ముఖం కావడం సిద్ధిస్తాయి. అందుచేత శ్రవణ, కీర్తన, మననము లనబడే యీ మూడూ, క్రమంగా ఒకదానికన్నా ఒకటి ఉత్కృష్టమైనవిగా తెలుసుకోవాలి. ఇంతకీ, అంతో యింతో శివానుగ్రహం వుంటే తప్ప యేదీ సిద్ధించదు.

ఉపరివిధ షట్కులీన మునిగణ- చతుర్ముఖ సంవాదం తరువాత తిరిగి సూతుడు ఇలా చెప్పసాగాడు.

# సనత్కుమారుడు వ్యాసునకు శైవము బోధించుట



ఒకప్పుడు మా గురువుగారైన వ్యాసుల వారు సరస్వతీ నదీతీరంలో తపస్సు చేసుకుంటుండగా, అక్కడికి సనత్కుమారులవారు వేంచేశారు. వ్యాసుడాయనకు అర్ఘ్యమిచ్చి సత్కరించాడు. సంతుష్టుడైన సనత్కుమారుడు - 'సాత్యవతేయా! సత్యమైనదాన్నే సదా ధ్యానించాలి. శివుణ్ణి మించిన సత్యంలేదు. కాబట్టి, నీలాంటివాడు శివ సాక్షాత్కారం పొందాల్సింవుంది. ఇంతకీ నువ్విక్కడ దేనికోసం తపస్సు చేస్తున్నావు?" అని అడిగాడు. బదులుగా వ్యాసుడు 'స్వామీ! ప్రజలందరికీ ధర్మార్థ కామమోక్షాలు నాలుగూ సిద్ధించే విధివిధానాలన్నీ గ్రథితం చేశాను. కాని ఇంత తెలిసి ఇంత చేసికూడా నాకింతవరకూ ముక్తి సాధనమైన జ్ఞానం కలుగలేదు. ఆ చింతలోనే మోక్షార్థినై తపస్సు చేస్తున్నాను" అని చెప్పాడు. నవ్వాడు సనత్కు మారుడు- "దానికింతచింతదేనికి? గతంలో ఒకసారి నేను కూడా నీలాగే కలతబడి -మందరాద్రిమీద తపస్సు చేశాను. అప్పుడు శివానుగ్రహంవల్ల కరుణకు జ్ఞానానికి మారు పేరైనవాడూ, సర్వసాక్షి ఆయన నందికేశ్వరుడు తారసిల్లి నన్ను ఓదార్చాడు. శ్రవణకీర్తన మననములు అనే మూడింటి ద్వారానే ముక్కంటి దయనూ- తద్వారా పరమపదాన్ని చేరుకోగలమని బోధించాడు. కాబట్టి ఓ పరాశరనందనా! నువ్వు కూడా అదే విధంగా శ్రవణ కీర్తన మననత్రయాన్ని అనుష్ఠించి, తాపత్రయాల్ని వర్జించి, ప్రశాంత చిత్తుడివీ, మోక్షగామివీ కావయ్యా" అని చెప్పి/అనుచర సహితుడై స్వకీయ విమానారూఢుడై బ్రహ్మలోకమార్గముగా వెళ్ళిపోయాడు. అందుచేత శ్రవణాది సాధన త్రికమొక్కటే ముక్తిదమని మనమంతా తెలుసుకోవాలి- అన్నాడు సూతర్షి.

"నువ్వు చెప్పింది బాగానే వుంది కాని ఆ సాధనాత్రికం చాలా సమయం తీసుకుంటుంది. కృత, త్రేతాయుగాలలోనే అది సాధ్యం. ద్వాపరంలో కూడా కష్టపడితే సాధించుకోవచ్చు! కాని-కలియుగంలో మానవులు మరీ అల్పాయుష్కులై పోతారు కదా!/మరి అటువంటి అతిస్వల్పకాల జీవులకు కూడా మోక్షం లభించేందుకు సులభోపాయం ఏమీ లేదంటావా?" అని అడిగారు శౌనకాదులు.

# లింగార్చనా ప్రాముఖ్యము



సూతుడు చెప్పనారంభించాడు. 'కలికాలంలోనే కాదు. ఏకాలంలోనైనా సరే సూక్ష్మంలో మోక్షం దొరికేందుకు మరో మార్గం కూడా వుంది. అదే శివలింగార్చన. ఆ పరమేశ్వరుని లింగంగా భావించి కరపీఠంలోగాని, ఇంట్లోని దేవతార్చనా పీఠంలోగాని, ఏదైనా ప్రత్యేక మందిరంలోగాని, పుణ్యక్షేత్రంలోగానీ-నిత్యమూ ఆరాధించు వారికి తప్పనిసరిగా ముక్తి లభిస్తుంది. ధ్యాన, ఆవాహన, ఆసన, పాద్య, అర్ఘ్య, ఆచమనీయ, అభిషేక, వస్త్ర, భస్మ, గంధ, అక్షత, పుష్ప, బిల్వ, ధూప, దీప, నైవేద్య, తాంబూల, మహానీరాజన, మంత్రపుష్ప, నమస్కార, ప్రార్థనలనే ఏక వింశత్యుపచారాలతోటి అర్పించాలి. ఛత్రం, చామరం, తాళపత్రం, అద్దం, ఘంట, శంఖం, గీతం, నృత్యం, ప్రదక్షిణం వంటి రాజోపచారాలు కూడా ఆచరించినట్లయితే మరీ మంచిది. అలా రోజూ శివపరంగా లింగారాధన చేసేవారు తప్పకుండా ముక్తులైపోతారు. లింగారాధన చేయలేనివారు-నాగభూషణ, నీలకంఠ, వ్యాఘ్రాంబర, ఫాలనేత్ర, చంద్రశేఖరాది సర్వోన్నత తత్వాలతోనూ కూడిన శివమూర్తిని పూజించినా కూడా సత్ఫలాన్నే పొంద గలుగుతారు. శివుడొక్కడు మాత్రమే నిష్కలత్వంచేత లింగంగానూ, సకలత్వంచేత మూర్తిమంతంగానూ, ఆరాధింపబడతాడు. తక్కిన దైవతాలన్నీ మూర్తిమంతాలూ, సాకారాలేగాని, పరతత్త్వమైన నిరాకారతను పొందలేకపోయాయి. శివుడే సర్వేశ్వరుడనడానికి యిదే ఆధారం మనకి."

అది విని మునులు మళ్ళా యిలా అడిగారు. "నువ్వు చెప్పేది చాలా ఆశ్చర్యంగా వుంది. పరబ్రహ్మమైన ఆ శివుడు సకల, నిష్కలరూపాలు రెండింటినీ ఎందుకు పొందాడు? ఆ విషయం వినిపించు."

"చెబుతాను గతంలో మార్కండేయుడు యిదే ప్రశ్నను అడగగా, దానికి నందికేశ్వరుడు, చెప్పిన సమాధానాన్నే మీకు చెబుతాను వినండి" అని ఆరంభించాడు సూతమహా పౌరాణికుడు.

# లింగావిర్భావ చరిత్రము



**నందికేశ్వర ఉవాచ:-** ఒకనొక సృష్టి ఆరంభించబడిన వేళ- అప్పటికి అయిదు ముఖాలతో అలరారే అబ్జాసనుడు విష్ణువు దగ్గరకు వచ్చాడు. అసలే అందగాడైన అబ్జనాభుడు- మరింత జగన్మోహనంగా నిదురపోతున్నాడు. శేషపాన్పు మీద పారిషదులందరూ యుక్తమైన ఉపచర్యలు చేస్తున్నారు. తాను మొదలు పెట్టిన సృష్టినిరాటంకంగా సాగుతూన్న సూచనలవలన కాస్తంత అహంకారంతో వున్నాడు. కంజోద్భవుడు అహంపుట్టడం ఆలస్యంగా-ఆక్రమించేస్తుంది శివమాయ. అదే జరిగింది బ్రహ్మకి ఆ శివమాయలోపడి, అహం పెంచుకుని, ఏమయ్యా నాలుగు చేతులవాడా! ఇంతటి సృష్టికర్తను నేనువస్తే, నన్ను లెక్క చేయకుండా, లేచి, ~~మర్యాద చేయకుండా లేచి,~~ మర్యాద చేయకుండా, నిదరోతున్నావా? అందరికి తండ్రిని నేను, గురువుని నేను, ఇప్పటికైనా తెలివి తెచ్చుకుని లే, లేచి నన్ను మర్యాద చెయ్యి అతిథిమర్యాద చేయనివారికి ప్రాయశ్చిత్తం విధించబడుతుంది తెలుసా? అన్నాడు.

మండుకొచ్చింది మహావిష్ణువుకి తన బొడ్డులోంచి మొలిచిన తామరపువ్వు లోంచి పుట్టిన విరించి- తన నల్లా నిర్లక్ష్యం చేయడం, తనే తండ్రిననడం ఆయనకి సుతారామూ నచ్చలేదు అయినా స్థితి కర్తకదా! అందుకని పైకి మాత్రం చిరు నవ్వులు నవ్వుతూ, బ్రహ్మదేవా! నీకు స్వస్థత కలుగునుగాక" అంటూనే బ్రహ్మకన్న తన ఆధిక్యతను చెప్పుకోసాగాడు ఎప్పుడైతే ఆత్మస్తుతి మొదలుపెట్టాడో, అప్పుడే శివమాయ ఆక్రమించేసింది విష్ణువును. బ్రహ్మ విష్ణువులిద్దరూ కూడా శివమాయలో మునిగిపోయారు నువ్వెక్కువా? నేనెక్కువా? అనే వాదమల్లా - నేనే సర్వేశ్వరుణ్ణి అంటే కాదు నేను సర్వేశ్వరుణ్ణి అనుకునే దాకా వెళ్ళిపోయింది. మాటామాటా పెరిగింది. చివరికి యుద్ధంగా పరిణమించింది.

విష్ణువువైపు విష్ణుగణాలూ, బ్రహ్మ వైపు బ్రహ్మగణాలూ సమకూడి సమర శంఖారావం చేశాయి/దేవతానీకం, దివ్యర్షిగణాలూ ఊర్ధ్వంలో నిలిచి యీ వూహించలేని పోరాటాన్ని తిలకించసాగాయి. యుద్ధం - యుద్ధం స్థాయి నుంచి ప్రళయం స్థాయికి మారుతోంది. దానికి పరాకాష్ఠగా విష్ణువు మాహేశ్వరాస్త్రాన్ని ప్రయోగించాడు. అదిచూచి బ్రహ్మ పాశుపతాస్త్రం ప్రయోగించాడు. ఆ లోకభీకరా లైన ఆ యిషీకద్వయ ప్రభావానికి- దేవతలు దిమ్మెరపోయారు. 'శివశివా, శివశివా, శరణు శరణు శివశివా' అంటూ ఋషి, దేవగణాలు కైలాసానికి చేరాయి. సర్వశక్తి మంతుడా సదాశివుడు. వచ్చిన వాళ్ళను ఓదార్చాడు. అభయమిచ్చాడు. ఉన్నవాడు ఉన్నట్లుగా అదృశ్యమై, మాహేశ్వర, పాశుపతాస్త్రాలతోడీకొంటున్న బ్రహ్మ విష్ణువు లనడుమ అగ్నిస్తంభమై ఆవిర్భవించాడు.

మాధవుడు వేసిన మహేశ్వరాస్త్రమూ, పంకజాసనుడు ప్రయోగించిన పాశు పతాస్త్రమూ-రెండూ కూడా ఆ తైజసస్తంభంలో విలీనమైపోయాయి. తుదీ మొదలూ తెలియకుండా-వెలుతురే వెలుతురుగా వెలిగిపోతున్న ఆ నిలువు వెలుగుకు నివ్వెరపోయినట్లుగా - ఆ మహాతేజం ముందు అక్కడున్న వారందరి తేజస్సులూ తప్పిపోయాయి. బ్రహ్మవిష్ణువులు కళలు దప్పి కలతపడసాగారు. వారివారి అహం కారాలు అణగారిపోయి, అంతకుముందెన్నడూ కనీవినీ యెరుగని - యీ అపూర్వ జ్వాలాస్తంభం వల్ల యేర్పడ్డ అద్భుతరసంలో మునిగిపోయారు. తానే సర్వజ్ఞుడననీ, తానే సర్వస్రష్టయనీ. తగువులాడుకున్న తామరసనయన, తామరసగర్భులిద్దరికీ యీ తత్కాలావిర్భూత వినూత్న తేజం పట్టుబడలేదు. ఇది వాళ్ళు సృష్టించింది గాదు. వాళ్ళు ఎరిగినదికాదు. అవయవాలు లేకుండా అప్రమేయంగా, అనూహ్యంగా

పరిణామరహితంగా - తుది మొదళ్ళు లేకుండా వున్న ఆ వెలుగు యొక్క అంతూదరీ తెలుసుకోవడమే విధి విష్ణువులకు సమస్యగా పరిణమించింది.

తక్షణమే బయల్దేరారు వాళ్ళు. దాని మొదలు తెలుసుకోవడం కోసం విష్ణువు శ్వేతవరాహమై - పాతాళాన్ని చీల్చుకుంటూ వెళ్ళాడు. ఆ వెలుగు యొక్క తుది కనిపెట్టడం కోసం బ్రహ్మదేవుడు హంసరూపంతో ఊర్ధ్వానికి సాగాడు. ఎంత దొలుచుకుపోతున్నా కాని- "మొదలు దొరకక-అలసిపోయాడు ఆదినారాయణుడు ఇక తనవల్ల కాదనుకొని- వెనుదిరిగి యుద్ధస్థలానికి చేరాడు విష్ణువు. పైకి వెళ్ళిన బ్రహ్మకి కూడా ఏమీ పాలు పోలేదు. ఆ నిట్టనిలువుకు తుదియొక్కడో చిక్కలేదు, కాని- సరిగ్గా అదే సమయానికి శివతైజస స్తంభాగ్రంనుండి ఒక మొగలిపువ్వు క్రిందకు పడుతూ కనిపించింది. బ్రహ్మ దానిని ఆపాడు, తన అన్వేషణ గురించి చెప్పాడు.

"ఈ నిట్టనిలువు నిట్టకు అగ్రం నీకు తెలుసా? అని అడిగాడు. అందుకా మొగలిపువ్వు ఓ మొలక నవ్వు నవ్వి-"నేను వస్తున్నదే అక్కడనుంచి, కాలమానం రీత్యా అయితే చాలా యుగాలైంది నేను జారి యిప్పటికిక్కడకు చేరాను. ఈ లోపల ఈ స్తంభంయింకెంత పెరిగివుంటుందో తెలియదు. నా మాటవిను. దీని అగ్రాన్ని చూడడం నీ తరంకాదు" అంది. బాధపడ్డాడు బ్రహ్మ. తుదికానకపోతే విష్ణువు ముందు లోకువైపోవాల్సివస్తుంది. లేదా విష్ణువుతో సమానుడవ్వాల్సి వస్తుంది అది తనకు నచ్చదు. తను విష్ణువు కన్నా గొప్పవాడు అని అనిపించు కోవాలి.

అందుకని ఒక ఆలోచన చేశాడు. మొగలిపువ్వుని చూసి- ఓ కేతకీసుమమా! నువ్వు నాకో ఉపకారం చెయ్యి నేను విష్ణువు దగ్గరకెళ్ళి/ఈ స్తంభాగ్రాన్ని సందర్శించానని చెబుతాను. నా మాట నిజమేనని నువ్వు సాక్ష్యం చెప్పాలి" అని ప్రాధేయపడ్డాడు. 'సరే' నంది మొగలిపువ్వు, కేతకీ బ్రహ్మలిద్దరూ పూర్వరణస్థలం చేరారు. దిగాలుగా కూర్చుని వున్నాడు విష్ణువు వచ్చాడు. బ్రహ్మ, తాను ఆ వెలుగు కంబపు పై భాగం చూశానని చెప్పాడు. మొగలిపువ్వే సాక్ష్యం అన్నాడు. 'ఔ'నంది మొగలి పొత్తి, నిట్టూర్చాడు నీరదశ్యాముడు. "నేను దీని మొదలు కూడా చూడలేకపోయాను "ఓడిపోయాను" అని తన ఓటమిని ఒప్పుకున్నాడు. బ్రహ్మ ఆధిక్యతని అంగీకరిస్తూ అతనిని అర్ఘ్యపాద్యాదులతో ఆరాధించి ఆ తైజసస్తంభం దగ్గరే బెంగగా కూర్చుండిపోయాడు.

# శివుడు ప్రత్యక్షమై విష్ణువును అనుగ్రహించుట



ఎప్పుడైతే విష్ణువులోని అహం నశించిందో, అప్పుడే అతనిని గప్పిన శివమాయ తొలగి పోయింది. తన అహంకారపూరిత మైన గత ప్రవర్తనకు పశ్చాత్తాప పడ్డాడు. చిత్తసంయమనంతో "శివశివా" అనుకోసాగాడు. అప్పటికే బ్రహ్మ చేసిన అవ చారానికి శిక్షింప నిశ్చయించిన శివుడు విష్ణువు చింతించడంతో అతని పట్ల ప్రసన్నుడయ్యాడు. తక్షణమే నిష్కళమైన అగ్ని స్తంభం నుండి సకలమైన మూర్తిత్వంతో ప్రత్యక్షమయ్యాడు శివుడు. సిగలో జాబిల్లినొసటకన్ను, నీలకంఠం నాగాభరణాలూ, డాకేలశూలం, మరొకచేత అభయ ముద్ర, వ్యాఘ్రాంబరంతో సాక్షాత్కరించాడాయన, కళ్ళముందు నిలిచిన సాకారు డైన కంఠేకాలుణ్ణి ఆర్ద్రనయనాలతో వీక్షించాడు విష్ణువు. భక్తి సంభరిత మానసం తోనూ ఆనందకంపితమైన తనూలతికతోనూ ఆయనను స్తోత్రం చేశాడు. స్వచ్ఛస్ఫటికాభుడైన సాంబుడు ఇంద్రనీలాభుడైన శ్రీహరికి అభయమిచ్చాడు.

"నారాయణా! నువ్వు కూడా ఒకచిన్న అబద్ధం చెప్పి ఉంటే బ్రహ్మకన్నా నువ్వే యెక్కువగా చెలామణి అయ్యేవాడివి. అయినా నువ్వు అసత్యం చెప్పలేదు. నీ సత్యసంధత నన్ను సంతుష్టుణ్ణి చేసింది. సత్యమే శాశ్వతమయినది. ఎవడు సత్యాన్నే ఆశ్రయిస్తున్నాడో వాడేశాశ్వతుడు. ఇకనుండి ఊర్ధ్వమధ్యమ, అధో లోకాలు అన్నింటా కూడా నువ్వు నాతో సమానంగా పూజింపబడతావు. నావలెనే నీకూ క్షేత్రాలు యేర్పడతాయి. పూజలూ, ఉత్సవాలూ అన్నీ లభిస్తాయి. లౌకిక జగత్తులో నాయంతటి వాడివిగా ఆరాధింపబడతావు" అని దీవించి వరాలు అనుగ్రహించాడు.

# శివుడు బ్రహ్మకు శిరచ్ఛేదము విధించుట



శిష్టుడైన శ్రీహరిని అనుగ్రహించి పిదప, దుష్టుడైన బ్రహ్మకు తగిన గుణపాఠం చెప్ప దలచాడు భవుడు. తక్షణమే తన సంకల్పంతో భైరవుడిని సృష్టించాడు. "భైరవా! అసత్య ప్రలాపుడైన ఆ బ్రహ్మని నీకత్తివాదరతో తగినట్లు సత్కరించు" అన్నాడు శంకరుడు. మరుక్షణమే భైరవుడు మృత్యువుకు సైతం భయం కలిగించే తనపదును కత్తిని ఝళిపించాడు. ఒకచేత బ్రహ్మదేవుడి కొప్పుబట్టి! ఆబద్ధం ఆడిన అతగాడి ఐదవతలకాయను ఖస్సున నరికేశాడు. తక్కిన తలలు కూడా తరిగేయడానికి సిద్ధపడుతుండగా, బ్రహ్మదేవుడు భయంతో గడగడలాడి పోయాడు. "శివ శివా, భవ భవా, హరహర" అని ఆర్తనాదాలు చేసుకుంటూ తత్తరపడిపోతూ వచ్చి శివుడి పాదాలమీద పడ్డాడు. వాతూలహత నీపశాఖికలా నిలువెల్లా వణికిపోతున్న విధాతపరిస్థితి విష్ణుమూర్తికి కూడా జాలి కలిగించింది.

ఎంతైనా ఆయన బొడ్డు తామరనుంచి వెలువడ్డబుడ్డడు గదా అపితామహుడు! అందుకే కాబోలు పునః పునః శంకరునకు అంజలించి మ్రొక్కుతూ బ్రహ్మను క్షమించవలసిందిగా కోరాడు. అంతకన్నా దీనంగా ప్రాణభిక్ష నర్థిస్తున్నాడు బ్రహ్మ. దయదలిచాడా జీవకోటికి దహరాకాశవాసి. ఓయీ బ్రహ్మదేవా! నువ్వింతగా ప్రాధేయపడుతున్నావు గనుక. విష్ణువు మరీ మరీ చెబుతున్నాడు గనుక యిప్పటికి క్షమిస్తున్నాను. నీ మానాన నీవ్వు సృష్టికార్యక్రమంలో వుండు. కాని, అనృత వచోదోషంవల్ల నువ్వెక్కడా పూజార్హుడివి కాకుండాపోతావు. కాని నా భక్తుడవు గనుక, నన్నే నిరంతరం చింతన చేస్తావు గనుక ఒక్కవరం యిస్తున్నాను

యజ్ఞయాగాదులూ మొదలైన వేదోక్త కర్మలో మాత్రం నువ్వే గురువుగా గౌరవింప బడతావు అలా కాదని నిన్ను తిరస్కరించి చేసే యాగాది క్రతుకాండలేవీ కూడా ఫలితాలనీయవు" అని చెప్పాడు.

## శివుడు మొగలి పువ్వును శపించుట



తదనంతరం తడబడుతూ తడ బడతూ నిలబడ్డ మొగలిపువ్వును చూసి ఓసికేతకీ! కూటసాక్షివై కుసుమజాతికే కళంకం ఆపాదించిన పాపిష్ఠవి ఇకనుండి నువ్వు నాకు అయిష్టురాలవు. అందువల్ల నా ఆరాధనలో నీకు స్థానం లేకుండా పోతుంది" అని శపించాడీశ్వరుడు. ముత్తెక్కించే పరిమళాల పాత్రికదా మొగలి పువ్వు! అందుకని దేవతలూ, ఋషులూ, యిత్యాదు లందరూ దానిని. ధరిస్తుండే వారు అటు వంటిది. శివుడు దానిని శపించగానే వారంతా తమతమ వద్దనున్న మొగలి పువ్వుల్ని దూరంగా గిరాటు వేశారు. దైవోపహతుల్ని యెవరూ దరిజేర్చరు కదామరి.../ ఈ శాపం వెనువెంటనే తనపట్ల తిరస్కారం చూసేసరికి, మొగమెత్తు కోలేకపోయింది. మొగలిపువ్వు, అయినా శివుడికి మొరపెట్టుకుంది హే జగన్నాథా! నీ సేవకు నోచనివాడు నా జన్మమే వృథా అయిపోతుంది. నాయందు కరుణించు, ఎంతటి పాపాత్ములకైనాసరే "శివ" అనే నీ నామస్మరణ మాత్రం చేత ముక్తి లభిస్తూ వుండగా, సాక్షాత్తూ నీ నిష్కల, సకలరూపాలు రెండింటిని దర్శించుతూన్న నా యొక్క ఒక్కగాని ఒక్క అసత్య దోషాన్ని ఇంకా మిగల్చి ఉంచుతావా తండ్రీ" అని పరిపరివిధాల ప్రార్థించింది. శుద్ధ అనుగ్రహ మూర్తిస్థాణుడు జాలికి పుట్టిన జంగమయ్య అందుకే ఆ మొగలి పువ్వును క్షమించాడు. 'కేతకి' నేను అన్నది అన్నట్లుగా జరగాల్సిందే నా ఆరాధనా నిషిద్ధమైనప్పటికీ కూడా, నీవు నా భక్తుల నిమిత్తం ఉపయోగించుకో బడతావు. నా పూజలోకి పనికిరాకపోయినా కూడా, నాకు పై కప్పుగా అలం కరించడానికి నీవు ఉపయోజితవు అవుతావులే అని అనుగ్రహించాడు.

# శివరాత్రి మాహాత్మ్యము



ఆవిధంగా అభవుడు ప్రసన్నుడు కావడంతో అంతవరకూ భీతివహులై యెడం యెడంగా నిలబడ్డ విలిం పాదులు. బ్రహ్మ విష్ణుగణాల వారూ మెల్లమెల్లగా శివ దర్శనార్థం చేరువకాసాగారు. వారందరినీ వెంట బెట్టుకుని విధి విష్ణువులిద్దరూ స్వామికి విశిష్టమైన ఆసనాన్ని కల్పించారు. నభూతో నభవిష్యతి అన్నట్లుగా ఆయనను ఆరాధించారు. వారి పూజకు పొంగి పోయాడు. భోళాశంకరుడు. ఆ ఆనందంలో శివుడు "మీరిద్దరూ కలిసి యీనాడు నాకు చేసిన యీ పూజతో నేనెంతో సంతుష్టుడి నయ్యాను. కాబట్టి ఇకనుండి ఈ దివ్య సమయం నాకు అత్యంత ప్రీతిపాత్రమై "మహాశివరాత్రి" నామంతో విరాజిల్లుతుంది.

ఇకనుండి శివరాత్రినాడు లింగాత్మకంగాగాని, మూర్త్యాత్మకంగాగాని, నన్నారాధించినవాడు పురుషోత్తముడవుతాడు. మహాశివరాత్రి ఒక్కనాడూ అహోరాత్రులూ ఉపవాసండుండి, యింద్రియాలని అదుపులో ఉంచుకుని త్రికరణ శుద్ధిగా, లోపం లేకుండా, విధివిధానంగా నన్నారాధించినవాడు ఒక సంవత్సరమంతా నన్ను పూజించిన ఫలం పొందుతాడు.

ఈరోజు శివప్రతిష్ఠకూ, శివ కళ్యాణానికీ శ్రేష్ఠమైనరోజు అవుతుంది. మీ యుద్ధం నివారించే నిమిత్తంగా నేను లింగాకృతిలో ఆవిర్భవించిన ఈ మార్గశిర మాస బహుళ చతుర్దశీ ఆర్ద్రా నక్షత్రం నాడు ఉమాసహితుడిగా గాని లేదా నా శివలింగాన్నిగాని దర్శించిన మాత్రం చేతనే ఆ పురుషుడు నాకు కుమారస్వామికన్నా యిష్టుడవుతాడు. నేను లింగాకృతితో ఉద్భవించిన యీ తావు లింగస్థానం అనబడుతుంది. ఆద్యంతాలు లేని ఈ నేనైన అనలస్తంభం భక్తాభీష్ట ప్రదానార్థం పరిణామవంతమై శివలింగంగా సిద్ధిస్తుంది. ఈ అనలస్తంభం ఆవిష్కరింపబడిన నేల "అరుణాచలం" గా ప్రసిద్ధిమవుతుంది.

శివక్షేత్రాలన్నిటా యిది అత్యంత కీర్తిమంతమవుతుంది. ఇక్కడ అరుణాచలేశ్వరుడిగా ఆవిష్కరింపబడే శివలింగారాధకులు సాలోక్య, సామీప్య, సాయుజ్యాది మోక్షపదాలనుక్రమశ, పొందగలుతారు" అని పలు విధాలుగా అనుగ్రహించి తుదిగా యిలా చెప్పసాగాడు శివుడు.

"విష్ణువిధాతలారా! నా పరబ్రహ్మతత్వాన్ని మీకునిరూపించడానికే నిరాకారమూ, నిర్గుణమూ, నిరుపమానమూ, అపరిమాణమూ అయిన రూపంలో కపించాను. అటు పిమ్మట, - మీకున్న సాకారతా అహంభావాన్ని తుద ముట్టించేందుకు సకలుడనై /ఈ లింగరూపంతో మీకు దర్శనం యిచ్చాను గుర్తుంచుకోండి. సకలతా, నిష్కలతా, నాకు మాత్రమే చెల్లుతాయి. కాబట్టి నేనే పరబ్రహ్మనని మరచిపోకండా మీలో మీరు తగవులాడకండా నా ఆజ్ఞాప్రకారం సృష్టి, స్థితులను నెరవేర్చండి. నాకూలింగానికిగాని, లింగానికీ మూర్తికీగాని నాకు విధమైన భేదమూ లేదు. నిత్యం లింగారాధన చేయండి. నిజానికి నేనేదో ఒకచోట ఉండిపోయే వాడినికాదు అయినా కూడా ఎక్కడ లింగప్రతిష్ఠ జరుగుతుందో అక్కడ మాత్రం తప్పకుండా ఉంటాను. ఒక్క శివలింగం ప్రతిష్ఠిస్తే శివసమానులై కైలాసాన నివసిస్తారు. రెండు శివలింగాల్ని ప్రతిష్ఠిస్తే మహా కైలాసమున శివానందానుభవులై శివసాయుజ్యం పొందుతారు. లింగప్రతిష్ఠ అత్యంత ప్రధానమైనది. లింగాభావం వల్ల మూర్తిని ప్రతిష్ఠించినప్పటికీ కూడా అది శివక్షేత్రమే అవుతుంది.

## పంచకృత్యాది వివరణము



శివోక్తమంతా శిరోధార్యంగా గ్రహించారు శ్రీపతివిధాతలు అనంతరం పంచ కృత్యముల గురించీ వివరించమని కోరారు శివుణ్ణి. ఆయన చెప్పసాగాడు. 'ఈ సంసారం తామరతంపరగా పెంపొందడమే సృష్టి యన బడుతుంది. అలా పెరిగే సృష్టిని క్రమ శిక్షణలో ఉంచి అక్రమాల నుండి రక్షించడమే స్థితిగా చెప్పబడుతోంది. /ఏతత్సమస్త ప్రపంచం యొక్కస్థూల రూపాన్నీ విభజించి సూక్ష్మ రూపంగా మార్చడమే సంహారం, సూక్ష్మీ

కరించబడినదాన్ని పునఃసృష్టి వరకూ పరిరక్షించడం తిరోభావం అంటారు. శివారాధనా పరులైన జీవులందర్నీ బంధ విముక్తులను చేయడం అనుగ్రహం అనుబడుతోంది. సృష్టి, స్థితిసంహార తిరోభావములు ప్రపంచ సంబంధితాలు కాగా, కడపటిదైన అనుగ్రహం మాత్రం కేవలం శివునకు మాత్రమే సాధ్యమైనది.

భూమి నుంచే సమస్తమూ పుడతాయి. నీటివలననే అన్ని పెరుగుతాయి తేజస్సు వలన హరించబడతాయి వాయువు కారణంగా మరుగవుతాయి. ఆకాశమే సత్యమవుతుంది. అంటే శివస్వరూపం కలిగినది అవుతుంది. ఈ అయిదు కార్యాలనిర్వహణార్థమే నేను పంచముఖుడనుగా ఉన్నాను గతంలో మీరు గొప్ప తపస్సు చేసి నా అనుగ్రహం వల్ల, ఒకరు సృష్టినీ మరొకరు స్థితినీ, నెరవేర్చే శక్తిని పొందారు. సంహార తిరోభావాలు రెండూ, రుద్రమహేశ్వరుల సొంతం చేయడ్డాయి. ఐదవదయిన అనుగ్రహం సర్వాతీతుడనైన నేనొక్కణ్ణి మాత్రమే దయచేయగలను. రుద్రమహేశ్వరులు నిరహంకారులై ఉన్నందువల్ల వాహన, ఆసన, వేషాదులన్నిటా నాకు యితరంగాని రూపంతో అలరారుతున్నారు. మీరు మాత్రం అహంభావులై నన్ను విస్మరించడం వల్ల నావిగాని రూపాలు పొందినవారై అవివేకులై అఖిలాధిపత్యం కోసం యిలా కుమ్ములాడుకున్నారు.

మరెప్పుడూ ఇలా జరగకుండా ఉండేందుకు మీకు నాయందు నిత్యం నిష్ఠ కలగడానికి గాను, ఇదిగో ప్రణవ పంచాక్షర మంత్రాన్నిస్తున్నాను స్వీకరించండి. ప్రణవం శివశక్తులను రెండింటినీ బోధిస్తుంది. అందులో నుంచే పంచాక్షరి ప్రభవించింది. పంచాక్షరి నుండి త్రిపాదగాయత్రి, అందులోంచి సర్వవేద సార స్వతం అవిర్భవించాయి. మంత్రాలు ఉత్పన్నాలయ్యాయి. ఒక్కొక్క మంత్రారాధనవల్ల- దానికి చెందిన వాంఛలు మాత్రమే పరిపూర్ణములవుతాయి. అన్ని మంత్రాలు కూడా భోగప్రదాలే. పంచాక్షరీ మంత్రం ఒక్కటే భోగాలతోపాటు మోక్షాన్ని కూడా ప్రసాదించ గల యేకైక మంత్రం ఇలా చెప్పి బ్రహ్మనూ, విష్ణువునూ ఉత్తరముఖంగా కూర్చోబెట్టి వారి కుడిచెవులలో పంచాక్షరిని ఉపదేశించాడు. తదనంతరం వారి కోరికపై సమస్తమైన యంత్ర తంత్రాలనీ, మంత్రాలనీ కూడా అనుగ్రహించాడు. సమస్త వాఙ్మయాన్నీ స్వీకరించిన అనంతరం విధి విష్ణువులు వృషాకపిని గురు స్థానంలో ఉంచి ఆరాధించారు. గురుదక్షిణగా తమ ఆత్మలనే సమర్పించుకున్నారు.

ఓ మునీంద్రులారా! ఆర్ద్రా నక్షత్రయుక్తమైన చతుర్దశినాడు శివపంచాక్షరీ జపం అఖండమైన సత్ఫలాలనిస్తుంది. శివారాధనను మించిన పుణ్యంలేదు. అందునా శివునిమూర్తిత్వం కన్నా లింగారాధనే శ్రేష్ఠమైనది. ఒక్క శివలింగాన్నైనా వైదిక విధానముతో స్వహస్తాలతో చేతిమీదుగా గాని, సద్విప్రుల చేతిమీదుగా గాని లింగప్రతిష్ఠాపన చేయవచ్చు ప్రతిష్ఠితమైన లింగాన్ని నిత్యం షోడశోపచారాలతో సేవించే వారికి శివపదం తథ్యం.

## లింగార్చనలో వివిధ పద్ధతులు



భక్తులు అన్ని విధాలా అనుకూలమైన శుభ సమయంలో- ఏదైనా పుణ్యతీరంలో లింగం ప్రతిష్ఠించాలి. ప్రతిష్ఠకు పార్థివ లింగం గాని, తేజోమయ లింగంగాని శ్రేయస్కరాలు, చరలింగమైతే చిన్నది గానూ ఉండాలి. ఏదైనప్పటికి పీఠం(పానపట్టం) తో కూడుకుని ఉండాలి. పానపట్టం నలుచదరంగాగాని, త్రికోణంగా గాని ఉండవచ్చు, ఎత్తులో మాత్రం నడుమ సన్నంగా ఉండటం అత్యంత ప్రధానం. లింగం యే పదార్థంతో చేయబడిందో, పానపట్టం కూడా అదే పదార్థంతో చేయబడి ఉండాలి. చరలింగాలకైతే లింగమూ పీఠమూ ఒకటిగానే ఉండాలి. ఒక బాణలింగానికి మాత్రం ఈ నియమం వర్తించదు కర్తయొక్క పన్నెండంగుళాలు. లింగప్రమాణం ఉండాలి. అంతకన్నా ఎక్కువైనా ఫర్వాలేదుగాని, తక్కువైతే మాత్రం ఫలితం కూడా తక్కువగానే ఉంటుంది. లౌకిక వాసనాతీతుడయి కేవలం మోక్ష గామియైన కర్తకు మాత్రం ఏకాంగుళ ప్రమాణమైన లింగమే సరిపోతుంది. లింగ ప్రతిష్ఠ చేసేవారు గోపురంతో కూడిన మందిరం కట్టించాలి. ఆయాతావులలో శాస్త్రవిహితంగా దేవగణాలు ఉండేలా శిల్పులతో చెక్కించాలి, గర్భ గృహద్వారాన్ని నవరత్నాలతోనూ అలంకరించాలి.

లింగ ప్రతిష్ఠాపనార్ధం గర్భగుడిలో వేదికను నిర్మించాలి. ఆవేదిక యొక్క గుంటలో నవరత్నాలనూ వేయాలి. లింగ ప్రతిష్ఠాపన వేళ సద్యోజాతాది పంచ బ్రహ్మ మంత్రాలతోనూ శివలింగాన్ని పూజించాలి. హవనం చేయాలి. శివ పరివారాన్ని కొలవాలి, గురువును సత్కరించాలి. బంధువులను, ఆప్తులనూ సమ్మానించాలి. యాచకులకు, దరిద్రులకు అన్నవస్త్రాదుల నివ్వాలి. అనంతరం యుక్త మంత్ర పఠన, మంగళవాద్యస్వరాల నడుమ పంచాక్షరీ నాదాలతో లింగప్రతిష్ఠ చేసి పీఠం నెలకొల్పాలి. అవి స్థిరంగా ఉండేలాగ - తగువిధంగా భూమిలో బంధించాలి. అదే విధంగా - ఉత్సవమూర్తులను సైతం శివపంచాక్షరీ మంత్ర పఠనంతో ప్రతిష్ఠించవచ్చును.

## లింగభేదములు - వివరములు



లింగాలు రెండు రకాలు అవి:- 1. స్థావర లింగాలు, పర్వతాలు, వృక్షములు, యిత్యాదులు,2. జంగమ లింగాలు,క్రిమికీటకాదులు స్థావరాల్ని సేవించడం, జంగమాల్ని సంతుష్టి పరచడం అనేది ఆయా కామ్యసిద్ధికి ఆచరించే శివారాధనం, కాని యధార్ధానికి పీఠం అమ్మవారు. లింగం శివుడు (శ్లో॥ పీఠమంబామయం సర్వం శివలింగం చేచ్చి న్మయం) అని తెలుసుకోవాలి. స్వయం భూ లింగంగాని, దేవఋషి మానవ ప్రతిష్ఠితాలైన లింగాలలో యేదో ఒక దానినిగాని నిత్యం సేవించాలి. కనీసం చరలింగాన్నైనా ప్రతిరోజూ షోడశోపచారాలతో సేవించాలి. అలా పూజించలేనివారు ఆ పూజావసర ద్రవ్యాలు సమర్పించి ప్రదక్షిణ నమస్కారాలు చేసినా చాలు. వాళ్ళు క్రమక్రమంగా శివపదం చేరతారు. ప్రతిరోజూ గుడికి వెళ్ళి శివదర్శనం చేసేవాళ్ళు తప్పక శ్రేయస్సు పొందుతారు. ఇది సత్యం.

చరలింగాన్ని మట్టితోగాని, బెల్లంతోగాని, వెన్నతోగాని, పిండి మొదలయిన వాటితో కాని చేయవచ్చును. దానిని ఎడమచేతి బొటనవ్రేలిమూలంలో ఉంచి పూజించినా కూడా తప్పులేదు. ఏదోవిధంగా మంత్రబద్ధంగా శివార్చన చేయడమే పుణ్యం. అది కుదరని వాళ్ళు శివలింగాన్ని దానం చేయవచ్చును. అలా కూడా చేయలేనివాళ్ళు ఆ లింగానికయ్యే ఖర్చును ధనరూపంలోగాని, మరేయితర మారక ద్రవ్యరూపంలోగాని (పుచ్చుకునేవారి అంగీకారంపై) యివ్వవచ్చును. రోజుకి 10 వేల సార్లు ప్రణవం జపించాలి. ఉదయ సాయం సంధ్యలలోనైనా కనీసం ఒక్కొక్క సారి వెయ్యి పర్యాయాలు జపించాలి.

ప్రణవ జపంలో ఓంకారం మకారాంతంగా ఉచ్చరింపబడాలి. గబగబా జపిస్తూ "ఓం" అని పలక్కూడదు. ఓంవ్ అంటేనే మనశ్శుద్ధి కలుగుతుంది. శివ ధ్యాన సమయంలో, అంటే సమాధిగ్రస్తుడైనప్పుడు మానసికంగా జపించాలి. అంటే మనసు లోనే అనుకోవాలి. కనీసం పెదవులు కూడా కదలకూడదు. ఇతర వేళలన్నిటా ఉపాంశువుగా జపించాలి. అంటే ఇతరులకి వినబడకుండానన్నమాట. ఇక ప్రణవంతో కూడిన శివపంచాక్షరీ రోజుకి పదివేల సార్లు జపించిన మంచిదే బ్రాహ్మణులు ప్రణవం ఆద్యంలో కలిగిన పంచాక్షరీని జపించాలి. ఇతరులు ప్రణవం అంత్యంలో ఉండేలా జపించాలి. ఎవరు జపించినా సత్పురుషుల మంచి ఉపదేశం పొందాలి. కుంభస్నానం, మంత్రదీక్ష మాతృకాన్యాసం, ఇవన్నీ మంత్రో పదేశానికి పరిగ్రహణానికీ ప్రధానకర్మలని మర్చిపోకూడదు.

పంచాక్షరీ, బ్రాహ్మణ, క్షత్రియులకు "నమః" అనే పదంతో ఆరంభం అవు తుంది. ఇతరులకు నమః చివర చేర్చి జపించాలని శాస్త్రం. ఐదుకోట్ల పంచాక్షరీ జపం వలన సదాశివసమానుడు అవుతాడు. నాలుగు కోట్లు జపిస్తే మహేశ్వరు సముడు మూడుకోట్ల జపంచేత రుద్రతుల్యుడు రెండుకోట్లు ధ్యానించడంచేత విష్ణువంతటివాడు, కోటి జపించడంచేత బ్రాహ్మణుడూ అవుతాడు. మనిషి నిత్యం గాయత్రీ మంత్రం 1000 సార్లు జపిస్తే శివుడు సంతుష్టుడయి కైలాసపదం యిస్తాడు.

శివానుగ్రహం కోరేవాళ్లు శివక్షేత్రాలలో నివసించాలి. శివాలయ సమీపాలలో ఫలపుష్ప భరితాలైన వృక్షాలనూ పెంచాలి. ఆలయం శుభ్రపరచాలి. శివోత్సవాలలో చేయూతనివ్వాలి. ఆ జన్మాంత శివక్షేత్రవాసులకూ, పశుపక్షి తరుగుల్మలతాదు

లకూ సైతం భుక్తి ముక్తులు లభిస్తాయి. మరొక్క విషయం, ప్రాతర్మధ్యాహ్న సాయాహ్నలలో కన్నా, నిశీథకాలంలో చేసిన శివారాధనే అత్యంత ఫలప్రదం అని గుర్తుంచుకోవాలి" అంటూ సూతుడు చెప్పినదంతా విని శివక్షేత్రాల గురించి వివరించమన్నారు. మునులు చెప్పసాగాడు సూతుడు.



## నదులు క్షేత్రములు

అగణిత పర్వతారణ్యాలతో కూడుకుని ఉన్నదీ, యాభై యోజనాల వైశాల్యం కలదీయైన భూమి- శివాజ్ఞ వల్ల సమస్త ప్రపంచాన్నీ భరిస్తోంది. ప్రపంచవాసులను తరింపచేయడానికి శివుడు అక్కడక్కడా తన క్షేత్రాలను వెలయించాడు. కొన్ని క్షేత్రాలు స్వయంభువాలు, మరికొన్ని ఋష్యనుష్ఠితాలు, మరికొన్ని దేవతాభివందితాలు. నదీ సముద్రతీరాలలో అనేక క్షేత్రాలున్నాయి. గంగాతీరాన కాశీ మొదలుగా అనేక క్షేత్రాలు విరాజిల్లుతున్నాయి. నర్మదలో స్నానం చేసి- అక్కడే ఉండి ఒకరోజు ఉపవసించినవారికి నాయకపదం లభిస్తుంది.

చెప్పుకోదగ్గ నది గోదావరి. నిత్యం "గోదావరి గోదావరి గోదావరి"అని స్మరించిన మాత్రంచేతనే సర్వపాపాల్నీ వల్లకాట్లోకలిపేసే దివ్యనది గోదావరి కాశీక్షేత్రం వల్ల గంగకు పేరు వచ్చినది. గోదావరీ నదివల్ల యిక్కడి క్షేత్రాలకి పేరు వచ్చింది. ఒక్క గోదావరి స్నానం వందసంధ్యావందనాలపెట్టు, వంద గోదావరీ స్నానాలు యోగాభ్యాసానికి తొలిమెట్టు నిత్యం గౌతమీస్నానం గాని పర్వదినాలలో గౌతమీస్నానం కాని యిచ్చే పుణ్యం అంతా యింతా అని చెప్పనలవి కాదు భక్తిశ్రద్ధలతో గోదావరి స్నానం చేసినవాళ్ళకి బ్రహ్మ హత్యాపాపాలూ, గోహత్యాపాతకాలూ గురుశయ్యాగత ద్రోహాలూ, ఒక్కటేమిటి! ఎన్ని మహాపాతకలున్నాయో అన్నీ మహాపాతకాల మంటలూ చప్పున చల్లారిపోతాయి.

బృహస్పతి సింహరాశిలో ఉండగా గోదావరీ పుష్కరస్నానం చేసినవాడికి శివలోకం తప్పదని చెప్పాడు శివుడు. ఎవడు శివభక్తుడో ఎవడు శివలోకానికి

పోవాలనుకుంటాడో, ఎవడు శైవుడో- వాడల్లా గోదావరి స్నానం చెయ్యాలి శివ లోకాన్ని ప్రసాదించే దివ్యసరిత్తు గోదావరి. ఆ గోదావరికి నమస్కారం దాని పుట్టుకకి నమస్కారం. దాని ప్రవాహానికి నమస్కారం. దాని పూర్వం వర్తమానం భవిష్యత్తు, సమస్తానికి నమస్కారం. గోదావరియైన శివానికి నమస్కారం పదేపదే నమస్కారం మళ్ళీమళ్ళీ నమస్కారం.

ఇంకా కృష్ణవేణీ నది ఉంది. విష్ణులోకప్రాప్తిని ప్రసాదిస్తుందని తుంగభద్రను ఆరాధించిన వాళ్ళు బ్రహ్మలోకానికి వెళతారని, ఎవరైతే యే పుణ్యఫలం వల్లనో బ్రహ్మలోకం చేరి అక్కడ నుంచి పునఃభూమిని పుట్టవలసివుందో వాళ్ళంతా ఖచ్చితంగా సువర్ణముఖీనది తీరాన్నే జన్మిస్తారని చెబుతారు. అందుచేత అటువంటి దివ్యనదీ నదతీరస్థ క్షేత్రాలు ముముక్షువులకు సదా వాసయోగ్యాలు.



## పాపములు- అంశలు

క్షేత్రవాసం పుణ్యంగదా అని, అక్కడ పాపా చరణ చేయతగదు. సుమా! పుణ్యాలెలా గుణీకృతాలౌతాయో, పాపాలూ అలాగే గుణీకృతాలౌతాయని మర్చిపోకూడదు. పుణ్యాపాపాలు మూడు అంశలుగా ఉంటాయి. 1. బీజాంశం:- ఇది జ్ఞానం వల్ల నశించి పోతుంది. 2. వృద్ధ్యంశం:- ఇది పాపాలన్నీ వృద్ధి చేసుకుంటే పుణ్యవృద్ధ్యంశ నశించిపోతుంది. పుణ్యాలని వృద్ధి చేసుకుంటే పాపాల వృద్ధ్యంశ నశిస్తుంది. 3. భోగాంశ:- అలా జ్ఞానం వల్ల అత్యధిక పుణ్య నిర్వహణవల్లా బీజ వృద్ధి, అంశలలో నశించిన పుణ్యామో పాపమో పోగా, మిగిలిన పాపపుణ్యాలే భోగాంశ. వాటినే అనుభవిస్తాడు జీవి. పాపభోగం పోగొట్టుకోవాలంటే నాలుగు మార్గాలు చెప్పబడుతున్నాయి. నిరంతరం దైవారాధన చేయాలి. బ్రాహ్మణులకు దాన ధర్మాదికాలు చేయడం రెండవది ఏళ్ళు పూళ్ళు అనకుండా దీర్ఘకాలం తపోమగ్నులు కావడం మూడవది. ఇవేవీ చెయ్యలేని వాళ్ళకి నాల్గవ మార్గం ఏమిటయ్యా అంటే మా కర్మమిలాకాలిపోయినది గదా అని పాపఫలాన్ని అనుభవిం చడమేనట. అందుచేత పాప వినిర్ముక్తుడు గాదలచినవాడు ఖచ్చితంగా పుణ్యాలే చెయ్యాలి. సదాచారుడు కావాలి అన్నాడు సూతుడు 'ఆ సదాచారా లేమిటో సెలవీయమన్నారు' మునులు.



# సదాచార పాలనము

**సూత ఉవాచ:-** ఉషఃకాలంలోనే నిద్ర లేవాలి. అలా లేస్తూనే యిష్టదేవతలను తలచుకోవాలి. అనంతరం దేహ(సంసార) పోషణార్థం తన ఆదాయ వ్యయాలను పరిశీలించుకుని-ధర్మ వితరణకున్న అవకాశాన్నీ ఆర్జించాల్సిన అర్థాన్నీ నియమించు కోవాలి. ఆయుర్దాయం గురించీ, పాపం గురించీ, భాగ్యం గురించీ, శరీరపాటవం, ఆరోగ్య అనారోగ్య స్థితిగతులూ, స్తోమత-తాహతు, యిత్యాదులు భావించుకోవాలి. అనంతరం శౌచం దంత ధావనం స్నానం పూర్తి చేయాలి. స్నానానంతరం మంత్ర పూర్వకంగా విభూతి ధరించాలి. సంధ్యావందనం చేసుకోవాలి. అధమపక్షం నూటెని మిది సార్లయినా గాయత్రిని జపించాలి. బ్రాహ్మణుడనేవాడు రోజు ప్రాత:కాలాన వెయ్యిసార్లు గాయత్రిని జపించాలి. మంత్రార్థం తెలిసి ధ్యానిస్తే బ్రహ్మప్రాప్తి కలుగుతుంది.

అలా తెలియకపోయినా మంత్రం మాత్రం జపిస్తే, బ్రాహ్మణ్యమైనా మిగులుతుంది. అసలు ఏమంత్రమైనా సరే, దాని అర్థాన్ని భావిస్తూ వెయ్యిసార్లు జపిస్తే బ్రహ్మప్రాపకం అవుతుంది. వందసార్లుగాని అంతకు తక్కువగాకుండా గాని జపిస్తే స్వర్గప్రదమవుతుంది. వందకన్నా తక్కువగా ఎంత జపించినా అది లౌకిక జగత్తులో ఆత్మ రక్షణార్థం మాత్రమే అవుతుంది. అలా గాయత్ర్యనంతరం శివాలయంలో గాని, లేదా యిష్టదేవతా మందిరంలోగాని, లేదా స్వగృహంలోనైనాసరే, ఆటంకం కలగని శుచీశుభ్రతావున్న స్థలంలోనే ధ్యానం కొనసాగించాలి. గుర్తుంచుకోండి. కనీసం ఒక లక్ష సార్లయినా గాయత్రీమంత్రం జపించనివాడు వైదిక కర్మలకి అనర్హుడు.

పన్నెండు లక్షలసార్లు గాయత్రీ జపం చేస్తే వాడికి "బ్రాహ్మణత్వం" అను సంధానించబడుతుంది. డెబ్బయి సంవత్సరాలు వచ్చేదాకా సంసారిగా ఉండాలి. ఆ తరువాతే సన్యాసం పుచ్చుకోవాలి. సన్యసించినవాడు రోజుకు పన్నెండుసార్లు ప్రణవమంత్రం ఉండాలి. ధర్మాచరణం వల్లే ధనం వస్తుంది. ధనం వల్ల భోగ ప్రాప్తి కలుగుతుంది. ధనార్జితంవల్ల, క్రమేణా భోగములపై విరక్తి, వైరాగ్యం కలుగుతాయి. అధర్మార్జిత విత్తంతోడి భోగాలవల్ల మరింత మోహం ఇంకో అంత అజ్ఞానం కలుగుతాయి.

**ఇక ధర్మం రెండు రకాలు:-** 1. ద్రవ్యంతో చేసేది- యజ్ఞం, యాగం వగైరాలు, 2. దేహంతో చేసేవి తీర్థయాత్రలు, స్నానసంధ్యలు మొదలైనవి బుద్ధిమంతుడు రెండూ ఆచరించాలి. ధర్మంవల్ల ధనం లభిస్తుంది. తపస్సువల్ల దివ్యరూపం కలుగుతుంది. దివ్యత్వం వల్ల నిష్కామకర్మాచరణం అలవడుతుంది. తద్వారా చిత్తశుద్ధి, చిత్తశుద్ధి వల్ల జ్ఞానం లభిస్తాయి. కృతయుగంలో ధ్యానమాత్రంచేతనే సమస్తమూ సిద్ధించేది. త్రేతాయుగంలో తపస్సు చేయడంవల్ల జ్ఞానసిద్ధి లభించేది. కలియుగానికల్లా అది విగ్రహారాధన వల్లనే సాధ్యమయ్యే స్థితియేర్పడిపోతుంది. అదలా ఉంచితే ఇక పాపపుణ్యాలవల్లనే ఫలితాలు యేర్పడతాయి. పిండికొద్దీ రొట్టె ఏది పాపం? ఏది పుణ్యం? పరులనూ మనకితరమైన సమస్త ప్రాణకోటినీ హింసించడమే అధర్మం, సంతోషపెట్టడమే ధర్మం. అధర్మంవల్ల దుఃఖం కలుగుతుంది. ధర్మం వలన సుఖం కలుగుతుంది.

# యజ్ఞభేదములు

అగ్నియందు హవనం చేయబడే తంతు అగ్ని యజ్ఞమనబడుతోంది. ఇంద్రాది దేవతల నుద్దేశించి చేసేది దేవయజ్ఞం వేదాధ్యయనమే బ్రహ్మయజ్ఞం. అగ్ని యందుకాక, ఇతర దేవతల నుద్దేశించి చేసే యజ్ఞాలు కూడా ఉన్నాయి. సర్వేశ్వరుడైన శివుడు, కాలవిభాగంలో ఏడు వారాల్ని నిర్ణయించాడు. ఆది, సోమ, మంగళ, బుధ, గురు, శుక్ర, శని అని పేర్లతో మసలే ఆయా వారాలలో ఆయా అధిష్ఠాన దేవతలను పూజించినట్లయితే ఆయురారోగ్య ఐశ్వర్య విద్యాభివృద్ధులు కలుగుతాయి. ఇవి కూడా యజ్ఞాలక్రిందే లెక్కకు వస్తాయి. మంత్రం, జపం, హోమం, దానం, తపస్సు, స్థండిలంలోగాని, ప్రతిమలోగాని, అగ్నిలోగాని, సద్బ్రాహ్మణుని యందుగాని ఆరాధించుట అనేవి అయిదురకాల పూజలు, ఇవి మొదటి దానికన్నా రెండవదీ, రెండవదానికన్న మూడవదీ, అన్నింటికన్నా ఆఖరుదే ఉత్తమమైనది. కళ్ళ జబ్బులు పోవడానికీ తలపోటు తగ్గడానికి, కుష్టువ్యాధికి శమించడానికి సూర్యుణ్ణి ఆరాధించి బ్రాహ్మణులకు భోజనాలు పెట్టాలి. మన ప్రార్థనా శక్తికన్నా, ప్రారబ్ధలమే ప్రబలమైపోయినప్పుడు మూడు సంవత్సరాలపాటు వరుసగా ఆరాధిస్తూనే ఉండాల్సివస్తుంది. అసలు గృహస్థు అనేవాడు- శుభకార్యాలకు ముందరా, అశుభాలకు తరువాత, నెలకు మూడుసార్లు వచ్చే తన జన్మ నక్షత్రం

యుక్త దినాలలోనూ ఈ సూర్యాదులందర్నీ ఆరాధించాలి. ఇది కూడా నియమం ప్రకారం పద్ధతిగా చేస్తే యజ్ఞంగానే పరిగణించబడుతుంది. అంతదాకా యెందుకు, అప్పుడు నేను చెప్పిన యజ్ఞం గురించి ఈ విషయాలు చదివినా విన్నా కూడా వాళ్ళకి దేవ యజ్ఞం చేసిన ఫలం లభిస్తుంది అని ఆగాడు సూతుడు.

# దేవయజ్ఞమునకు దేశకాల పాత్రములు

అంతా విన్న మునులు "దేవయజ్ఞానికి అవసరమైన దేశకాల పాత్రాదులను కూడా తెలియజెప్పమని కోరినమీదటా, ఇలా ఆరంభించినాడు. రోమహర్షణుడు./ దేవయజ్ఞాది కర్మలకుగాను శుచిగా ఉండే యిల్లు, గోశాల, నీటిఒడ్డు, మారేడు, తులసి, రావిచెట్ల మొదళ్ళు, దేవాలయం. పుణ్యనదీతీరం అనేవి యుక్తమైన స్థలాలు ఇవి వరుసగా ఒకదానికన్నా ఒకటి పదేసిరెట్లు సత్ఫలితాలన్నీ యిస్తాయి. నదీతీరం కన్నా సముద్రతీరం పదిరెట్లు, పర్వతశిఖరం దానికి పదిరెట్లు ఫలప్రదాలు/అసలు రహస్యానికివస్తే యెక్కడైతే మనస్సు చంచలం కాకుండా ఉంటుందో, యేకాగ్రత మహాగ్రస్థాయి నందుకుంటుందో అక్కడ చేసిన యజ్ఞం వెంటనే గుణం చూపిస్తుంది. అయితే,/యీ యజ్ఞదానాదులన్నీ కృతయుగంలో నూటికి నూరు పాళ్ళూ ఫలించేవి. త్రేతాయుగంలో మూడొంతుల ఫలాన్నే యిచ్చేవి. ద్వాపరం వచ్చేసరికల్లా యాభైశాతమే ఫలిస్తాయి. ఇక కలియుగం మొదటి సగంలో ఇరవయ్యయిదూ శాతం (నాలుగోవంతు) ఫలప్రదాలు. ద్వితీయార్థభాగంలో అందులో సగంమాత్రమే ఫలిస్తాయని చెప్పాను గదా! యాగాలు కూడా చెప్పాను. ఇక చెయ్యదగ్గ సమయం వినండి పంచాంగ శుద్ధి గల రోజు మంచిది. అంతకన్నా రవి సంక్రాంతి ఇంకా మంచిది. విషువ, అయనాలు, మకరసంక్రాంతి, చంద్ర గ్రహణం సూర్యగ్రహణాలూ ఒకదానిని మించి మరొకటి మంచివి. జన్మనక్షత్రం తటస్థించడం, ఒకానొక వ్రతం యొక్క చివరి వేళకూడా సూర్యగ్రహణతుల్యం మహాత్ములతో కలియడమే జరిగితే, అది కోటి గ్రహణ కాలాలకన్నా గొప్ప పర్వమని తెలుసుకోవాలి. ఇక ఎలా చెయ్యాలి. అంటే, ఎవరెవరి కుల కుటుంబ ఆచారాల రీత్యా వాళ్ళు చెయ్యాలి. ఇవన్నీ ఒకయెత్తు పార్థివలింగపూజ ఒకటీ ఒకయెత్తు సర్వ దుఃఖాలూ తక్కున సమసిపోతాయి./అపమృత్యువు చేరలేదు. కాలమృత్యువు సైతం గడగడలాడి పోతుంది. సత్కళత్ర పుత్రాదుల్నీ ధనధాన్యాల్నీ తత్క్షణమే ప్రసాదించే దివ్యారాధనం అది.

# పార్థివ లింగారాధనం



స్త్రీలూ పురుషులూ కూడా ఆరాధించదగినదీ పార్థివలింగారాధనం. నీటిలోని మట్టిని తీసుకుని, దానికి శ్రీగంధచూర్ణం, పాలూ కలిపి సాధకుడు తన స్వహస్తాలతో విగ్రహంగా మలచాలి. అంగ ప్రత్యంగాలతోనూ సమస్తాయుధాలతోనూ పద్మాసనస్థులై కూర్చున్నట్లుగా ఆ ప్రతిమలను మలచాలి. అలా మలచిన వినాయక, సూర్య, శౌరి, శక్తి విగ్రహాలనూ పార్థివలింగాన్నీ షోడశోపచారాలతోనూ అర్చించాలి. వాటిని అభిషేకించేటప్పుడు నీళ్ళు ధారగా పోయనక్కరలేదు. అలా పోస్తే పార్థివ ప్రతిమలు విచ్చిపోతాయి. కనుక అభిషేక మంత్రం చదువుతూ పువ్వులతో అభిషేక ద్రవ్యాన్ని చిలకరించాలి. వరి అన్నం నివేదించాలి. ఇంట్లో అర్చించేటప్పుడు మానెడు వరి బియ్యం వేరే యెవరైన మానవులచే ప్రతిష్ఠింపబడిన పార్థివలింగానికి మూడు మానికల బియ్యం. దేవతా, ప్రతిష్ఠితానికి తొమ్మిది మానికల బియ్యం, స్వాయంభువలింగానికి పదిహేను మానికల బియ్యమూ వండి నివేదించాలి.

శివుడికి అభిషేకం చేస్తే చిత్తశుద్ధి కలుగుతుంది. గంధమలదితే సుకృతం వృద్ధి అవుతుంది. నైవేద్యం వల్ల దీర్ఘాయుష్యం కలుగుతుంది. ధూపాఘ్రాతుణ్ణి చేయడం వల్ల ధనవృద్ధి కలుగుతుంది. దీప ప్రదర్శనం వల్ల బుద్ధిబలం, తాంబూల సమర్పణ వల్ల సుఖరాగాలు ఇచ్చితంగా అభివృద్ధి చెందుతాయి. అందువల్ల శక్తి మేరకేకాదు. తాహతుకి మించిన పనైనా సరే ఆ ఆరుపనులు మాత్రం చేయాలి. ఇక శివపూజా నంతరం నమస్కారం జపం చేయాలి. శ్రావణ భాద్రపద మాసాలలో వచ్చే శుక్రవారాలప్పుడు చవితి తిధినాడు శతభిష నక్షత్రంలోనూ, ధనుర్మాసమప్పుడు, మొత్తం నూరురోజులుగాని, సహస్ర ఘస్రాలుగాని వినాయకుణ్ణి అర్చించడం వల్ల లౌకికమైన కోరికలన్నీ తీరిపోతాయి.

మన కోరికలు తీరేందుకు చేసే క్రియకావడంవల్ల దీనిని "పూజ" అనే పేరున పిలుస్తారు. నిత్యనైమిత్తిక కర్మలు కొంతకాలానికి ఫలిస్తాయి. కామ్యకర్మలు యధా విధిగా ఆచరిస్తే అప్పుడే ఫలవంతాలవుతాయి. ప్రతీనెలా బహుళపక్ష చవితినాడు వినాయకుణ్ణి ఆరాధిస్తే పాపాలన్నీ పటాపంచలైపోతాయి. ప్రతీ ద్వాదశినాడూ విష్ణువును ఆరాధిస్తే సంపత్కరం. కర్కాటకమాసంలోని సోమవారంనాడు నవమి ఘడియల్లోనూ, మృగశిరా నక్షత్రము వేళా అమ్మవారిని సేవిస్తే సర్వైశ్వర్యభోగాలు సంప్రాప్తములవుతాయి. ఆశ్వియుజ శుద్ధ నవమి దేవీపూజకు శ్రేష్ఠం. ఆదివారా ల్లోనూ ప్రతీ చతుర్ధశినాడూ, ఆర్ద్ర నక్షత్రములోనూ శివారాధన శీఘ్రఫలకారి.

ముఖ్యముగా మాఘబహుళ చతుర్దశి మహాశివరాత్రినాడు శివారాధనవల్ల అన్ని విధాల అపమృత్యువులు తొలగిపోతాయి. ఆయుష్షు పెరుగుతుంది. జ్యేష్ఠ మాసములోనూ మార్గశిర మాసంలోనూ షోడశోపచారయుత శివారాధనం భోగ మోక్షప్రదం, కార్తికమాసంలో దేవతారాధనం తపోదాన హోమాదికాలు, నక్తభోజనాది నియమాలు ముఖ్యమైనవి. బ్రాహ్మణులకు భోజనం పెట్టడం శ్రేయోదాయకము. కార్తికమాసంలో కపర్దిని ఆరాధిస్తే సర్వవ్యాధులు సమసిపోతాయి. భూతప్రేత పిశాచాది బాధలు తొలగిపోతాయి. కార్తీకమాస ఆదివారం నాడు సూర్యారాధన చేయడము వల్ల నూనెతో తడిపిన వత్తుల దానమువల్ల, కుష్ఠు మొదలయిన భయంకరమైన వ్యాధులు కూడా నశించిపోతాయి.

అదే రోజున, కరక్కాయ, మిరియాలు, క్రొత్తబట్టలు, పాలు, యిత్యాదులు దానము చేసినా, లేదా ఒక బ్రాహ్మణ బాలుడికి ఉపనయనం చేసినా- క్షయవ్యాధి నశిస్తుంది. అవాలు, దీపాలు దానం చేస్తే అపస్మారరోగం హరిస్తుంది. ఎంతటి దరిద్రమైనా సరే -కృత్తికా నక్షత్రంలో కూడిన సోమవారం శివారాధన చేస్తే అంత దరిద్రమూ కూడా అంతరించిపోతుంది. సంపద అభివృద్ధి కలుగుతుంది. కృత్తికా నక్షత్రయుత భౌమవారంనాడు కుమారస్వామిని ఆరాధించడం దీపఘంటా దానాలు చేయటంవలన -అతిత్వరలోనే వాక్సిద్ధి కలుగుతుంది. కృత్తికా నక్షత్రంలో కూడిన బుధవారంనాడు విష్ణువుని ఆరాధించి-పెరుగూ అన్నం (దధ్యోదనం) దానం చేస్తే సత్సంతానం కలుగుతుంది. కృత్తికా నక్షత్రంతో కూడిన గురువారం బ్రహ్మను సేవించి- తేనె, నెయ్యి, బంగారం దానం చేస్తే సమస్తమైన సుఖసౌభాగ్య భోగాలూ వృద్ధి చెందుతాయి.

కృత్తికా నక్షత్రయుక్త శుక్రవాసరాన వినాయకుణ్ణి ఆరాధించి, సుగంధపుష్పాలనూ- అన్నదానాన్నీ ఆచరించిన వారికి మేలిమి వస్తువులన్నీ సిద్ధిస్తాయి. సంతాన సంకల్పంతో ఆరాధించి-వెండి, బంగారాలు దానం జేసిన స్త్రీ పుత్రవతి అవుతుంది. కృత్తికా తారతో కూడివచ్చిన మందవారంవాడు దిక్పాలకులనీ దిగ్గజాల్నీ, నాగదేవతల్నీ, త్రిమూర్తుల్నీ, ధన్వంతరినీ, అశ్వినీదేవతల్నీ ఆరాధిస్తే రోగాలూ, అపమృత్యుభయాలూ నశించడమేకాకుండా, తక్షణమే ఆరోగ్యం కలుగుతుంది. ఉప్పు, శొంఠి, నీళ్ళూ, యినుము, పిప్పలి, మినుములు, మిరియాలూ, మంచినూనె వంటి కఠిన వస్తుప్రదానం వల్ల స్వర్గప్రాప్తి కలుగుతుంది. ధనుర్మాసం తెల్లవారుజామున శివవిష్ణ్వాది దేవతల్ని పూజించి- వరి అన్నం దానం చేయడంవల్ల పాపక్షయం, ఆరోగ్యం, ధర్మవృద్ధి, ఇహపరమహాభోగాలు, శివైకచిత్త దారుఢ్యం కలుగుతాయి.

## బిందువు- నాదము - లింగము

బిందువు శక్తి, నాదం, శివుడు, బిందునాదాత్మకమే సమస్త ప్రపంచమూ కావడం వల్ల ప్రపంచమంతా శివశక్త్యాత్మకమని తెలుసుకోవాలి. నాదాన్ని ఆధారం చేసుకుని వుంది బిందువు. దాని నాధారం చేసుకొని జగత్తు. అందువల్ల బిందునాదాలు రెండూ జగత్తుకు ఆధారాలు. బిందునాదాత్మకమైనది. అనగా శివశక్త్యాత్మకమైనది శివలింగము తదారాధనమే జన్మనివృత్తి. కాబట్టి శివలింగాన్ని సేవించితీరాలి. అయితే మరో విషయం. శివలింగానికీ ప్రణవానికీ సామ్యమున్నదంటారు. ఆ పంథాలో చూస్తే యీ శివలింగం ఆరు విధాలుగా ప్రకటించబడుతోంది. ఈ ఆరు విధాలూ మళ్ళీ రెండు పద్ధతులుగా ఉన్నాయి.

| క్రమసం. | ప్రణవ విభాగం | 1వ విధాన లింగం | 2వ విధానలింగం |
|---|---|---|---|
| 1. | 'అ'కారము | ఆచారలింగము | గురులింగము |
| 2. | 'ఉ'కారము | గురులింగము | చరలింగము |
| 3. | 'మ'కారము | శివలింగము | ప్రతిష్ఠిత యంత్రలింగము |
| 4. | బిందువు | చరలింగము | బిందులింగము |
| 5. | నాదము | ప్రసాదలింగము | నాదలింగము |
| 6. | ప్రణవసమస్తం | మహాలింగము | ప్రణవలింగము |

ఇలా ఒక్కొక్క విధానంలో ఆరేసి లింగాలూ ద్వివిధా ద్వాదశ లింగాలుగా చెప్పబడుతున్నప్పటికీ శివాగమాలరీత్యా మాత్రం ఆచార గుర్వాది లింగాలే సరియైనవిగా తోస్తున్నాయి. యీ ఆరు లింగాలనూ అనుదినం ఆరాధించాలి. మహానైవేద్యాదులు సమర్పించాలి. తేనె, నెయ్యి, పన్నెండు మానికల బియ్యం, పన్నెండు దోన్నెల పెసరపప్పు, పన్నెండు రకాలైన కూరగాయలు, నేతితో వండిన పిండి వంటలు, కుడుములు, పాలు, పెరుగు, పన్నెండు టెంకాయలు, పన్నెండు పూజా ఫలాలు, ముప్పయ్యారు తమలపాకులు, పచ్చకర్పూర చూర్ణం, 'నఖం' అనే గంధ విశేషం యొక్క చూర్ణం, చెంగల్వాది పంచ సుగంధద్రవ్యాలు, తాంబూలం అనే వాటి సమర్పణని మహానైవేద్యం అంటారు. దానిని శివార్పణం చేసి, బ్రాహ్మణాది వర్ణక్రమంలో భక్తులకు పంచిపెట్టాలి. ఇలా వంద మహానైవేద్యాలు చేస్తే - వచ్చే జన్మలో రాజైపుడతాడు.

వెయ్యి మహానైవేద్యాల ఫలం స్వర్గంలో పూర్ణాయువుతో సుఖించడం-ముప్ఫై వేల మహానైవేద్యాలు వల్ల వైకుంఠవాసం-జన్మరాహిత్యం- ముప్పైఆరు వేల మహానైవేద్యాలు కలిపి ఒక జన్మనైవేద్యం అవుతుంది. కార్తికమాసంలోనూ, సంక్రాంతి నాడూ, పర్వదినాల్లోనూ, వ్యతీపాతలప్పుడూ, పౌర్ణమి అమావాస్యలలోనూ, జన్మ నక్షత్రాలప్పుడూ మహానైవేద్యం సమర్పించడం మంచిది. కనీసం సాలుకొక్కసారి వచ్చే జన్మదిన సందర్భంగానన్నా మహానైవేద్యం సమర్పించుకోవడం, శ్రేయోదాయకం. రుద్రాక్షలని ధరించండి-విభూది దాల్చండి-శివ పంచాక్షరిని జపించండి. శివలింగాన్నారాధించండి. ఈ నాలుగూ మిమ్మల్ని శివభక్తులను జేస్తాయి. అందరికన్నా ఉత్తముడైన శివభక్తుడు శివుడితోబాటు శివభక్తుల్ని కూడా సేవించి తరిస్తాడు. అటువంటివాడు ఏ మినహాయింపులూ లేకుండా మోక్షానికి వెళ్లిపోతాడు.

## ప్రణవ పంచాక్షరీ మాహాత్మ్యాలు

"శివారాధన గురించి మాకు తెలియనివెన్నో విషయాలు చెప్పి మమ్మల్ని ధన్యుల్ని చేశావు. అలాగే, ప్రణవ పంచాక్షరీ మంత్రాలను కూడా వినిపించవయ్యా మహర్షీ" అని మునులు కోరడంతో, సూతుడు వాళ్ళ వాంఛితాన్ని యిలా వివరించ నారంభించాడు.

తాపసులైన మీరడిగిన ప్రశ్నకు తగిన సమాధానం చెప్పడం శివుడికే సాధ్యం అయినా నా ఓపిక మేరకు తెలియజేస్తాడు వినండి. శివుడే రక్షించాలి- ప్ర+నవ=

ప్రణవం అయింది. ప్రకృతివలన జన్మించిన సంసారం అనే సముద్రాన్ని తరింప చేసే 'నవ' అంటే సూక్ష్మమైన నౌక అని అర్థం చెప్పుకోవచ్చు. ఇంకా చాలా అర్థాలు ఉన్నాయనుకోండి. అవలావుంచుదాం. ఇక ప్రణవం రెండు రకాలు. అవి :- 1. స్థూలం, 2. సూక్ష్మం సూక్ష్మమంటే ఒకే అక్షరం -స్థూలం అంటే ఐదు అక్షరాలలో ఉంటుంది. జీవన్ముక్తికీ సూక్ష్మ ప్రణవమే విధాయకం. ముప్పైఆరు కోట్ల సూక్ష్మ ప్రణవజపం వల్ల ఆ జన్మలోనే శివయోగం సిద్ధిస్తుంది. గృహస్థులై, శివోపాసకులైన వారికీ పంచాక్షరియే స్థూలప్రణవమై విరాజిల్లుతోంది. ఈ గృహస్థ యోగం 1. క్రియాయోగం, 2. తపోయోగం, 3. జపయోగం అని మూడు రకాలు. పదిమంది క్రియాయోగులకన్నా ఒక తపోయోగి, పదిమంది తపోయోగులకన్న ఒక జపయోగి అత్యుత్తములని తెలుసుకోవాలి.

# బంధమోక్షము

తదనంతరం బంధమోక్షం గురించి చెప్పసాగాడు సూతుడు- ప్రకృతి 1 బుద్ధి1 త్రిగుణాత్మకమైన అహంకారం 1 పృథివ్యాధి పంచభూతాలకు చెందిన తన్మాత్రలు 5 అనే యీ ఎనిమిదింటివల్లా యేర్పడేదే బంధనం/దానికి కట్టుబడ్డ వాడే బద్ధుడు./ఆ ఎనిమిదింటినీ వశపరచుకున్న వాడే ముక్తుడు. జీవుడు తాను చేసిన సుకృతదుష్కృతాల వలన కర్మరజ్జువులచే కట్టబడినవాడై- స్థూల, సూక్ష్మ, కారణాలనే దేహత్రయ కృత కర్మానుసారంగా సంసారచక్రంలోపడి పరిభ్రమిస్తుంటాడు. ప్రకృత్యాదులు మహాచక్రం. శివుడొక్కడే ప్రకృతికి అతీతుడని తెలుసుకుని - ఈ చక్రభ్రమణంలోంచి బైటపడేందుకుగాను - ఏతత్ చక్రవర్తియైన శివుణ్ణి ఆశ్రయించాలి.

తద్వారా శివానుగ్రహం లభిస్తుంది. నిజానికి నిస్పృహుడూ, పరిపూర్ణుడూ అయిన ఆయనకు ఈ పూజలూ పురస్కారాలూ ఏమీ చెయ్యాల్సిన పనిలేదు. కాని చెయ్యాలి. ఎందుకంటే-సహజంగా సాంబుడు ప్రకృత్యతీతుడే అయినా కూడా =యిలా తననే నమ్ముకుని ఆరాధించేవారిపట్ల- నిష్కలుడుగా గాక సకలుడై అనుగ్రహిస్తాడు. ఆ అనుగ్రహం లభించినట్లయితే ప్రకృత్యాదులు మనకు వశమవుతాయి. ముందుగా కర్మాదులు, తద్వారా దేహాదులూ వశవర్తులవుతాయి. అటువంటివారికి 'సాలోక్యం' లభిస్తుంది. తదనంతరం తన్మాత్రాదులు లోబడతాయి. ఆస్థాయి వారికి సామీప్యత సిద్ధిస్తుంది. ఆ అనంతర క్రమంలో అహంకారమూ-

తన్నాశనంచేత బుద్ధీ వశీకరింపబడుతుంది అంటే చిత్తవృత్తి నిరోధకత సిద్ధిస్తుంది' అలా సిద్ధించిన వాణ్ణే యోగి అంటారు.

తక్కిన వాళ్ళని యోగులనడం 'కుక్క సామజమనుటే,' అటువంటి శక్తి యోగివాచ్యులూ' చిత్తవృత్తి నిరోధనా సిద్ధులూ అయినవారికి లభిస్తుంది. 'సారూప్య మోక్షం. అంటే వారు అచ్చం శివ స్వరూపులవుతారన్నమాట. అంతదాకా వచ్చిన వారిపై ప్రసరించే మహాశివుని దివ్యానుగ్రహం వల్ల - ప్రకృతిని వశీకరించుకున్న వారు 'సాయుజ్యమోక్షాన్ని పొందుతారు. కాబట్టి శివారాధన తప్ప- బంధవిముక్తికి అన్యథా మార్గంలేదు. చరలింగాలన్నింటా శ్రేష్ఠమైన రసలింగం బ్రాహ్మణులకు సర్వాభీష్టప్రదమైనది. క్షత్రియులకు బాణలింగం మహాసామ్రాజ్యసిద్ధి కలిగిస్తుంది. సువర్ణలింగం వైశ్యులపాలిట సంపదల పెన్నిధి. శివలింగారాధనం శూద్రులను, శుద్ధులను చేస్తుంది.

అయినప్పటికీ కూడా- స్ఫటికలింగ, బాణలింగాలు రెండూ సర్వవర్ణాలవారికి ఆరాధనీయాలు. ఒకవేళ ఆయా వర్ణాలవారికి విధించబడిన శివలింగాలు లభించ నప్పుడు తమ కన్న పై తరగతి లింగాన్ని సేవించవచ్చు. ఇక పుణ్యస్త్రీలకు పార్థివ లింగం, వితంతువులకి స్ఫటికలింగం మంచివి అని చెబుతారు. కానీ స్త్రీలు ఏ స్థితిలోవున్నా, ఏ వయసులో వున్నా, ఏ స్థాయివారైనా ఏ వర్గం వారైనా సరే-స్ఫటిక లింగమే వారికి సర్వశ్రేయోదాయకమని చెప్పబడుతుంది. సంసారమగ్నుడైనవాడు పీఠంలో లింగాన్ని అభిషేకించి, శాల్యన్నం నివేదించి, పూజానంతరం సంపుటంలో దేవతా మందిరంలో వుంచాలి. నిషిద్ధ కర్మల నుంచి నివృత్తులైనవారు- గురు దత్తమూ సూక్ష్మమూ అయిన శివలింగాన్ని ఎడమ అరచేత వుంచుకుని ఆరాధించి తాము తినబోయే ఆహారాన్ని ముందుగా శివ నివేదనం చేయాలి. తదనంతరం లింగాల్ని తలపైగాని, కంఠానగాని యుక్తస్థానంలో ధరించాలి. ఓ శైవజ్ఞాన జిజ్ఞాసువు లారా! వ్యాసోక్తంగా నాకు లభించిన శ్రేయోమార్గ జ్ఞానాన్ని మీకు విన్నవించుకున్నాను. ఇది తెలుసుకున్న వారు శివానుగ్రహపాత్రులౌదురుగాక!" అని ఆపాడు సూతుడు.

## పార్థివ లింగారాధనా ఫల నిరూపణం - విధి

ఆ తరువాత -ఋషుల కోరికపై పార్థివలింగం గురించి చెప్పనారంభించాడు. మహాత్ములారా! శివలింగాలన్నింటా అత్యుత్తమమమైనది యీ పార్థివలింగం, ఏతదారాధనవల్లనే విష్ణు, బ్రహ్మ, యింద్రాదులూ, నాగ, గంధర్వ, దానవ సంతతుల

వారూ కృతార్థులయ్యారు. కృతయుగంలో రత్నమయలింగం, త్రేతాయుగంలో బంగారులింగం ద్వాపరంలో రసలింగం, కలియుగంలో పార్థివలింగం మహో త్కృష్టాలుగా తెలుపబడుతున్నాయి. పార్థివలింగారాధన వల్ల ఆరోగ్యం, ఆయు ర్వృద్ధి, సంపద, సద్బుద్ధి ఒకటేమిటి? మన మనసులో ఎన్నెన్ని కోరికలున్నాయో అన్ని కోరికలూ సిద్ధిస్తాయి.

ఈ పార్థివలింగ నిర్మాణంలో పంచసూత్ర విచారం అవసరంలేదు. పార్థివ లింగం అఖండంగా నిర్మించాలి ఎప్పుడూ కూడా చరలింగం అఖండంగా- అనగా పానపట్టమూ- పిండమూ విడివిడిగా కాకుండా ఒక్కటిగానే ఉంచాలి. ప్రతిష్ఠిత లింగం మాత్రం ద్విఖండంగా ఉండాలి. లింగవేదికే మహావిద్యలింగమే మహాదేవుడు అని భావించాలి. మందిరాల్లో ఉండే అఖండ లింగాన్నిగాని చరలింగాలలో ద్విఖండ లింగాన్నీ కాని ఆరాధించడం యెందుకూ కొరగానిదని మర్చిపోకూడదు. ప్రాతః కాలంలో మేల్కొంచి నిత్యకర్మలాచరించి- స్నానాదుల అనంతరం భస్మరుద్రాక్ష లను ధరించి- ఆపిదప పరిశుద్ధమైన పుట్టమన్ను తీసుకొని- అందులో శ్రీగంధాన్ని కలిపి, శుచిగల తావున జలంతో తడిపి- వేదికాయుతంగా పిండాన్ని అఖండంగా నిర్మించాలి. శివ పంచాక్షరీ మంత్రంతో పూజాద్రవ్యాలపై జలం ప్రోక్షించాలి.

"భూరసి" మంత్రంతో స్థలశుద్ధినీ, అపోస్మాన్- మంత్రంతో జలసంస్కారం, 'నమస్తే రుద్ర' మంత్రంతో పేటికాబంధనం, 'నమశ్శంభవే మంత్రంతో పంచా మృత ప్రోక్షణం, పమోనీలగ్రీవాయ' మంత్రంతో ప్రతిష్ఠాపన ఏతత్తే రుద్రాయ, మంత్రంతో ఆసన సమర్పణ 'మానోమహాంతం అనే మంత్రంతో ఆవాహనం, 'యాతేరుద్ర' మంత్రంతో ఉపవేశనం, యామిషుం మంత్రంతో న్యాసం అధ్య వోచత్ మంత్రపూర్వకంగా అధివాసం, అసౌజీవ మంత్రంతో దేవతాన్యాసం అసౌయోవసర్పతితో ఉపసర్పణం, నమోస్తు నీలగ్రీవాయ మంత్రంతో పాద్య సమర్పణ రుద్రగాయత్రితో అర్ఘ్యం, త్ర్యంబకమంత్రంతో ఆచమనీయం, 'పయః పృథివ్యా' మంత్రయుక్తంగా క్షీరాభిషేకం, 'ధధిక్రావణ్ణో'తో దధిస్నానం ఘృతం ఘృతయావ, మంత్రంతో ఘృతస్నానం, "మధువాతా" మంత్రంతో మధుస్నానం, 'స్వాదుఃపవస్వ' మంత్రంతో శర్కారాస్నానం, 'దేవస్వత్వా' మంత్రంతో పుష్ప మార్జనం, 'మానస్తోకే'తో ధోవతీ సమర్పణం, 'నమోధృష్ణవే' తో వుత్తరీయాన్ని, యాతేహేతిః ఇత్యాది నాలుగు మంత్రాలతో ప్రత్తి నూలుతో చేసిన వస్త్రసమర్పణ ఆచరించాలి.

ఈ విధంగా సద్యోజాత మంత్రంతో మృత్తికను గ్రహించి వామదేవ మంత్రంతో నీళ్ళతో తడిపి, అఘోరమంత్రంతో పార్థివలింగాన్ని నిర్మించి, తత్పురుష మంత్రంతో ఆవాహనం చేసి, పానవట్టంతో కూడి వున్న లింగాన్ని ఈశాన మంత్ర యుతంగా వేదికపై స్థాపించి,

**"భవాయ భవనాశాయ - మహాదేవాయ ధీమహి**
**ఉగ్రాయ ఉగ్రనాశాయ - శర్వాయ శశిమౌళినే॥"**

అనే మంత్రం చెప్పుకుంటూ, ఏ ఆటంకాలూ సంభవించకుండా- భక్తి శ్రద్ధలతో షోడశోపచారయుతంగా పార్థివ శివలింగార్చన గావించాలి.

వైదిక మంత్రాలూ అవీ రానివాళ్ళకి వేరే కొన్ని పద్ధతులున్నాయి. (అవన్నీ ఈ రచయితచే వ్రాయబడిన "శివపూజా సర్వస్వం" అనే గ్రంథంలో తెలియగలరు) ఇంతవరకు ఈ పార్థివలింగార్చన వీటియొక్క సూక్ష్మతత్వం మీకు వినిపించాను. మరో చిత్రం వినండి.

# కోరికల నిమిత్తం పూజించవలసిన లింగ సంఖ్య

విద్యాభివృద్ధిని కోరేవాడు ఒక వెయ్యి పార్థివలింగాలని అర్చించాలి. ఐశ్వర్యాన్ని ఆశించేవాళ్ళు అయిదువందల పార్థివ లింగాల్ని ఆరాధించాలి. పుత్రార్థి 1500, ముముక్షువు ఒకకోటి భూకాముడు వేయి వస్త్రార్థి 500, గురుజనకృపార్థి మూడు వేలు, తీర్థసేవనాభిలాషి రెండు వేలు, మైత్రీవాంఛితుడు మూడువేలు, శత్రు నిబర్హణార్థం 108, కారాగారాది బంధవిముక్తికి 1500, ప్రభువుల నుండి భయ నివృత్తికి 500, చోరాధిభయదూరతలకు 200, భూత, ప్రేత పిశాచాది బాధా నివారణార్థం 500, దారిద్ర్యం పోవడానికి 3000, సర్వకామనాసిద్ధ్యర్థం 10,000 లింగాలను అర్చించాలి. నిత్యం ఆరాధించేవారు రోజుకు ఒక పార్థివలింగార్చన ద్వారా పాపవిముక్తులవుతారు. 2 లింగాలనర్చించడం వల్ల గాఢమైనవీ, తీరని బాధ కలిగించేవీ అయిన కోరికలు తీరతాయి.

త్రిలింగారాధనవల్ల అంటే మూడు పుటలా పూటకొక లింగాన్ని సేవించడం వలన అన్ని కోరికలూ యిట్టే నెరవేరిపోతాయి. ఇంతెందుకు, ఈ సంసార మహార్ణవాన్ని తరించడానికి లింగార్చనను మించిన మార్గం మరొకటిలేదు. అజ్ఞానమనే చీకట్లోనూ యింద్రియ సుఖవ్యసనాలనే అంధకారంలోనూ పడి గ్రుడ్డివారైన వారికి

జ్ఞాననేత్రం తెరిపించే మైకాక సాధనం శివలింగార్చన మాత్రమేనని మర్చిపోవద్దు. ఉపర్యుక్త విధముగా ఆరాధింపబడిన తరువాత తుట్టతుదిని ఆ లింగాన్ని విసర్జించి వేయాలి. లింగార్చన చేసేవాళ్ళు తూర్పుదిక్కుకు అభిముఖంగా కూర్చుంటే శివుడికి ఎదురవుతుంది. దక్షిణాముఖంగా కూర్చుంటే అమ్మవారి నివాసాన్ని ఆక్రమించి నట్లవుతుంది.

పడమరకు ఎదురుగా కూర్చుంటే అది శివ పృష్ఠభాగం అవుతుంది. అందువల్ల ఆరాధనకు లెప్పుడూ ఉత్తరదిశా ముఖంగా కూర్చొనే శివుణ్ణి అర్చించాలి. శివా రాధనలో అత్యంత ప్రధాన ద్రవ్యాలు మూడు. అవి :- 1. భస్మం, 2. రుద్రాక్ష, 3. మారేడు (బిల్వ) దళాలు. ఇవి మూడూ లేని శివపూజ నిష్ఫలం సుమా! అని సూతుడు చెప్పగానే ఆ మూడింటికీ ఉన్న ప్రత్యేకతయేమిటి? వివరంగా చెప్పు' అని అడిగారు శౌనకాదులు. చెప్పనారంభించాడు.

## బిల్వమహిమ



బిల్వవృక్షం శివ స్వరూపంగా చెప్పబడుతోంది ఏడేడు పద్నాలుగు లోకాలలోని పుణ్యతీర్థాలు కూడా యీ బిల్వమూలమందే నివసిస్తా యని ప్రతీతి. బిల్వవృక్ష మూలాన్ని గంధ పుష్పాదులతో పూజిస్తే వంశాభివృద్ధి కలుగుతుంది. బిల్వ వృక్షం చుట్టూ దీపాలు పెట్టినవారికి శివజ్ఞానం సిద్ధిస్తుంది. మారేడుచెట్టు మొదలులో ఒక మహేశ్వరునికి భోజనం పెడితే- కోటిమందికి అన్నదానం చేసిన పుణ్యం కలుగుతుంది. అక్కడ- ఒక శివభక్తునకు క్షీరాన్నమూ, నెయ్యి, సమర్పించినవాడు మరి ఏ జన్మలోనూ కూడా దరిద్రుడుగాడు.

## భస్మధారణము - ఫలము

**భస్మ:-** 1. స్వల్పభస్మ, 2. మహాభస్మ అని రెండు రకాలుగా ఉంటుంది. ఈ రెండు రకాలవల్లనే -శ్రౌత- స్మార్త- లౌకికాలనే మూడు విభూతులుత్పన్న

మయ్యాయి. బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్యులు మంత్రపూర్వకంగానూ, యితరులు శివ స్మరణంతోను విభూతి ధరించాలి. త్రిపుండ్రాలుగా ధరించబడే విభూతికి కాల్చబడిన ఆవుపేడ ద్రవ్యం.



బ్రాహ్మణులూ, క్షత్రియులూ మానస్తోకే మంత్రంతోను, వైశ్యులు త్రయంబక మంత్రం తోనూ, శూద్రులు గాని, వితంతుస్త్రీలుగాని అయినట్లయితే పంచాక్షరీ మంత్రంతోనూ భస్మ ధారణ చేయాలి. బ్రహ్మచారి త్ర్యంబక మంత్రంతోనూ, గృహస్థు పంచబ్రహ్మ మంత్రంతోనూ, వానప్రస్థుడు అఘోర మంత్రంతోనూ, సన్యాసి ప్రణవస్మరణ తోనూ విభూతి ధరించాలి. అత్యాశ్రమి- సత్యశాంభవ దీక్షితు డైనవాడు- ఈశాన మంత్రయుక్తంగా ఎల్లవేళలా భస్మాన్ని ధరించాలి.

ప్రతీరోజు శివాగ్ని కార్యం చేసి, త్రియాయుషం అనే మంత్రంతో భస్మం ధరించేవాడు సర్వపాప విముక్తుడౌతాడు. భస్మస్నానం చేయకుండా షడక్షరీ మంత్రాన్ని జపించకూడదు.

భస్మధారణ గావించకుండా చేసే జపతపాదు... నిష్ఫలాలుగా చెప్పబడు తున్నాయి. శిరస్సు, నొసలు, చెవులు, కన్నులు, ముక్కు, నోరు, మెడ, రెండు చేతులు, మోచేతులు, మణికట్టులు, హృదయం, రెండు ప్రక్కలు, బొడ్డు, నడుము, తొడలు, చీలమండలు, మోకాళ్ళు, పిక్కలు, పాదములు అనే ముప్పయిరెండు స్థానాలలోనూ భస్మమును ధరించాలి. అంత అవకాశం లేనివారు- శిరస్సు, లలాటం, చెంపలు, కంఠము, భుజములు, మోచేతులు, మణికట్లు, హృదయము, నాభిపార్శ్వద్వయము, వెన్ను- అనే పదహారుచోట్లనైనా భస్మధారణ చేయాలి. అది కూడా సంఘటిత పడనివారు తల, బాహుద్వయం, హృదయం, నాభి - అనే అయిదుతావులందైనా భస్మమును ధరించాలి. దేశకాలమాన పరిస్థితులను బట్టి భస్మమును ధరించవచ్చు. ఉద్ధూళనం కుదరనప్పుడు త్రిపుండ్రాలనైనా ధరించాలి/భస్మధారణ విధి విధానాలు యేమాత్రమూ తెలియనివారు "ఓం నమః శివాయ" అని స్మరిస్తూనైనా భస్మధారణ చేయాలి.

స్త్రీహత్యా, గోహత్య, వీరహత్య, అశ్వహత్యా, స్తేయం, పరస్త్రీగమనం, పరనింద, అకారణహింస, పంటలను దొంగిలించడం తోటలు పాడుచేయడం, కొంపలు తగలబెట్టడం, గోమహిషతిలా శాంబర (దుప్పటి, వస్త్రాన్న ధాన్య, జలసువర్ణాదు లను నీచుల నుంచి దానం తీసుకోవడం, చేతులు పట్టే స్త్రీనిగాని- లేదా వాళ్ళకి సంబంధించిన స్త్రీనిగాని- వేశ్యలనుగాని - చండాల స్త్రీనిగాని, శూద్రస్త్రీనిగా లేదా నాట్యకత్తెలనుగాని- బహిష్ఠయివున్న భామలనుగాని- అవివాహితలనుగాని-విధవ లనుగాని- సంగమించడం మాంసం-తోలు-ఉప్పు- రసద్రవ్యాలు, అనే వాటిని అమ్మడం, చాడీలు చెప్పడం కపటంగా ప్రసంగించడం, కూటసాక్ష్యం, అసత్యం అనే అన్ని రకాల పాపాలూ కూడా -అవి పూర్వజన్మవైనా యీ జన్మలోవైనాసరే, తెలిసి చేసినా తెలియక చేసినాసరే- కేవలం నిరంతరం భస్మ త్రిపుండ్రధారణ మాత్రాన - తత్కాలముననే నశించిపోతాయి.

నియమంగానూ, భక్తియుక్తులతోనూ భస్మధారణ చేసేవాడు యెంతటి భ్రష్టు డైనాసరే- దేవతలంతా అతడిని గౌరవిస్తారు. వాడు శివోపాసన కూడా చేసినట్లయితే - ఆ ఫలితం చెప్పనలవికాదు. తానొక్కడేకాదు, అతగాడుచరించే ప్రాంతమంతా పుణ్యక్షేత్రంగా కీర్తించబడుతుంది. భస్మధారిని దండించేవాడు- చండాల బీజోత్ప న్నుడుగా గుర్తించాలి. ఎవడైతే, బిల్వ, భస్మ, రుద్రాక్షయుతంగా రుద్రారాధన చేస్తాడో వాడి పుణ్యం అంతా ఇంతా అని చెప్పటానికి అలవికాదు.

కనీసం భస్మరుద్రాక్షలన్నా ధరించి శివారాధన చేయాలి. అవి లేకుండా చేసే శివార్చన మొత్తం నిష్ఫలమైపోతుందని చెప్పబడుతోంది. కాని శివారాధన చేసినా చేయకపోయినా భస్మరుద్రాక్ష ధారణ మాత్రం సర్వశ్రేయస్కరం అని శాసించబడింది. ఆరాధన చేయలేనివారు విభూతీ, రుద్రాక్షలూ ధరించి శివ నామాన్ని స్మరించినా చాలు "నమః శివాయ" అనే పంచాక్షరిని గాని "ఓం నమః శివాయ" అనే షడక్షరిని గాని జపించాలి. కనీసం "శివశివ" అనైనా అనుకుంటూ వుండాలి. అయితే "శివశివ" అనుకోవడంకన్న "శ్రీశివాయనమః" అనుకోవడం శ్రేయస్కరమని పెద్దలహితవు.

భస్మరుద్రాక్షలు ధరించి శివనామాన్ని స్మరించేవారి దర్శనమాత్రం చేతనే త్రివేణి స్నానఫలం సంప్రాప్తమౌతుంది. విశ్వాసం లేనివాడు పాపాత్ముడయి వుంటా డని చెపుతున్నారు. నొసట విభూతి కంఠాన రుద్రాక్ష, నోటశివ నామం ధరించని వాడు అధముడని ఆర్యోక్తి.

# రుద్రాక్ష మహిమ - ధారణ విధి



"ఆలోచనీయమైన భస్మ మాహాత్మ్యాన్ని వినిపించావు. అదే విధంగా రుద్రాక్షల గురించి కూడా తెలియజెప్పు"మని శౌనకాదులు కోరడంతో, ఆ విషయాన్ని చెప్ప సాగాడు సూతుడు.

గతంలో ఒకసారి అగణిత దివ్యవత్సరాలపాటు ధ్యానంలో వుండిపోయాడు రుద్రుడు. ఆ తపస్సు నుండి ఆయన కళ్ళు తెరవగానే ఆ నేత్రాలనుండి కొన్ని నీటిబొట్లు భూమికిరాలి-గౌడదేశానా, మధురక్షేత్రంలోనూ, అయోధ్యానగరంలోనూ, లంకాపట్టణానా, మలయపర్వతంపైనా, సహ్యాగిరిమీదా, కాశీక్షేత్రానా పడ్డాయి. కాలాంతరాన- అవే రుద్రాక్షలుగా పరిణమించాయి. రుద్రుడి అక్షులనుంచి ఆవిర్భూతం కావడంవల్లా, రుద్ర (దుః)ఖాలను క్షయింపచేసేవి గనుకా- వాటికి రుద్రాక్షలనే పేరు వచ్చింది.

భక్తానుగ్రహ తత్పరుడైన శివుడు రుద్రాక్షలను చతుర్వర్ణ భక్తులకూ అనుగ్రహించాడు. వాటిలో రేగిపండంత పరిమాణం కలిగినవి సుఖసౌభాగ్యాలను వృద్ధి చేస్తాయి. ఉసిరికాయంతవున్న రుద్రాక్ష సర్వారిష్టాలనీ శమింపజేస్తుంది. గురివింద గింజంత వుండే రుద్రాక్షలు మనసులోని కోరికలన్నింటినీ సఫలం చేస్తాయి. చెప్పొచ్చేదేమిటంటే ఈ రుద్రాక్షలు యెంత చిన్నవైతే అంత మంచి ఫలాలనిస్తాయి. జపం చేసుకోవడానికి ఈ రుద్రాక్షల మాలికలే అత్యంత శ్రేష్ఠమైనవి.

అలాగని అన్ని రుద్రాక్షలూ ఆరాధనీయాలుగావు. సమానములు, నునుపైనవి, గట్టివి, స్థూలములు, కంటకయుతాలైనవీ అయిన రుద్రాక్షలు శుభప్రదాలు. అలాగే పురుగులచేత తొలచి వేయబడ్డనీ, పగిలిపోయినవీ, విరిగినవీ, ఖండరహితాలూ, వ్రణయుతాలూ, గుండ్రంగా లేనివి, అయిన రుద్రాక్షలు అశుభాలు. వాటిని ధరించ కూడదు. వాటితో జపం కూడా చేయకూడదు.

దారం గ్రుచ్చుకోవడానికి అనువుగా రుద్రాక్షకు ఒక రంధ్రం కావాలి గదా! ఆ రంధ్రం తనకి తానుగా యేర్పడి వున్న రుద్రాక్ష చాలా శ్రేష్ఠమైనది. ఆ సూత్రం

ద్వారా తప్ప - తక్కిన మంచి లక్షణాలన్నీ వున్నట్లయితే- మనమే దానికి జాగ్రత్తగా రంధ్రం చేసుకోవచ్చును. పదకొండువందల రుద్రాక్షలను ధరించినవాడు రుద్ర స్వరూపుడుగా చెప్పబడుతున్నాడు. అందువల్ల కలిగే సత్ఫలం చెప్పడం యెవ్వరి వల్లాకాదు. అయిదు వందల యాభై రుద్రాక్షలను తలపై మకుటంవలె ధరించి శిఖలో మూడు ఒక్కొక్క చెవికి ఆరుచొప్పున రెండు చెవులకూ కలిపి పన్నెండు, కంఠాన నూటొక్క రుద్రాక్షలు, భుజాలమీద- మోచేతులయందు- మణికట్టులందు తావుకొక ఆరుచొప్పున ఉపవీతంలో మూడు, కటిని అయిదు ధరించాలి. అలా ధరించి సుఖాసీనుడైన వ్యక్తిని చూసీచూడగానే రుద్రుడనే భావన ఎవరికైతే కలుగు తుందో వాళ్ళు చేసిన పాపాలన్నీ అప్పటికప్పుడే కాలిపోతాయి.

మరొకపద్ధతిలో -శిఖను 1, శిరస్సున 30, కంఠాన 40, బాహుద్వయం 32, 2 మణికట్టులకూ కలిపి 24, రెండ మూపులా 500, మాలికగా 103, ఉపవీతంగా 255 కూడా ధరించవచ్చు.

శిఖలో 1, శిరస్సున 40, కంఠాన 32, ఛాతీపై 108, చెవులమీద ఒకటొకటి, రెండు బాహువులకు 12, చేతులకు 32, ధరించడం మూడవపద్ధతి, ఇలా ధరించిన వాళ్ళని శైవ ప్రవరుడంటారు. వీరు యెదురైనాసరే శివభావంతో నమస్కరించవలసి వుంటుంది.

శిరస్సుపై ధరించేటప్పుడు ఈశాన మంత్రంతోను, చెవులకు దాల్చేటప్పుడు తత్పురుష మంత్రంతోను, కంఠానా, హృదయానా దాల్చేటప్పుడు అఘోరబీజ మంత్రంతోను, చేతులకు ధరించేందుకు అఘోర బీజమంత్రంతోను, ఉదరభాగ ధారణం వామదేవ మంత్రంతోను, యిలా పంచబ్రహ్మ మంత్రాలతోనూ, రుద్రాక్ష మాలిక ధరించాలి పదిహేను రుద్రాక్షలు గల మాలికను ఒక దానినిగాని, మూడింటిని గాని, ఐదింటినిగాని, యేడింటిగాని ధరించాలి.

భస్మరుద్రాక్షలు ధరించి శివారాధన చేసేవారు మద్యమాంసాలనూ, నీరుల్లినీ, వెల్లుల్లినీ, మునగ, విరిగి మొదలైన వస్తువులను తినకూడదు/బ్రాహ్మణుడు తెల్లటి రుద్రాక్షలు ధరించాలి. క్షత్రియులు ఎర్రటిని ధరించాలి. వైశ్యులు పసుపుపచ్చవీ, నల్లనివీ ధరించాలి. రుద్రాక్షలను శైవులే దాల్చాలనే నియమం లేదు. వైష్ణవులూ, శాక్తేయులూ కూడా ధరించవచ్చును. రుద్రాక్షలు ధరించేవాళ్ళని- భూతప్రేత పిశాచ శాకినీ డాకిన్యాదులు తేరి చూడలేవు.

# రుద్రాక్షలలో రకములు

రుద్రాక్షలు పదునాలుగు రకాలుగా ప్రసిద్ధమైవున్నాయి. అవేగాక యింకా కొన్ని రకాలు వున్నాయి గాని -అవన్నీ అలభ్యాలు, కర్మానుసారంగా ఎవరికైనా లభిస్తే లభించవచ్చు. అదంతా యీశ్వరేచ్ఛ. ప్రస్తుతం ప్రసిద్ధాలైన పద్నాలుగింటి గురించి తెల్సుకుందాం.

మొదటిది ఏకముఖి. దీనిని చూస్తేనే బ్రహ్మహత్యాది పాతకాలు నశిస్తాయి. పూజించినవాడు నిత్యం లక్ష్మీ ప్రసన్నతను పొందిన వాడవుతాడు. రెండవది ద్విముఖి. ఇది గోహత్యాపాపాన్ని పోగోడుతుంది. అభీష్టాలు సిద్ధింపజేస్తుంది. మూడవది త్రిముఖి దీనిని పూజించినా ధరించినా సాధనలో వున్న సర్వకార్యాలూ సిద్ధిస్తాయి. విద్యాభివృద్ధికి, విద్యా ప్రయోజనానికీ చాలా మంచిది. చతుర్ముఖ రుద్రాక్ష-బ్రహ్మ స్వరూపము ఇది దర్శన, స్పర్శనల మాత్రం చేతనే పాపాలను దగ్ధం చేసేస్తుంది. నరహత్యా పాపాన్ని తొలగిస్తుంది. తదుపరి పంచముఖి. ఇది కాలాగ్ని రుద్రస్వరూపం-సాలోక్య సారూప్య సామీప్యసాయుజ్యాలనే నాలుగు రకాల మోక్షాలనూ క్రమంగా కలుగజేస్తుంది/వెళ్ళకూడని చోటికి వెళ్ళడం, తినరానివి తినడంవంటి పాపాలు అన్నింటినీ భస్మీపటలం చేసేస్తుంది. ఆరుముఖాలు గల రుద్రాక్ష షణ్ముఖ స్వరూపమై విరాజిల్లుతుంది. దీనిని కుడి భుజాన ధరిస్తే ఏ పాపమైనా సరే అది ఎటువంటిదైనా, యెంతటిదైనాసరే నాశనం చేసేస్తుంది. ఆ పిదపనున్న సప్తముఖీ.

రుద్రాక్ష మన్మధరూపమైనదిగా తెలుసుకోవాలి. దారిద్ర్యహరణానికి పనికి వస్తుంది. అష్టముఖీ రుద్రాక్ష - అష్టవసువుల, భైరవుల సంయుక్త రూపం, దీర్ఘా యుష్యకారకం. యీ రుద్రాక్ష, నవవక్త్ర రుద్రాక్ష భైరవుని కపిలుని, నవదుర్గల యొక్క స్వరూపం ఎడమచేత దానిని ధరిస్తే శివ తుల్య విభవుడవుతాడు. దశముఖ రుద్రాక్ష విష్ణుస్వరూపం. సర్వవాంఛలూ తీరుస్తుంది. ఏకాదశముఖి ఏకాదశరుద్ర స్వరూపం, ద్వాదశముఖి ద్వాదశాదిత్యస్వరూపం, త్రయోదశ ముఖి విశ్వేదేవ తాత్మకమైనది. పద్నాలుగు ముఖాలతో విరాజిల్లే రుద్రాక్ష పరమశివ స్వరూపం.

# రుద్రాక్షలు ధరించు మంత్రబీజములు



వీనిలో ఏకముఖ, చతుర్ముఖ, పంచముఖ, దశముఖ, త్రయోదశముఖాలైన రుద్రాక్షలను ధరించేటప్పుడు "ఓం హ్రీం నమః" అనే మంత్రంతో ధరించాలి. ద్విముఖీ, చతుర్ముఖీ రుద్రాక్షలు దాల్చేటప్పుడు "ఓం నమః" అనుకోవాలి. త్రిముఖీ రుద్రాక్షధారణవేళ "క్లీం నమః" అని జపించాలి. ఆరు, తొమ్మిది, పదకొండు, ముఖాలు గల రుద్రాక్షలు ధరించేందుకు "ఓం హ్రీం నమః" అని ధ్యానించు కోవాలి. అదే విధంగా సప్తముఖీ, అష్టముఖీ రుద్రాక్షలు ధరించేటప్పుడు "ఓం హుం నమః" అనుకోవాలి. ద్వాదశముఖీ రుద్రాక్షకు 'ఓంక్రౌం క్షౌం రౌం నమః' అని ధ్యానించుకోవాలి. రుద్రాక్షను మంత్రహీనంగా ధరించకూడదు.

ఋషులారా! మీ కోరిక మీదట- బిల్వ, భస్మ, రుద్రాక్షల మహిమలు-ధారణా విధులు తెలియజేశాను. ఇంతటితో శివపురాణంలోని విద్యేశ్వర సహిత పూర్తయింది. అంటూ ముగించాడు సూతుడు.

ఏవం

శ్రీవేదవ్యాస మహర్షి రచించిన శివ మహాపురాణమున
యిరువదియైదు అధ్యాయములుకల, విద్యేశ్వర సంహిత సంపూర్ణము

శా॥ నీరూపంబు దలంపంగా తుదమొద ల్నేగాన నీవైనచో
రారారమ్మనియంచు చెప్పవు వృథారంభంబు లింకేటికిన్
నీరన్మ్ంపుము, పాలముంపు మింకనిన్నే నమ్మినాడంజుమీ
శ్రీరామార్చిత పాదపద్మయుగళా! శ్రీ కాళహస్తీశ్వరా॥

★★★



శ్రీ విఘ్నేశాయ నమః

# శ్రీ శివమహాపురాణము

## 2. రుద్రసంహిత

విద్యేశ్వర సంహితా ప్రవచనానంతరం, మునుల కోరికపైన శుకసహాధ్యాయి యైన సూతుడు- వేదవ్యాసకృత శివమహాపురాణాంతర్గత సంహితా సప్తకంలో రెండవదైన రుద్రసంహితను యీ విధంగా వినిపించసాగాడు.

## నారదుడి తపస్సు- గర్వము

పూర్వం ఒకప్పుడు నారదుడు శివతత్త్వజిజ్ఞాసువై అఖండమైన తపస్సు చేశాడు. అతని తపస్సుకు లోకాలు సైతం అట్టుడికి పోసాగాయి. ఇంద్రుడు వెంటనే మన్మథుణ్ణి పిలిచి, నారదుడికి తపోభంగం చేయవలసిందిగా ఆదే శించాడు. శుకపిక శారికాది పరివారాన్నీ వసంతాదులైన సైన్యగణాన్నీ చెరకు వింటినీ, పూలబాణాలనీ తీసుకునీ నారదుడున్న చోటికి వచ్చాడు అనంగుడు.

గతంలో మన్మథుడొకసారి శివనేత్రాగ్ని జ్వాలలకు బలియైపోయిన స్థలంలోనే యిప్పుడు నారదుడు తపస్సు చేస్తున్నాడు. అప్పట్లో శివుడు మన్మథుణ్ణి అనంగుడిగా

బ్రతికించి- ఆ స్థలంలో మాత్రం మన్మథుడి తంత్రాలు ఏమీ పని చేయవని హెచ్చరించి వున్నాడు. కాని మాయాధీనులైన కారణంగా ఇటు రతీపతి, అటు శచీపతి, యితరులూ కూడా ఆ విషయాన్ని విస్మరించి - మునిపతికి తపో భంగం చేయడానికై మోహరించారు. నారదుడి యేకాగ్రతను భగ్నం చేయడానికి శతధా ప్రయత్నించాడు పంచబాణుడు. శివశాసనంవల్ల- అక్కడ మదన తంత్రా లేవి ఫలించలేదు., కాని, శివమాయాధీనులైన వారంతా అది కేవలం నారదుడి తపః ప్రభావమనే భ్రమపడ్డారు. ఆయనకు తలలు వంచి నమస్కరించి తమదారిని తాము వెళ్ళిపోయారు.

మరికొన్నాళ్ళు తరువాత తపస్సులో నుంచి కన్నులు తెరిచాడు నారదుడు. జరిగిందంతా తెలుసుకున్నాడు. కాముని జయించడం తన ప్రజ్ఞేననుకున్నాడు. హరిబ్రహ్మాదులకే వశంకాదు- శివమాయను గెలవడం, ఒక యీ మదనుడనగా యెంత? అహంలో మునిగిపోయాడు. మదనదమనం వలన తాను మాయను గెలిచాననుకున్నాడు? తపస్సు సిద్ధించిందని తలపోశాడు./ఆశ్రమాన్నీ, దీక్షనూ వదిలిపెట్టి కైలాసం వెళ్ళాడు. శంకరుణ్ణి కలిశాడు. తాను మారుణ్ణే ఓడించడం చెప్పుకున్నాడు. మాయను గెలిచేశానని మరీ మరీ చెప్పాడు. మహాత్ముణ్ణాయి పోయినంతగా ప్రగల్భించాడు.

జాలిపడ్డాడు శంకరుడు. నారదుణ్ణి మందలించాడు. తపస్సులోని విషయా లను అలా తనకుతానై బైట పెట్టుకోకూడదనీ, తన దగ్గర మాట్లాడినట్లుగా మరెవ్వరి దగ్గరా మాట్లాడవద్దనీ, మరీ ముఖ్యంగా ఆ విష్ణుమూర్తి దగ్గర పెదవి కదపవద్దనీ అనేకరకాల హితవు వచించాడు. శంకరుడు చెప్పినవన్నీ యీ చెవితో విని ఆ చెవితో వదిలేశాడు నారదుడు. ఎంత నారదుడైతే మాత్రం కర్మను తప్పించుకో గలడా? అందువల్లనే వృషధ్వజుడు చెబుతున్నంసేపు వూకొట్టి చివరగా ఓ నమ స్కారం పెట్టి, సత్యలోకం దారిపట్టాడా బ్రహ్మపట్టి, సత్యలోకంలో తన తండ్రియైన బ్రహ్మను దర్శించాడు. శంకరుని దగ్గర చెప్పుకున్న గొప్పలన్నీ బ్రహ్మ దగ్గర కూడా చెప్పుకున్నాడు. బ్రహ్మ

వారించాడు. అలా ఆత్మస్తుతి చేసుకోవడం ఆరోగ్యకరమైన పనికాదనీ చెప్పాడు. వింటేగా నారదుడు! అక్కణ్ణుంచి వైకుంఠం చేరాడు. నారదుడి రాక గురించి తెలియగానే నారాయణుడు స్వయంగా యెదురువెళ్ళాడు. స్వాగత

సత్కారాలతో ఆహ్వానించాడు. విష్ణువంతటివాడు తనకలా స్వాగత సత్కారాలు చేయడంతో విర్రవీగిపోయాడు నారదుడు. తన గొప్పలు చెప్పుకోనారంభించాడు. విన్నాడు విన్నాడు విష్ణుమూర్తి. ఈ జటాధారి పెడదారి పడ్డాడని గ్రహించాడు. శివ మాయలో చిక్కుకుని అహంకరిస్తున్నాడని అర్థం చేసుకున్నాడు. నారదుడు తన మన్మథ విజయం గురించి చెప్పగానే-

'ఔనుమరి! నైష్ఠిక బ్రహ్మచారివి. అఖండ తపశ్శక్తి సంపన్నుడివి. శివభక్తుడివి. నిన్ను ఆ మన్మథుడేం చేయగలడులే అన్నాడు. నారాయణుడు వర్మగర్భంగా, మరింత పొంగిపోయాడు త్రిలోకసంచారి. బాగా చెప్పావు. నువ్వు నావెనకవుండు చాలు. అల్లాటి మన్మథులు ఎంతమందైనా సరే ఓడించేస్తాను" అన్నాడు గర్వంగా. నవ్వుకున్నాడు విష్ణువు. మనసారా శివుణ్ణి స్మరించుకున్నాడు. కేశవుడి వద్ద శలవు తీసుకుని - నారదుడు లోక సంచారానికై బయలుదేరాడు.

# విష్ణుమాయ విలాసము నారద గర్వభంగము

నారదుడు వెళ్ళిపోగానే శివమాయా ప్రేరితుడైన శ్రీనివాసుడు తన విష్ణు మాయతో ఒక అత్యద్భుతమైన నగరాన్నీ, ప్రజలనీ, రాజునీ, యువరాణినీ అందర్నీ సృష్టించాడు. లోకసంచారం చేస్తూ చేస్తూ నారదుడు ఆ మాయానగరం చేరుకున్నాడు. దాని రాజైన శీలనిధి నారదుణ్ణి ఆహ్వానించి, సన్మానించి, తన కుమార్తె యైన శ్రీమతి చేత అతనికి మ్రొక్కించాడు. నారద మునీంద్రా! త్వరలోనే నా పుత్రికయైన యీ శ్రీమతికి స్వయంవరం యేర్పాటుచేశాను. మంచి భర్తను యెంచుకొనేలా ఆశీర్వదించండని కోరాడు రాజు. నారదుడు అలాగే దీవించాడు. కాని ఆ పిల్లమీద మోజుపడ్డాడు. అప్పట్లో తానున్నది శివ తపోభూమి గాబట్టి కాముణ్ణి గెలిచాడే గాని, ఇప్పుడు అతని వల్ల కావటంలేదు. నిలువెల్లా కామం బుసలు కొట్టసాగింది. ఎలాగైనా సరే ఆపిల్లని పెళ్ళాడాలనుకున్నాడు. అయితే ఆ పిల్ల తనవంటి సన్యాసిని వరిస్తుందో వరించదోననే అనుమానంతో సహాయం కోసం విష్ణువు దగ్గరకు వెళ్ళాడు. ఆయనతో తన మోహం గురించి చెప్పాడు.

"ఈ బ్రహ్మచర్యం నావల్లకాదు. శుభ్రంగా పెళ్ళి చేసుకుని సంసారినై పోతాను. ఆడపిల్లలు అందగాళ్లైన పురుషుల్నే ప్రేమిస్తారు విష్ణుమూర్తి! నీకన్న అందగాడెవడూ లేడు. కాబట్టి నాకు నీ రూపాన్ని అనుగ్రహించావంటే నేనా కన్యచే వరించబడి ఓ

యింటివాడినవుతాను అని ప్రార్థించాడు. నవ్వుకున్నాడు నారాయణుడు. సరేనన్నాడు. అని నారదుడి శరీరమంతా అందంగా మార్చేశాడు. ముఖం మాత్రం కోతి ముఖంగా మార్చాడు. ఎవరి ముఖం వారికి కనపడదు గదా! అందువల్ల నారదుడు తన తక్కిన శరీరం మల్లేనే ముఖం కూడా అందంగా మారిపోయి ఉంటుందనుకుని-ధైర్యంగా స్వయం వరానికి వెళ్ళాడు.

శివమాయవశాన ఇద్దరు రుద్రగణాధి నాయకులు బ్రాహ్మణ వేషాలు ధరించి నారదుడికి చెరి ఒక ప్రక్కనా కూర్చున్నారు. శ్రీమతి పూలమాలతో వచ్చింది. స్వయంవరానికి వచ్చిన వారెవరూ ఆమెకు నచ్చలేదు. కోతి ముఖంతో వున్న నారదుడు అసలే నచ్చలేదు. అదే సమయాన మహారాజు వేషంలో వచ్చాడు మాధవుడు. ఆయన శ్రీమతికి నచ్చాడు. ఆమె ఆ హరిని వరించింది. ఈ సంఘట నతో నారదుడికి తలకొట్టేసినట్లయింది. శ్రీమతి మీద మీద కామంతో పరి తపించపోసాగాడు.

అది గమనించి చెంతనున్న రుద్రగణాలు ఓయీ నారదా! అందని అందం కోసం అలమటించి లాభం లేదు అయినా ఆ సుందరాంగి నిన్నెలా వర్తిసుందనకు న్నావు. నీ ముఖం ఒకసారి అద్దంలో చూసుకో అని సలహాయిచ్చారు. నారదుడు అద్దం చూసుకున్నాడు. తన ముఖం కోతి ముఖంలా ఉండడం చూసి కుతకుత లాడిపోయాడు. ఆ ఆవేశంలో ప్రక్కనున్న తనను పరిహరిస్తున్న రుద్రా గణాల వారు బ్రాహ్మణులే అనుకుని బ్రాహ్మణులై యుండి నన్నింతగా పరిహసించే మీరు బ్రాహ్మణ బీజమున రాక్షసులై జన్మింతురుగాక అని శపించాడు. అక్కడితో కసి తీరక వైకుంఠానికి బయలుదేరాడు.

## నారదుడు విష్ణువును శపించుట

కామాతురుడూ, కార్యవిఫల వేదనామానసుడూ- శివమాయా పరివృతుడూ యైన నారదుడు వైకుంఠంలో అడుగు పెడుతూనే విష్ణువును దెప్పిపొడనారంభిం చాడు. "హరి హరీ! నువ్వు మాయావివని తెలుసుగాని, కాని, ఆశ్రితుడనైననన్ను కూడా అల్లరి పెడతావనుకోలేదు. ఇలా మోసాలు చేస్తావు. గనుకనే ఆ సదాశివుడు సర్వాధిక్యతను బ్రహ్మపరం చేసి, నిన్ను ఆ తరువాత వాడిగానే అట్టేపెట్టాడు. ఇంకెప్పుడూ నువ్వి లాంటి దుర్మార్గపు పనులు చేయకుండా ఉండేలాగ ఇప్పుడే

నిన్ను శపిస్తున్నాను. ఏ రాజువేషంతో ఆడపిల్ల విషయమై నన్ను మోసం చేసావో, ఆ రాజు వేషంతోనే మానవుడివై జన్మింతువుగాక! ప్రేమించిన పిల్లకోసం నేనెలా వియోగం దుఃఖం అనుభవిస్తున్నానో, అలాగే నువ్వు కూడా ఆ జన్మలో భార్యా వియోగదుఃఖంతో సామాన్య మానవుడివై పరితపించి పోవుదువుగాక, నువ్వు నాకు సంప్రాప్తింప చేసిన వానరముఖాలే ఆ జన్మలో నీకు తోడౌనుగాక!

నారదుడి ఆవేశమంతా తాపీగా భరించాడు పీతాంబరుడు. దేవర్షి శాపానికి తిరుగులేదు కదా! ఆ శాపస్వీకరణార్థమై మనసారా మహాదేవుణ్ణి స్మరించాడు. కరుణా వరుణాలయుడు కంఠేకాలుడు తక్షణమే నారదునిపై గప్పివున్న శివ మాయను తొలిగింప చేశాడు. ఎప్పుడైతే మాయ తప్పుకుందో భళ్ళున తెల్లవారి నట్లయింది నారదుడు తెలివికి, తప్ప తాగిన యిప్ప సారా చప్పున దిగిపోయి నట్లయింది. నారదుడి ప్రజ్ఞానం మబ్బు విడిన సూర్యుడిలా ప్రకాశించసాగింది. జరిగినదంతా స్మృతిపథంలో మెదిలి, తనకు తానే సిగ్గుపడిపోయాడు. తటాలున విష్ణుపాదాలపై పడ్డాడు. తప్పులు మన్నించమన్నాడు. శాపాన్ని త్రిప్పి వేయమన్నాడు. తన పాపానికి ప్రాయశ్చిత్తం సెలవీయమన్నాడు. ఘోధు ఘోడున విలపించాడు నారదుడు. నిర్వికారంగా దరహసించాడు.

నీరజాక్షుడు నారదా! మృదువుగా చెప్పసాగాడు మురారి. ఇందులో నీ తప్పే మీలేదు. ఇదంతా శివుడిలీల. ఆయన ఎలా ఆడిస్తే అలా ఆడవలసిన వాళ్ళమేగాని మనమెవ్వళ్ళమూ కూడా స్వతంత్రులం కాదు భవిష్యల్లోక కళ్యాణార్ధం శివేచ్ఛవలనే నువ్వు నన్ను శపించడం సంభవించింది. నీ శాపాన్ని స్వీకరిస్తున్నాను. నువ్వేం దిగులు పడకు. శివుణ్ణే నమ్ముకో! ఆయనే పరబ్రహ్మ ఆయననే కీర్తించు. ఆయననే ధ్యానం చెయ్యి. ఆయన అష్టోత్తర శతనామ స్తోత్రాల్ని సర్వదా పఠించు, మనో వాక్కాయములు మూడింటా నిత్యం యెవడైతే మృత్యుంజయుణ్ణే సేవిస్తాడో వాడే పండితుడు, వాడే జీవన్ముక్తుడు పురాకృత పుణ్య విశేషంవల్లనే ఆపురహరుడి మీద భక్తి కలుగుతుంది.

నారదా! పాదాల నుంచి శిరస్సు వరకూ భస్మోద్ధూళనం చేసుకో. శివుడికి అత్యంత ప్రియాలైన రుద్రాక్షలను కంఠమూ మొదలైన తావులలో ధరించు. నిత్యం శివషడక్షరీ మంత్రాన్నే జపించు. అంటే "ఓం నమశ్శివాయ" అనే అను. వింటే వృషాకపి గురించే విను, చెబితే శివచరిత్రములే చెప్పు తలబోస్తే నెలపూతల దాలుపునే తలపోయి లోకంలోని శివక్షేత్రాలనే చరించు, (కాశీ)కి వెళ్ళు, అక్కడ

విశ్వేశ్వరుణ్ణి సేవించు, నిర్వికారుడివిగా, అనంతరం నీ తండ్రియైన బ్రహ్మను ఆశ్రయించు, అతడు నీకు శివమహిమనీ, శివ సహస్రనామ స్తోత్రాదులనీ ఉప దేశిస్తాడు. అవి ధరించు, ఇన్నాళ్లూ నా భక్తుడిగా ఖ్యాతి వహించి నిత్య సంచారి వయ్యావు ఇక నుంచైనా సర్వేశ్వరుడైన ఆ శివుణ్ణి ఆరాధించి ముక్తిని పొందు ఆ శివుడు నిన్ను అనుగ్రహించుగాక! అని బోధించి, దీవించి అంతర్హితుడయ్యాడు హరి.

# నారదుడి లోకయాత్ర

విష్ణూపదేశంతో తెలుసుకున్నాడు నారదుడు. తదనుసారంగానే శైవక్షేత్రా లన్నీ సంచరించసాగాడు. అంతః పూర్వం మాయా స్వయంవరంలో విప్రవేషాలలో ఉండి నారదుడిచేత శప్తులైన రుద్రగణాలు, యీ క్షేత్రసంచారంలో పునః తారస పడ్డాయి. తాము బ్రాహ్మణులము కామనీ, రుద్రగణాలమనీ తెలియజేసి జరిగిన దానికి క్షమాపణ కోరుకున్నారు. శాపవిముక్తి ప్రసాదించమని నారదుని అర్థించారు. నారదుడు వారిని ఓదార్చాడు. శాపాన్ని వెనక్కి తీసుకోలేనని చెప్పాడు. అందువల్ల రుద్రగణాల వారిద్దరూ ఒకానొక మునిబీజాన రాక్షసజాతిలో పుట్టి అనుపమాన బలపరాక్రమ,వైభవోపేతులై, జితేంద్రియులై, శివభక్తులై చరించుచు, శివుడంతటి దేవుడి వలన మరణించి తిరిగి రుద్రగణాలలో చేరతారనీ, కాని మనినంతకాలమూ మాత్రం రాక్షస స్వభావంలోనే ఉంటారనీ చెప్పాడు. రుద్రగణాలు అంతటితో సంతృప్తిపడి వెళ్ళిపోవడం జరిగింది.

అనంతరం నారదుడు కాశీ చేరాడు. గంగాస్నానం చేశాడు. భైరవుడికి, వినాయకుడికి మ్రొక్కాడు. అన్నపూర్ణమ్మా, విశాలాక్షిని అర్చించాడు. విశ్వేశ్వరుణ్ణి సేవించాడు. అటుపైని బ్రహ్మలోకం వెళ్ళాడు. తన తండ్రియైన చతుర్ముఖుడికి నమస్కరించాడు. "తండ్రీ! నీ దయవలన విష్ణుమాహాత్మ్యమును, భక్తిజ్ఞాన తపో మార్గములను, దానపద్ధతులను, తీర్థమహిమలను తెలుసుకోగలిగాను. కాని, శివ తత్త్వ పరిజ్ఞానం మాత్రం అందడం లేదు. అలా ఎలా వుంటాడు? సృష్టిలో ఎలా ఉంటాడు? ప్రళయవేళ ఆయన పద్ధతులెలా ఉంటాయి? బుద్ధిమంతులందరూ కూడా "శివుడే" పరబ్రహ్మం అంటున్నారు. నాకేమో ఏమీ అర్థమే కావడంలేదు. తండ్రే గురువంటారు నాకు తండ్రివి నువ్వే, దయచేసి గురుత్వం వహించి నాకు శైవజ్ఞానాన్ని అనుగ్రహించు అని వేడుకున్నాడు.

# బ్రహ్మ నారదుడికి శివజ్ఞానము తెలుపుట

నారదుడలా వినయంగా వుండటం చూసి బ్రహ్మానందపడ్డాడు నలువ. ఆ ఆనందంలోనే పరబ్రహ్మ వాచ్యుడైన పశుపతి గురించి యిలా చెప్పసాగాడు.



శ్లో॥ శివతత్త్వం మయానైవ
విష్ణునాపి యదార్థతః
జ్ఞాతంచ పరమం రూప
మద్భుతం పరేణ న ॥

నాయనా, నారదా! నేనుగాని నన్ను కన్న నారాయణుడు గాని శివుడి గురించి సంపూర్ణమైన విషయపరిజ్ఞానం ఉన్న వాళ్ళంకాదు. ఆవాఙ్మానసగోచరు డాయన. పరిపూర్ణ దర్శనం యెలా లభిస్తుంది మాకు? అందువల్ల శివుడొక అద్భుతంగా అనుకోవచ్చు.

ప్రళయ సమయంలో ప్రాణికోటి సమస్తం నశించిపోతుంది. సూర్యుడు, చంద్రుడు, నక్షత్రాలూ, గ్రహాలూ అన్నీ తుడిచిపెట్టుకుపోతాయి. రాత్రీ పగలూ అనేవి ఉండవు. పంచభూతాలూ, శబ్దస్పర్శాదితన్మాత్రలూ దిక్కులూ కూడా లేకుండా పోవడంవల్ల సర్వేసర్వత్రా గాఢాంధకారమే కమ్మేసి ఉంటుంది. ఈ చిమ్మచీకటినే 'మహాప్రకృతి' అంటారు. అదిగో, అలాంటప్పుడు- ప్రాకృత నామ రూప గుణాలుగాని, స్థూలత్వ కృశత్వాది పరిణామాలు గాని లేకుండా కేవలం సత్యస్వరూపంగా, జ్ఞానాత్మకంగా, అనంతంగా, స్వప్రకాశంగా, ఆనందమయంగా భావిస్తుండేది యేదైతే ఉంటుందో అదే శివుడని ప్రకటింపబడుతోంది.

ఇప్పటి వరకూ ఉన్న వాఙ్మయం అంతా ఘోషిస్తున్నది యిదే. ఇలా ప్రకటింపబడ్డ పరముడు సృష్టికోసం ఒక మూర్తిని కల్పించి ఆ మూర్తికి సదాశివుడు అనే పేరుపెట్టాడు. ఏమరుపాటు నైనా తనని ఎడబాయకుండా ఉంటూ సహకరించే శక్తితో సదాశివుడు జట్టుకట్టాడు. అదుగో ఆశక్తి- ప్రకృతి, మాయ, ప్రధాన నిత్య, త్రిదేవజనని, సకలేశ్వరి అంబిక మూలకారణ- అని వివిధ విధాలుగా చెప్పబడుతూ వుంది.

ఈ సకలేశ్వరి ఏకముఖి ఆ సదాశివుడు పంచముఖుడు. ఈమె అష్టభుజి, ఆయన దశభుజుడు. ఈమె సహస్రపూర్ణ చంద్రుల వంటి కాంతులు వెలార్చే వదనారవిందయై, నానాభరణశోభితయై, ఆయుధధారిణియై, ప్రఫుల్ల పంకజ లోచనయై, ఊహించడానికైనా వీలులేని తేజస్సులతో, సొగసైన విలాసాలతో సర్వజనయిత్రిగా అలరారగా త్రిశూలధారియై భసితోద్ధూళితమైన కర్పూర గౌరవర్ణ శరీరుడై కాలస్వరూపిణియైన ఆ పరాంబతో కూడి వున్నాడు.

## విష్ణ్వావిర్భావము



తేజోరూపుడైన శివుని వల్ల చీకట్లు చెదరి పోతాయి. ఆ సదాశివుడు సకలేశ్వరితో కూడి యానందించుటకు గాను ఒక తావును తల పెట్టాడు. అదే శివలోకము, కాశీక్షేత్రము, ఆనందవనము, అవిముక్తము, ఆస్థలంలో సకలేశ్వరీ సదాశివులు- చిత్తసముద్రమును మథించి వామభాగమున అమృత ప్రవాహ మును ప్రసరింపజేసారు. అంత త్రిలోకైక సుందరుడు, శాంతస్వభావుడు, సత్త్వ గుణుడు, గంభీరుడు క్షమా సంపన్నుడు, ఇంద్రనీలాభమైన దేహకాంతులు గలవాడు. పద్మాక్షుడు, బంగారపు ఆభరణాలు ధరించినవాడు, బలిష్ఠములైన భుజములు గలవాడు, పట్టుపీతాంబరం ధరించినవాడు, ఓటమి అన్నది ఏనాడూ ఎరుగనివాడూ అయిన పురుషుడు వుద్భవించాడు. అతడు సదాశివునకు నమస్కరించి, తనకొక పేరు పెట్టమనీ, పనిని చెప్పమనీ ప్రార్థించాడు.

జగత్తునందంతటా వ్యాపించి వుంటావు గనుక విష్ణువు అనే పేరు నీకు సరిపోతుంది. ప్రస్తుతానికి తపస్సు చెయ్యి అని చెప్పి వేదరాశినంతటినీ నిశ్వాస స్వరూపంగా విష్ణువు కనుగ్రహించి- సదాశివుడు, సకలేశ్వరితో సహా అదృశ్యుడై పోయాడు. అనంతరం విష్ణువు తపస్సులో కూర్చున్నాడు. పన్నెండు వేల దివ్య సంవత్సరాలు తపించాడు. అయినా శివానుగ్రహం కలుగలేదు. పునఃతపించమని శూన్యవాణి సూచించింది. సిద్ధపడ్డాడు. విష్ణువు అలా చాలాకాలం (?) చేసిన తర్వాత ఓ రోజున ధ్యానం నుంచి తేరుకునే సరికి శివమాయవలన, విష్ణు శరీరం నుంచి విపరీతమైన జలధారలు రాసాగాయి. విష్ణువింకా ఆశ్చర్యపోతూనే వున్నాడు.

ఆ జలధారలన్నీ కలిసి శూన్యం నిండా నిండిపోయాయి అటు గుర్తెరుగనంత సమయం(?) ధ్యానంలో ఉన్న అలసట ఇటు/ఈ ఆశ్చర్యం, రెండింటితోటి తులమునకలైన విష్ణువు-శివమాయ వలన- ఉన్న వాడున్నట్లుగా అలా ఆ నీళ్ళలోనే పడి నిద్రపోసాగాడు. అలా ఎన్నాళ్ళు పడివున్నాడో తెలియదుగాని- అలా ధారలే అయనముగా పడివున్న పడివున్న కారణంగా విష్ణువు 'నారాయణుడు' అని పేరు తెచ్చుకున్నాడు. (నరః అంటే రుద్రుడు ఆయన మాయాప్రభావం వల్ల ఉద్భ వించినది గనుక, నీరు "నారము" అనబడింది) తిరిగి విష్ణువుకు తెలివివచ్చే లోపలనే ప్రకృతి నుండి సత్త్వరజస్తమోగుణాలు, అహంకారం, తన్మాత్రలు- పంచభూతాలు, జ్ఞానకర్మేంద్రియములు అనబడే 24 తత్వాలు ఆవిర్భవించాయి. అప్పటికి వున్నది ఆ పురుషుడొక్కడే. ఆ పురుషుడొక్కడే చైతన్యుడు. తక్కిన తత్పురుషేతరమంతా జలాలని తెలుసుకో.

## బ్రహ్మ-విష్ణువుల సంవాదం శివసాక్షాత్కారం

అలా అంతూ పొంతూ లేకుండా అతినిద్రపోతున్న నారాయణుని నాభినుండి పద్మం సంభవించింది. అది మొదలు నారాయణునికి పద్మనాభుడు అనే పేరు సంక్రమించింది. ఇలా వుండగా, ఆ తామరపువ్వు యొక్క కాడ విపరీతంగా ఎదిగి పోసాగింది. దానికి తగ్గట్టే ఆ పువ్వు కూడా మహా వైశాల్యంతో వికసిస్తూనే వుంది. అంతలోనే పరమేశ్వరుడు తన దక్షిణ భాగం నుండి బ్రహ్మను సృష్టించి- యీ విష్ణునాభికమలంలోకి వదిలాడు. ఆ బ్రహ్మకు నాలుగు ముఖాలు వుండటం వల్ల చతుర్ముఖుడనీ, అతని కడుపులో బంగారం వుండడం వల్ల, హిరణ్యగర్భుడనీ పిలువబడుతాడు. అంతూ దరీలేకుండా పైపైకి ఎదిగిపోతున్న అంతటి చతుర్ముఖుడికి యెవరో తప్పితే మరేమీ తెలియకుండా పోయింది. అసలు తన జన్మదాత యెవరో కూడా అతనికి బోధపడిందికాద.

శివమాయే అటువంటిది. ఇదంతా శివమాయా ప్రభావమేనని మర్చి పోకూడదు. అసలు నేనెవర్ని? ఎలా వచ్చాను? అనే శంకాకులిత మానసుడైన నళినగర్భుడు, ముందుగా పద్మమూలాన్ని గ్రహించదలచి - తామరతూడులోనికి దిగి నూరు సంవత్సరాలు ప్రయాణించాడు. అయినా ఆ కాడయొక్క మూలం లభించలేదు. విసుగు చెంది మళ్ళా పువ్వులపైకి వెళ్ళిపోదామని నూరేళ్ళు బాటు తిరుగు ప్రయాణం చేశాడు. కాని అప్పటికే కాడ బాగా ఎదిగిపోవడంవల్ల- పై

నున్న పువ్వుజాడ తెలియలేదు. అటుయిటు తిరుగుతూ యింకో వందేళ్ళపాటు ఆ కాడలోనే ఉండిపోయాడు అబ్జభవుడు. అతని చింత పెరిగిపోసాగింది. అప్పుడతనికి తపించు అనే దివ్యవాణి తోచింది. తపస్సుకు ఉపక్రమించాడు.

తపించగా తపించగా ఆ తపోబలం వల్ల నారాయణుడి ముందుకు చేరాడు బ్రహ్మ. నాలుగు చేతులూ, నల్లటి శరీరమూ, మిలమిలా మెరిసిపోతున్న పట్టు పంచె, ఆయనను అంటిపెట్టుకొనడంవల్ల అందగిస్తున్న ఆభరణాలు, ఆయుధాలు, నిద్దట్లోవున్నా సరే ముద్దొస్తున్న కనురెప్పలు ఆ రూపాన్ని చూసి లిప్తపాటు తన్మయుడైపోయాడు. తామరచూలి, కాని, అంతలోనే, శివమాయ అతణ్ణి కప్పేసింది. అహం పురివిప్పింది. దాంతో మరింత చేరువకు వెళ్ళి నిద్దరోతున్న నీలాంగుణ్ణి చేతట్టి లేపి ఎవర్నువ్వు? అని అడిగాడు.

బదులుగా విష్ణుమూర్తి నాయనా బ్రహ్మదేవా! స్వస్థుడివిగా నీకేం భయంలేదు. నీ కోరికలన్నీ తీరుస్తానుగా అన్నాడు లాలనగా. వింటేగా బ్రహ్మ? శివమాయ కప్పేసి ఉందేమో- వీర అహంకారంతోటి నవ్వి- ఏమిటోయ్! నన్ను బాబూ నాయనా అంటున్నావు. నేనేమైనా నీ తరువాత వాణ్ణనీ నీ కన్నా చిన్నవాణ్ణనీ అనుకుంటున్నావా ఏమిటి? కాస్తంత నిద్రమత్తు వదలిపెట్టి పరకాయించి చూడు. అంతటినీ పుట్టించే వాణ్ణి అతి పూర్వీకుణ్ణీ, నాకు నేను స్వయంగా పుట్టినవాడినీ, అందరికన్నా శ్రేష్ఠుణ్ణి ఉత్తమోత్తముణ్ణీ అయిన నాదర్శనం చేసుకుని పుణ్యాత్ముడివికా అనేశాడు. విష్ణువు అతనికి యెంతగానో నచ్చచెప్పబోయాడు "ఓ చతుర్ముఖుడా! జగత్ సృష్టినిమిత్తమై నేనే నిన్ను నా నాభికమలంలో నుంచి ఆవిర్భవింప చేశాను.

నీకు స్రష్టనూ, సర్వవ్యాపకుడనూ నేనేనని తెలుసుకో" అని విష్ణు వెంత బోధించినా వినలేదు బ్రహ్మ. నువ్వు ముందా? నేను ముందా? అని మొదలైన ఘర్షణ "నేనే పరబ్రహ్మను" అంటే కాదు, నేనే పరబ్రహ్మను" అనే దాకా వెళ్ళింది. శివమాయాచ్ఛాదితులైన పద్మాక్ష, పద్మగర్భులు ఆ ప్రళయ జలాలలోనే యుద్ధానికి దిగారు. వారి యుద్ధాన్ని వారించదలిచాడు ఈశ్వరుడు. మరుక్షణమే అఖండమైన అగ్నిజ్వాలా సహితమైనదీ, వృద్ధిక్షయాలు లేనిదీ, అది మధ్యాంతరహితమైనదీ అయిన లింగాకారంతో వారిమధ్య ఆవిర్భవించాడు శివుడు. ఆ మహాతేజోలింగ దర్శనమాత్రాన తమను గప్పివున్న మాయాపటలం తొలగి బ్రహ్మ, విష్ణువు లిద్దరూ పశ్చాత్తప్తులై శివతత్త్వస్ఫురణ కలిగి పదే పదే శివ ప్రార్థలు చేశారు.

# శబ్ద బ్రహ్మ నిరూపణము

సదాశివకృత గర్వభంగంతో సమ్యక్ యోచనాపరులైన పద్మనాభ పద్మ గర్భులు వేవిధాల ప్రార్ధించగా ప్రసన్నుడయ్యాడాపరముడు. ఆ ప్రసన్నత కారణంగా లింగానికి దక్షిణదిశగా ఆద్యమైన 'అ' కారము ఉత్తరదిశగా 'ఉ' కారం అగ్నిలా వుంది. 'మ' కారం చంద్రమండలంలా వుంది. అన్నింటికీ పైన సత్యస్వరూపము, ఆనందాత్మకము. అమృతము వేదవేద్యము, విశ్వాత్మకమూ అయిన శివతత్త్వం స్ఫురిస్తోంది. అదే సమయంలో ఒక ఋషి సాక్షాత్కారించాడు. "మహాదేవుడు శబ్ద బ్రహ్మయొక్క తనువనీ, పరబ్రహ్మ నిశ్చింతుడు, మనోవాగతీతుడు, పరమ కారణుడు, ఓంకారవాచ్యుడు అయి వున్నాడు అని బ్రహ్మ, విష్ణువులకు బోధింప సాగాడు. 'అ' కార, 'ఉ'కార, 'మ'కారముల నుంచి బ్రహ్మ, విష్ణుమహేశ్వరులు ఆవిర్భవించి, సృష్టిస్థితిలయలు నిర్వహిస్తున్నారు. 'మ' కారం బీజి 'అ'కారం బీజం. 'ఉ'కారం యోని, నాదమే అనుసంధానం, బీజియైన రుద్రుడు నాదస్వరూపుడైన మహేశ్వర ప్రేరితుడై, బీజమును- యోని యందు విసర్జించాడు.

తద్వారమున సువర్ణమయమైన బ్రహ్మాండ మేర్పడి వేయి దివ్యవర్షాలపాటు నీటిలోనాని, రెండు ముక్కలైపోయింది. అందులో పై భాగం ఊర్ధ్వలోకాలుగాను, దిగువభాగం మర్త్యలోకాది అధోలోకాలుగానూ పరిణమించాయి. ఇలా యజుస్సులు, ఋక్కులు "ఓం ఓం" అని విశదీకరిస్తుంటే, నారాయణ, నళినగర్భు లిద్దరూ మరింత దీక్షతో మహేశ్వరుని ప్రార్థించసాగారు. అప్పుడు నానా విధాలం కారాలతో, గౌరకర్పూరవర్ణంతో, అయిదు ముఖాలూ పదిచేతులతో పరాక్రమమూ ఓదార్యమూ మూర్తీభవించినట్లుగా పురుషసంజ్ఞతో కూడిన రూపం ఒకటి చిరునవ్వులు నవ్వుతూ వారికి తోచింది. అది సంపూర్ణ శబ్దమయస్వరూపమై ఉంది, ఎలా ఉంది ఆరూపం? 'అ' కారం శిరస్సుగా 'ఆ' కారంగా లలాటంగా భాసిస్తున్నాయి.

'ఇ' కారం కుడికన్ను 'ఈ' కారం ఎడమకన్ను, 'ఉ'కారం కుడిచెవి, 'ఊ' కారం ఎడమచెవి, 'ఋ'కారం కుడికపోలం, 'ౠ' కారం ఎడమకపోలం నాదములే నాసాపుటాలు ఏకార ఐకారములు పై పెదవీ క్రిందపెదవీగా ప్రకాశిస్తున్నాయి. ఓకార

---

"యో వేదాదౌ స్వరః ప్రోక్తః వేదాంతేచ ప్రతిష్ఠితః
తస్య ప్రకృతి లీనస్యయః పరః స మహేశ్వరః॥

ఔకారములు దంతాలు (పలువరుస) అం, అఃలు దౌడలు, క, ఖ, గ, ఘ, జ అనే అయిదు ఎడమచేతులు ట, ఠ, డ, ఢ, ణ, త థ, ద, ధ, న లు పాదద్వయం ప్రకారం కడుపు, ప, బ-లు పార్శ్వద్వయం, భ-స్కందం, మ-కారం హృదయం య, ర, ల, వ, శ, ష, సలు సప్తధాతువులు, హ-కారం, నా భిక్ష-కారం ఘ్రాణం, ఏం చెప్పమంటారు ఆ స్వరూపాన్ని? ఆకారాది క్ష కారాంత సర్వవర్ణాత్మకమైన ఆ ఉమాసమేత మహేశ్వరుని యొక్క శబ్ద బ్రహ్మస్వరూపానికి పైన ఓంకార ప్రభవము, కళాపంచక సంయుతము, అష్టత్రింశదక్షరమూర్తియైన మంత్రమే మేధగా ఉంది.

గాయత్రీ మహామంత్రము, త్రింశదక్షరమంత్రము, పంచవింశదక్షర మంత్రము, ఏక పుష్టివర్ణన మంత్రము, మృత్యుంజయ మంత్రము, పంచాక్షర మహామంత్రము చింతామణీ మంత్రం, దక్షిణామూర్తి మంత్రం- ఒకటేమిటి సర్వాక్షర సంపత్కరమైన ఆ సర్వేశ్వర దర్శనమాత్రం చేత సమస్త మంత్రాలూ తెలిసిపోతూ ఉండగా విష్ణువు వాటినన్నిటిని పరిగ్రహించేస్తున్నాడు మననం చేస్తు న్నాడు. ఇంకా- ఈశాన, తత్పురుష అఘోర, వామ, దేవ, సద్యోజాత, సర్వ మంత్రాధిష్ఠిత స్వరూపాలూ తన సర్వాక్షర పరబ్రహ్మ రూపంలోనే స్ఫురిస్తూ ఉండగా మహా భోగీంద్ర భూషణుడై, వరదుడై సాక్షాత్కారించిన ఆ లోకేశ్వరుణ్ణి బ్రహ్మ విష్ణువులు మరింతగా స్తుతించసాగారు.

## బ్రహ్మ విష్ణువులకు శివుని బోధన

పద్మనాభ, పద్మగర్భుల స్తోత్రాలకు ప్రీతుడైన పినాకి పంచవదనుడుగా, త్రినేత్రుడుగా, ఫాలచంద్రముడిగా, జటాధరుడు, గౌరవర్ణుడు, సువిశాలనయనుడు, దశబాహుడు, నీలకంఠుడు, భస్మోద్ధూళిత విగ్రహుడు, సర్వాభరణభూషితుడు భస్మ త్రిపుండ్రాంకిత మస్తకుడుగానూ తోచి తన నిట్టూర్పులద్వారా వారికి వేదాలను యిచ్చి వేదార్ధరహస్యాలు సర్వమూ బోధించాడు. తదనంతరం బ్రహ్మ విష్ణువులా ముక్కంటికి ముకుళిత హస్తులై మ్రొక్కి "నిత్యమూ మమ్ములను శాసించువాడవు నీవే. మేము నీ భక్తులము, మాయందు దయవుంచి నిన్ను యెలా పూజించాలో, యెలా ధ్యానించాలో యెలా నిన్ను ఉపాసిస్తే నువ్వు అత్యంత సంతోషివై మాకు సులభుడివవుతావో ఒక ముస్ముందు మేము యేం చెయ్యాలో అనతీయవా ప్రభూ!" అని ప్రార్థించగా, లలిత లలిత కరుణాకలితుడైన కంఠేకాలుడు వారి భక్తికి సంతసించి, "నన్ను భావించటమే సర్వ భయహారకమౌతుంది.

ప్రస్తుతం మీకు స్ఫుటంగా కనిపిస్తున్నయీ శివలింగాన్నే సదా ఆరాధించండి లింగరూపంలో అర్చించబడి భక్తుల మనోవాంఛలను తీరుస్తాను. లింగపూజే శ్రేష్ఠం. అందునా పార్థివలింగపూజ మరింత ఉత్తమం. ఇక మీ కర్తవ్యాలు, ఓ బ్రహ్మదేవా! నువ్వు జగత్తును సృష్టించు, విష్ణూ! నువ్వా జగత్తును సంరక్షించు. త్వరలోనే బ్రహ్మ నుదుటినుండి నేను రుద్రుడిగా అవతరిస్తాను. నాలో వున్న యీ ఉమయే ప్రకృతి. ఈ ప్రకృతి యొక్క రెండవరూపం, సరస్వతి, అనే పేర బ్రహ్మనూ, మూడవ రూపం లక్ష్మి అనే పేర విష్ణువునూ పొందుతారు. మరొక రూపం కాళి అనే పేరనా పూర్ణావతారమైన రుద్రుడిని అంటి పెట్టుకొని వుంటుంది.

బాహ్యాభ్యంతరాలు రెండింటా రజోగుణమయుడై బ్రహ్మగావించే బ్రాహ్మణాది చతుర్వర్ణయుతము, బ్రహ్మచర్యాది చతురాశ్రమయుతమూ అయిన సమస్త సృష్టిని, లోనతమోగుణము, వెలుపల సత్త్వ పూర్ణావతారమైన రుద్రుడు లోపల సత్త్వగుణము-బైటకు మాత్రం తమోగుణమూ కలవాడై ప్రళయకార్యాన్ని నిర్వరిస్తాడు. విష్ణూ! బ్రహ్మ నిన్ను సేవిస్తాడు. నువ్వూ, బ్రహ్మ కలిసి రుద్రుణ్ణి సేవించండి. నిజానికి బ్రహ్మ, విష్ణు, రుద్రులకి ఎట్టి భేదము లేదు. లీలార్థముగా విడివడ్డాముగాని, ముగ్గురమూ ఒక్కటే. ఏ శివభక్తుడైనా మిమ్మల్ని నిందించినట్లయితే ఆక్షణమే అతని పుణ్యాలు నశించిపోతాయి సజ్జనులను 'రక్షిస్తూ - భక్తులకు భోగభాగ్యాలను అనుగ్రహిస్తూ నా ఆజ్ఞ మీరక చరించండి.

నారాయణా! బ్రహ్మ సృష్టికి విఘాతాలు రాకుండా, శత్రువులను పరిమార్చుతూ, వివిధ అవతారాలు ధరించి అగణితముగ భక్తులను పొంది, వారి అభీష్టాలు తీరుస్తూ, అఖండమైన యశస్సు నార్జించు, నీవల్లగాని పని యే మాత్రంవున్నా దానిని నేనే నెరవేరుస్తాను. అనీ చెప్పాడు. ఇంకా వారి వారి ఆయుర్దాయాలను యిలా నిర్ణయించాడు.

# ఆయుష్కాల నిర్ణయము

నాలుగు వేల యుగాలు బ్రహ్మకు ఒక పగలు, మరొ నాలుగు వేలయుగాలు ఒక రాత్రి. మొత్తం ఎనిమిది వేల యుగాలు ఒకరోజు. అలాటివి ముప్ఫయి రోజులు (రెండు లక్షల నలభై వేల యుగాలు) ఒక నెల. అలాటి పన్నెండు నెలలు ఒక సంవత్సరం. అటువంటి వంద సంవత్సరాలు బ్రహ్మకు ఆయుర్దాయం. ఒక సంవత్సరం (ఇరవై ఎనిమిది లక్షల యెనభై వేల యుగాలు) అయితే విష్ణువుకు

ఒక దినం, ఆ లెక్కన నూరేళ్ళు విష్ణువుకు ఆయుర్దాయం, ఒక విష్ణువర్షం, ఒక రుద్ర దినముగా నూరేళ్ళు గడిస్తే రుద్రుడు నరుడవుతాడు. అనగా నాలోలీనమై పోతాడు.

అప్పుడు నేను ఒక్కణ్ణే వుంటాను నా ఉచ్ఛ్వాసము నుంచి మహాశక్తి ఆవిర్భ విస్తుంది. నానిశ్వాసమునుంచి పునః బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులు, గరుడోరగ గంధర్వాదులూ ప్రభవిస్తారు.

ఆరు ఉచ్ఛ్వాసలు, ఒక 'క్షణం' అరవై క్షణాలొక గంట. ఇరవైనాలుగు గంటలు ఒకరోజు. నిజానికి నాకు ఉచ్ఛ్వాస నిశ్వాసగణనం లేదు. నేను గణనాతీతుడను, అక్షయుడను, అని చెప్పి ఇంకా బోధించవలసినవన్నీ బోధించాడు శివుడు. ఆనాటి నుంచే లింగపూజను భావించి ఆరాధించారు. శివలింగంయెదుట యీ లింగా విర్భావ ఘట్టాన్ని ఆరుమాసాలు పఠించినవారు శివరూపులవుతారు.

# శివార్చనా విధి - శుద్ధులు

అనంతరం సూతుడు మునుల కోరికపై శివార్చనా విధిని తెలియజేయ సాగాడు. శివార్చనవల్ల అన్ని పనులూ నెరవేరతాయి. అన్ని విధాల దరిద్రాలూ, రోగాలూ, పీడలూ నశించిపోతాయి. శత్రువుల వలన భయాలు, చతుర్విధపాపాలు నశిస్తాయి. స్వర్గసుఖాలు కలుగుతాయి. అంతలో ముక్తి లభిస్తుంది. శివుణ్ణే ఆశ్రయించిన వాళ్ళు సత్సంతానాన్ని పొందినవాళ్ళై సర్వకార్యార్థ సాధకులవుతారు.

శివార్చన చేయదలచుకున్న వాళ్ళు ప్రాతఃకాలం బ్రాహ్మీ ముహూర్తంలో నిద్రలేచి గురుస్మరణ చేసుకోవాలి. శివుణ్ణి స్మరించాలి. తదుపరి పుణ్యాతీర్థాలను, విష్ణువును, బ్రహ్మాది దేవతలను, మునులను ధ్యానించాలి. ఆ తరువాతనే పక్క మీద నుండి లేవాలి. దక్షిణదిశలో వుండే యేకాంత ప్రదేశంలో మలవిసర్జన చేసుకోవాలి. శాస్త్రోక్తంగా బ్రాహ్మణుడు పరిశుద్ధమైన మట్టితో ఐదుసార్లు కాళ్ళూ, చేతులూ శుభ్రం చేసుకోవాలి. అదే విధంగా, క్షత్రియులైతే నాలుగుసార్లు, వైశ్యు లైతే మూడుసార్లు, శూద్రులైతే రెండు సార్లు మృత్తికాశుద్ధి చేసుకోవాలి. అనంతరం గుదస్థానాన ఒకసారి మృత్తికాశుద్ధి గావించాలి. పిదప ఎడమచేతిని పదిసార్లు, రెండు చేతులూ కలిసి ఏడుసార్లు మృత్తికతో క్షాళనం చేయాలి. ఇంతా చేశాక మళ్ళా మూడేసిసార్లు కాళ్ళూ చేతులూ మట్టితో శుభ్రం చేసుకోవాలి. స్త్రీలు శూద్రుల లెక్క ప్రకారముగా ప్రక్షాళించుకోవాలి.

# దంత ధావన విధి

బ్రాహ్మణులు 12 అంగుళములు, క్షత్రియులు 11 అంగుళములు, వైశ్యులు 10 అంగుళములు పొడవుగల కాష్ఠముతో దంతధావనం చేసుకోవాలి. పర్వదినాలలో, అటే షష్ఠి, అమావాస్య, నవమితిథులలోనూ, వ్రతసమయాలలోనూ, ఆదివారంరోజునా, శ్రాద్ధకర్మలు ఆచరించే రోజులలోనూ మాత్రం పుల్లతో ముఖం కడుగుకోకూడదు. ఆకులతో మాత్రమే పండ్లు తోముకోవాలి.

# స్నానవిధి

దంతధావనానంతరం పుణ్యతీర్థాలలోగాని, యితర స్నానాదికాలకు అనువైన తావులలోగాని స్నానం చేయాలి. స్నానం చేసి ముందు దేశకాలాగుణంగా సంకల్పం చెప్పుకుని, సమంత్రంగా స్నానం చెయ్యాలి. పిదప ఆచమనం చేసి ధౌతవస్త్రం ధరించి, పవిత్రమైన ఏకాంత ప్రదేశమందాసీనుడై పూజాగృహమున కేగి న్యాస పూర్వకంగా శివార్చన చేయాలి.

# అర్చనం

పూజకు ముందుగా విఘ్నేశ్వరుణ్ణి అర్చించాలి. ద్వారపాలకులను, అష్ట దిక్పాలులను కూడా అర్చించి, పీఠపూజ చేసి, దానిపై అష్టదళపద్మం వేసి, పూజా ద్రవ్యాలను సమీపంలో వుంచుకుని, తాను కూర్చుని, పరమేశ్వరుని ఆసీనుణ్ణి చేసి మూడు సార్లు ఆచమనం చేసి చేతులు కడుక్కుని మూడుసార్లు ప్రాణాయామం చేయాలి. అనంతరం

**శ్లో॥ పంచవక్త్రం దశభుజం శుద్ధస్ఫటిక సన్నిభం**

**సర్వాభరణ సంయుక్తం వ్యాఘ్రచర్మోత్తరీయకం॥**

అని స్వామిని ధ్యానించి సారూప్యమునకై ప్రార్థించాలి. పిమ్మట శివునకు స్నానం చేయించి, పంచామృతాలతోను అభిషేకం చేసి మూలమంత్రంతో న్యాసం చెప్పి, ప్రణవంతో అంగన్యాస కరన్యాసాలు ఆచరించాలి. స్వామిని హృదయ పీఠమందిడుకొని, అర్ఘ్యపాద్యాచమనాలతో పాత్రల నక్కడవుంచి, రెండు క్రొత్త కలశాలను స్థాపించి వాటిని దర్భలతో ఆచ్ఛాదించాలి.

---

నరుడు : నరః=రమతః=నరః=స్వాత్మారాముడు అని అంతేనే గాని మానవుడు, నరాల్తోకూడినవాడు- అనే అర్థాలు యిక్కడ వర్తించవు.

అర్ఘ్యపాద్యాచమనాది పాత్రలు నెలకొల్పి తొమ్మిది కలశములనుంచి వాటితో మంచినీళ్ళు నింపాలి.

వట్టివేరు, శ్రీగంధం అనే వాటిని పాద్యపాత్రలోను- జాజికాయ, పచ్చకర్పూరం, మర్రివూడలు, తమాలపత్రం అనే వీని చూర్ణాన్ని ఆచమనపాత్ర లోనూ, తక్కిన అన్నింటిలోనూ శ్రీగంధం చూర్ణాల్ని వెయ్యాలి. శివసన్నిధానంలో దీపధూప సుగంధద్రవ్యాలు అమర్చి, పూర్వాది (శివునకు) దిశలలో అణిమాద్య ష్టసిద్ధులనూ నెలకొల్పి, స్వామికి ప్రణవంతో ఆసనం కల్పించి, సోమసూర్యాగ్నులు, ధర్మాదులు ఆ పీఠమునకు క్రిందనున్నట్లుగా భావించాలి. అవ్యక్తాదులను చతుర్దిశ లలోనూ భావించాలి సోమ సామీప్యంలో సత్వరజస్తమో గుణాలను భావించాలి. తరువాత నందికేశ్వరుణ్ణి పూజించాలి.

'సద్యోజాతం ప్రపద్యామి' అనే మంత్రంతో ఆవాహన చెప్పి, వామదేవ మంత్రోక్తముగా పీఠమునందు ఉపవసింప చేసి, రుద్రగాయత్రీ జపంతో సాన్నిధ్యాన్ని పొందాలి. అఘోరమంత్రంతో నిరోధం (క్షుద్రదేవతాదులను) చేయాలి. ఈశాన మంత్రంతో పాద్యం ఆచమనీయం, అర్ఘ్యం సమర్పించాలి.

అనంతరం శ్రీగంధం కలిపిన నీళ్ళతోనూ, పంచగవ్యములతోనూ, (గవ్యములంటే గోవునుంచి వచ్చినవి అని అర్థం, ఆవుపాలు, ఆవునెయ్యి మొదలైనవి) పవిత్ర భాండములందు వస్త్రపూతములు గావించబడిన మంచినీళ్ళతోను రుద్రాధ్యాయాదులు పఠిస్తూగాని, వేదవిదులైన బ్రాహ్మణులచేత పఠింపచేస్తూగాని 101 జలధారలతో శివాభిషేకం చేయాలి. అనంతరం శుద్ధియైన వైదికభస్మను అలంకరించాలి. గంధం, అక్షతలు సమర్పించాలి. కుశపుష్పాలు, ఉత్తరేణులు, జాజిపులు, చంపకములు, కలిగొట్టు (పాటల)పుష్పాలను, తెల్లగన్నేరులు, మల్లెపూవ్వులు, కమలములు, కలువలు వంటి వివిధాలైన అపూర్వపుష్పాలు సమర్పించాలి.

అభిషేక సమయంలో రుద్రసూక్తం, మృత్యుంజయస్తవం, మంత్రం యిత్యాదులు స్మరిస్తుండటంవల్ల సర్వారిష్టాలూ శాంతిస్తాయి. ఆ తరువాత మృదువైన మారేడుదళాలు, ధూపం, అవసరనైవేద్యం, తాంబూలం, దక్షిణ, పండ్లు అర్పించాలి.

ఆపైన మంగళ నీరాజనం యియ్యాలి. మంత్రపుష్పము, నమస్కారాలు అర్పించాలి. స్తోత్రం చేయాలి. శైవీయమైన మహామంత్రాలు పఠిస్తూ అర్ఘ్యం యిచ్చి

శివలింగం యొక్క పాదముల వద్ద పూలుంచి, కృతాంజలియై నిలవాలి. చేతులో పువ్వులు పట్టుకొని

శ్లో॥ "అజ్ఞానా ద్యదివా జ్ఞానాజ్జప పూజాదికం మయా
కృతం తదస్తు సఫలం-కృపయా తవ శంకర॥"

(ఓం శంకరా! తెలిసిగాని, తెలియకగాని నాచే చేయబడిన జలపూజాదిక విధులన్నియు నీవలన సఫలములగుగాక) అని ప్రార్థించి చేతిలో వున్న పువ్వులు స్వామికి సమర్పించాలి. ఆ పిమ్మట ప్రణిపాతపూర్వకంగా క్షమాపణ చెప్పుకోవాలి. చేసిన పాపాలన్నీ తలుచుకుని పశ్చాత్తాపంతో క్షమాపణలు అర్థించాలి.

## దేవత లారాధించిన శివలింగములు



ఓ మహర్షులారా! ఎవరైతే ప్రతి రోజూ శివుని మూర్తినిగాని, లింగ స్వరూపాన్నిగాని నిత్యమూ సేవిస్తున్నారో వాళ్ళ పాపాలన్నీ పటాపంచలై పోతాయి. చేసిన పాపాలే కాదు, చెయ్యబోయే పాపాలు కూడా నశించిపోతాయని సాక్షాత్తూ శ్రీమహావిష్ణుతే బ్రహ్మాదులకు చెప్పిన దాఖలాలు ఉన్నాయి. ఆ ముక్క చెప్పే దేవతలందర్నీ కూడా శివారాధన చేయమని ప్రోత్సహించాడు విష్ణువు. పై పెచ్చు తనే స్వయంగా దగ్గరుండి విశ్వకర్మ చేత పంచసూత్ర ఘటిత మనోహరలింగాలను తయారు చేయించి ఎవరెవరి హోదాలకు తగ్గట్టుగా వారికర్పించాడు.

ఇంద్రుడు పద్మరాగమణితో చేసిన శివలింగాన్ని పూజించాడు. కుబేరుడు బంగారపు లింగాన్ని అర్చించాడు. యమధర్మరాజు పీతమణి మయలింగాన్ని ఆరాధించాడు. వరుణుడు శ్యామ(పచ్చటి)మణితో చేసిన దానిని, నారాయణుడు

స్వయంగా ఇంద్రనీలమణితో నిర్మించిన శివలింగాన్ని సేవించి తరించారు. బ్రహ్మ దేవుడు బంగారు లింగాన్ని కొలిచాడు. లక్ష్మీస్ఫటిక లింగాన్ని ఆరాధించినది. విశ్వే దేవతలు రజతలింగాల నర్చించారు. వసువులు యిత్తడి లింగాలను సేవించారు. అశ్వనీదేవతలు పార్థివలింగాన్ని పూజించారు. ఆదిత్యులు రాగి లింగాలని, చంద్రుడు ముత్యాల శివలింగాన్ని, సూర్యుడు వజ్రలింగాన్ని, ఋషులు మృణ్మయ లింగాలని ఋషిపత్నులు మంచి గంధంతో నిర్మించిన లింగాలని, మయుడు పగడాల లింగాన్ని, సరస్వతి రత్నలింగాన్ని ఆరాధించారు. తమ తమ ఉత్తమాంగాల ధరించారు.

## భావలింగ ప్రాధాన్యత



ఓ ఋషులారా! బ్రహ్మోక్తమైన విషయాలను చెబుతున్నానే తప్ప భాషా పద్ధతీనావేమో గాని, ఒక్క ముక్క కూడా నా సొంతందిలేదు.

సర్వప్రాణులలోనూ, దుర్లభమైన మానవ జన్మపొంది, అదీ సత్కులంలో జన్మించి అందునా సదాచారవంతుల యిళ్ళలో పుట్టిన వాళ్ళు తమ అదృష్టాన్ని విస్మరించకూడదు. అందువల్ల అహంభావులు కాకూడదు. స్వవర్ణాశ్రమ ధర్మాల ననుసరించి శివప్రీతి నొనరిస్తూనే ఉండాలి. తమ తమ అధికారాల రీత్యాశ్రౌత స్మార్తకర్మల నాచరించాలి.

అయితే వెయ్యి కర్మయజ్ఞాలు చేయడం కన్న ఒక తపోయజ్ఞం చాలా గొప్పదని మర్చిపోరాదు. సరాసరి తపస్సుకే వెళ్ళలేని వాళ్ళు కూడా నక్తవ్రతం, సోమవారవ్రతం, ఉపవాసములు, శివక్షేత్రసందర్శనం వంటివి చేసినా కూడా శ్రేయో దాయకమేనని తెలుసుకోవాలి.

ఒక్క విషయం చెబుతున్నాను. రత్నాలూ, రాళ్ళూ కాదు బంగారమూ, బొగ్గులూ కాదు యధార్థమైన శివధ్యానపరుల హృదయాలలో ఉంది సత్యమైన భావలింగం, దాన్ని మించిన లింగం వేరేయేది ఉండదు. అయితే అది యోగులకే తప్ప యితరులకి సాధ్యంకాదు. గనుక మనం స్థూలలింగాలనే ఆరాధించాలి. మనలో కూడా భావలింగం వెలిగే వరకూ ఈ పూజలే చేసి తీరాలి. ఈ పూజ చేయడంలో పూవులపాత్ర విశేషమైనది.

# కామ్యసిద్ధికి ఫలపుష్ప సంఖ్య

ధనార్థియై శివారాధన చేసేవాడు పద్మాలు, మారేడు పత్రాలు, శతపత్రాలు, శంఖపుష్పాలతో పూజించాలి. రకానికి లక్ష చొప్పున తెచ్చి శివార్చన చేసినవాడు తప్పక సంపన్నుడవుతాడు.



ఏ కోరికలూ లేకుండానే శివుణ్ణి పూవులతో అర్చించిన వాడికి ముక్తి తప్ప మరేమీ లేదని తెల్సుకోవాలి.

పైన చెప్పిన పువ్వులతోనే శివార్చన చేస్తే రాజు కూడా అవుతాడు. లక్ష పువ్వులు అనే లెక్కేమీలేదు. ఎన్ని పువ్వు లతో చేయ గలిగితే అన్ని పువ్వులతోనే చేయ వచ్చును. ఎటొచ్చీ కోటి పార్థివ లింగాల్ని పూజించాలి.

పరపతికోసం తపించేవాడు పశుపతిని యాభైవేల పూలతో పూజించాలి. చెరసాలనుంచి బైటపడాలను కునేవాడు లక్షపూలతో ఆరాధించాలి. రోగగ్రస్తుడు ఆరోగ్యం పొందగోరినా, వరుడు వధువు కోసం తపనపడినా, విద్యాభివృద్ధి, కావాలన్నా వాక్శుద్ధి పొందాలన్నా శివుణ్ణి 59 వేల పువ్వులతో పూజించాలి.

50 వేల పువ్వులతో శివారాధన, అయిదు లక్షల మృత్యుంజయ మంత్రజపం చేసిన భాగ్యశాలికి శివదర్శనం లభించే అవకాశం వుంది. లక్షపూలతో శివారాధన, పది లక్షలు మృత్యుంజయ మంత్రజపం చేస్తే ఖచ్చితంగా శివుడు ప్రత్యక్షమవు తాడు.

ఆయుర్దాయం కోరుకునేవాడు దూర్వలతోనూ, పుత్రార్థిఉమ్మెత్త పూల తోనూ, కీర్తికాముకుడు అవిసె పూలతోనూ, భుక్తి ముక్తి కోరేవాడు తులసి దళాల తోనూ, ప్రతాపాన్నాశించేవాడు జిల్లేడు పూలతోనూ చిన్న కలువలతోనూ, శత్రు నిర్మధనార్థమై దాసెన పువ్వులతోనూ, రోగ విమోచనానికి కరవీరపుష్పాల తోనూ, ఆభరణాలు కోరేవారు మంకెన పువ్వులతోనూ, వాహనలాభం కావాలను కుంటే జాజిపత్రాలతోనూ, ఉత్తమురాలైన భార్యను కోరుకునేవాడు మల్లికాపుష్పాల తోనూ,

నిత్యం స్వగృహవాసమే ఆశించేవాడు అడవి మొల్లలు పెదగోరింట పువ్వు లతోనూ, సర్వవాంఛలు తీరడానికి మారేడు పత్రితోనూ శివలింగాన్ని ఆరాధించాలి. వ్రేటి కాడ గలిగిన ఉమ్మెత్త పువ్వులైతేనే శివపూజకు శ్రేష్ఠం. పత్రమయినా పుష్ప మైనా లక్షకి తక్కువకాకుండా అర్పించాలి. సంపెంగ, మొగలీ తప్ప తక్కిన పువ్వు లన్నింటికి శివపూజార్హత ఉంది. కాబట్టి ఆ రెండూ శివపూజలో నిషేధించాలి.

లక్ష తండులాలు శివలింగానికి అర్పించితే లక్ష్మి అభివృద్ధి చెందుతుంది. దీని కోసం ప్రతి బియ్యపు గింజా లెక్క పెట్టనక్కరలేదు. ఆరున్నర మానికల మీద ఆరుతులాల బియ్యం లక్ష గింజలవుతుంది. ఎటొచ్చి ఆ బియ్యంలో ముక్కలు విరిగినవీ నూకలవంటివి లేకుండా చూచుకోవాలి.

అలాగే లక్ష (11 పలాలు) నువ్వులతో పూజిస్తే మహా పాపాలన్నీ నశిస్తాయి.

లక్ష (81/2 మానికల, ఆరు తులాలు) యవలతో పూజిస్తే సర్వసౌఖ్యాలు కలుగుతాయి.

అరతూము, లేదా, 8 మానికల గోధుమలైతే లక్ష అవుతాయి లక్ష గోధుమ లతో శివార్చన చేస్తే సంతానప్రాప్తి కలుగుతుంది.

ఇదే విధంగా పెసలు, కందులు, ఆవాలు, మిరియాలు మొదలైన వాటితో కూడా శివార్చన చేసినట్లయితే ఆయా నిర్దిష్ట ఫలాలు తప్పక లభిస్తాయి.



## అభిషేకాలు

అలాగే అభిషేకాలు, స్వగృహశాంతి సుస్థిర తలకు జలాభిషేకం, శత్రువులను తపింప చేయ డానికి తైలాభిషేకం, భోగభాగ్యాలకు సుగంధి తైలాభిషేకం చేయించాలి. ఆవనూనెతో అభి షేకిస్తే శత్రునాశనం, తేనెతో అభిషేకిస్తే కుబేరునితో సమానత కలుగుతాయి. చెరుకు రసంతో అభిషేకిస్తే సర్వసుఖాలు పొంది సంతృప్తులౌతారు. గంగా జలాభిషేకం వల్ల భుక్తి ముక్తులు కలుగుతాయి.

# సృష్ట్యారంభం

ఋషి పుంగవులారా! లింగరూపాన ఆవిర్భవించి, బ్రహ్మ విష్ణువుల మదమ డంచి -శివారాధనాదులు బోధించి, పరమేశ్వరుడు అంతర్ధానం చెందాడు. ఆ తదుపరి బ్రహ్మసృష్టించేందుకు సిద్ధాపడ్డాడు. శివేచ్ఛానుసారంగా విష్ణువు అతగాడికి సహకరించాడు. సృష్టికి అవసరమైన జ్ఞానం కలిగింపచేశాడు పిదప - బ్రహ్మాండానికి పొలిమేర అయిన వైకుంఠంలో నివసింపసాగాడు విష్ణువు.

బ్రహ్మసృష్టి ఆరంభమైంది. జలంలో అంజలించాడు. తక్షణమే ఇరవై నాలుగు తత్వాలతో కూడిన అండం ఆవిర్భవించింది. అదే విరాడ్రూపం. ఆ అండాన్ని యేం చెయ్యాలో తెలియక మళ్ళీ విష్ణువును స్మరించాడు బ్రహ్మ. సాక్షాత్కరించాడు విష్ణువు. 'జడంలా వున్న ఈ అండంతో సృష్టి యెలా చెయ్యాలో అర్థంగా వడంలేదు' అంటూ వాపోయాడు చతుర్ముఖుడు. చతుర్భుజుడు అతనిని ఓదార్చి- తాను అనంత రూపయుతుడై ఆ అండంలో ప్రవేశించాడు. వెయ్యి తలలు, వెయ్యి చేతులు, వెయ్యి పాదాలూ గల మహాద్భుతరూపంతో అండప్రవేశం చేయగానే- అది చైతన్యవంతం అయ్యింది.

మళ్ళీ సృష్టికి కూర్చున్నాడు బ్రహ్మ. ఈసారి అవిద్యాదితామస వస్తుజాలమంతా ఆవిర్భవించింది. బెంగపడిపోయాడు బ్రహ్మ-అయినా ఎలాగోలాగ మనసు కుదుట పరుచుకుని ఇంకా సృష్టించగా తరులూ, గిరులూ వంటి స్థావరాత్మక సృష్టి జరిగింది. నాలుగు బుర్రలు పెట్టుకుని సృష్టిస్తున్నా- ఇలా బుర్రలేనివి పుడుతున్నా యేమిటా? అని బాధపడ్డాడు మళ్ళీ మళ్ళీ సృష్టించాడు. పట్టుదలవుంటే కాని పనేముంటుంది? ఈసారి పక్ష్యాదులు ప్రభవించాయి. అటు తరువాత ఊర్ధ్వ స్రోతస్కులైన సాత్త్విక దేవతలు కడగొట్టు గారాజసులూ అర్వాక్ స్రోతస్కులూ యైన మానవులూ ఆవిర్భవించారు. మనిషి పుట్టగానే మహానంద పడిపోయాడు బ్రహ్మ. ఈ విధంగా పంచవిధ సృష్టి ఏర్పడింది.

సర్గం అంటే సృష్టి మహత్తత్వం. సూక్ష్మ పంచభూతములు, పంచీకృత పంచ భూతములు- అని నిర్మాణం మూడు రకాలు ఇదంతా ప్రాకృతసృష్టిగా పరి గణించ బడుతోంది. పైన చెప్పిన ఐదు రకాలు ఇప్పుడు చెప్పిన మూడు రకాలు కలిపి మొత్తం ఈ యెనిమిది రకాలూ కూడా ప్రాకృత సృష్టేనని తెల్సుకోవాలి. తొమ్మిదవ సృష్టికౌమారం. ఈ సర్గంలోనే సనక సనందనాదులు ఆవిర్భవించారు. వాళ్ళని

కూడా సృష్టి చేయమని ప్రేరేపించాడు బ్రహ్మ. కాని వాళ్ళు పరమ విరాగులై శివధ్యాన తత్పరులై- సృష్టికి విముఖత చూపించారు. తన పిల్లలే తన మాట కాదన్నారని తల్లడిల్లాడు బ్రహ్మ. ఎంతగానో దుఃఖించాడు. అనంతరం విష్ణువు సలహా మీద శివార్చన చేశాడు.



## రుద్రావిర్భావము

అలా చేయగా చేయగా- బ్రహ్మ యొక్క కనుబొమ్మల మధ్య 'అవిముక్తం' అనే పేరుగల నాసికామూలమునుంచి మహేశ్వరుడు తన సంపూర్ణాంశతో అర్ధ నారీశ్వరుడుగా ఆవిర్భవించాడు. ఆయన పేరే రుద్రుడు. ఆయన పుడుతూనే అనేక మైన రుద్రగణాలను కూడా ఆవిర్భవింప చేసుకున్నాడు. ఇదే రుద్రావతరణ ఘట్టం సర్వపాపహారం.

అలా ఆవిర్భవించిన రుద్రుని పూజించి, జన్మమృత్యుజరావిష్టులైన ప్రాణు లను సృష్టించవలసినదిగా ప్రార్థించాడు బ్రహ్మ. రుద్రుడందుకు అంగీకరించ లేదు. 'విధాతా! పుట్టడం, చావడం, ముసలితనం, రోగాలూ, రొష్టులూ, కర్మ బంధాలూ దుఃఖం, ఇలాంటి వికారయుతమైన సృష్టిని నేను చేయను. సంసారమనే లంపటంలో పడిపోయి దుఃఖితులైన వారిని వుద్ధరించడమే నాకు ప్రీతికరమైనది. కాబట్టి నువ్వు కోరుకుంటున్న వాళ్ళని నువ్వే సృష్టించుకో, అని అజ్ఞాపించాడు మాయాబంధాలు ముంచి వేయకుండా వుండేలా బ్రహ్మకు వరం యిచ్చాడు. ఇలా వరం యిచ్చాడు. అలా మాయమైపోయాడు రుద్రుడు.

## సృష్టి ప్రకారము

మళ్లీ మొదలయ్యింది. బ్రహ్మసృష్టి. శబ్ద, స్పర్శ, రూప, రస గంధాలనే సూక్ష్మ పంచకాన్నీ మేళవించి ఆకాశం వాయువు, అగ్ని, నీళ్ళు, నేల- అనే స్థూలాల నేర్పరిచాడు. స్థావరజంగ మాదులన్నీ పుట్టించాడు. నిమిషాలు మొదలు యుగాల

వరకు కాలవిభజనానుసారంగా చేతనైనట్టు సృష్టించాడు. అయినా తృప్తి కలుగలేదు. అప్పుడు బ్రహ్మ తన కళ్ళనుంచి మరీచిని హృదయం నుంచి భృగుఋషిని శిరసు నుంచి అంగీరసుణ్ణి, వ్యానవాయువు ద్వారా పులహుడిని, ఉదానం ద్వారా పులస్త్యుణ్ణి, సమానం నుంచి శిష్టుణ్ణి నీడలోంచి కర్దముణ్ణి, సంకల్పంలోంచి ధర్మ దేవుణ్ణి కన్నాడు. వీరిలో ధర్ముడు మానవరూపం ధరించి సాధకులను ఆశ్రయించాడు.



శైవజ్ఞానలాలసులారా! ఆ అనంతరం బ్రహ్మ శివప్రేరితుడై తన దేహం సగం స్త్రీగానూ, సగం పురుషుడుగానూ మార్చుకున్నాడు. ఆ మిధునం నుంచి ఓం ప్రథమంగా స్వాయంభువమనువు పుట్టాడు. అతనితోటే శతరూప అనే యోగిని పుట్టింది. వారిద్దర్నీ కలిపాడు బ్రహ్మ. శతరూపా, స్వాయంభువుల మైథునం వల్ల ప్రియవ్రత, ఉత్తానపాదాది పుత్రుల్నీ ఆకూతి, దేవహూతి, ప్రసూతి అనే ముగ్గురు ఆడపిల్లల్ని కనడం జరిగింది. ఆకూతి రుచితోటి, దేవహూతి కర్దముడి తోటీ ప్రసూతి దక్షుడితోటి సంధానించబడ్డారు.

అకూతికి రుచివలన యజ్ఞుడు, దక్షిణ ఆవిర్భవించారు. వాళ్ళిద్దరూ జంట కట్టారు. వాళ్ళకి పన్నెండుగురు కొడుకులు పుట్టారు. దేవహూతి కర్దముడి వల్ల అనేకమంది ఆడిపిల్ల లను కన్నది. ప్రసూతి దక్షుడితో సుఖించి ఇరవైనలుగురు ఆడపిల్లలను కంది. ఆ యిరవై నలుగుర్లోనూ, శ్రద్ధ, లక్ష్మి, ధృతి, తుష్టి, పుష్టి, మేధ, క్రియ, బుద్ధి, లజ్జ, వసువు, శాంతిసిద్ధి, కీర్తి అనే పదముగ్గురు పడచులనూ ధర్ముడికి కట్టబెట్టారు. తక్కిన పదకొండుగుర్లో ఖ్యాతిని భృగువుకి, నీతిని ధర్ముడికి, సంభూతిని మరీచికి, స్మృతిని అంగిరసుడికి, ప్రీతిని పులస్త్యుడికి, క్షమను పులహుడికి, సన్నుతిని క్రతువుకీ, అనురూపని, అత్రికి, ఊర్జను వశిష్ఠుడికి, స్వాహాను అగ్నికి స్వధను పితరులకీ ధారబోశాడు దక్షుడు. ఈ జంటలతో ప్రపంచానికి క్రొత్త కళ వచ్చింది.

ఇక్కడో చిన్న విషయం వుంది. దక్షుడికి అరవైమంది ఆడపిల్లలని కూడా చెప్పబడుతోంది. అయితే అది కల్పభేదం అని గుర్తించాలి. ఒక్కొక్క కల్పంలో ఒక్కో విధంగా జరుగుతుంది. అయితే కథమొత్తం మాత్రం మారదు. అలా అరవైమంది. అమ్మాయిలుగా చెప్పిన కల్పంలో పదిమందిని ధర్ముడికి, ఇరవై యేడుగుర్ని చంద్రుడికి, పదముగ్గురిని, కశ్యపుడికి, నలుగురిని గరుత్మంతుడికి, భృగు-అంగీరస-కృశాశ్వులు ముగ్గురికీ తలో యిద్దర్నీ చొప్పున యిచ్చుకున్నాడు దక్షుడు.

మరీ ప్రధానంగా కశ్యపుడు తన పదముగ్గురు భార్యలయందునా పొందిన సంతానమే ఈ ప్రపంచాన్ని నింపేసింది. స్థావరజంగమాలు రెండూ నింపేశాడా మహానుభావుడు. దేవతలు, ఋషులు, రాక్షసులు, చెట్లు, పిట్టలు, పర్వతాలు, పాములు ఒకటేమిటి? సృష్టిలో వున్న రకాలు ఎన్నివున్నాయో అన్నీ ఆయన దాంపత్యఫలమే! అందుకే సృష్టిని "కాశ్యపేయం" అనీ భూమిని "కాశ్యపి" అని పిలుస్తారు.

దక్షతనయగా ప్రభవించిన "సతి"ని శివుడు స్వీకరించాడు. నిజానికి సర్వేశ్వరుడి వామాంగం నుంచి విష్ణువు దక్షిణాంగం నుంచి ధాతా, హృదయం నుంచి రుద్రుడూ వచ్చారు. ఆ ముగ్గురూ అభేదులని గుర్తించాలి. వీరి వీరి అర్ధాంగుల రూపంలో ఆదిశక్తే తన అంశలను లక్ష్మి సరస్వతి దాక్షాయణిగా సృజించింది. వీరిలో లక్ష్మి తమస్స్వరూపిణి సరస్వతి రజోరూపిణి, సతీదేవి సత్వస్వరూపిణి.

కాళిక, చండిక, చాముండ, జయ, విజయ, జయంతి, భద్రకాళీ, దుర్గ, భగవతి, కామేశ్వరి, కామద, అంబ, మృడాని, అంబిక సర్వమంగళ- ఇవన్నీ ఆ సతీదేవి యొక్క అద్భుత నామధేయాలే. ఆవిడ యొక్క లీలా విలాసాలవల్ల ఆయా నామాలు ఆపాదించబడ్డాయి.

సత్త్వరజస్తమ స్స్వరూపులైన ముగ్గురు మూర్తులు తాదృశ గుణత్రయ రూపులైన ముగ్గురు దేవతలతోనూ కూడి యీ పవిత్ర సృష్టిని కొనసాగిస్తున్నారనీ గ్రహించాలి.

అన్నిటికీ పైనవున్న శివలోకంలో శివుడు ఆదిశక్తితో విహరిస్తూ వుంటాడు. ఆయన పూర్ణావతారమే పరమేశ్వరుడు. ఈయన కైలాసవాసి, ప్రపంచం అంతా పాడైపోతుంది గాని కైలాసం మాత్రం ఎట్టి కీడూ పొందదు ఇతి ధృవం.

అని బ్రహ్మ నారదునకు ఉపదేశించినట్లుగా సూతుడు శౌనకాది మహర్షులకు వినిపించాడు. వారు మహానందపడ్డారు. శివపురాణ ప్రవచనాన్ని యింకా కొన సాగించమని కోరారు. శివస్మరణం చేసుకుంటూ- సూతుడు మళ్ళీ ఆరంభించాడు.

# శ్రీ శివాష్టోత్తర శతనామస్తోత్రమ్



ఓం శివో మహేశ్వర శ్శంభుః పినాకీ శశి శేఖరః
వామదేవో విరూపాక్షః కపర్దీ నీలలోహితః॥ 1

శంకర శ్శూలపాణిశ్చ ఖట్వాంగీ విష్ణువల్లభః
శిపివిష్టోంబికానాథః శ్రీకంఠో భక్తవత్సలః॥ 2

భవశ్శర్వ స్త్రిలోకేశః శ్శితికంఠ శ్శివాప్రియః
ఉగ్రః కపర్దీ కామారి రంధకాసుర సూదనః॥ 3

గంగాధరో లలాటాక్షః కాలకాలః కృపానిధిః
భీమః పరశుహస్తశ్చ మృగపాణి ర్జటాధరః॥ 4

కైలాసవాసీ కవచీ కఠోర స్త్రిపురాంతకః
వృషాంకో వృషభారూఢో భస్మోద్ధూళితవిగ్రహః॥ 5

సామప్రియ స్స్వరమయః త్రయీమూర్తి రనీశ్వరః
సర్వజ్ఞః పరమాత్మా చ సోమసూర్యాగ్నిలోచనః॥ 6

హవి ర్యజ్ఞమయ స్సోమః పంచవక్త్ర స్సదాశివః
విశ్వేశ్వరో వీరభద్రో గణనాథః ప్రజాపతిః. 7

హిరణ్యరేతా దుర్ధర్షో గిరీశో గిరీశో ఽనఘః
భుజంగభూషణో భర్గో గిరిధన్వా గిరిప్రియః॥ 8

కృత్తివాసాః పురారాతి ర్భగవాన్ ప్రమథాధిపః
మృత్యుంజయః సూక్ష్మతను ర్జగద్వ్యాపీ జగద్గురుః॥ 9

వ్యోమకేశో మహాసేనజనక శ్చారువిక్రమః
రుద్రో భూతపతిః స్థాణు రహిర్బుధ్న్యో దిగంబరః॥ 10

అష్టమూర్తి రనేకాత్మా సాత్త్విక శ్శుద్ధవిగ్రహః
శాశ్వతః ఖండపరశు రజః పాశవిమోచకః॥ 11

మృడః పశుపతి ర్దేవో మహాదేవోఽవ్యయో హరిః
పూష దంత భిదవ్యగ్రో దక్షాధ్వర హరో హరః॥ 12
భగనేత్రభిద వ్యక్త స్సహస్రాక్ష స్సహస్రపాత్,
అపవర్గప్రదోఽనంత స్తారకః పరమేశ్వరః. 13

ఇది శివాష్టోత్తర శతనామ స్తోత్రం. ఇక దీనికి వివరణ నాలించు అంటూ బ్రహ్మ- ఆయా నామాలకర్థాల్ని చెప్పసాగాడు.

1. **ఓంశివాయనమః**:- ఐహిక, ఆముష్మికములు రెండింటా ఎడతెగని శుభవానగూర్చువాడు.
2. **ఓం మహేశ్వరాయ నమః** :- రుద్రరూపమున ప్రళయము జరుపబడిన వెనుక- పునఃసృష్టిని తనయందు భద్రపరచి తిరోధాన మొనరించువాడు.
3. **ఓం శంభవే నమః** :- భక్తులెల్లరకూ శుభపరంపరల నిచ్చుచూ సంరక్షించువాడు.
4. **ఓం పినాకినే నమః** :- పినాకము అనే పేరుగల ధనుస్సు గలవాడు.
5. **ఓంశశిశేఖరాయ నమః** :- తన శిరస్సు పైన చంద్రుని దాల్చువాడు.
6. **ఓం వాసుదేవాయ నమః** :- అలౌకిక సౌందర్యవంతుడు.
7. **ఓం విరూపాక్షాయ నమః** :- విశేష త్రినేత్రములు గలవాడు.
8. **ఓం కపర్దినే నమః** :- అందమైన జటాజూటము గలవాడు.
9. **ఓం నీలలోహితాయ నమః**:- ఎరుపు, నలుపు వర్ణ సమ్మిళితమైన వన్నెతో ప్రకాశించువాడు.
10. **ఓం శంకరాయ నమః** :- సాధకులకు శుభమును/శమనమును (శుభము) కల్గించువాడు.
11. **ఓంశూలపాణయే నమః** :- శూలమును ధరించిన చేయిగలవాడు.
12. **ఓం ఖట్వాంగినే నమః** :- మంచపుకోడు నాయుధముగా గలవాడు.
13. **ఓం విష్ణువల్లభాయ నమః** :- విష్ణుమూర్తికి నాయకుడైనవాడు.
14. **ఓం శిపివిష్టాయ నమః** :- సర్వోన్నతమునందుండువాడు.

15. **ఓం అంబికానాథాయ నమః :-** ఆదిశక్తికి భర్తయైన వాడు.

16. **ఓం శ్రీకంఠాయ నమః :-** విషము నిలిపిన కంఠము గలవాడు.

17. **ఓం భక్తవత్సలాయ నమః :-** భక్తులయందు వాత్సల్యము గలవాడు.

18. **ఓం భవాయ నమః :-** సర్వమును జన్మింప చేయువాడు.

19. **ఓం సర్వాయ నమః :-** సర్వమును శాసించువాడు.

20. **ఓం త్రిలోకేశాయ నమః :-** ముల్లోకములకు అధిపతియైనవాడు.

21. **ఓం శితి కంఠాయ నమః :-** నల్లరంగు కంఠమున గలవాడు.

22. **ఓం శివాప్రియాయ నమః :-** పార్వతీదేవికి ప్రియమైనవాడు.

23. **ఓం ఉగ్రాయ నమః :-** సంహారావేశము గలవాడు.

24. **ఓం కపాలినే నమః :-** బ్రహ్మ కపాలమును ధరించినవాడు.

25. **ఓం కామారయే నమః :-** మన్మథునికి శత్రువైనవాడు.

26. **ఓం అంధకాసురసూదనాయ నమః :-** అంధకాసురుని వధించినవాడు.

27. **ఓం గంగాధరాయ నమః :-** గంగను ధరించినవాడు.

28. **ఓం లలాటాక్షాయ నమః :-** ఫాలముల(నొసలు)యందు కన్ను గలవాడు.

29. **ఓంకాలకాలాయ నమః :-** యముడికి సైతము మృత్యువు వంటివాడు.

30. **ఓం కృపానిధయే నమః :-** కరుణకు గని వంటివాడు.

31 **ఓం భీమాయ నమః :-** ఉత్కృష్టుడు, భయము గొలుపువాడు, బలశాలి.

32. **ఓం పరశుహస్తాయ నమః :-** గండ్రగొడ్డలిని చేత ధరించినవాడు.

33. **ఓం మృగపాణయే నమః :-** చేతిలో లేడిని ధరించినవాడు.

34. **ఓం జటాధరాయ నమః :-** జడలను ధరించినవాడు.

35. **ఓం కైలాసవాసినే నమః :-** కైలాసమునందు నివసించువాడు.

36. **ఓం కవచినే నమః :-** నిత్యము కవచము ధరించినవాడు.

37. **ఓం కఠోరాయ నమః :-** శాసనములు చేయువేళ ఎట్టి వివక్షతలును చూడనివాడు ఋజుగామి.

38. **ఓం త్రిపురాంతకాయ నమః :-** త్రిపురాలను దహించువాడు.

39. **ఓం వృషాంకాయ నమః :-** వృషభము తనకు చిహ్నముగా గలవాడు.

40. **ఓం వృషభారూఢాయ నమః** :- వృషభముపై నెక్కి యుండువాడు.

41. **ఓం భస్మోద్ధూళిత విగ్రహాయ నమః** :- నిలువెల్లా భస్మ(విభూతి) ని పులుము కొని యుండువాడు.

42. **ఓం సామప్రియాయ నమః** :- సామవేదమందు ప్రేమ గలవాడు.

43. **ఓం స్వరమయాయ నమః** :- అన్ని స్వరములయందు ప్రాణరూపమున ప్రవర్తించెడివాడు.

44. **ఓం త్రయీమూర్తయే నమః** :- బ్రహ్మ, విష్ణు, రుద్రుడు అను మూడు రూపములను ధరించినవాడు ఋక్ యజుస్సామములను మూడు వేదములే స్వరూపముగ గలవాడు.

45. **ఓం అనీశ్వరాయ నమః** :- తనపై అధికారము చేయగలవారెవరునూ లేని వాడు అనగా తానే సర్వోన్నతాధికారి అని అర్ధము.

46. **ఓం సర్వజ్ఞాయ నమః** :- అన్ని విషయములు క్షుణ్ణముగా తెలిసినవాడు.

47. **ఓం పరమాత్మనే నమః** :- విష్ణువుకు ఆత్మయైనవాడు. అందరియందు గల ఆత్మలకు - మూలమైన ఆత్మస్వరూపుడు.

48. **ఓం సోమసూర్యాగ్నిలోచనాయ నమః** :- సూర్యుడు, చంద్రుడు, అగ్ని- అను ముగ్గురూ నేత్రములుగా గలవాడు.

49. **ఓం హవిషే నమః** :- క్రతువులందలి హోమార్పిత ద్రవ్యరూపుడు.

50. **ఓం యజ్ఞమయాయ నమః** :- యజ్ఞమునంతటా విస్తరించి యుండెడివాడు యజ్ఞమే తనరూపముగా గలవాడు.

51. **ఓం సోమాయ నమః** :- ఉమాదేవితో కూడ వుండువాడు.

52. **ఓం పంచవక్త్రాయ నమః** :- సద్యోజాత వామదేవ, అఘోర, తత్పురుష, ఈశానములనబడు పంచ బ్రహ్మాత్మకతా చిహ్నముగా - నలుదెసలకూ నాలుగున్నూ- ఊర్ధ్వమునకొక ముఖమున్నూ గలవాడు.

53. **ఓం సదాశివాయ నమః** :- నిత్యము మంగళములు కలిగించువాడు.

54. **ఓం విశ్వేశ్వరాయ నమః** :- సృష్టి మొత్తమునకు అధినాయకుడు.

55. **ఓం వీరభద్రాయ నమః** :- వీరభద్రావతారమును ధరించినవాడు.

56. **ఓం గణనాథాయ నమః** :- అన్ని ప్రమధగణములకు నాయకుడు. విఘ్నేశ్వర రూపమున కూడా తానే ప్రవర్తిల్లువాడు.

57. **ఓం ప్రజాపతయే నమః** :- సంతానకారులందరికీ అధిపతి.

58. **ఓం హిరణ్యరేతసే నమః** :- బంగారము వీర్యముగా గలవాడు.

59. **ఓం దుర్ధర్షాయ నమః** :- ధర్షింప వీలుగానివాడు.

60. **ఓం గిరీశాయ నమః** :- కైలాసగిరికి ప్రభువు, మేరుమందరాది గిరులన్నిటికీ యజమాని.

61. **ఓం గిరిశాయ నమః** :- కొండయందు శయనించువాడు.

62. **ఓం అనఘాయ నమః** :- పాపము లేనివాడు.

63. **ఓం భుజంగభూషణాయ నమః** :- నాగాభరణములు గలవాడు.

64. **ఓం భర్గాయ నమః** :- భార్గవేయులకు ఆదిపురుషుడైనవాడు. లేదా అజ్ఞానమును పోగొట్టువాడు.

65. **ఓం గిరిధన్వనే నమః** :- మేరుపర్వతమును ధనుస్సుగా ధరించినవాడు.

66. **ఓం గిరిప్రియాయ నమః** :- కొండలయందు ప్రేమగలవాడు.

67. **ఓం కృత్తివాససే నమః** :- ఏనుగుతోలు వస్త్రముగా కప్పుకొనువాడు.

68. **ఓం పురారాతయే నమః** :- త్రిపురములను హరించినవాడు. శరీరములనూ హరించువాడు.

69. **ఓం భగవతే నమః** :- ఆధిపత్య, ఐశ్వర్య, వైరాగ్య, నిత్యత్వాది భగషట్కమును కలవాడు.

70. **ఓం ప్రమథాధిపాయ నమః** :- ప్రమథగణములన్నింటికి నాయకుడు.

71. **ఓంమృత్యుంజయాయ నమః** :- మృత్యువును గెలిచినవాడు. మృత్యువు లేనివాడు. మార్కండేయుని రక్షించుటకై యముని ఓడించినవాడు.

72. **ఓం సూక్ష్మతనవే నమః** :- నివ్వరిధాన్యపు ముల్లు అంత సూక్ష్మమైన రూపముతో అలరారువాడు. శరీరధారుల స్థూల దేహాంతర్గత సూక్ష్మదేహము నందు అవాసముండువాడు.

**73. ఓం జగద్వ్యాపినే నమః :-** సర్వప్రపంచమందునా వ్యాపించినవాడు.

**74. ఓం జగద్గురవే నమః :-** జగత్తునకు తండ్రీ, గురువూయైనవాడు.

**75. ఓం వ్యోమకేశాయ నమః :-** ఆకాశమే తల నీలాలుగా భాసించువాడు.

**76. ఓం మహాసేనజనకాయ నమః :-** కుమారస్వామికి తండ్రియైనవాడు.

**77. ఓం చారువిక్రమాయ నమః :-** సొగసైన పరాక్రమము గలవాడు.

**78. ఓం రుద్రాయ నమః :-** ప్రళయవేళ సర్వులనూ దుఃఖపరచువాడు. సర్వుల దుఃఖములనూ పోగొట్టువాడు.

**79. ఓం భూతపతయే నమః :-** కలిగిన వాటి కన్నిటికీ భర్త, భూతప్రేతాదులకెల్ల యజమాని.

**80. ఓం స్థాణవే నమః :-** ఎట్టి చలనము లేనివాడు.

**81. ఓం అహిర్బుధ్న్యాయ నమః :-** దివారాత్రాతీతుడైనవాడు దివ్యుడు.

**82. ఓం దిగంబరాయ నమః :-** దిక్కులనే బట్టలుగా ధరించువాడు.

**83. ఓం అష్టమూర్తయే నమః :-** భూమి, నీరూ, నిప్పు, గాలి, ఆకాశము, సూర్యుడు, చంద్రుడు, ఆత్మ-అను యెనిమిది మూర్తులతో ఇంద్రియ గోచరమగుచున్నవాడు.

**84. ఓం అనేకాత్మనే నమః :-** అనేకములైన విధములుగా అలరారువాడు.

**85. ఓం సాత్త్వికాయ నమః :-** ఎల్లవేళల్లా సత్త్వగుణములతో నుండువాడు.

**86. ఓం శుద్ధ విగ్రహాయ నమః :-** నిష్కళంకమగు స్వచ్ఛమైన స్ఫటికము వలె భాసించురూపము గలవాడు.

**87. ఓం శాశ్వతాయ నమః :-** ఉండుట, లేకపోవుట అనే భేదము లేకుండా సర్వకాల సర్వావస్థల యందున్న- ఉన్నట్లు లేకుండుటయు లేనట్లు వుండుటయూ గలవాడు.

**88. ఓం ఖండపరశవే నమః :-** పరశువను రాక్షసుని ఖండించినవాడు. గండ్ర గొడ్డలి యను ఒక విశేషమైన ఆయుధము ధరించినవాడు.

**89. ఓం అజాయ నమః :-** పుట్టుక అనునది లేనివాడు.

**90. ఓం పాశవిమోచనాయ నమః :-** సంసార బంధములన్నింటి నుండియు విముక్తిని కలిగించెడివాడు.

91. **ఓం మృడాయ నమః** :- నిత్యము సుఖించువాడు సుఖమును కల్గించువాడు.

92. **ఓం పశుపతయే నమః** :- సంసార బంధనాలనే పాశములచే బంధింపబడ్డ జీవులందరికీ యాజమాన్యము వహించువాడు.

93. **ఓం దేవాయ నమః** :- దివ్యమైనవాడు.

94. **ఓం మహాదేవాయ నమః** :- దేవతలదరిలోనూ శ్రేష్ఠుడైనవాడు.

95. **ఓం అవ్యయాయ నమః** :- తరుగుదల లేనివాడు. స్త్రీ, పురుష, నపుంసక లింగములకు అతీతుడు.

96. **ఓం హరయే నమః** :- సర్వార్తిహారకుడు. విష్ణుస్వరూపము తానే అయినవాడు.

97. **ఓంపూషదంతభిదే నమః** :- పూషుడను సూర్యునియొక్క దంతములు రాలగొట్టినవాడు.

98. **ఓం అవ్యగ్రాయ నమః** :- ఎటువంటి తాపమును పొందనివాడు.

99. **ఓం దక్షాధ్వరహరాయ నమః** :- దక్షుని యజ్ఞము నాశనము చేసినవాడు.

100. **ఓం హరాయ నమః** :- అన్నిటిని హరించువాడు.

101. **ఓం భగనేత్రభిదే నమః** :- భగుడనే సూర్యుని యొక్క కండ్లను ఊడబెరికినవాడు.

102. **ఓం అవ్యక్తాయ నమః** :- ఎవ్వరికీ తెలియబడనివాడు.

103. **ఓం సహస్రాక్షాయ నమః** :- వేయి కన్నులు గలవాడు.

104. **ఓం సహస్రపాదే నమః** :- వేయి పాదములు గలవాడు.

105. **ఓం అపవర్గప్రదాయ నమః** :- మోక్షమును యిచ్చువాడు.

106. **ఓం అనంతాయ నమః** :- తుది అనునది లేనివాడు.

107. **ఓం తారకాయ నమః** :- సంసార సాగరమును తరింపచేయువాడు.

108. **ఓం పరమేశ్వరాయ నమః** :- లౌకిక జగత్తుకు అతీతమైనది, చావు పుట్టుకలు లేనిదీ, శాశ్వతమైనదీ అయిన పరమపదమునకు ప్రభువు ఇవి- శివుడి నూటనెనిమిది పేర్లకీ వివరణలు, నిత్యమూ రోజుకి ఒక్కసారైనా యీ వివరణను మననం చేసుకుంటూ శివాష్టోత్తర శతనామ స్తోత్రం

స్మరించువారు. శివానుగ్రహపాత్రులై- ప్రారబ్ధ విముక్తులై ఆయురారోగ్యైశ్వర్య ములు కల్గి వర్ధిల్లుతారు. నారదా! శివుడే పరుడు, శివుడే-నరుడు, నీయందూ, నాయందూ వున్నదా శివుడే మన అందరి విభూతులూ కూడా ఆ శివుడివే. ఆయన తప్ప మరేది లేదనీ తెలుసుకుని ఆరాధించినవాడు తరించుతాడు -లేనివాడు లేదు- 'అని బ్రహ్మవద్ద ఉపదేశితుడైన నారదుడు శివస్మరణంతో పున:తనలోక సంచారానికి బయలుదేరి వెళ్ళిపోయాడు. అని సూతుడు చెప్పగా విన్న ఋషులు- "మహాభాగా సర్వేశ్వరుడైన శివుడు కుబేరుడికి స్నేహం యెలా కుదిరింది? ఆ వివరం చెప్పి మమ్మల్ని జ్ఞానులను చెయ్యి" అని కోరగా సూతుడా కుబేరోపాఖ్యానాన్ని గుణనిధి కథతో ఆరంభించినాడు.

## గుణనిధి కథ



బ్రహ్మ చెప్పినదంతా విని, నారదుడు యిలా అడిగాడు. 'తండ్రీ! శివుడు కైలాసానికెప్పుడు వెళ్లాడు? కుబేరుడితో స్నేహం యెప్పుడు చేశాడు? ఆ పరమాత్ముడి పూర్వావ తారమైన మహేశ్వరుడు ఏఏ లీలలు గావించాడు? ఆ శివచరిత్రం మొత్తం వినిపించు నాకు. 'అందుకు బ్రహ్మ ఆనందించి యీ విధంగా చెప్ప సాగాడు- అని సూతుడు శౌనకాదు లకు వినిపిస్తున్నాడు.

చాలాకాలానికి పూర్వం కాంపిల్య నగరంలో యజ్ఞదత్తుడనే మహా పండితు డుండేవాడు. విధివిహిత సదాచారపరాయణుడు. యాజ్ఞీకుడూ అయిన ఆ యజ్ఞ దత్తుడికి లేక లేక ఒక్క కొడుకు పుట్టాడు. ఆ బిడ్డకు 'గుణనిధి' అని పేరుపెట్టి యెంతో ప్రేమగా చూసుకునేవారు. గర్భాష్టమప్రాయంలో వుపనయనం చేసి విద్యనేర్వ పంపారు. ఆ విద్యార్థి దశలోనే గుణనిధి చెడు స్నేహాల పాలయ్యాడు. చెడు స్నేహాలవల్ల జూదం మొదలైన దుర్వ్యసనాలు మరిగాడు. యజ్ఞదత్తుడు నిత్యం యేవో పనులలో మునిగివుండటం వల్ల యీ విషయాలేవీ ఆయనకు తెలియవు.

ఆయన తీరిక వేళలలో యెప్పుడైనా గుణనిధి గురించి భార్య అడిగితే - ఆమె, ఒక్కగాని, ఒక్కకొడుకు గదా! అనే మోహంలోపడి -గుణనిధి వేదం అవీ బాగా చదువుకుంటున్నాడనీ, ఇప్పుడే మిత్రులతో కలసి చింతన చేయదానికి వెళ్లాడనీ బొంకుతూ వుండేది. యజ్ఞదత్తుడి వైదిక కార్యలంపటత్వం ఆయనను గుణనిధికి దూరం చేయడంవల్లనైతేనేం, తల్లి విపరీతంగా గారం చేయడం వల్లనైతేనేం, గుణనిధి ఎంత చెడిపోవాలో అంతా చెడిపోయాడు. 'పండిత పుత్రః పరమ శుంఠః' అన్నట్లుగా తయారయ్యాడు. ఇవేమీ తెలియని యజ్ఞదత్తుడు, గుణనిధికి పదహారవ సంవత్సరం రాగానే చూడాకర్మ జరిపించడం ఆ వెనువెంటనే ఒక సద్బ్రాహ్మణ కన్యతో వివాహం చేయడం కూడా పూర్తి అయి పోయింది.

గుణనిధికి మాత్రం బుద్ధీ రాలేదు. పెళ్లయినా దారికి రాని కొడుకును చూసి తల్లి బాధపడింది. వేట, మద్యపానం, చాడీలు చెప్పడం, అబద్ధాలాడటం, దొంగ తనం, జూదం, పరస్త్రీ సంగమం, అనె ఏడు వ్యసనాలలోనూ ఏ ఒక్కటి అబ్బినా బైటపడటం కష్టమేనంటారు. అలాటిది ఒకదాని కొకటి తోడైతే చెప్పేదే ముంది! కొడుకు చెడిపోవడం పట్ల కళ్ళు తెరచుకున్న తల్లి ఇంక అతనికి పైకం యివ్వడం మానేసింది. వ్యయమే కాని ఆర్జనచేతగాని గుణనిధి స్వగృహంలోనే దొంగతనానికి, ఒడిగట్టాడు పాత్రలు, పళ్లెరాలు, పీటాలు, పీతాంబరాలు- ఒకటేమిటి అందినదల్లా జూదశాలకి చేర్చడం, జూదంలో ఓడిపోవడం-ఆస్తులన్నీ గెలిచినవారికి కైంకర్యం చేయడం అలవాటైపోయింది.

ఒకనాడు యజ్ఞదత్తుడు అభ్యంగనస్నానం ఆచరిస్తూ, తన చేతినవున్న రత్నాంగుళీయకాన్ని జాగ్రత్త చేయమని భార్య చేతికి యిచ్చాడు. ఆమె దాన్ని యెడంచేత్తో యెక్కడో పెట్టి మర్చిపోయింది. గుణనిధి దాన్ని తీసుకుపోయి జూదంలో పణంగా పెట్టి కోల్పోయాడు. అప్పటికి ఆ వుంగరం సంగతి అందరూ మర్చిపోయారు. ఆ రెండో నాడోమూడో నాడో యజ్ఞదత్తుడు రాచ వీధిని వస్తుండగా ఒకానొక వ్యక్తి చేతిని తన ఉంగరం కనిపించింది. యజ్ఞదత్తుడు ఆ అంగుళీయకం విషయమై అతనిని గద్దించగా ఆ అనామకుడు గుణవిధి యొక్క జూదరితనమంతా చెప్పి- వుంగరాన్ని తాను జూదంలో గెల్చుకున్నట్టుగా తెలియ జేశాడు.

కాగులూ, కంచాలూ కూడా జూదశాలకు చేరుకుండానే కొడుకును అదుపులో పెట్టుకోమని హెచ్చరించాడు. హేళన చేశాడు. యజ్ఞదత్తుడు అవమానభారంతో

యింటికి వచ్చి, భార్యను పిలిచి తన రత్నాంగులీయం గురించి ప్రశ్నించగా ఆమె కంగారుపడి, తరువాత వెదకి యిస్తాను - అన్నది. యజ్ఞదత్తుడు భార్యను నిందించాడు. కొడుకు ప్రవర్తనలు తనకు తెలపకుండా దాచి వాడిని పాడు చేసిందని తూలనాడాడు. తక్షణమే గుణనిధికి తిలోదకాలర్పించేశాడు. భార్యను వదలివేసి, మరొక శ్రోత్రియ కన్యను మనువాడాడు.

## గుణనిధి- శివరాత్రి పూజ



తన తప్పుడు ప్రవర్తన అంతా తండ్రికి తెలిసిపోయిందన్న సంగతి గుణనిధికి తెలిసిపోయింది. ఇంటికి వెడితే తండ్రి యేం శిక్ష విధిస్తాడనే భయంతో- పారిపోయాడు. ఆ మర్నాడు ఒకచెట్టు క్రింద కూర్చుని ఆకలి బాధతో తన చెడుకాలాన్ని నిందించు కుంటూండగా ఒకానొక శివభక్తుడు-స్వజన పరీవృతుడై- సర్వ విధ పక్వాన్నములతో శివారాధనకై ఆలయానికి వెడుతూ కనిపించాడు. ఆ పక్వాన్నాల మీది సువాసనలతో, గుణనిధి ఆకలి మరింత రెచ్చిపోయింది. అతడు ఆ శివభక్తులను అనుసరిస్తూ చీకటిపడే వేళకి ఆలయం చేరాడు. అక్కడా భక్తులు శివార్చన చేసి తమతో తెచ్చిన పక్వాన్నాల్ని నివేదించి, నృత్యగీతాదులతో స్వామిని సేవించి, అక్కడే పరుండి పోయారు.

అప్పటివరకు గుణనిధి, ఆలయ ద్వారంవద్దనే వేచి వుండి ఆ సమస్తమైన శివారాధనను తిలకించాడు. అంతా నిద్రించిన అనంతరం, శివుని నివేదనను ఆరగించాలనే తలంపుతో గుడిలోనికి కదిలాడు. లోపల దీపం కొండెక్కబోతోంది, శివలింగం యొక్క శిరోభాగాన క్రీనీడ లాడుతున్నాయి. ఆకలితో కళ్ళుబైర్లు కమ్ముతున్న గుణనిధికి ఆ దీపపు వెలుగు చాలలేదు. అందువల్ల తన ఉత్తరీయపు టంచును చింపి వత్తిగా చేసి - ప్రమిదలో కొడిగడుతున్న వత్తితో వెలిగించాడు. దీపం యెగదోశాడు. చీకటి పటాపంచలైంది.

ఆ కాంతిలో గుణనిధి శివ నివేదనలన్నిటినీ మూట గట్టుకొని త్వరత్వరగా పారిపోబోయాడు. ఆ తొందరలో- నిదురిస్తున్న వారిలో ఒకరికి గుణనిధి కాలు

తగిలింది. వారు మేల్కొంచి, "దొంగ-దొంగ" అని అరిచారు. దేవాలయ రక్షక భటులు రివ్వున దూసుకువచ్చి చేతిలోని బాణాక్రతో కాబోలు ఒక్క దెబ్బ కొట్టారు. అంతే ఆ ఒక్క దెబ్బతోటే గుణనిధికి కపాలమోక్షం అయిపోయింది. తక్షణమే యమదూతలు వచ్చి, గుణనిధి యొక్క సూక్ష్మదేహాన్ని పాశాలతో బంధించి యమలోకానికి గొనిపోబోయారు ఇంతలోనే వచ్చారు శివపారిషదులు. గుణనిధి సూక్ష్మదేహాన్ని తమకు పప్పగించవలసినదిగా శాసించారు వారు.

ఆశ్చర్యపోయారు యమదూతలు, "అహో శివదూతలారా! ఇతనితో మీకేం పని? ఇతడు మహా పాపాత్ముడు. స్నానసంధ్యలుగాని, శుచిశుభ్రతలూగాని, ఆచార వ్యవహారాలుగాని, యేమీ లేనివాడు. తల్లిదండ్రులకు కష్టము కలిగించినవాడు, జూదరి, దొంగ తుంటరీయైన యిటువంటి భ్రష్టుడితో మీకేంపని?" అని అడిగారు. శివదూతలు నవ్వుతూ "ధర్మకింకరులారా! మీరు చెప్పినదంతా సత్యమే అయి నప్పటికీ ఈరోజు బహుళ చతుర్దశి కాబట్టి, ఇది శివుని కిష్టమైన మాసశివరాత్రి పర్వదినం అయింది. ఈనాడు తెలిసో తెలియకో పగలు నాలుగు జాములూ ఉపవాసంతో గడిపాడు. సాయంవేళ శివభక్తులతో కలిసి శివాలయం చేరాడు. నక్షత్రదర్శనవేళకు శివార్చన సందర్శనం చేశాడు.

శివలింగపు టగ్రభాగాన పడే క్రీనీడ-యీతని ఉత్తరీయపు టంచుతో చేసిన వృత్తి యొక్క కాంతితో కొట్టుకుపోయింది. దాంతోనే యితని పాపాలూ కొట్టుకు పోయాయి" అని చెప్పి, గుణనిధి సూక్ష్మదేహమును తమతో తీసుకువెళ్ళిపోయారు. యమదూతలు శివదూతల నెదిరించలేరు. గదా! అందువల్ల కిమపినాస్తిగా యమ పురి చేరి తమ ప్రభువైన సమవర్తికి జరిగింది విన్నవించారు. అప్పుడు శమనుడు తన కింకరులను చూసి "భటులారా! మీకొక్క సూక్ష్మ విషయం చెబుతాను వినండి.

చితాభస్మాన్ని త్రిపుండ్రాలుగా ధరించినవారినీ నిలువెల్లా భస్మోద్ధూళనం చేసుకున్నవారినీ, కారణాంతరమున శివవేషం ధరించిన వారినీ, రుద్రాక్షధారులనీ, జటాధారులనీ, చివరికి పొట్టకూటికోసం ఈశ్వరుడివేషం వేసే వారిని గానీ, అసలు యే విధంగానైనా సరే విభూతీ రుద్రాక్షలు ధరించే వారిని మాత్రం యెప్పుడు కూడా ఇక మన యమలోకానికి తీసుకురాకండి సుమా!" అని హెచ్చరించాడు.

# గుణనిధి దమనుడుగా జన్మించుట

పూర్వోక్త విధాన యమదూతల నుండి గ్రహించిన గుణనిధి సూక్ష్మ శరీరాన్ని కైలాసం చేర్చారా శివదూతలు. కాలాంతరాన ఆ గుణనిధి, కళింగ రాజ్యాన్ని పరిపాలించే అరిందముడు అనే రాజుకు 'దమనుడు' అనే కుమారునిగా జన్మించాడు. పూర్వజన్మలో శివుని ముందు దీపం పెట్టిన పుణ్యానికి - యీ జన్మలో అతడు పురాస్మృతి కలిగి ఉన్నాడు. అరిందముడి అనంతరం దమనుడు రాజయ్యాడు. పూర్వ సంస్కారం వల్ల దమనుడు మహాశివభక్తుడై, ప్రతి మాసశివరాత్రి నాడూ, మహాశివరాత్రి నాడూ శివాలయాలన్నిటా దీపాలు వెలిగింపజేస్తూ దీపదానాలు చేస్తూ, శివదీక్షాపరుడై ధర్మబద్ధుడై జీవించసాగాడు. తానేకాదు తన రాజ్యంలో అందరి చేతా శివారాధనలూ, దీపదానాలూ చేయించాడు. అనంతరం శరీర ధర్మంరీత్యా కాలం చేశాడు.

# దమనుడు కుబేరునిగా పుట్టుట

తొలుతటి గుణనిధి తన ఉత్తరీయపుటంచుతో వత్తి చేసి శివుడి ముందు దీపం పెట్టిన పుణ్యానికి- తదుపరి జన్మలో దమనుడనే రాజుగా జన్మించి- అగణిత శైవారాధనలతో, దీపదానాలతో పుణ్యాత్ముడై- ఆ మరుసటి జన్మలో సాక్షాత్తూ బ్రహ్మదేవుని పౌత్రుడైన విశ్రవసువుకు కుమారుడుగా జన్మించాడు. విశ్రవసుడి కొడుకు గాబట్టి వైశ్రవుడు అనీ వైశ్రవసుడనీ పిలుస్తుండేవారు. పూర్వజన్మలోని పుణ్యఫలం వల్ల గతం అతని స్మృతిలోనే ఉండేది. ఆ కారణంగా అతగాడు ఈ జన్మలో కూడా శివభక్తుడై విరాజిల్లసాగాడు. పవిత్ర భాగీరథీతీరంలో శివలింగాన్ని ప్రతిష్ఠించి అనుపమానమైన తపస్సాచరించాడు. ఆ తపస్సులో పూర్తిగా శుష్కించి పోయాడు. శల్యావస్థలో వున్న వైశ్రవణుడిపై దయతలచి సతీసమేతంగా సాక్షాత్కరించాడు రుద్రుడు.

హస్తమస్తక సంస్పర్శతో వైశ్రవణుని పూర్వ పరిమాణ దేహుణ్ణి చేశాడు. కళ్ళు తెరిచాడు వైశ్రవణుడు. అతనికి కంటికి ఆదిదేవుడినే అంటి పెట్టుకొని ఉన్న అమ్మవారు కనిపించారు. ఆమెను చూసి అసూయపడ్డాడు. అసూయగా చూశాడు. "నేనెంత తపస్సు చేసి ఏం లాభం? నా స్వామికి సర్వస్వమైపోయిన యీ నెలతకన్నా అధికుడను గానుగదా! ఈమె తపస్సు యెంత గొప్పదో గదా!" అనుకుంటూ - ఆమె నదే పనిగా చూడసాగాడు. మహా సాధ్వి మహేశ్వరి. వైశ్రవణుడి

చూపును గురించి వేదాతీతుడికి వివరించబోయింది. దరహాసించాడు దాక్షాయణి పతి "పుత్రతుల్యుడీ వైశ్రవణుడు కేవలం నీతపో వైభవం చూసి అసూయ పడుతు న్నాడే గాని, అన్యథా భావించకు" అని ఆమెకు బోధించి, అనంతరం వైశ్రవణుడితో "నాయనా నీ తపస్సుకు ఆనందించాను. నవనిధులకూ నిన్ను నాయకుడిగా అను గ్రహిస్తున్నాను.

యక్షకిన్నర కింపురుష గుహ్యకులకు, పుణ్యాజనులకు అధిపతివవుతాను. అలకానగరం నీరాజధాని అవుతుంది. నీతో నేను మైత్రీపూర్వకంగా మసలుతావు. ఆ నిమిత్తంగా నీ రాజధానికి చేరువలోనే నివసిస్తూ ఉంటాను. ఈ దేవి నీకు తల్లి వంటిది. ఈమెకు కూడా నమస్కరించి ఆశీస్సులు పొందు" అని చెప్పాడు. అలాగే నమస్కరించాడు. వైశ్రవణుడు. అతనిని దీవించమన్నాడు రుద్రుడు. రుద్రాణి దీవించింది. "నాయనా! నీ శివభక్తి నిర్మలమై - దినదినాభివృద్ధి చెందాలి. నీ స్ఫుటిత నేత్రం గోరోచనవర్ణం కలిగి, చూపరులకు అందంగా కనిపిస్తుంది. హరుడిచ్చిన వరము అతిత్వరలోనే ఫలించాలి. అలాగే- నారూపవి భవాదులకు అసూయాగ్రస్తుడవైన కారణంగా యికనుంచి "కుబేర" నామంతో వర్ధిల్లుతావు నువ్వు" కులపాలిక దీవెనలకు "కృతార్థోఽహం"అంటూ తలదాల్చాడు కుబేరుడు. అనంతరం కుబేరుడు అలకాపురి నేల సాగాడు శివుడిచ్చిన వరం ప్రకారం కుబేరుడికి చేరువలోనే ఉండాలి కదా! అందుకని కుబేరుడి కోరికపై రుద్రుడు కైలాసానికి తరలాడు.

## శివుడు కైలాసము చేరుట



సతీసమేతుడై కైలాసాన్నధి రోహించి - ఒక్కసారిగా తన ఢమరు కాన్ని మ్రోగించాడు. ఆ నాదం భూ నభోంతరాళా లన్నింటా వ్యాప్తమై పోయింది. బ్రహ్మ విష్ణ్వాదులందరూ బారులు తీరులూ వచ్చి స్వామివారి ముంగిట నిలిచారు. నారదాది ఋషులు, మూర్తిమంతాలైన నిగమాగ మాదులు, సిద్ధులు, ప్రమథగణాలూ, భక్తులూ అందరూ తరలివచ్చారు. వీరు కాక యింకా అగణితమైన గణాధి

పతులూ, చిల్లర మల్లర గణాలూ ఊహించడానిక్కూడా వీల్లేనంతమంది వచ్చి చేరారు. వృషధ్వజుడి సన్నిధికి, అందరికందరేగా వున్నవారందరికీ వేయి చేతులు మూడేసి కన్నులు, జటామకుటాలు, జటలపై జాబిలులు, హారకుండల కేయూర మకుటాద్యలంకారాలు, అందరును అణిమాది గుణసంపన్నులు అజహరి సన్నిభులు, నీలకంఠులు -ఈవిధంగా అనేకానేకులు అంజలి బద్ధులై పరదేవతా సహితుడైన తనని ఆరాధిస్తుండగా- కైలాసంలో నివాసయోగ్యాలైన సౌధాదిక నిర్మాణానికై విశ్వకర్మకు ఆజ్ఞల నీయడం, విశ్వకర్మ ఆయానతిని తక్షణమే నిర్వర్తించడం - కాలాధికుడైన కంఠేకాలుడు లోక వ్యవహారార్థం సుముహూర్తాన్ని ఆరోపించి-కైలాస శిఖరాగ్ర నగరప్రవేశం చేయడం- అన్నీ ఒకదాని వెనుక ఒకటి చక చకా జరిగిపోయాయి. అనంతరం రుద్రాక్షితో అందరును తమతమ తావులకు తరలిపోయారు. ఈ విధంగా శివుడికి కుబేరుడికి సావాసమూ- తత్పరంగా శ్రీవారికి కైలాసవాసమూ తటస్థించాయి.

# సతీచరిత్రం

సూతుడు చెప్పిదంతా విని శౌనకాదులు ఆనందించారు. అనంతరం- "మహా భాగా పరమపురుషుని పూర్ణావతారమైన రుద్రుడి రాణి దక్షుడి కుమార్తెయనీ తదుపరి హిమవంతుడి కుమార్తె పార్వతిగా పిలువబడుతున్నదనీ చెబుతున్నారు, ఇది మాకు ఆశ్చర్యంగా వుంది. ఒకే స్త్రీ యిద్దరికి కూతురెలా అవుతుంది? ఇందు లోని రహస్యగాథను వినిపించి మమ్మల్ని చరితార్థులను చేయి" అని కోరగా సూతుడు తొలుతగా

మధ్యాక్కర నీవే తండ్రివి నేను పుత్రుడనయా నిన్ను సేవించెదన్
నీవే రాజువు నేను సత్కవిని తండ్రీ నిన్ను వర్ణించెదన్
నీవే దైవము నేను భక్తుడను తండ్రీ నిన్ను బ్రార్థించెదన్
నా వైదుష్యము నీవె జూడు కృపసంధానించు విశ్వేశ్వరా॥

అని ఆ సర్వేశ్వరుడిని ప్రార్థించుకుని - ఇలా ప్రవచించసాగాడు-

# సంధ్యా-మన్మథుల ఆవిర్భావం

"వినండి. ఏ చరిత్ర వినడంవల్ల జన్మజన్మాంతర జాడ్యాలూ నశించి పోతాయో, ఏకథాశ్రవణం వల్ల కళ్యాణపరంపరలతో వర్ధిల్లగలమో- ఆదివ్యగాథను వినిపిస్తాను వినండి."

ఒకనాడు బ్రహ్మదేవుడు తన మానసపుత్రులైన దక్షమరీచ్యాదులందరితోటి కొలువుతీరి ఉండగా- ఆయన హృదయంలోంచి -నవయువ వయోవిలాసినియైన ఒక కన్య ఆవిర్భవించింది. ఆ పిల్లని చూసి అంతా ఆశ్చర్యపోసాగారు. అదే సమయములో వేరొక నవయువకుడు కూడా ఆవిర్భవించాడు. స్త్రీలకన్నా సమ్మోహనాకారం గానూ, అత్యంతదర్పంగానూ ఉన్న ఆ యువకుడు చెరుగ్గడతో చేసిన విల్లునూ, అయిదంటే అయిదే పుష్పవిశేషాలను బాణాలుగానూ ధరించి ఉన్నాడు. పుట్టడం పుట్టటమే బ్రహ్మకు నమస్కరిచాడు ఆ యువకుడు. తనకొక వూరూ, పేరూ, ఉద్యోగమూ, యిప్పించవలసిందిగా కోరాడు ఆ యువకుణ్ణి చూస్తుంటే ఎవరికీ నోరు మెదలడం లేదు. అంతకు ముందెప్పుడూ తెలియని యేదో చిత్రమైన వికారానికి లోనై పోసాగారు. ముందుగా బ్రహ్మ కోలుకున్నాడు.



"చూడగానే మోహంపట్టిస్తు న్నావు నువ్వు. కాబట్టి అదే పని మీదుండు. నీ పూలబాణాలతో సర్వ ప్రాణికోటినీ సమ్మోహింపచెయ్యి. స్త్రీ పురుషులలో కామనలు రేపి సృష్టికి దోహదం చెయ్యి. ప్రాణికోటి అంతటా రహస్యంగా వుండు నువ్వు. నీ బాణాలకు తిరుగులేదు. ఏలోకంలోనైన ఎటువంటి మా లోకాన్నైనా- కామంలో ముంచేస్తాయి. నీబాణాలు, అంతెందుకు? నీ బాణాల ధాటికి త్రిమూర్తులమైన మేము కూడా చలించక తప్పదు" అని చెప్పాడు.

అనంతరం మరీచ్యాదులందరూ కలసి, పుడుతూనే, మనో వైకల్యాలు కలిగించిన వాడవడంచేత, "మన్మథుడు" అని కామోద్దీపకుడు గనుక "కాముడు" అనీ, అత్యధికమైన దర్పంతో విరాజిల్లుతూన్నడు. గనుక 'కందర్పుడు' అనీ, యిలా ఆ యువకుడికి నామకరణాలు చేశారు.

---

★ ఈ రచయిత పసినాట చదువుకున్న -కవిసామ్రాట్ విశ్వనాథవారి పద్యం మరపుపొరలలోంచి మారురూపుడుగా పొందిన రూపం

తనకొక పని నిర్దేశింపబడగానే దానిని అక్కడికక్కడే ఆరంభించదలచుకు న్నాడు. మన్మధుడు తక్షణమే, ఆ సభలోనే తన పూలబాణాలు ప్రయోగించాడు. కంపరమెత్తి పోయారు కంజాసనాదులు, ఎవరికీ యేమీ పాలుపోకుండా అయి పోయింది. ఊహకు అందనంతమోహంతో తలమునకలైపోయారు. అంతమంది పురుషుల నడుమనే వున్నా ఒకేఒక్క స్త్రీ- మన్మధుడికన్నా ఒక్క అడుగు ముందు పుట్టిన బ్రహ్మమానసపుత్రి ఆమె హృదయం కూడా చలించింది. మరీచీ మొదలైన అందరి చూపులూ ఆ పిల్లమీదే ఉన్నాయి. చివరకు బ్రహ్మదేవుడు కూడా ఆ యువతి మీద భ్రమపడిపోసాగాడు. - అది గమనించాడు.

ధర్మదేవత తక్షణమే తరుణేందు శేఖరుణ్ణి తలంచాడు. విధాత సభలో లీలాదర్శనమిచ్చాడు. విషమాంబకుడు. బ్రహ్మాదుల్ని మందలించాడు. శ్రుతి మించిన కామంతో కూతుర్నే కోరుకోవడం శ్రుతివిరుద్ధమని చెప్పాడు. అలాగే బ్రహ్మ మానసపుత్రులు తమ చెల్లెల్ని చేరాలనుకోవడం చేయరాని పని అని చెప్పాడు. వారిలో కామోపసంహరణ గావించి తాను అదృశ్యుడైపోయాడు శివుడు. అప్పటికే కల్గిన కామవికారం వల్ల చతుర్ముఖుడి శరీరమంతా చెమటలు పట్టేశాయి. ఆ చెమటనుంచి అగ్నిష్టోములనే అరవైనాలుగు వేల పితృగణాలు, ఎనభై ఆరు వేలమంది బర్హిషదులు అనే పితృగణాలు ఆవిర్భవించడం జరిగింది. క్రతువు వశిష్ఠుడు పులస్త్యుడు, అంగిరసుడు అనేవారి బీజాలు ధూమగతాలైనందు వల్ల, సోమపులు, సుకాలురు, ఆజ్యపులు, హవిష్మంతులు అనే పితృగణాలు ఆవిర్భవించాయి.

పితృకార్యాలలో సమర్పించే కవ్యాలను వీరే భుజిస్తారు. అగ్ని వీరికి చేరుస్తాడు. బ్రహ్మయొక్క తీవ్రధ్యానంలోంచి పుట్టిన కారణంగా 'సంధ్య' అనే సంజ్ఞతో కూడిన ఆ యువతి శివదర్శనంతో జ్ఞాని అయింది. కాని, ఆమెకు సంబంధం లేనప్పటికి కూడా ఆమె మీది కామవికారం వల్లనే- బ్రహ్మనుండి, బ్రహ్మ మానసపుత్రుల నుండి పితృగణాలు ఆవిర్భవించాయి. గనుక ఆమె పితృగణాలకు తల్లిగా చెప్ప బడింది. ఇంత జరిగిన తరువాత బ్రహ్మ చిరాకుపడ్డాడు. శివునిచేత చెప్పించుకో వలసి వచ్చినందుకు సిగ్గుపడ్డాడు. ఆ వికలతతో మన్మధుణ్ణి శపించేశాడు. "నలుగురికి చెప్పవలసినవాడినీ, నాలుగు ముఖాలున్నవాడినీ- నన్నే ముఖం యెత్తు కోలేకుండా చేసేశావు. ఏ శివుడి చేత నాకు నీతులు చెప్పించావో - ఆ శివుడిక మూడోకంటి మంటలోపడి మసైపో" అని శపించాడు.

గజగజలాడిపోయాడు మదనుడు. "నన్ను క్షమించు తండ్రీ! నువ్వు నాకు యిచ్చిన ఉద్యోగధర్మాన్ని నిర్వర్తించానే గాని తప్పుచేయలేదు. విధి నిర్వహణ యిది అని పలువిధాల ప్రాధేయపడ్డాడు. అతడి వేడికోలుతో బ్రహ్మకొద్దిగా తేరుకున్నాడు. "నిజమే నీకు యిచ్చిన, ఉద్యోగ ధర్మమే నువ్వు చేశావు. కాని, కామం పుట్టించమంటే- ఇలా వావివరసలు లేకుండా పుట్టించమని అర్థంకాదు. అయినా నిన్ననాల్సినపనే లేదు. కామమే కష్టమైంది. కామం కళ్ళకు కప్పాక- వావివరుసలేం తెలుస్తాయి. అందుకే, తల్లి, వదిన, తోడబుట్టినది- కూతురు- వీళ్ళతో సంపర్కాన్ని ఆశించేవాడు అధోగతులకు పోతాడు. నీకిచ్చిన వరం ఎంత బలమైందో- ఇప్పుడు పెట్టిన శాపం కూడా అంతే బలమైంది.

అందువల్ల నువ్వు శివనేత్రాగ్నులలో కాలిపోక తప్పదు. కాలినా-సృష్టి జరగడానికి నువ్వే ప్రధాన కారణమైనందువల్ల-ఆ శివానుగ్రహంతోనే నువ్వు పునర్జీవివవుతావులే" అన్నాడు. అదే పదివేలనుకున్నాడు మన్మథుడు. అదే సమ యంలో దక్షుడి చెమట నుంచి ఒక అనుపమాన మోహనాంగి ఆవిర్భవించింది. చూపరులను వెర్రెక్కింప చేసే సోయగాలపుట్ట ఆ పుట్ట, ఆ పిల్లకి 'రతి' అని పేరు పెట్టారు. రమణమూర్తియైన ఆ 'రతి'ని చూస్తూనే - మన్మథుడంతటివాడు మనసుని అదుపులో పెట్టుకోలేకపోయాడు. ఈ కామకారకుడికి కాస్తంత పగ్గాలు వేసేందుకు ఆ పిల్లే సరైందిగా తలచి 'రతి'ని అతనికిచ్చి పెండ్లి చేశారు. ఆడా మగా కలిపి ఆనందపడడానికి ఎన్ని పద్ధతులున్నాయో- అన్ని పద్ధతుల్లోనూ ఆనం దించసాగారు. వాళ్లు అవి చాలవన్నట్లు క్రొత్త క్రొత్త పద్ధతులు కూడా ఆవిష్కరించ సాగారు.

## సంచలనాత్మకమైన సంధ్యాదేవి తపస్సు వరములు

సరే! ఆ రతీ మన్మథుల్ని అలా సుఖపడనిద్దాం. ఇక అక్కడ- బ్రహ్మాదులకు బుద్ధిగరవడం కోసం లీలా దర్శనమిచ్చిన శివస్ఫురణతో సంధ్య జ్ఞాని అయింది గదా! ఆమె పశ్చాత్తాపపడింది. పుట్టి పుట్టగానే - తండ్రీని, తోబుట్టువులనూ కూడా కామవివశుల్ని చేసాను గదా అని బాధపడి, ఆ పాపపరిహారార్థం తపస్సు చేసుకునేందుకు గాను చంద్రభాగపర్వతానికి చేరింది. కాముడి కళ్యాణం హడావిడిలో నుండి తేరుకున్న తరువాత బ్రహ్మదేవుడు సంధ్య గురించి యోచించాడు. ఆమె నిశ్చయం తెలుసుకున్నాడు. వశిష్ఠుణ్ణి పిలిచి నాయనా! ఆ అమ్మాయికి

తపోవిధానం తెలియదు. కాబట్టి నువ్వు- మరేదైనా రూపంలో వెళ్లి ఆమెకు ఆ విధానాన్ని బోధించిరా" అని ఆజ్ఞాపించాడు. వశిష్ఠుడు బ్రహ్మచారిగా మారి చంద్ర భాగ పర్వతంపై నున్న సంధ్యవద్దకు వెళ్ళాడు. ఆమెకు తపోవిధానాదులన్నీ బోధించాడు. "ఓం నమఃశంకరాయ" అనే మంత్రాన్నుపదేశించాడు. 'దీనినే జపించు ఆ శంకరుడు దిగివచ్చే దాకా జపించు' అని చెప్పి చక్కాబోయాడు. సంధ్య తీవ్రమైన తపస్సులో మునిగిపోయింది. ఆమె యొక్క తపోదీక్షను వర్ణించడం ఎవరి తరమూ కాదు.



అలా ఆమె తపస్సులో వున్న కాలంలోనే - దక్షుడికి అశ్వినీ, భరణ్యాది ఇరవైయేడుగురు ఆడపిల్లలు పుట్టారు. వారందర్నీ చంద్రుడికిచ్చి పెళ్లి చేశాడు దక్షుడు అందరూ తన భార్యలే యైనా- ఆ చంద్రుడు మాత్రం యెందుకోమరి వారిలో రోహిణ పట్లనే విపరీతమైన ప్రేమతో వుండేవాడు. తక్కిన ఇరవైయారు గురు భార్యలకీ యిది యిబ్బంది అయ్యింది. వాళ్ళంతా కలిసి వెళ్లి తమ తండ్రి యైన దక్షుడికి విన్నవించుకున్నాడు. దక్షుడు- అల్లుడైన అమృతాంశుణ్ణి పిలిచి మందలించాడు. అయినా చంద్రుడి ధోరణిలో మార్పురాలేదు. అందుకు ఆగ్రహించిన దక్షుడు చంద్రుణ్ణి క్షయగ్రస్తుడవు కమ్మని శపించాడు. చంద్రుడు బ్రహ్మాదుల్ని ఆశ్రయించాడు. అందరూ కలసివచ్చి మహాతపస్వినియైన సంధ్యను ప్రాధేయపడ్డారు. కాని ఆమె ధ్యానసమాధిలో వుండటం వల్ల - వీళ్ళ మొరలేవి ఆమెకు వినబడలేదు. ఆమె చలించలేదు. అప్పుడు మార్గాంతరంగా బ్రహ్మదేవుడు చంద్రభాగా నదిని సృష్టించడం, చంద్రుణ్ణి పవిత్రం చేసేందుకు యితర ప్రయత్నాలు చేయడం జరిగింది. ఇదంతా ఎందుకు చెబుతున్నానంటే ఆ సంధ్యా దేవి యొక్క తపోదీక్ష ఎంత గాఢమైనదో చెప్పడాని కన్న మాట.

ఒకటా రెండా- నాలుగు యుగాలు తపస్సు చేసిందామె. కరుణించాడు కపర్ది. కదలివచ్చి ఆమె కన్ను లెదుటతోచాడు. వరం కోరుకోమన్నాడు. 'హే జగన్నాథా! శివా! శంకరా! నేను పుడుతూనే కాముకురాలయ్యాను. ఇతరులను కాముకులుగా మార్చాను. ఆ పాపపరిహారార్ధమై తపించాను. ప్రసన్నుడవయ్యావు నువ్వు. అదే పదివేలు నా పాపం నశించినట్లయితే నేను కోరే మూడు వరాలు

అనుగ్రహించు మొదటిది ఇక నుండి, ఏ ప్రాణిగాని పుట్టుకతోనే కామానుభూతి పొందడానిక వీలులేదు. రెండు సృష్టిలోని సాధ్వీమణులలో నాకు అగ్రతాంబూలం దక్కాలి. మూడు - నా భర్త తప్ప, మరే పురుషుడు నన్ను వక్రదృష్టితో చూసినా- తక్షణమే వాడు నపుంసకుడై పోవాలి. ఈ మూడు వరాలూ అనుగ్రహించు" అని కోరింది.

సంధ్యాదేవి, శివుడు నవ్వాడు "అలాగే జరుగుతుంది. ఇక నుంచి ప్రాణికోటి బాల్య, కౌమార, యౌవన, వృద్ధాప్యాలనే నాలుగు దశలననుభవిస్తుంది. వాటిలో బాల్యకౌమారాలు దాటితే గాని పురుషులకు కామోద్దీపనం తెలియకుండా వుండే విధంగా శాసిస్తున్నాను. అలాగే యౌవనవతులైతేనే తప్ప స్త్రీలకి అసలు ఆ అవకాశమే వుండకుండా అనుగ్రహిస్తున్నాను. సాధ్వీమణులందరికీ ఆదర్శప్రాయ మయ్యే వరాన్నిస్తున్నాను నీకు. నీ మూడవ కోరిక రీత్యా- నీ భర్త తప్ప మరే పురుషుడు నిన్ను కామదృష్టితో చూసినా- వాడు తక్షణమే నపుంసకుడైపోతాడు - ఈ నీకోరికలు సఫలం చేసుకోవడానికి ప్రయత్నించు. ఇక్కడ చంద్రభాగానదీ తీరంలో మేధాతిథి అనే ముని జ్యోతిష్టోమం అనే యజ్ఞం చేస్తున్నాడు. నువ్వు అదృశ్య రూపిణివై వెళ్ళి ఆ యాగకుండంలో ఆత్మార్పణ గావించుకో, త్వరపడు" అని ఆదేశించి అంతర్హితుడయ్యాడు ఆ భవుడు.

## అరుంధతి చరిత్ర

క్షణం ఆలస్యం చేయకుండా బయల్దేరింది సంధ్య. శివాజ్ఞరీత్యా మేధాతిథి యజ్ఞ గుండంలో పడి ఆత్మార్పణం చేసుకుంది. అదృశ్యరూపిణిగా వెళ్లినందువల్ల ఆమె ఎవ్వరికి కనిపించలేదు. మహాతపస్విని అయిన కారణంగా- అగ్ని దగ్ధమైన ఆమె శరీరం నుండి సాధారణమైన కవురుకంపు కాకుండా- పురోడాశ పరిమళాలు వచ్చాయి. అందువల్ల యెవరూ గుర్తించలేకపోయారు. అగ్నిపరమైన ఆమె సూర్య మండలాన్ని చేరింది. సూర్యుడామె దేహాన్ని రెండు భాగాలు చేసి- తనవద్దనే వుంచుకున్నాడు. మొదటి భాగం ప్రాతస్సంధ్య- దేవతాప్రీతి కారిణి రెండవది సాయం సంధ్య పితృదేవతలకు ప్రియమైనది. ఆమె ప్రాణాన్ని పునఃయజ్ఞగుండానికి మళ్ళించాడు శివుడు.

తత్ఫలితంగా - యజ్ఞగుండంలో నుంచి అపురూపమైన బాలికగా ఆవిర్భ వించింది. ఆమెను అక్కడి మునులందరి సమ్మతి మీదా మేధాతిథి ఆమెను

తన కూతురుగా స్వీకరించాడు. ఆమె ఏనాడూ ధర్మోల్లంఘనం చేయనిది కావాలి అనే సంకల్పంతో ఆమెకు అరుంధతి అని నామకరణం చేశాడు. అల్లారుముద్దుగా పెరిగిన ఆ పిల్లకు యుక్తవయస్సు వచ్చింది. ఆమె సంధ్యగా వున్నప్పుడు తపోదీక్ష నిచ్చిన "బ్రహ్మచారి రూపం" ఈ జన్మలో కూడా ఆమె మనఃఫలకం మీద వుండి పోయింది. అది తెలుసుకున్న మునులూ, బ్రహ్మాదులూ అందరూ కలసి- ఆనాడు బ్రహ్మచారి వేషం వేసిన వశిష్ఠుణ్ణి పిలిచి- అరుంధతినిచ్చి పెళ్ళిచేశారు. సాధ్వీమ తల్లులకు శిరోభూషణమైన ఆ ఆరంజ్యోతి- అరుంధతి చరిత్ర యిదీ అని ఆపాడు సూతుడు.

# మన్మథుడు శివుడిపై దండెత్తి పరాభూతుడగుట

అరుంధతీ చరిత్రం విన్న మునిగణాలలో కలకలం బయల్దేరింది. పదేపదే సంధ్యాదేవిని - ఆమె తపః పరిపక్వతా పరిణామరూపమైన అరంధతీ మూర్తినీ భావించుకున్నారు. పదే పదే మనసులలోనే నమస్కరించుకున్నారు. సంచలనాత్మక మైన సంధ్య ఆదరణీయ - ఆనందదాయినీ అయిన అరుంధతీ, వీరి కథా శ్రవణానుకంపనం తగ్గాక రతీదేవి కథను కొనసాగించుమని కోరారు. చెప్పసాగాడు సూతుడు.

మన్మథుడు పుట్టినప్పుడు జరిగిన తతంగం- శివుడు వచ్చి మందలించడం- తామంతా తెప్పరిల్లడం- అప్పట్లో అలా ఏదో అయిపోయినా తర్వాత్తర్వాత ఆ విషయం గుర్తు వచ్చినప్పుడల్లా గుండెలు కలుక్కుమనేవి బ్రహ్మదేవుడికి- ఏదో ఆడపిల్ల మీద మోజుపడ్డ మాత్రాన శివుడు అలా సభామధ్యలో తనని మంద లించడం కంటగింపుగా వుండేది. ఇంతకీ మూలకారణము ఆ శివుడు పెండ్లీ పెటాకులూ లేకుండా- నిత్యవిరాగిలా తపోలంపటుడై పోవడమే ననుకున్నాను. ఆ శివుడికి కూడా ఒక్కసారి స్త్రీ సంపర్కం కలిగితే అప్పుడు తెలిసొస్తుంది- కామవశులై పోవడం ఎంత మామూలు విషయమో! అనీ అనుకున్నాడు. ఉన్న పళంగా రుద్రుడికి కామం కలిగించాలని నిశ్చయించు కున్నాడు.

వెంటనే మన్మథుణ్ణి శివుడి మీదికి ప్రేరేపించాడు. వెళ్లాడు మన్మథుడు. వచ్చాడు మన్మథుడు ఆ రుద్రుడు చలించడంలేదని చెప్పాడు. తన దగ్గర శస్త్రాలే గాని అస్త్రాలు లేకపోవడమే ఓటమికి కారణం అన్నాడు. అస్త్రాలు యిప్పించమని

బ్రహ్మను కోరాడు. ఏ కళనున్నాడోగాని బ్రహ్మ, మన్మథుడికి అస్త్రాలను మాత్రం యీయలేదు. అవే ఇచ్చి ఉంటే యీ ప్రపంచం యేమైపోయేదో! ఒట్టి పూల బాణాలతోటే జగజెట్టీలైన యోగుల్ని సైతం మట్టికరిపించేస్తున్న మన్మథుడికి అస్త్రాలు కూడా తోడైతే సృష్టి మొత్తంలో కామకార్యం తప్ప మరో సంగతే వుండేది కాదు. అస్త్రాలు యివ్వలేదుగాని మన్మథుడి ద్వారా శివుణ్ణి గెలవడం యెలాగా? అని మాత్రం తీవ్రంగా ఆలోచించాడు.

అప్పుడే బ్రహ్మ హృదయం నుంచి వసంతుడు ఆవిర్భవించాడు. పుట్టడం పుట్టటమే తానున్న పరిసరాలన్నీ మలయమారుతాలతో సుగంధ పరిమళాలతో, కొంగ్రొత్త సోయగాలతో అందగింపజేసేశాడు. అక్కడ వాళ్ళ హృదయాలన్నీ ఆహ్లాద మయం చేసేశాడు. అతన్ని చూసి బ్రహ్మ ఆనందించాడు. అతగాడిని మన్మథుడికి తోడుయిచ్చాడు. వసంతుడు తోడుంటే మన్మథుడి పని మరింత తేలిక అవు తుందని బోధించి మరోసారి మహేశ్వరుడి పైకి పంపించాడు. వెళ్ళారు మదన వసంతులు. వచ్చారు మదన వసంతులు. ఆ మహానుభావుణ్ణి కాముకుణ్ణి చేయడం తమవల్ల కాలేదని చెప్పుకుని తలలు వంచుకున్నారు.

## వసంతుడితో కలసివెళ్ళి మన్మథుడు మరోసారి ఓడిపోవుట

శివుడి స్థాణుత్వానికి, తన పన్నుగడ నీరుకారి పోవడానికి విషమశరుడి వైఫల్యా నికి, వసంతుడి పగ్గె పనికిరాకపోయినందుకూ ఉసూరుమన్నాడు చతుర్ముఖుడు. అలా కాసేపు నిట్టూరుస్తూనే వుండిపోయాడు. అదుగో, ఆ నిట్టూర్పులోంచి జన్మిం చాయి. కొన్ని గణాలు పుట్టడం పుట్టడమే 'మారయమారయ', 'భేదయ భేదయ' అని అరుస్తున్నారు. పటహ, కాహళాది వాద్యాలు మ్రోగిస్తున్నారు. వాళ్ళని చూసి - దక్షాదులూ, మదనవసంతులూ కూడా ఆశ్చర్యపోయారు. "హేధాతా! ఎవరు వీళ్లు? ఎందుకు పనికి వస్తారు?" అని అడిగారు.

నాయనా! జన్మించుతూనే మారయ మారయ అని అరుస్తున్నారు! గనుక వీళ్ళకి మారగణాలు' అని పేరు పెడుతున్నాను. వీళ్లందరూ మన్మథుడి అనుచరులై వుంటారు. కాముడి పని సులువుచేసి పెట్టేందుకు వుపయుక్తులవుతారు. అని చెప్పి కందర్పా! ఈసారి వసంతుడితోబాటు యీ మారగణాలని కూడా చేర్చుకుని- ఆ చిచ్చుకంటివాడి సంగతి చూసి రావయ్యా!" అని ఆజ్ఞాపించాడు. తప్పో, ఒప్పో-

తండ్రి చెప్పింది చెయ్యడమేగాని- యెదురు చెప్పేవాడు కాదు. అంచేత మళ్ళా బయల్దేరాడు మదనుడు. తరలివెళ్లారు మదన వసంత, మారగణాలు మరలి వచ్చారు. మదనవసంత, మారగణాలు, ఇంకో యింత బలంతో వెళ్ళినా ఆ భర్గుణ్ని మాత్రం మోహపరచలేము. పైగా - సమాధిచాలించినప్పుడు- విప్పుకున్న ఆయన కళ్ళు నిప్పుగుండాల్లా కనిపిస్తుంటే కాలి బూడిదై పోతామేమోనని భయం వేస్తోంది" అని మనవి చేసుకున్నారు.

## బ్రహ్మ - విష్ణుమూర్తిని సలహా అడుగుట



నాలుగు తలకాయలూ బాదుకున్నాడు నలువ "నారాయణమూర్తి తండ్రీ! ఎంత కష్టం తెచ్చిపెట్టావయ్యా నాయనా!" అనుకున్నాడు. అనుకోవడం తడవుగా శ్రీ మహా విష్ణువు కోసమై ప్రార్థనలు చేయ సాగాడు. సర్వవ్యాపకుడైన విష్ణువు చటుక్కున ప్రత్యక్షమయ్యాడు. "కుమారా! పద్మగర్భా! అంతదీనంగా ప్రార్థిస్తున్నావు ఏమి ఆపద వచ్చింది నాయనా!" అని ప్రశ్నించాడు వాత్సల్యంగా. ఏ ఒక్కటీ దాచలేదు. ఆ సరస్వతీనాథుడు మనసులో వున్నది వున్నట్లూ జరిగింది జరిగినట్లుగా చెప్పేశాడు. ఏవిధంగానైనా సరే ఆ కాలకంఠుణ్ణి కాముకునిగానూ, కాంతా దాసునిగానూ మార్చెయ్యాలి. అందుకు మార్గం నువ్వే చెప్పాలి" అని వేడుకున్నాడు.

ఔరౌరా! అంటూ ముక్కున వేలేసుకున్నాడు మురారి. గతంలో ఒకసారి శివుడు రుద్రుడు తన పూర్ణావతారమని, తన ననుసరించి మసలే మాయయే ఒక భాగం ఉమగా అవతరించి రుద్రాణి అవుతుందనీ చెప్పివున్నాడు గదా! అందుచేత యిదంతా శివసంకల్పమే తప్ప మరొకటికాదని నిశ్చయించుకున్నాడు. ఆ మాత్రం ధైర్యం లభించాక - దేవి గురించి తపించు దక్షుణ్ణి కూడా తపించమను' అని చెప్పి ఉపదేశించాల్సింది వుపదేశించి అంతర్హితుడైపోయాడు అంబుజనాభుడు.

# దక్షుడు తపస్సు చేయడం అమ్మవారు అనుగ్రహించడం



విష్ణువు వెళ్ళిపోగానే- దక్షుడికి కబురు పెట్టాడు స్రష్ట. వచ్చాడు దక్షుడు. జగజ్జననియైన మహామాయను గురించి తపించు నీ కుమార్తెగా అవతరించుమని అర్థించు అని ఆజ్ఞాపించాడు బ్రహ్మ. తక్షణమే పాల కడలి ఉత్తరతీరాన్ని చేరి మహామాయకై తపించసాగాడు దక్షుడు. ఇక్కడ బ్రహ్మ తపస్సు మొదలుపెట్టాడు. ఆపద్బాంధవి ఆ తల్లిపైగా అమ్మ మనసుగదా ఆమెది 'తల్లీ' అనుకోవడం ఆలస్యం ఏం నాయనా! అంటూ వచ్చేస్తుంది. అటువంటి బ్రహ్మ అంతటివాడు బాసీ పట్టేసుకుని తపస్సుకు కూర్చుంటేరాదా మరి! రానే వచ్చింది. ఎప్పుడూ లేనిది యిలా నాకోసం తపస్సు చేస్తున్నావేమిటి? ఏం కావాలి నీకు?" అని అడిగింది.

తల్లి ముందు దాపరికాలేముంటాయి. గనుక అన్నీ చెప్పేశాడు ఎటొచ్చీ శివుణ్ణి కాముకుణ్ణి చెయ్యాలి' అని చెప్పకుండా శివుడికి కళ్యాణం జరగాలి కదా! అన్నాడు అంతే అంతటి అమ్మవారు ఆలోచనలో పడ్డారు. రుద్రుణ్ణి చలింప చేయడం అంటే సామాన్యమైన విషయం గాదుకదా! ఆలోచించగా ఆలోచించగా ఆవిడకి కూడా యిదంతా శివ సంకల్పంగానే తోచింది. అందువల్ల "సరేలే ప్రయత్నిస్తాను" అని అదృశ్యమయిపోయింది. అక్కణ్ణుంచి సరాసరి దక్షుడికి సాక్షాత్కరించింది. ఏంకావాలో కోరుకోమంది. దక్షుడామెకు ప్రదక్షిణ నమస్కారాలాచరించి అమ్మా! నా కూతురివై దాక్షాయణిగానూ, రుద్రపత్నివై రుద్రాణిగానూ నన్ను అనుగ్రహించాలి. అదే నా కోరికా" అన్నాడు. అలవోకగా నవ్వుకుంది అమ్మవారు "అస్తు" అంతర్ధానమైపోయింది.

అమ్మవారు వరంయిస్తే యి ఆలస్యం యేముంటుంది. తపోదీక్ష నుండి యింటికి తరలివచ్చి- ఆసిక్నీనామ్ని అయిన వీరిణి అనే భార్యతో విహరించాడు. దక్షుడు ఆమె నెల తప్పింది. ఒకానొక సుముహూర్తంలో ఆవీరిణి గర్భాన- జగన్మాతయైన మహామాయ ఆవిర్భవించింది. లోకాలు ఆనందించాయి. బ్రహ్మ

విష్ణ్వాదులు అంతా వచ్చారు. బారులు తీరి నిలబడ్డారు. శ్రుతి శిఖరాలు సైతం అందుకోలేని ఆ మహామాయ పాదాలను స్పృశించారు. పుట్టినందుకు ఫలితం దక్కింది - అని అందరూ అనుకుంటుంటే, తన పట్టుదల నెరవేరిందని బ్రహ్మ ఆనందించాడు.

మరో సుముహూర్తాన సత్యస్వరూపిణియైన ఆ సతీదేవి యొక్క బాలికా రూపానికి "ఉమ" అని నామకరణం చేశాడు దక్షుడు. లోక వ్యవహారార్థం విష్ణ్వాదు లందరూ వెళ్ళి దీవించారు. ఉమ ఎదుగుతోంది, పసినాటినుండి పశుపతి లీలల్నే వింటూ, మననం చేసుకుంటూ, క్రీడిస్తూ పెరిగింది. యుక్తవయస్క అయ్యింది. బ్రహ్మదేవుడు వెళ్ళి ఆమె సందర్శనం చేసుకున్నాడు అవతారకారణం గుర్తు చేసి వెళ్ళిపోయాడు. ఆనాటి నుండి ఆమె మరింత దృఢంగా శివపూజనం ఆరంభించింది.

## సతీదేవి ఆచరించిన నందావ్రతము

ఆశ్వియుజమాసంలో నందాతిథియైన ప్రతిపదయందు శంకరుణ్ణి భక్తితో అర్చించింది. గుడోదనం నివేదించింది. కార్తీక చతుర్దశినాడు భక్ష్యాలను, పాయసా లను నివేదించి సేవించింది. మార్గశిర బహుళాష్టమినాడు జ(య)వలూ నువ్వులూతో కూడిన అన్నాన్ని నైవేద్యంగా సమర్పించి స్వామిని ఆరాధించింది. పుష్యశుక్ల సప్తమినాడు అర్ధరాత్రి నిద్రలేచి కూర్చుంది. అమర్నాటి రాత్రివేళ పులగం నివేదనగా పురారిని పూజించింది. మాఘపౌర్ణమినాటి రాత్రంతా జాగారం చేసి నాలుగుయామాల్లో బిల్వపత్రాలతో అర్పించింది. చైత్రశుక్ల చతుర్దశినాడు మోదుగు పువ్వులూ దవనముతో ముక్కంటికి కొలువులిచ్చింది. వైశాఖ శుక్ల తదియనాడు నువ్వులతో చేసిన పదార్థాలనీ యవల అన్నాన్ని శివుడికి నైవేద్యం పెట్టింది. ఆ నెలంతా తాను మాత్రం పాలూ మొదలైన గవ్యాలతో మాత్రమే గడిపింది. జ్యేష్ఠపౌర్ణమినాటి రాత్రి శివుణ్ణి బృహతీపత్రాలతో పూజించి నూతన వస్త్రాలు సమర్పించింది. తాను మాత్రం నిరాహారంగా వుండిపోయింది.

ఆషాఢ శుక్ల చతుర్దశినాడు శివపూజ చేసి నల్లబట్టలు సమర్పించింది. శ్రావణ శుక్ల అష్టమీ, చతుర్దశీ తిథులు రెండింటా కూడా శివార్చన చేసి, యజ్ఞోపవీతాన్నీ క్రొత్తబట్టలనీ దర్భలనీ సమర్పించుకుంది. భాద్రపదమాస బహుళ త్రయోదశినాడు అనేక రకాల పువ్వులతో శివపూజ చేసింది. అరటిపళ్ళు, కొబ్బరికాయలు నివేదిం

చింది, చతుర్దశినాడు కేవలం మంచినీళ్లు మాత్రమే ఆహారంగా స్వీకరిస్తూ- సరిగ్గా ఆ సమయానికి పండిన ధాన్యాలను నివేదనగా సమర్పించింది. శివపంచాక్షరీ మంత్రం స్మరిస్తూ- సర్వవేళలా శివాయత్తచిత్తయై వుండిపోయింది.

ఆవిధంగా నందావ్రతాన్నాచరించి శివాయత్తచిత్తయై నిశ్చలధ్యానమగ్నయైన ఉమను చూచి- దేవతలంతా ఆశ్చర్యపోయారు. ఆమె దీక్షకు హాహాకారాలు చేశారు. తక్షణమే బ్రహ్మవిష్ణువులు- తమ తమ పరివారాలన్నీ యితర అర్హ జనాల్నీ వెంట బెట్టుకుని కైలాసం చేరారు. రుద్రుణ్ణి స్తుతించారు. గృహస్థుడివి కమ్మని ప్రార్థించారు. ఎట్టకేలకు అంగీకరించాడు నిటలాక్షుడు.

"నిత్యం నేను ఆత్మధ్యానంలో వుంటాను. నా ధ్యానానికి యేనాడూ ఆటంకం కలిగించకూడదు. ఒకవేళ అలా ఆటంకం కలిగించినట్లయితే ఆమె నాశనం అయిపోతుంది. నేను యోగిని కాబట్టి, నాకు యోగినియైన యోషయే కావాలి. పెండ్లి చేసుకుంటాను. గనుక- నేను కాముకుడనైనప్పుడే తానూ కాముకి కావాలి. నేను యోగంలో వుండగా ఆమె కూడా యోగాన్నే ఆశ్రయించాలి. నిత్యం నాకు అనుకూలతనే అనుసరించగలిగేది అయిన అమ్మాయి వుంటే చూడండి పెళ్ళాడతాను అన్నాడు రుద్రుడు.

"అమ్మయ్య" అనుకంది అమరవర్గం. మెల్లమెల్లగా దాక్షాయణి విషయం ఆయన చెవిలో వేశారు. ఆమె శివదీక్షను కూడా వివరించాడు మందహాసం చేశాడు చంద్రధరుడు.

## సతిదేవికి శివుడు ప్రత్యక్షమగుట



నందావ్రతం ముగిసిపోయినా శివదర్శనం కాకపోవడంతో ఉమాదేవి మరింత దీక్షగా ప్రయత్నించాలనుకుంది. ఆశ్వీయుజ శుక్లాష్టమి నాడు ఉపవాసం చేసి, శివారాధన నెరపి, ఆ మర్నాడు నవమినాటి ఉదయం శివధ్యానంలో కూర్చుని వుండగా- ఆమె ముందుగా ప్రత్యక్ష మయ్యాడు పశుపతి. పురుషుడు ఎంత అందంగా ఉంటే ఆడవాళ్ళ కళ్ళు కట్టడిపోతాయో అంతకు వెయ్యింతలు అందంగా అగుపించ

డాయన. సర్వాంగ సౌందర్యం, స్ఫటికాభదేహం, నేత్రత్రయం, చంద్ర జూటం, విశాలపక్షం, నీలగళం, భస్మోద్ధూళితం అయిన- ఆయనను చూసి నును సిగ్గులు యిబ్బడిముబ్బడిగా- దబ్బున ఆయన చరణాల వ్రాలితల వాల్చుకుని వుండి పోయింది ఉమ.

ఈవిడగారి అందానికి ఆయన మరీయిద్దై పోయాడు. అయినా పురుషుడూ, పురుషోత్తముడూ గనక- నిర్వికార ప్రదర్శనతో - నీ భక్తికి మెచ్చాను. ఏంకావాలో కోరుకో! అన్నాడు. ఆమె మరీ ముగ్ధగదా! మీకేది అనుగ్రహించాలని తోస్తే అదే అనుగ్రహించండి! అన్నది. ఆవిడచేతే అడిగించుకుందామంటే కుదరలేదు. పాపం! అయినా అదో తరహా బెట్టునే ప్రదర్శిస్తూ నాభార్యగా అనుగ్రహిస్తున్నాను అన్నాడు. మహానందపడింది. ఆ జగదానందకారిణి, మనపాణిగ్రహణం మాత్రం నా తండ్రి సమక్షాన యధావిధిగా జరగాలి అన్నది ఆమె. సరే నన్నాడు శివుడు. అనంతరం ఉమ-శివుడి వద్ద శలవు తీసుకుని తల్లిదండ్రుల వద్దకు వెళ్లిపోయింది. శివుడికి సతీ విరహం పుట్టింది. దాని మొదటి లక్షణంగా- ఆయనకు - తన కైలాసమే దూరం అనిపించింది.

అందుకని హిమాలయాల్లోనే ఆగిపోయి, ధ్యానంలో పడ్డాడు. ధ్యానం ముగిసింది దక్షుడూ, దాక్షాయణి రాలేదు. పెండ్లీ విషయం ప్రసంగించలేదు. తనకేమో మనసంతా ఉమే అయిపోయింది. వెంటనే బ్రహ్మను తలచాడు తక్షణమే సరస్వతీ సహితంగా వచ్చి రుద్రుని మ్రోలనిలిచాడు బ్రహ్మ. శివుడు తన పెళ్లి విషయం కదిపాడు. సిగ్గుపడుతూనే విరించి వినయం ప్రదర్శించాడు- లోపల ఆనందంతోనే ఈ వివాహం తప్పక జరుగుతుందని చెప్పి- దక్షునితో మాటలాడే నిమిత్తం వెళ్ళాడు బ్రహ్మ మాటలాడేదేముంటుంది. అదంతా వాళ్ళొకపన్ను గడమీద చేసిన పనేగదా! బ్రహ్మ, దక్షుడికి చెప్పవలసినవి చెప్పాడు. తిరిగి త్రినేత్రుడి వద్దకు వచ్చాడు. "అంతా నిశ్చయం అయిపోయింది సుముహూర్తానికి తమరు తరలి వస్తే - దక్షుడా ఉమను మీకు కన్యాదానం చేస్తాడు" అని విన్నవించుకున్నాడు.

# సతీ శివుల కళ్యాణం

ఆది చైత్రమాసం శుక్లపక్షం, త్రయోదశీ ఆదివారంనాడు పూర్వఫల్గుణీ నక్షత్రాన రుద్రుడు నందివాహనారూఢుడై- బ్రహ్మ, విష్ణువు, యింద్రుడు- మొదలైన దేవగణాలు మహానంద మందహాసకలకలారావాలతో వెన్నంటిరాగా దక్షపురికి

బయలుదేరాడు. దక్షుడు వారికి ఎదురు సన్నాహాలూ, స్వాగత సత్కారాలు చేశాడు. ఒక సుముహూర్తాన బ్రహ్మదేవుడు పురోహితుడుగా - కన్యాదానం కానిచ్చేశాడు. శివుడు సాంబశివుడైనాడు దిగంబరుడు- జగదంబరుడైనాడు. లోకాలన్నీ మహానంద వార్ధిలో ఓలలాడాయి. త్రిమూర్తులలో మూడవమూర్తి కూడా గృహస్థుడు కావడం అంటే- అదేమన్నా మామూలు సంబరమా మరి! సరే- కన్యాదానాది కార్యక్రమాలు ముగిశాయి. విధివిహితంగా అగ్ని ప్రదక్షిణానికి ఉద్యుక్తులయ్యారు ఉమాశంకరులు.



ఆ సప్తపది సమయంలో తనపంతం నెగ్గి ఈశ్వరున్ని ఓయింటి వాడిగా చేయగలగానన్న అహం తలెత్తింది బ్రహ్మలో. అహం తలెత్తాలేగాని శివమాయ. కప్పి వేయడానికి ఆలస్యం యేముంటుంది? చటుక్కున ఆవరించింది శివమాయ. పిచ్చివాడికి ప్రపంచమంతా పిచ్చిదిలా తోచినట్లు-ఆ శివమాయలో పడ్డ ప్రతి వాడూ తానొక్కణ్ణే మాయా తీతుణ్ణను కుంటాడు. సరిగ్గా సప్తపది సమయంలో అమ్మవారి దివ్యచరణం లవలేశంగా కనుపించింది బ్రహ్మకు. అంతే మాయావృతుడైన బ్రహ్మ మోహంలో పడి పోయాడు. ఈ ఉమాదేవి కాళ్ళే యింత అందంగా వుంటే వదనారవిందం మరెంత అందంగా వుంటుందో అనుకున్నాడు.

ఆమె ముఖదర్శనం కోసం ప్రాకులాడసాగాడు, కుదరటం లేదు ఇదికాదు పని అనుకున్నాడు. అగ్నిహోత్రంతో రెండు తడి కట్టెలు పడేశాడు. దాంతో అగ్ని మండపంలోంచి పొగరానారంభించింది. శివుడు కళ్ళుమూసుకున్నాడు. బ్రహ్మ అమ్మవారి ముఖారవిందం చూశాడు. ముగ్ధుడైపోయాడు. కామంతో కైపెక్కి పోయాడు తక్షణమే స్ఖలించాడు. బ్రహ్మతేజం నాలుగు బొట్లుగా స్ఖలించబడింది. అది ఎవరూ చూడకుండా కప్పెట్టు కోవాలనుకున్నాడు కాని సర్వాంతర్యామియైన ఆ సర్వేశ్వరుడికి తెలియదా! తెలియనే తెలిసింది. ఆ క్షణమే ఆగ్రహోదగ్రుడై పోయాడు, త్రిశూలాన్నెత్తాడు, బ్రహ్మను వధించాడానికి.

లోక కళ్యాణకరమైన ఉమాశంకరుల వివాహదర్శనాభిలాషులై వచ్చిన అహూతులంతా హాహా చేశారు. దక్షాదులు ధైర్యంగా ముందుకొచ్చి రుద్రుని పాదాలమీద పడి ప్రాధేయపడసాగారు. ఈ పచ్చని పెండ్లి పందిరిలోంచే బ్రహ్మ గారి పాడెను లేపవద్దని పలురకాలు ప్రార్ధించారు, ఎవరి మొరలూ వినేలా లేడు విషమాంబకుడు అప్పుడు రంగప్రవేశం చేశాడు విష్ణుమూర్తి. శివకేశవులకున్న పరస్పరాభిమానమో- మరే ఊహాతీత కారణమోగాని- విష్ణుమూర్తి విన్నపాలను మన్నించి విధిని క్షమించాడా శివుడు అందరూ ఊపిరి పీల్చుకున్నారు.

# బ్రహ్మకు మదభంగం

అనంతరం బ్రహ్మకూడా అపరాధం క్షమించమని ప్రార్థించాడు. "నీ చేత్తోటే నీ తలలను స్పృశించుకో"మన్నాడు. శివుడు బ్రహ్మ అలాగే చేశాడు. ఇంకేముంది! బ్రహ్మ తలమీద నందివాహనా రూఢుడైన రుద్రుడిరూపం ముద్రితమూ-ప్రకటితమూ అయిపోయింది. తెలుసుకున్నాడు తామరచూలి. "ఇంతకన్నా నా తల కొట్టేసినా బాగుండును అని అనుకున్నాడు. పైకి మాత్రం ఆ భావం కనబడ నీయకుండానే శతధా ప్రార్థించాడు. ఈశ్వరుణ్ణి- చివరగా శివుడిలా చెప్పాడు.

"నువ్వీ రూపంతోనే తపస్సు చెయ్యి. "రుద్ర శిరస్కుడనే పేర జగత్ప్రసిద్ధు డవుతావు సత్పురుషులైన ద్విజుల కార్యాలను నిర్వర్తించేవాడివి అవుతావు, మానుష రూపంతో మహీమండలాన సంచరించే నిన్ను- నీయీ రూపం గురించి ఎవరైనా ప్రశ్నించవచ్చు అడిగిన వారికందరికీ యధార్థాన్ని చెప్పుకో. వారు నిన్ను అపహాస్యం చేస్తారు. అలా నవ్వుల పాలైనప్పుడల్లా నీ పాపం కొంచెం కొంచెంగా తొలగి పోతుంది. నవ్వుల పాలవడమే నీకు తగిన ప్రాయశ్చిత్తం, ఎంతైనా విధివి గనుక-నీ వీర్యం సంవర్తక ఆవర్తక, పుష్కర, ద్రోణములనే నాలుగు ప్రళయ పర్జన్యాలుగా పరిణమించడం జరుగుతుంది. అవి ఆకాశంలో వుంటాయి."

అన్నిటికి తలవంచాడు బ్రహ్మ, అనంతరం విష్ణ్వింద్రదక్షాదుల మాటమీద -తక్కిన పెండ్లి తంతులన్నీ పూర్తికావించాడు బ్రహ్మ. ఆఖరున బ్రహ్మను పిలిచాడు శివుడు. "ఈ శుభకార్యం ఆద్యంతం నీచేతుల మీద పూర్తి చేయించావు. నాకిధి సంతోషం కలిగించింది. ఏమైనా వరం కోరుకో" అన్నాడు.

నీ యీ పెండ్లికొడుకు వేషంలో యీ కళ్యాణమండప ప్రాంతంలోనే వెలసి వుండు. ఈ చేరువలోనే ఆశ్రమం కట్టుకుని తపస్సు చేసుకుంటాను. ఎప్పుడైనా

సరే- చైత్రశుక్ల త్రయోదశి పూర్వఫల్గుణి నక్షత్రయుక్త భానువారంనాడు యిక్కడ నిన్ను దర్శించినవారు తక్షణమే పాపవిముక్తులు కావాలి/వారి వ్యాధులు నశించాలి" అని కోరాడు. అనుగ్రహించాడు ఆదిదేవుడు. అందరికీ ఆశ్చర్యమే! అంతకు ముందే ఆ తామరచూలి తలను తరిగేస్తానన్న తామసానికీ, అడిగిందే తడవుగా వరం యిచ్చేసిన ఈ అనుగ్రహానికి యెక్కడా పొంతనలేదు.

"జై భోలాశంకర్ జై" అని నినదించాయి లోకాలు. అప్పగింతలూ, అవీ అన్నీ ముగిసిన వెనక సాంబశివుడు నిజధామానికి తరలి వెళ్ళాడు. ఇదీ దాక్షాయణీ కళ్యాణగాథ. ఎప్పుడో స్వాయంభువమన్వంతరంలో జరిగిన ఘట్టమిది. మీ కోరిక మేరకు వినిపించాను. వివాహసమయంలోనూ, యజ్ఞ ప్రారంభంలోనూ, శివార్చన చేసిన తరువాతనూ ఈ కళ్యాణ కథను తలచుకునేవారికి అన్నీ శుభాలే జరుగుతాయి. కన్యలు విన్నట్లయితే ఆచిరకాలాననే వివాహితలై సౌభాగ్యవతులై అలరారుతారు/పతివ్రత విన్నట్లయితే పుత్రవతి అవుతుంది.

## సతీ శివ విహారం



సూతుడు చెప్పినది విని తమ సంతోషాన్ని వ్యక్తం చేశారు. శౌనకాదులు శివ వివాహం వినిపించావు. ఆ సతీపతుల విహార విలాసాలు కూడా వినిపించి మమ్మల్ని ధన్యుల్ని చేయవయ్యా! సూతా" అని అడిగారు. వాళ్ళు. తన కుడి అర చేతికేసి చూసుకుంటూ వుండిపోయాడు సూతుడు అనంతరం అదొక విలాసంగా నవ్వి యిలా ఎత్తుకున్నాడు విషయాన్ని.

"శివమాయ మిమ్మల్ని కప్పకుండా వుండుగాక, శివ వివాహవేళ సతీచరణ దర్శనమాత్రం చేత, బ్రహ్మ అంతటివాడు పతనమైపోయాడు. అందువల్ల- మీరంతా ఒక్కసారి శివనామస్మరణ చేసుకోండి ఆపరుముడి కటాక్షంవల్ల చాలా టూకీగా నేను చెప్పబోయే మాటలు మీకు ఎటువంటి దుర్వికారాన్నీ కలిగించకుండా వుండుగాక!.... అంటూ సతీశివుల సరసవిహారాన్ని ఆసాంతం వర్ణించారు సూతర్షి.

బ్రహ్మానంద భరితులయ్యారు మహర్షులు. అప్పటిదాకా శృంగారవర్ణనం చేయడం వల్ల కాబోలు, లోకం తెలిసిన సూతుడు ఆ వెనువెంటనే దాక్షాయణికి వైరాగ్యం కలిగిందనీ, శివుణ్ణి భక్తి విషయమై ప్రశ్నించిందనీ చెప్పాడు శివప్రోక్తమైన భక్తి పాఠాన్ని యిలా విన్పించసాగాడు.

# భక్తి - తొమ్మిది పద్ధతులు

శివుడు చెబుతున్నాడు- "ఓ సతీదేవి! భక్తికీ జ్ఞానానికీ అట్టే భేదం లేదు. కాని భక్తే ఒక చూపువాసి గొప్పదిగా చెప్పకోవలసి వస్తుంది. జ్ఞానంవల్ల -ఐహికం అర్థరహితమౌతుంది. భక్తులకు మాత్రం పరంతోబాటే ఐహికసుఖం కూడా అనుషంగికంగా అనుభవనీయమౌతుంది. నామట్టుకు నేను జ్ఞానులకన్నా కూడా భక్తులనే ముందుగా అనుగ్రహిస్తాను జాతికుల వివక్షత లేకుండా వారి వారి గృహాలయందు నివసిస్తాను వారివారి అభీష్టాలను తీరుస్తాను. ఈ భక్తి తొమ్మిది రకాలు.

1. **శ్రవణం** :- ఇతరుల ద్వారా నాగురించి వినడం. 2. **కీర్తనం** :- తనకు తానై నన్ను స్తుతించడం. 3. **స్మరణం**:- ఎప్పుడూ నన్నే తలపులో వుంచుకోవడం, నామజపం చేయడం. 4. **సేవనం** :- రోజుకు ఐదు పర్యాయాలు వాక్కులతో స్తుతిస్తూ, చేతులారా నన్ను పూజించడం. 5. **దాస్యం**:- నేను వినా అన్యంలేదని భావించి నా సేవ తప్ప వేరు యెరుగక-సర్వదా నాకు ప్రీతికరాలైన పనులు చేయడం. 6. **అర్చన**:- తగిన సమయాలలో అర్ఘ్యపాద్యాది షోడశోపచారాలతో నన్ను పూజించడం. 7. **వందనం**:- నామంత్రోచ్చారణతో - నాధ్యానంతో మనోవాక్కాయశుద్ధిగా-వక్షం, శిరసు, నేత్రాలు, మనస్సు, వాక్కు, పాదములు, హస్తములు, కర్ణములు భూమికి తాకే విధంగా నాకు ఆచరించే నమస్కారమే వందనం. 8. **సఖ్యం**:- ఏది జరిగినా అది తన మేలుకోసమే నాచే జరిపించబడినట్లు భావించడం సఖ్యం. 9. **ఆత్మార్పణం**:- నేను వినామరేదీ హృదయంలో వుంచుకొనక, ఈ శరీరంగాని, మరొకటి గాని తమవనే భావన ఉంచుకోకుండా- దేహపోషణకై దేవుళ్ళాడి పోకుండా భారం నామీద పెట్టి- నాచే యీయబడిన బ్రతుకు కొనసాగించడమే ఆత్మార్పణం.

ఈ తొమ్మిది రకాల భక్తిలో - దేనిననుసరించినా నాకు ఆనందమే. బిల్వ సమీకరణాది ఉపాంగాలు కూడా కొన్ని వున్నాయనుకో ఏదిఏమైనా భక్తి ప్రధానం భక్తి రహితమైన జ్ఞానం ఎందుకూ కొరగాకుండా పోతుంది. సాంగోపాంగమైన

భక్తి- ఎటువంటి వారికైనా మోక్షార్హతని అనుగ్రహిస్తుంది. మూడు లోకాలూ, నాలుగు కాలాలా కూడా భక్తియే ఉత్తమమార్గం, మరీ ముఖ్యంగా కలియుగంలో భక్తికీ వున్న ప్రాధాన్యత మరి దేనికి వుండదు. ఆ యుగంలో జ్ఞానవైరాగ్యాలు ముసలితనం పొందుతాయి. అందువల్ల అవి యెక్కువగా వుపయోగపడకపోవచ్చు.

భక్తులు విన్నా నాకేమీ లేదు. భక్తులే నా సంపద, నాస్థితి నాగతి భక్తుడి కోసం యమధర్మరాజునే కాల్చివేశాను నేను. ఇంతెందుకు దాక్షాయణీ! సతీవతి నన్నది భక్తులు పిలిచే పిలుపేగాని నిజానికి నేను భక్తులకు భక్తుణ్ణిస్మా అని శివుడు చెప్పినది విని- సతీదేవి శివునియందు భక్తిని వృద్ధిపరచుకో సాగింది.

అనంతరం మంత్రం, తంత్రం యంత్రం జ్యోతిష సాముద్రికాది శాస్త్రాలను ప్రశ్నించి శివునివల్ల అనుగ్రహింపబడినదైంది. లోకోపకారార్థం వారలా తర్కించు కుంటారేగాని- ఆ సతీ శివులు విడదీయరాని వారు. పుంస్త్రీ రూపభేదం ప్రదర్శిస్తున్న అఖండ సచ్చిదానంద శివతత్త్వమిది.

అని సూతుడు చెప్పగా విని ఆనందించిన ఋషులు శివుడికీ, దక్షుడికీ వైర మేర్పడిన విధం చెప్పమని కోరగా- సూతుడిలా చెప్పసాగాడు.

## శివుని పై దక్షుడి అలక

ఒకానొక పర్యాయం- కొందరు మునులు కలసి ఇదే ప్రయాగక్షేత్రంలో యజ్ఞం చేయసాగారు. ఆ యజ్ఞానికి సనకసనందాదిసిద్ధులు నారదాది దేవర్షులు, మరీచ్యాది ప్రజాపతులు ఒకరేమిటి? రాదగ్గ వాళ్ళంతా వచ్చారు. సాక్షాత్తూ శివుడు కూడా వచ్చాడు. అందరూ శివుని అర్చించారు. శివుని దర్శనంతో సంతోషి తాంతరంగు లయ్యారు. అంతా అలా ప్రశాంతంగా ఉండగా- మరికొంత సేపటికి దక్షప్రజాపతి కూడా వచ్చాడు. వస్తూనే బ్రహ్మకు నమస్కరించాడు. ఆయనను చూసి అందరూ లేచారు. నమస్కరించారు. దక్షుణ్ణి కీర్తించారు. ఒక్క శివుడు మాత్రం తనస్థానంలోంచి కదలకుండా అలాగే కూర్చుని వుండిపోయాడు. దక్షుడికది అవమానంగా తోచింది. అందరూ తనని గౌరవిస్తున్నప్పుడు అంబికేశుడు మాత్రం అలా నిస్పృహుడిగా వుండడం ఆయనకు గిట్టలేదు. ఆ గిట్టని తనం తనలోనే దాచుకోలేకపోయాడు బైటపెట్టేశాడు.

దేవ, దానవ, సిద్ధ, సాధ్య, ముని గణాలన్నీ నాకు మ్రొక్కులిడుతుండగా- యీ భూత, ప్రేత- సహవాసుడైన శివుడు మాత్రం నన్ను సత్కరించకుండా స్థాణువులాగా కూర్చుండి పోవడంలో అర్థంమేమిటి? నన్నవమానించడమేగా! అందుకే శపిస్తున్నాను. ఈ రుద్రుడు ధర్మబహిష్కృతుడై పోవాలి. యజ్ఞంలో పాల్గొనలేకపోవాలి. దేవతలలో సమానంగా హవిర్భాగం యితనికి చెందకుండా పోవాలి అని శపించాడు దక్షుడు. అది విని నందికేశ్వరుడు కలగచేసుకున్నాడు. ఎవరి స్మరణ మాత్రంచేత సమస్తమైన యజ్ఞాలూ సఫలాలైపోతున్నాయో, అట్టి శివుణ్ణి యజ్ఞబాహ్యుడిగా శపించడం కేవలం నీ అవివేకమయ్యా బ్రాహ్మణాధమా! అన్నాడు.

ఆ మాటలతో అగ్గిమీద గుగ్గిలం వేసినట్టు భగుమన్నాడు దక్షుడు నువ్వెంత వాడిని నాకు చెప్పడానికి! అసలు మీ రుద్రగణాలన్నీ వేదమార్గాన్ని పరిత్యజింతురు గాక మహర్షి సంప్రదాయాలకు దూరమై పోదురుగాక, శిష్టాచార బహిష్కృతులై జటాభస్మధారులై చరింతురుగాక అని శపించాడు. నందికేశ్వరుడు మాత్రం యేమైనా తక్కువ తిన్నాడా? ఓరి శఠుడా! మీ బ్రాహ్మణులంతా కేవలవేదోక్త కర్మవాదులై పోవుదురుగాక. వేదార్థమైన శివతత్వం మీకు పట్టుబడకుండా వుండు గాక. అభిజాత్యహీనులూ యాచకులూ అయ్యెదరు గాక, నిత్యం దానపరిగ్రహులయి దరిద్రులై పావుదురుగాక,/ దుష్టదాన స్వీకరణాఘ సంతృప్తులై కొందరు నరక వాసులయ్యెదరు గాక మరికొందరు బ్రహ్మరాక్షసులయ్యెదురుగాక.

శివుణ్ణి సర్వేశ్వరుడిగా కాక కేవలం త్రిమూర్తులలోని ఒకడుగా మాత్రమే భావించే వాళ్ళంతా తత్వజ్ఞాన హీనులగుదురుగాక! ఇక నువ్వు ఆత్మోద్ధరణ మార్గాన్ని వదలి పశుప్రాయుడివై కేవలం కర్మనిష్ఠాపరుడివై-అతి త్వరలోనే అజ ముఖుడివై అలరారెదవు గాక అని ప్రతి శాపం పెట్టేశాడు. ఈ శాపాల యుద్ధంలో అందరూ హాహాకారాలు చేశారు. బ్రహ్మదేవుడు దక్షుణ్ణి మందలించాడు. శివుడు నందికేశ్వరుణ్ణి మందలించాడు. యజ్ఞం అయిందనిపించి యెవరి దారిన వారి వారి స్వస్థానాలకు వెళ్లారు రుద్రుడు రుద్రుడు అని ఒత్తి ఒత్తి పలకడమే గాని, నిజానికి సత్వగుణ సముద్రుడు గదా శివుడు అందువల్ల ఆయన రుద్ర గణాలూ కూడా జరిగింది మర్చిపోయారు దక్షుడలా మర్చి పోలేకపోయాడు. మనసులో కక్ష పెంచుకున్నాడు శివమాయా పరిప్లుతుడై తామసంలో తలమునకలై పోయాడు. శివుడంతటి వాణ్ణి శిక్షించాలనుకున్నాడు.

# యాగ ప్రతీకారం



ఆ నిమిత్తంగానే ఒక యజ్ఞం తలపెట్టాడు. ఒక్క శివుణ్ణి తప్ప అందర్నీ ఆహ్వానించాడు. సామాన్యదేవతలు లగాయతు, అగ్రదైవాలూ, మహామునులు కూడా తరలి వెళ్లారా యజ్ఞానికి, హరిద్వార సమీపంలో క్షేత్రాన్ని యెంచుకున్నాడు. వచ్చిన వాళ్ళందరికి విడుదులు యేర్పాటు చేశాడు. భృగ్వాదులు మొత్తం యైనభై ఎనిమిది వేలమందీ ఋత్విక్కులుగా ప్రవర్తిస్తున్నారు ఉద్గాతలు అధ్వర్యులు, హోతలూగా అరవై నాలుగు వేలమంది నియమింపబడ్డారు. ఋషిసప్తకం "గాధ" (వేదాంతర్గత చరిత్రము)లను గానం చేయసాగింది. యజ్ఞాధిష్ఠాతకేశవుడు. దిక్పాల కులే యజ్ఞరక్షకులు. యజ్ఞం ప్రత్యక్షమూర్తిగా తోస్తోంది. అహుతులు స్వీకరించే నిమిత్తంగా అగ్ని తన వేనాల్కలతోనూ ఓ ప్రజ్వరిల్లిపోతున్నాడు.

సర్వశుభ సంజ్ఞాలాంఛితమైన మహాపుషుడి దివ్యదేహంలా ఉంది. ఆ ప్రాంత మంతా! ఎటోచ్చి పుట్టిలు దాలుస్తాడు గనుక శివుణ్ణి ఆయనతో కాపరం చేస్తుంది గనుక అంబనీ మాత్రం ఆహ్వానించలేదు. దక్షుడు అంతమందీ వచ్చినా- ఆ అంతకాంతకుడు రాకపోవడాన్ని కనిపెట్టాడు దధీచి వెంటనే దక్షుణ్ణి ప్రశ్నించాడు. ఏమోయ్ దక్షా! ఇంతకూ ఆ ఏణపాణిలేకుండా యాగం జరిగితోందేమిటి? సమస్త అమంగళ ప్రశమనుడు, సర్వమంగళప్రదాతా అయిన శంకరుడు లేనిదే యజ్ఞం బాగుండదు. ఆయనెందువల్ల రాలేదో మరి. ఆ బ్రహ్మతోనో, విష్ణువుతోనో-లేదా అర్హులైన ఋషిగణాలతోనే ఓ పిలుపు పిలిపించు సాంబశివుణ్ణి రప్పించు, ఏమిటి ఆలస్యం? అలా అంటున్న దధీచి మాటలు ఏకోశానాన నచ్చలేదు దక్షుడికి. ఇప్పుడు వచ్చిన వాళ్ళకన్నా ఆయనేమంత ఘనుడని ప్రత్యేకంగా కబురుపెట్టాలి. అహూతులెవరూ ఆయనకు తీసిపోరు, అయినా, వల్లకాట్లో మసలేవాడూ, చితాభస్మధరుడూ, అస్థిమాలాభూషణుడూ, పాములవాడు అయిన అతగాడు రాకపోతే కొంపేమీ మునిగిపోదు.

అప్పట్లో ఏదో బ్రహ్మమాటకొట్టేయ లేక కూతుర్నిచ్చి పెళ్లి చేశానేగాని- అదంతా ఆయన గారి గొప్పతనం మాత్రం కాదు. కావాలనే పిలువలేదు నేను.

ఆ గొడవ ఆపి, వచ్చినవాళ్లు మీరందరూ కలిసి యజ్ఞం శుభంగా ముగించండి" అన్నాడు నవ్వేడు దధీచి- 'ఇక నువ్వు యెగ్గొంచేసినట్టేలే!' అనేసి అక్కడి నుంచి చరచరా వెళ్ళిపోయాడు. "శివుణ్ణి నిరాకరించినచోట నిమిషం కూడా నిలువబోనని చెప్పి మరీ చక్కాపోయాడు. అయినా చలించలేదు దక్షుడు. 'శివుడేకాదు శివ ప్రియులైన ఈ దధీచిలాంటి వాళ్ళు కూడా లేకపోతేనే యజ్ఞానికి మంచిదిపోతే, పోనివ్వండి. శుద్ధ విష్ణుపరాయణులూ, వేదమార్గ ప్రవర్తకులూ అయిన వాళ్ళే నాకు చాలు. మీరంతా కలిసి నా యజ్ఞం సఫలం చేయండి అన్నాడు- దధీచితో పాటు వెళ్ళినవారు వెళ్ళగా- మిగిలిన వారంతా యజ్ఞాభిముఖులయ్యారు.

## దక్ష యజ్ఞానికి సతి ప్రయాణమగుట



అక్కడలా యజ్ఞం జరగుతుండుగా - యిక్కడ కైలాసంలో విలాసభవనాగ్రాన తన చెలులతో ఆటలాడుచున్న అంబిక-రోహిణీ యుతుడై వెడుతున్న చంద్రుణ్ణి చూసి- 'విజయ' అనే చెలియను పిలిచి, తన సోదరి ప్రయాణ విశేషాలు తెలుసుకు రమ్మని పంపింది. ఆమె వెళ్లింది వచ్చింది- దక్షయజ్ఞం వార్త తెచ్చింది. తనని పిలవకుండా తన తండ్రి యజ్ఞం చేయడం యేమిటా అని ఆశ్చర్యపోయింది సతి. సరాసరి సర్వేశుని సమీపించి దక్షయజ్ఞం సంగతిచెప్పింది. అయిన వాళ్ళింట్లో అభంజరిగినా శుభం జరిగినా వెళ్ళిరావడం ధర్మం గనక- మనం కూడా వెడదాం పదమంది 'దేవీ! నువ్వు చెప్పింది నిజమే. కాని, నీ తండ్రియైన దక్షుడు ప్రస్తుతం నన్ను ద్వేషిస్తున్నాడు.

అందుచేతనే యజ్ఞానికి ఆహ్వానించలేదు. పిలవని - పేరంటానికి వెళ్ళడం, ప్రాణగొడ్డమే అవుతుంది. కాబట్టి మనం వెళ్ళకపోవడమే మంచిది అని చెప్పాడు శివుడు. సంగతి తెలిసి చాలా బాధపడింది సకల, ఇదంతా నా తండ్రి అజ్ఞానమే ననుకుంటున్నాను. అజ్ఞానమే. అయితే సన్మార్గంలో పెడతాను. అయిన మీరు లేని యజ్ఞానికి ఆ వెళ్ళినవాళ్లెలా వెళ్ళారో, మానాన్నగారి మనసేమిటో అందరిలోనే

అమీతుమీ తేల్చుకురావాలని వుంది. మీరెటూ రారు. నన్నైనా వెళ్ళనివ్వండి. అని మనవి చేసుకుంది. దరహసించాడు దక్షజామాత. దేవేరి వారికి అదే ఆనందమైతే నందివాహనంపై సమస్త రాజోపచారాలతోనూ బయలుదేరవచ్చు' అని మాత్రం చెప్పి- ధ్యానముద్ర నవలంబించాడు తక్షణమే బయలుదేరింది ఉమ.

## దక్షయజ్ఞ వాటిలో సతీదేవి అగ్నిప్రవేశం



యజ్ఞ శాలాద్వారం వద్ద నందినిదిగి లోనికి వెళ్లింది. తల్లియైన అసిక్నీ, తోడబుట్టిన వారూ తగిన ప్రేమతో చూశారు దక్షుడు మాత్రం ఆమెను చూసి కూడా పలకరించలేదు. అసలు చూడనట్లు గానే వుండిపోయాడు. అయినా పట్టించుకోలేదు అమ్మవారు. సవనవేదికనంతనూ సాంగంగా పరి శీలించింది. శివుడు తప్ప తక్కిన వారందరికీ హవిర్భాగాలు యేర్పడివుండటాన్ని గుర్తిం చింది. తక్షణమే నిలదీసింది తండ్రిని. 'స్మరణమాత్రం చేతనే చరాచర ప్రపంచాన్నీ పునీతంచేసే శంభుణ్ణి ఎందుకు పిలువలేదు? ఆయన లేని యజ్ఞం అత్యుత్తమమైన అపవిత్ర కార్యమని తెలియదా? రుద్రుణ్ణి సామాన్యదేవతగా భావించావా? అజ్ఞానంతోగానీ, అహంకారం చేతగాని - ఇలాటి యజ్ఞం చేయడంవల్ల నువ్వు 'అధముడి' వైపోతు న్నావు అని చెప్పింది.

అనంతరం బ్రహ్మ విష్ణ్వాదులనూ, ఋషులనూ పరికిస్తూ- 'ఏ శివారాధన కారణంగా మీరందరూ పదవుల్నీ, ప్రాణాల్నీ పొందారో- వాటిని నిలబెట్టుకుంటు న్నారో - ఆ శివుడు మీ యజమాని- లేకుండా సాగే యీ యజ్ఞానికి రావడానికి మీకెలా మనసొప్పింది? అంటూ దులపాల్సిన నాలుగూ దులిపేసింది. అటు ఋషులుగాని ఇటు దేవతలుగాని, బ్రహ్మవిష్ణువులుగాని- కిమపినాస్తిగా వుండి పోయారు. సహించలేకపోయాడు దక్షుడు కూతుర్ని కొరకొరచూశాడు. 'అధికంగా మాట్లాడకు కడుపుతీపి కొద్దీ యింతవరకూ నీ మాటలన్నీ భరించాను. ఎటూ

వచ్చావు గనుక వుంటే వుండు. హవిర్భాగం తీసుకో, అంతేగాని- ఆ అమంగళుడి గురించి మాత్రం మాట్లాడకు - కులగోత్రాల్లేనివాడూ, శ్రుతులకు కట్టుబడనివాడూ, గుణశూన్యుడూ, భూతప్రేత పిశాచాదిక గణాచారీ అయిన నీ పెనిమిటి గురించి ప్రసంగించి పవిత్రమైన యీ సవనాన్ని అపవిత్రం చేయకు అన్నాడు.

ఆ మాటల్ని అసలు భరించలేకపోయింది అంబ. అందునా శివనింద! పిలవని పేరంటానికి వెళ్ళకూడదని ఆయన చెప్పినా వినకుండా వచ్చినందుకు బాధపడింది. తిరిగివెళ్ళి భర్తకు ముఖం చూపలేను. ఒకవేళ సిగ్గుమాలి వెళ్ళినా- జరిగిన విషయాలను ఆయన తరచి తరచి అడుగుతుంటే తలెత్తుకు సమాధానం చెప్పలేను గదా! అనీ లోలోన కుమిలిపోయింది. అన్నిటికన్నా మిన్నగా శివనిందాశ్రవణ దోషానికి పొగిలి పొగిలి యేడ్చింది. చివరికిలా అంది- 'దక్షా! నీలాటి పాపాత్ముడి కూతురిగా - దాక్షాయణిగా బ్రతకలేను, శివనిందాపరుడివైన నీకూ, నిన్ను సమర్థిస్తూ నీచేత జనం చేయించబూనిన ఈ జనాలకూ- తగిన శాస్తి త్వరలోనే జరుగుతుందిలే అంది. సుఖాసీనయై శుద్ధజలాలను అచమనం చేసింది.

శుభ్రవస్త్రాన్ని పైన కప్పుకుంది. కళ్ళు మూసుకుని శివధ్యానం చేస్తూ- యోగమార్గాన ప్రాణాపాన వాయువులను సమానం చేసింది. నాభిచక్రంనుంచి ఉదానాన్ని లేపింది హృదయం చేర్చి- అక్కడ నుంచి కంఠం- అక్కడ నుంచి భృకుటికి నెట్టింది. భగ్గుమంది యోగాగ్ని- రెప్పపాటుకాలంలో ఆ నిత్యసౌభాగ్యవతి బూడిదగా మిగిలింది. హాహాకారాలు మిన్ను ముట్టాయి. ప్రమథాదిగణాలవారు కొందరా సంతాపం భరించలేక- ప్రాణత్యాగం చేశారు. మరికొందరు తమ తమ అవయవాలను ఖండించుకున్నారు. అధికభాగం మహావేశంతో దక్షుడి పరివారంపై తలపడ్డారు. వెంటనే భృగుమహర్షి దక్షిణాగ్నులలో హవనం చేసి ఋభువులను పుట్టించాడు. వారికీ ప్రమథులకీ మధ్య ఘోరమైన పోరాటం జరిగింది. ప్రమథులు వెనుదిరిగి కైలాసమార్గం పట్టారు. ఇంద్రాదులూ, ఋషులూ విష్ణువుని శరణు జొచ్చారు. యజ్ఞం నిర్విఘ్నంగా పూర్తి చేయించమన్నారు. విష్ణువేమీ మాట్లాడలేకపోయాడు. బ్రహ్మబంధువు గదా అని దక్షుడి యజ్ఞానికి వచ్చాం. శివద్రోహియై యింత చికాకు తెచ్చుకున్నాడు. మనల్ని చిక్కుల్లో పెట్టాడీ దక్షుడు. ఇక ఈ దక్షుడు యెగ్గెం చేసినట్లేలే- అన్న భావన విష్ణువు మనసులో తళుక్కుమంది.

## ఆకాశవాణి హెచ్చరిక

అదే సమయాన ఆకాశవాణి ఆ సభను హెచ్చరించింది. దక్షా! నీ ముఖం దహించబడిపోతుంది. నీకు సాయం నిలబడ్డ వారంతా నష్టమైపోతారు! నీ యజ్ఞం ధ్వంసమైపోతుంది. ఓ విష్ణువమూర్తి! నువ్వెందుకిక్కడ? ఈ యజ్ఞభూమిని వదలి వెళ్ళిపో, లేకపోతే నీకైనాసరే కీడు తప్పదు' అంటూ అక్కడి వారి పేరు పేరునా హెచ్చరించింది.

## శివుడు దక్షునిపైకి వీరభద్రుని పంపుట

ఋభువులచేత తరిమికొట్టబడిన శివగణాలు కైలాసం చేరాయి. జరిగిన దంతా జగదీశ్వరునికి మొర్రపెట్టుకున్నాయి. తక్షణమే నారదుణ్ణి తలచుకున్నాడు శివుడు. అప్పటికప్పుడే ప్రత్యక్షమయ్యాడు నారదుడు. జరిగింది జరిగినట్లు పొల్లు పోకుండా చెప్పాడు నారదుడు. మండిపడ్డాడు మహేశ్వరుడు - తన జడనొక దానిని పెరికి పెరికి కైలాసపర్వతంపై చరిచాడు. ఆ జడ రెండు ముక్కలై ఒకదాని నుండి మహా గణేశ్వరుడు- మరొక దాని నుండి మహాకాళీ ఆవిర్భవించారు. మహాకాయుడూ ప్రళయాగ్ని సమప్రకాశుడూ, సహస్రబాహుడు, విపక్షజనభీతా వహుడూగా వున్న ఆ మహాగణేశ్వరుడే వీరభద్రస్వామి అంతలోనే శివుడి నిట్టూర్పుల నుండి సన్నిపాతాది జ్వరాలు ఆవిర్భవించి మూర్తీభవించాయి. వీర భద్రుడు- రుద్రుడికి మ్రొక్కి, 'ఆజ్ఞాపించుదేవరా! అన్నాడు. దక్షయజ్ఞాన్ని ధ్వంసం చేయండి" అన్నాడు శివుడు.

## వీరభద్రకృత దక్షయజ్ఞ విధ్వంసము

'హర హర హర హర హరోం హరా' - అంటూ బయల్దేరారు భద్రకాళీ వీరభద్రులు. వారిని వెన్నంటి కదిలాయి భద్ర, రుద్రగణాలు, కనీవినీ యెరుగని ఆయుధాలతో, హుంకారాలతో దక్షుడి యజ్ఞవాటిక మీద విరుచుకుపడ్డారా భద్రకాళీ వీరభద్రులు, గడగడలాడిపోయాడు దక్షుడు "విష్ణూ! విష్ణూ! అంటూ హరి చరణాబ్జాలా శ్రయించాడు. ఎరుగని వాడు కాదుకదా చక్రపాణి. అందుకే మృదువుగా చెప్పాడు. దక్షా! దుఃఖించి యేం ప్రయోజనం. శివుడికి అపరాధం చేసేవారికి కీడు కాకపోతే మేలు జరుగుతుందని యెలా అనుకున్నావు?

శ్లో॥ అపూజ్యా యత్ర పూజ్యంతే పూజనీయో న పూజ్యతే।
త్రీణి తత్ర భవిష్యంతి దారిద్ర్యం మరణం భయమ్॥

అపాత్రుల్ని ఆదరించినా, అర్హుల్ని ఆదరించలేకపోయినా- అక్కడ దరిద్రమూ, భయమూ, మృత్యువూ మాత్రమే సంచరిస్తాయి. దక్షా! ధర్మవ్యతిరేకమైన యజ్ఞాన్ని తలపెట్టి శివద్రోహం చేశావు నువ్వు. శిక్షార్హుడివయ్యావు. నీ వంటివాడి యాగానికి వచ్చి నేను కూడా శిక్షాపాత్రుణ్ణయ్యాను. శివుణ్ణి ఎదిరించి నిలబడగల వాడంటూ యెవడూలేడు. ఇక గెలవడమనే ప్రసక్తేలేదు. నాదగ్గర సుదర్శనచక్రం అవీ వున్నాయి గదా అని నువ్వు అనొచ్చు. ఇది కేవలం శివప్రసాదం మాత్రమే. శివుడికి నేను సహస్ర కమలార్చన చేస్తుండగా ఒక పువ్వు తక్కువైంది. అందరూ నన్ను పద్మాక్షుడంటారుగదా! అదే వుద్దేశ్యంతో ఆ పువ్వు బదులు నా కన్నును పెరికి ఆయన్ను పూజించాను. ఆ నా భక్తికి సంతుష్టుడైన శివుడు పునః నేత్రదానంతోబాటే ఆయన పాదాంగుష్ఠం నుంచి ప్రభవింపచేసిన యీ సుదర్శనాన్ని నాకు అనుగ్రహించాడు.

శివదత్తమైనది కాబట్టి యీ చక్రం కూడా శైవమే. అందువల్ల యిది శైవులపట్ల వైరం వహించదు. దధీచి మహాముని నిన్ను ఛీత్కరించుకుని వెళ్ళిపోయినప్పుడే నేను కూడా వెళ్ళిపోయి వుండవలసింది కాని, ఏదియెలా జరిగినా యజ్ఞాన్ని యజ్ఞ ధర్మాన్నీ యాజ్ఞికుల్నీ సంరక్షించి తీరుతానని నాకు ప్రతిజ్ఞవుంది గదా! అందుకే నేను ఆగవలసివచ్చింది. మహారోషంతో వస్తున్నాడా వీరభద్రుడు. దండలేసినా, దండాలు పెట్టినా, దయదలచే పరిస్థితి కాదిది. ఒక్క ముక్కలో చెప్పాలంటే మనకి మూడింది. కాబట్టి-జరిగిందానికి దుఃఖించడం మాని ఏం జరిగితే అదే శివానుగ్రహంగా తలచి తృప్తిపడడం ఒకటే మిగిలింది. వెళ్ళు- అని చెప్పి దైన్యం కప్పుతున్న హృదయానికి స్థైర్యం గరపుతూ శివధ్యానంలో మునిగాడు మహేంద్రుడలా వూరుకోలేకపోయాడు.

దేవతలకి రాజుకదా ఇంద్రుడు! అందుకని ఐరావతం యెక్కాడు తన సైన్యాన్ని పురిగొల్పాడు. వీరభద్రుణ్ణి యెదిరించాలనుకున్నాడు. తమ నాయకుడే తగవుకు తయారవగా లేనిది, తామేం తక్కువ తిన్నామా? అనుకున్నారు కాబోలు- గబా గబా యుద్ధసన్నద్ధులై వాహనాలధిరోహించారు తదితర దేవతలు. అగ్ని మేకపోతు పైన యముడు దున్నపోతు మీద, నిరుతినరం (భూతవిశేషం) మీద,

వరుణుడు మొసలిమీద, వాయువు మృగంమీద, కుబేరుడు పుష్పకవిమానం మీద అధిరోహించారు. యక్షచారణ గంధర్వగుహ్యకాదులంతా వారి వారి వాహనాలు ఎక్కేసారు. వాళ్ళు ఇళ్ళకి వెళ్లిపోవడానికి వాహనాలెక్కారో, యుద్ధం కోసం అలా చేశారో తెలియని దక్షుడు ఒక్క క్షణం దిక్కులు చూశాడు. గబగబా వాళ్ళదగ్గర కెళ్లాడు "మీమీ బలాన్ని, శక్తుల్నీ నమ్ముకునే యింత యజ్ఞం తలపెట్టారు. మీరే రక్షించాలి. మీరు తప్ప దిక్కులేదు" అని ప్రార్థించాడు.

దిక్పాలకులతనికి అభయలమిచ్చారు. "ఒక్క దిక్కేంకర్మ! ఏడు దిక్కుల వాళ్ళమూ వున్నాము నువ్వేం దిగులు పెట్టుకోకు" అని ధీమాయిచ్చారు. వీరభద్రుడి మీదకి యుద్ధానికి తరలారు. ఏం ప్రయోజనం లేకపోయింది. ఒక్క భృగుమహర్షి మాత్రం దక్షిణాగ్నిలోంచి ఏవేవో సృష్టిస్తూనే వున్నాడు. ఆ ధాటికి ఆగడం రుద్ర గణాలకి యిబ్బందిగానే వుంది. గమనించాడు వీరభద్రుడు. తన భద్రగణాలతో సహా ఆ దిక్కుకు తానే స్వయంగా వెళ్లాడు. అంతే సిద్ధ, సాధ్యచారణ, గుహ్యకాదు లందర్నీ రుద్రగణాలూ వాయించెయ్యసాగాయి. వీరభద్రుడూ- ఆయన గణాలూ కలసి దేవగణాలతో తలపడ్డారు. సాధారణ దేవతలంతా డీలాపడిపోయారు. అధిక భాగం అమరావతికి పారిపోయారు.

దిక్పాలురు మాత్రం యింకా యుద్ధభూమిలోనే వున్నారు. వాళ్ళకి అనుమానం వచ్చింది. వీరభద్రుణ్ణి ఓడించాలని రంగప్రవేశం చేసినవాళ్ళు- కాస్సేపు పోరుసల్పే సరికే- ఎలా గెలవాలి? అనే ఆలోచనలో పడ్డారు. మరికాస్సేపు గడిచేసరికి - 'గెలిస్తే బాగుండును' అనుకున్నారు ఇంకొంచేంసేపు గడవగానే - గెలుస్తామా' అని సందేహంలో పడ్డారు. అనుమానం వుంచుకోకూడదు గనుక - దేవగురువైన బృహస్పతి దగ్గరకు వెళ్ళి-ప్రశ్న అడిగారు.

తెగేసి చెప్పాడు బృహస్పతి - "మీతరం గాదు గెలవడం" అని, అవతల - వీరభద్రుడు విసురుతున్న అగ్ని బాణాలకి అసంఖ్యాకులు ఆహుతై పోతున్నారు. ఋషులు కూడా భయభ్రాంతులై పోయారు. ఎడంగా కూర్చుని ధ్యానమగ్నుడై వున్నాడు విష్ణువు. చేతులంటుకున్నాక ఆకులు పట్టుకుంటున్న వాడిలావున్నాడు. ఋషులంతా ఆయనను ప్రాధేయపడ్డారు. దక్షుణ్ణంటే కాదనగలిగినాడు గాని, ఋషులనెలా కాదనగలడు? అందునా స్థితికర్తగా చెలామణీ అవుతూను! తప్పదురా నాయనా అనుకున్నాడు తార్క్ష్యవాహనుడు. లేచివచ్చాడు. రణభూమిలోకి

అలావస్తున్న విష్ణువు కేసి ఒక్క చూపు చూశాడు వీరభద్రుడు పరమ పాపాత్ముణ్ణి యములాడుచూసినట్లుగా వుందాచూపు అలా చూస్తూనే మెల్లగా పెదవి విప్పాడు వీరభద్రుడు.

"దక్ష రక్షణార్థం వస్తున్నావా పుండరీక్షా! రా! నువ్వు కూడా యిలా శివ విరోధివవుతావనుకోలేదు. ఒకవేళ నీకు విషయం తెలియక వస్తున్నా వేమో! శ్రద్ధగా విను. యజ్ఞ వాటికలో దక్షుడు మనతల్లి సతీదేవిని క్షోభపెట్టాడు. ఆమె యోగాగ్ని దగ్ధ అయిపోయేలా చేశాడు. దధీచి వంటి ఉత్తముల మాటలు పెడచెవిని పెట్టాడు శివద్రోహంతో నిండిపోయిన యజ్ఞం చేస్తున్నాడు. శివదూషణ చేశాడు. ఇంత జరిగినా బుద్ధి తెచ్చుకుని శివస్మరణ చేయకుండా- తనని రక్షించే వారెవరా అని తారట్లాడుతున్నాడు. అయినా నువ్వా దక్షుడి పక్షాన్నే నిలబడతానంటే నాకేమీ అభ్యంతరంలేదు. యజ్ఞాహుతులయందు ప్రలోభులు గదా మీరు! రా-నా యీ త్రిశూలంతో నీ రొమ్ముగాడనేస్తాను. శివుడు నీకు శరణీయని పక్షంలో, నువ్వు యుద్ధమే చేస్తే - నిన్నెవడు కాపాడతాడో చూస్తాను - రావయ్యా రమాపతీ! రా" అన్నాడు.

అతి సుతారంగా ఆరంభమై అంత్యవేళా మేఘగర్జనలని సైతం తిర... రించేలా పరిణమించింది. వీరభద్రుడి కంఠస్వరం. మృదువుగా అందుకున్నాడు మాధవుడు - "వీరభద్రా! నేను శివద్రోహిని కానయ్యా? సృష్టి సమస్తంలో అందరి కన్నా గొప్ప శివభక్తుణ్ణి నేనే - కాని, బ్రహ్మబంధువన్న దృష్టితో దక్షుడి ప్రార్థన మన్నించి యజ్ఞానికి వచ్చాను. యజ్ఞరక్షణా ప్రతిజ్ఞాపరుడ నవడం వల్ల - దధీచితో బాటే వెళ్ళిపోకుండా ఆగిపోవాల్సివచ్చింది.

ఇప్పుడు ఋషుల ప్రార్థనవల్ల నీ ముందు నిలబడ్డానే గాని-నేను చేస్తున్నది గాని - నా చేత చేయబడేది గాని ఏమి లేదు. ప్రతిజ్ఞాభంగాన్ని ఆ పరమేశ్వరుడు హర్షించడు. అందుకే వచ్చాను, నా ప్రతిజ్ఞ నెరవేర్చేందుకు గాను అనుగ్రహించు -ఉపేక్షించకు, నువ్వన్నట్లేకానీ- యుద్ధాన్ని ప్రసాదించు - అదే శివసంకల్పం అన్నాడు. వీరభద్రుడు ఆ ఒక్క విష్ణువుపట్ల మాత్రం ప్రసన్నుడయ్యాడు. 'ఇద్దరమూ శివ కింకరులమే ఇప్పుడేందారి?" అని అడిగాడు. యుక్తిపరుడా విష్ణువు ఏముంది! నీ బాణాలతో నన్ను కప్పెయి అంతే చాలు. నా దారిన నేను వైకుంఠానికి పారిపోతాను' అన్నాడు.

# విష్ణు, వీరభద్రుల యుద్ధము



విష్ణు, వీరభద్రులు వారివారి శంఖాలు పూరించారు. సింహనాదాలు చేశారు. విష్ణువు యొక్క పాంచజన్యం స్వరం చెవినబడే సరికి - దేవతలకి ప్రాణాల్లేచి వచ్చినట్లయ్యింది. ఇళ్ళకు మళ్ళీ పోదామనుకుంటున్న వాళ్ళంతా మళ్ళా వెనుదిరిగి రణస్థలి చేరారు. చెప్పుకోతగ్గ యుద్ధం జరిగింది. గణాలు గణాలు దొమ్మీ చేసుకుంటున్నాయి. విష్ణు వీరభద్రులిద్దరూ ద్వంద్వ యుద్ధం చేస్తున్నారు. అదే విధంగా - ఇంద్రుడు నంది కేశుడితో తలపడ్డాడు. అశ్మడు అగ్నిని ఢీకొన్నాడు. కుబేరుడూ కూష్మాండ పతీ కుమ్ములాటకు దిగారు, యముడు- మహాలోకుడు ఓ వంక నిరుతీ చండుడూ మరో వంక. వరుణునితో ముండుడు, వాయువుతో భృంగి-ప్రశస్తమైన పోరాటం సాగిస్తున్నారు. భైరవుడు యోగినీ చక్రాన్ని అండగా తీసుకొని దేవతల్ని గాయపరచి నేల పడగొట్టి - వాళ్ళ రక్తపానంలో మునిగి పోయాడు. క్షేత్రపాలకులంతా పడిపోయిన దేవతల దేహాలను భోజనం చేసేయ సాగారు. ఇది యుద్ధ దృశ్యం.

ఇంతలో విష్ణువు ఒకా నొకక్షేత్రపాలకుడి మీదకి తన చక్రాన్ని ప్రయోగించాడు. కనిపెట్టాడు వీరభద్రుడు. ఆ చక్రాన్ని చటుక్కున పట్టుకుని- గుటుక్కున మ్రింగేశాడు. ఆ దెబ్బతో భూనభోంతరాలు గగ్గోలైపోయాయి. అతి ప్రయాసమీద విష్ణుగణాలు ఆవిర్భవించి వీరవిహారం చేయసాగాయి. భగ్గుమన్నాడు వీరభద్రుడు విష్ణు గణాల మొత్తాన్ని విఘుడియ తిరక్కుండా అణిచేశాడు. అదే ఆవేశంతో తన త్రిశూలంతో విష్ణువుని లాగి ఒక్కటుచ్చుకున్నాడు. గుండెపగిలినంత పనయ్యి మూర్ఛపోయాడు. మురారి అప్పుడా విష్ణువు నుండి ప్రళయాగ్ని సన్నిభమైన తేజస్సు వెలువడింది. కాని అది నిరర్ధకంగా సముద్రంలో పడిపోయింది మూర్ఛతేరుకున్న విష్ణువు - చక్రం ప్రయోగించబోయాడు.

కాని - శివమాయా ప్రభావం వల్ల చక్రమూ దానిని దాల్చిన చెయ్యికూడా స్తంభించిపోయాయి. అనంతరం వైదిక మంత్రోచ్చారణతో చెయ్యి కదిలింది.

అది పనికాదనుకుని - శార్‌ఙ్గమనే ధనుస్సును ధరించాడు విష్ణువు. వీరభద్రుడా వింటిని మూడు చెక్కలుగా చేసిపారేవాడు. అలా ఎప్పుడైతే వీరభద్రుడు బాణ ప్రయోగం చేశాడో - విష్ణువు పతనం తన పూర్వవాక్యం రీత్యానూ - అంతర్వాణి బోధనల వల్లనూ యుద్ధభూమి నుంచి వైదొలగి వైకుంఠానికి వెళ్ళిపోయాడు.

యజ్ఞం మృగ రూపంతో ఆకాశంలో పరుగు పెట్టసాగింది దాన్ని పట్టుకుని - తలనరికేశాడు వీరభద్రుడు. యజ్ఞాన్ని వదలలేని ధర్మదేవతను, కశ్యప ప్రజాపతిని, అరిష్టనేమిని, అంగీరసుణ్ణి, కృశాశ్వుణ్ణి, దత్తర్షినీ పట్టుకుని తలలు పగిలేయా అన్నట్టుగా తన్నాడు వీరభద్రుడు, అదితీ, సరస్వతుల ముక్కు కొసలు ఛేదించే శాడు అప్పటిదాకా దక్షిణాగ్నులలో నుండి ఋభువుల్నీ వాళ్ళని పుట్టిస్తున్న భృగువుని వెతికి పట్టుకొని - అతని కనుబొమ్మలు పెరికి పారేశాడు.

చండుడు - సూర్యుడి పళ్ళు రాలగొట్టాడు. నందికేశ్వరుడు కొట్టిన దెబ్బకి భృగువుకు గ్రుడ్లు పేలిపోయాయి. స్వాహా, స్వధా, దక్షిణ, మంత్రాలూ, తంత్రాలూ - అన్నీ పరామర్శింపబడ్డాయి. రుద్రగణాలు యజ్ఞాన్ని ఆర్పేయసాగాయి. ఎక్కడ దాక్కున్నాడో దక్షుడు అతణ్ణి గాలించి మరీ పట్టుకున్నాడు వీరభద్రుడు. కొనగోటనా దక్షుడి తలగొట్టి- యజ్ఞ గుండంలోకి విసిరేశాడు. శైవం వీరభద్రుడి మీద పుష్పవృష్టి కురిసింది. సుగంధమయమైన మందపవనాలు వీచసాగాయి. వచ్చినపని పూర్తి కావడంతో కైలాసానికి మరలాడు వీరభద్రుడు కృతార్థుడై వచ్చిన వీరభద్రుణ్ణి తాహతుకు తగ్గట్టుగా అభినందించి వీరగణాధ్యక్షుడిగా పట్టం గట్టాడు పశుపతి.

## క్షుప దధీచుల కథ

'అద్భుతమైన ఘట్టం చెప్పావు. ఎందువల్లనో గాని- ఆ విష్ణువల్లా దక్షయజ్ఞానికి వెళ్ళకుండా వుంటే బాగుండేదనిపిస్తోంది.' అన్నారు శౌనకాదులు. సూతుడు సన్నగా నవ్వుకున్నాడు. 'నిజమే! కాని ధధీచి ముని పెట్టిన శాపం అది' ఆ కథంతా విపులంగా చెప్ప"మని కోరారు. ఋషులు వినపిస్తున్నాడు పౌరణికుడు.

శివభక్తుడూ, శ్రోత్రియుడూయైన దధీచికి - విష్ణు భక్తుడూ, క్షత్రియుడూ అయిన క్షుపుడు అనే రాజుకీ స్నేహం వుండేది, కాని కర్మ వశాన వారి మధ్య వివాదం కలిగింది. వర్ణాలన్నిటా బ్రాహ్మణ వర్ణమే శ్రేష్ఠమని దధీచి క్షత్రియ వర్ణమే

ఉత్తమమని క్షుపుడూ వాదించుకున్నారు. దధీచి యెంత నిదర్శన యుతంగా చెప్పినా క్షుపుడు విన్నాడు గాదు. విసుగొచ్చింది దధీచికి, ఆ విసుగులో క్షుపుడి నెత్తిన ఒక్క మొట్టికాయ పెట్టాడు, క్షుపుడు ఆ దెబ్బకే అలిగి - తన దగ్గరున్న వజ్రంతో దధీచిని కొట్టాడు. దధీచి భూతపవం చెందుతూ చెందుతూ శుక్రాచార్యుణ్ణి స్మరించాడు. తక్షణమే శుక్రుడు వచ్చి సంజీవని విద్యతో దధీచిని బ్రతికించాడు - అతనికి మృత్యుంజయ మంత్రాన్ని ఉపదేశించాడు. లక్షజపం చేయుమని చెప్పాడు.

శివారాధన చెయ్యమని బోధించి వెళ్ళిపోయాడు. దధీచి మృత్యుంజయ మంత్రంతో శివుడికై తపస్సు చేశాడు ప్రత్యక్షమయ్యాడు పశుపతి. ఏం కావాలో కోరుకోమన్నాడు. 'నా వంట్లోని యెముకలన్నీ వజ్రమయాలు కావాలి. నాకు ఎవరి వల్ల చావు ఉండకూడదు నేను ఏనాడూ దీనుణ్ణి కాకూడదు ఈ మూడు వరాలూ అనుగ్రహించు అని ప్రార్థించాడు దధీచి, తథాస్తు అనేసి అంతర్హితుడైపోయాడు నాగభూషణుడు. తపోభూమినుంచి సరాసరి క్షుపుడి సభకు వచ్చాడు దధీచి. వస్తూనే క్షుపుడి గుండెలమీద తన్నాడు క్షుపుడు తన వజ్రంతో దధీచి రొమ్ము పగిలేలా కొట్టాడు. కాని - ఆ బ్రాహ్మణుడు రవ్వంత కూడ చెక్కుచెదరలేదు. ఆశ్చర్య పోయాడు క్షుపుడు.

అదంతా శివదత్త వరప్రభావంగా గ్రహించాడు. తాను కూడ అడవులకు పోయి విష్ణువు గురించి తపస్సు చేశాడు ప్రత్యక్షమయ్యాడు విష్ణువు. వరం కోరుకో మన్నాడు. "దధీచిని నేను గెలిచేలా అనుగ్రహించు" అన్నాడు క్షుపుడు. విష్ణువు ఆలోచించాడు 'బ్రాహ్మణుడంటేనే జయించరాని వాడు. అందునా శివభక్తుడైన విప్రుడంటే - జయింపబడనివాడు. అటువంటి వాళ్ళతో నేను తగవుకు దిగేవాణ్ణి కాదు. అయినా నువ్వు నా భక్తుడవైన కారణంగా తప్పనిసరిగా నీ పక్షాన వస్తాను కాని, ఒకటి గుర్తుంచుకో శివ భక్తుడైనా శివుడైనా ఒక్కటే దెబ్బలాడతాం. అంతవరకే గెలుపుమాత్రం వూహించకు అని బోధించాడు విష్ణువూ, క్షుపుడూ, దధీచి ఆశ్రమానికి వచ్చారు. క్షుపుణ్ణి ఓ వారగా నిలబెట్టి విష్ణువు దధీచితో సంవాదనకి దిగాడు.

ఒక్కసారైనా క్షుపుడి ముందు ఓటమికి అంగీకరించమన్నాడు దధీచి అంగీ కరించలేదు. విష్ణువు సుదర్శనం ప్రయోగించబోగా అది స్తంభించిపోయింది. కోట్లాది విష్ణుగణాలను సృష్టించాడు. అది చూచి - దధీచి ఒక దర్భముడిని

మృత్యుంజయ మంత్రంతో అభిమంత్రించాడు. అదిజ్వాలా త్రిశూలమై విపక్ష సర్వస్వాన్నీ భయభ్రాంతుల్ని చేసింది దధీచిని మాయలో ముంచాలనుకున్నాడు మాధవుడు. తన విశ్వరూపాన్ని చూపించాడు. దధీచి నవ్వాడు 'శివానుగ్రహం వుంటే - నువ్వేనేమిటి నేనూ చూపిస్తాను విశ్వరూపం - చూడు అన్నాడు నిజంగానే శివుడు అనుగ్రహించాడు. దధీచి - విష్ణువు యొక్క విశ్వరూపంతో సహా తనలోని సమస్తాన్ని ప్రదర్శించగలిగాడు. క్షుపుడు భయపడ్డాడు. బ్రహ్మదేవుడు దిగివచ్చి శాంతి సందేశం చెప్పాడు.

అప్పుడా దధీచి శాంతిస్తూనే - నా ఆశ్రమవాటిని బీభత్సం చేసిన విష్ణూ! నీ యీ గణాలూ, యజ్ఞ రక్షణాప్రతిజ్ఞాపరుడవైన నువ్వూ కూడా పవిత్రమైన యజ్ఞవాటిలో భీభత్సంగా చంపబడతారు అని శపించాడు. అనంతరం క్షుపుడు దధీచిని ప్రార్థించాడు. "విష్ణువు తప్పు ఏమీలేదు, ఆయన వద్దంటున్నా వినకుండా నేనే బలవంతంగా ఇంతపని చేయించాను. ఆయనను శపించకండి" అని వేడుకోవడంతో దధీచి ప్రసన్నుడై-"శివలీలా నిమిత్తంగా యజ్ఞ వాటిలో చంపబడినా కూడా - శివానుగ్రహంవల్ల పునర్జీవితులవుతారు లెమ్మని అనుగ్రహించాడు. ఆ శాపం - అనుగ్రహం యిలా దక్షయజ్ఞవాటిలో రూపించాయన్న మాటసరే - ఈ కథని యిలా వుంచుదాం దక్షయజ్ఞ విధ్వంసం, వీరభద్రుడికి గణాధ్యక్ష పదవి - తర్వాత కథవినండి.

## శివుడు శాంతించి దక్షుడిని బ్రతికించుట



చేయాల్సినదంతా చేసి వీరభద్రుడు కైలాసానికి వెళ్ళిపోయాక పారిపోయిన వాళ్ళూ దాక్కున్న వాళ్ళూ, ఒక్కొక్కరుగా బైటపడ్డారు. హతులైన బంధుమిత్రుల్నీ, పరిచయస్థుల్నీ చూసుకొని ఘొల్లుమన్నారు. బ్రహ్మ విష్ణులు మళ్ళా కలగజేసుకుని అందర్నీ వెంటబెట్టుకుని కైలాసం చేరారు. అదే పనిగా ప్రార్థించారా నిరాలంబుణ్ణి దయ దలచాడు శివుడు. పరివార సమేతంగా వారిని అనుసరించి రణస్థలి చేరుకున్నాడు.

నిత్యం స్మశానంలో సంచరిస్తాడు. ఆ నిటలాక్షుడు ఆ స్మశాన భీభత్సం తోనే మరింత విరాగీ, నిస్పృహుడూ అయిపోతాడు కాబోలు! కరుడు కట్టుకు పోయింది హృదయం.

అదిగో అలాటి వల్లకాటి వేల్పు శివుడు యజ్ఞవాటికలోని మృతులనీ, క్షతగాత్రులనీ దుఃఖితుల్ని పీడితుల్ని. ధ్వంసితమైన సమస్తాన్నీ చూసే సరికి అంతటి కటిక హృదయమూ కూడా కరిగిపోయింది. మెల్లగా వీరభద్రుణ్ణి చేరబిలిచాడు "విధ్వంసం చేయమంటే మరీ విరాగులకు కూడా హృదయ వికారం కలిగించేలా యింత భీభత్సంగా నటయ్యా' అంటూ ఆయన భుజం చరిచాడు. అది మెచ్చికోలో - మందలింపో శివుడికే తెలియాలి. మృతులై పడివున్న సాధారణులందరినీ అమృత దృష్టితో పరికించాడు శివుడు ఎవరెవరి మీద ఆయన చూపులు పడ్డాయో, వారంతా నిద్రలోంచి లేచిన వాళ్ళమళ్ళే లేచి కూర్చున్నారు.

ఆధ్వర్యులు స్వస్థులయ్యారు. పూషుడి హస్తాలే తమ హస్తాలుగా అశ్వనీ దేవతలు హవిస్సులను మోయసాగారు. దేవతలంతా తాము తాము కోల్పోయిన సర్వావయవాలనూ తిరిగి పొందారు. వీరభద్రుడు విలాసంగా పెరిగి పారేసిన భృగువు యొక్క కనుబొమ్మలస్థానే మేక వెంట్రుకలను అతికించారు. పూషుడు "యజమాని" యొక్క దంతాలచేతనే హవిర్భాగాన్ని అనుభవించే యేర్పాటు గావించబడినది. మిత్రునినేత్రాలతోనే భృగుడికి దృష్టికలిగేలా నిర్ణయించాడు శంకరుడు. కడగా దక్షుడి కళేబరాన్ని తెచ్చారు. ఆ మొండాన్ని చూసి, - 'తలను' తెమ్మన్నాడు తరుణేందు శేఖరుడు.

కాని -తలలేదుగదా! వీరభద్రుడు దానిని యజ్ఞగుండంలో పడవేయడం, అది దగ్ధమై పోవడం ఎప్పుడో జరిగిపోయాయి. ఆ ముక్కనే ముక్కంటికి మనవి చేశాడు వీరభద్రస్వామి. ఆలోచించాడు ఆదిదేవుడు యజ్ఞపశువుగా వున్న మేక యొక్క తలను కోసి దానిని దక్షుడి మొండేనికి అతికించాడు. ప్రాణప్రతిష్ఠ గావించాడు దక్షుడు తలవాల్చేడు, తనను అలా కరుణించిన కపర్దిని చూసి సిగ్గుపడి తలెత్తడానికి ముఖం చెల్లదు కాని, ఇప్పుడున్నది తన అసలు ముఖం కాదు గనుక - వినయ పూర్వకంగా తలెత్తడు. విశ్వంభరుడైన శివుణ్ణి శతధా కీర్తించాడు అందరూ ఆనందించారు, అందరినీ అనుగ్రహించి - ఆ దేవదేవుడు మాత్రం భార్యా వియోగాన్ని నటిస్తూ - తక్కిన పరివారంతో కైలాసం చేరాడు.

కొన్నాళ్ళపాటు చెంతకొచ్చిన వారికందరికీ సతీగాధలనే వినిపించేవాడు అంతా చెప్పి - ప్చ్ అంటూ నిట్టూర్చేవాడు. నిజానికి సతీదేవి మరణించలేదు, గదా! ఆమె నిత్యనిష్కల. అలనాడు దక్షుడి వాంఛమేరకు దాక్షాయణి అయిన ఆమె ఆ దాక్షాయిణీత్వం నుండి విరమించింది. అంతే ఆమె మాత్రం శివుడికి యెడంగా మసలగలదా! మసలేదు. అందువల్లనే హిమవత్పుత్రికయై, సదాశివుని వామాంగమై-సర్వ సుమంగళయై - గౌరిగా పార్వతిగా, గిరిజగా, శైలజగా సర్వలోక సంపూజితయైంది.

# మేనక - ధన్య - కళావతుల కథ



సూతుడు చెప్పినదంతా విని-'అయితే - ఆ మహా మాయ - హైమవతియైన దివ్యగాధను కూడా విని పించ'మని కోరారు ఋషులు 'శుభం అంటూ మొదలు పెట్టాడు సూతుడు. అంతటి అధికశక్తిని కూతురుగా పొందడమంటే మాటలుకాదు. హిమ వంతుడు కూడా దక్షుడంతటివాడు గనుకనే పొంద గలిగాడు. ఆ పూర్వా పరాలన్నీ ఒక క్రమంలో చెబు తాను శ్రద్ధగా వినండి. దక్షపుత్రికలలో ఒకతె అయిన "స్వధ" అనే ఆమెను పితరులకిచ్చి పెళ్ళిచేయడం జరిగింది. స్వధా పితరులకు ముగ్గురు కుమార్తెలు. మేనక, ధన్య, కళావతి-అనే పేరుగల ఆ ముగ్గురూ దినదిన ప్రవర్ధమానలై యోగినులు, జ్ఞానమూర్తులు, త్రిలోకసంచారలు శక్తిమంతులుగా పరిణతి చెందారు. ఒక రోజున వారు వైకుంఠంలో జరుగుతున్న ఉత్సవదర్శనార్ధమై వెళ్ళారు.

ఆ ఉత్సవాన్ని తిలకించడానికి సనకసనందన సనత్కుమారులు కూడా వచ్చారు. వారిని చూడగానే అక్కడ వారంతా దిగ్గునలేచి నమస్కరించి గౌరవించారు. కాని పితరుల పుత్రికలైన ముగ్గురూ మాత్రం - శివమాయవల్ల సంబరాలలో మునిగిపోయి - ఆ మునులకు ప్రత్యుత్థానం చేయకపోవడం వలన సనత్కుమారుడు వారిని శపించాడు. 'వళ్ళు మరచి కూర్చుని మాకు అభ్యుత్థానమీయని కారణంగా యీ పిల్లలు ముగ్గురూ మానవలోకంలో జన్మించాలి' అని తిట్టిపోశాడు.

ఆ శాపంతో తృళ్ళిపడింది కన్యాత్రయం, జరిగినదానికి చింతించి- ఋషు లకు పాదాలంటి ప్రణమిల్లారు. శాపవిమోచనం అనుగ్రహించుడని శతధా ప్రార్థించారు. అప్పుడు సనత్కుమారుడు - కుమారీ మణులారా! దిగులు పడకండి భావిలోక కళ్యాణార్థం శివేచ్ఛాపరంగానే ఇదంతా జరిగింది మీలో ఆఖరుదైన కళావతి ద్వాపరయుగంలో వృషభానుడనే యాదవ వైశ్యుడికి యిల్లాలై గోలోక సమ్రాజ్ఞియైన రాధా దేవిని కుమార్తెగా పొందుతుంది. ఆ రాధాదేవి కృష్ణ ప్రియ అవుతుంది. రెండవ యామెయైన ధన్య నిజంగానే ధన్యురాలు. ఇరవై యెనిమిదవ త్రేతాయుగంలో జనక రాజుకు భార్యయై మహాలక్ష్మీ అంశతో అవతరించబోయే సీతామహాసాధ్వికి తల్లి అవుతుంది. విష్ణ్వంశోద్భవుడైన శ్రీరాముని అత్తగారై శాప విముక్తిని పొందుతుంది. ఇక మొదటిదైన మేనక-హిమవంతుడి అర్ధాంగియై ఆదిశక్తిని కూతురుగా కంటుంది. ఆది దేవుడైన పరమశివుని అల్లుడిగా పొందు తుంది. అని అనుగ్రహించాడు. ఆ శాపం కారణంగా - మేనక భూలోక మందలి హిమవంతుడికి భార్యగా అవతరించింది.

## వజ్రాంగ చరిత్ర

అదలా వుంచండి. కశ్యప ప్రజాపతి పెద్దభార్య దితి ఆమె కుమారులైన హిరణ్యాక్ష, హిరణ్య కశ్యపులిద్దరూ ఒకరు వరాహంచేతా, మరొకరు నృసింహం చేతా నశించిపోవడంతో గర్భశోకతప్తయై భర్తనర్థించి - గర్భవతియై శివవ్రతాన్ని ఆచరించసాగింది. అది తెలిసిన యింద్రుడు మాయోపాయంతో ఆమె గర్భంచేరి - లోపలి పిండాన్ని ఏడు ఖండాలుగా నరికేసాడు. పిండగత ప్రాణి యేడుస్తుంటే - 'మారుద-మారుద' అ గద్దించాడు అలా 'మారుద మారుద' అనే గద్దింపుతో పరిణమించిన ఏడు పిండ శకలాలే సప్తమరుత్తులయ్యారు. వాళ్ళు యేడుగురూ స్వర్గం వెళ్ళిపోయి ఇంద్రుడితో స్నేహంగా వుండిపోయారు. తన తొలి సంతతి పోయిన కక్షతీరలేదు దితికి, అందువల్ల భర్త్రాజ్ఞ ప్రకారం పదివేల వర్షాలు తపస్సు చేసి - తదనంతరం భర్తృసమాగమమై మళ్ళా నెల తప్పింది. ఈసారి ఆమెకు వజ్రాంగుడనే రాక్షసుడు పుట్టాడు. అనుపమ బలశాలియైన ఆదైతేయుడు తల్లి ఆజ్ఞ పై త్రిదశులమీద దండెత్తాడు. యింద్రుణ్ణీ వాళ్ళనీ కట్టి తెచ్చి - కారాగారంలో పడవేసేశాడు. దితికి ఆనందమైంది. పరుగు పరుగున వచ్చారు బ్రహ్మాదులు. వారి మాటమీద వజ్రాంగుడు ఇంద్రుణ్ణి వదిలేశాడు.

నా తల్లియొక్క కోరికను తీర్చడం కోసం యీ యింద్రాదుల్ని బంధించానే గాని - నిజానికి నాకెటువంటి భోగాల మీదా కోరికలేదు. సాక్షాత్తు బ్రహ్మవు నువ్వు, దయచేసి నాకు తత్త్వబోధ చెయ్యి అన్నాడు. సత్త్వగుణాన్ని మించిన సద్గుణం లేదు అని మొదలు పెట్టి వజ్రాంగుడి తాహతుకు యెంతవరకు చెప్పాలో అంతవరకూ తత్త్వం బోధించాడు బ్రహ్మ. అనంతరం ముందుగా గృహస్థాశ్రమ నిర్వహణ అత్యంత ఆవశ్యమని పలికి అతనికి తగినంత శోభాయమైన 'వరాంగి' అనే కన్యతో పెండ్లి జరిపించాడు. ఈ వరాంగికి సాత్త్వికగుణం పడేది కాదు తామసమేతామసం, అవధిలేని కామం.

# తారకాసుర విజృంభణం

ఒకనాడు వరాంగి యేకాంత వేళ భర్త నత్యంతంగా సంతోష పరిచింది. ఆనందించిన వజ్రాంగుడు ఏంకావాలో కోరుకోమన్నాడు 'హరిని దుఃఖ పెట్ట గలవాడూ, ముల్లోకాలనూ జయించగలవాడూ, అమితబలశాలీ అయిన కొడుకు కావాలి" అని కోరింది. వజ్రాంగుడికది యిష్టంలేదు. అయినా భార్యమాట కాదని బ్రతకడం యెవరితరం? అందుకని బయలుదేరి వెళ్ళి బ్రహ్మకోసం తపస్సు చేశాడు దిగివచ్చాడు బ్రహ్మ ఏంకావాలో అడగమన్నాడు. వజ్రాంగుడు తనకష్టం చెప్పుకున్నాడు. 'తత్త్వం చెప్పవయ్యా తాతాపాదా అంటే గృహస్థాశ్రమం అంటూ నన్నిరికించావు. ఇప్పుడు నీ మనవరాలు యిలాంటి కోరిక కోరింది నీదే భారం అన్నాడు. 'అంతేకదా! అలాగే జరుగుతుందిలే అన్నాడు బ్రహ్మ. వజ్రాంగుడు ఇల్లు చేరాడు. కొన్నాళ్ళకి వరాంగి కోరిక తీరా ఒక కుమారుణ్ణి ప్రసవించింది. వాడు పుట్టగానే అన్ని లోకాలూ అల్లకల్లోలంగా యేడ్చాయి. కశ్యపుడు వచ్చి వాడికి 'తారకుడు' అను పేరు పెట్టాడు. తల్లియైన వరాంగీ నాయనమ్మయైన దితీ కలిపి రాక్షసత్వమంతా రంగరించి పోశారు వాడికి. వాడు గడికట్టేసరికే సజ్జనదుఃఖ కారకుడైనాడు.

తల్లీ, తాతమ్మల బోధనపై తామరచూలి గురించి తపస్సు చేశాడు. వాడి పట్టుదలకు లోకాలన్నీ అట్టుడికిపోయాయి. తరలి వచ్చాడు తామరపట్టి, వరం యిస్తాను పట్టమన్నాడు. వల్లమాలిన శక్తికావాలి. విశ్వవిజేతను కావాలి. విష్ణువు చేతిలో చావకూడదు అలాగని శివుడి చేతిలోనూ చావకూడదు. అసలు నీ సృష్టిలో

దేనివల్ల నేను చావకూడదు. పరముడూ, నిత్యతపస్వి సతీ వియోగీ, పరమ విరాగీ అయిన శివవీర్యం వల్ల యెవడైనా పురుషుడు పుడితే - వాడి శస్త్రంవల్ల తప్ప నాకు మరణం వుండకూడదు అని కోరాడు.

తప్పని సరియై ఆ వరం యిచ్చి చక్కాబోయాడు బ్రహ్మ. ఇక విజృంభిం చాడు తారకుడు, వరం పొందడం ఆలస్యంగా వియల్లోకాలమీద విరుచుకు పడ్డాడా రాక్షసుడు. కుబేరుణ్ణి కొల్లగొట్టాడు. చంద్రుణ్ణి చావదన్నాడు. యముణ్ణి హడల గొట్టేశాడు. ఇంద్రుణ్ణి స్వర్గసభలోంచి యీడ్చియివతల పారేశాడు. దేవత లంతా బ్రహ్మనాశ్రయించారు బ్రహ్మ-వాళ్ళతో సహ వెళ్ళి విష్ణువు నాశ్రయించాడు.

## దేవతలు విష్ణువుతో కలసి ఆలోచించుట

దేవతలు, బ్రహ్మ చెప్పినదంతావిని విష్ణువు పెదవి విరిచేశాడు వాడు నాపద్దులోని ప్రాణికాదు- ఇది నావల్లనయ్యే పనీ కాదు అన్నాడు. శివవీర్య సంజాతుడు తప్ప తారకుడిని జయించేవాడు లేకుండా బ్రహ్మదేవుడే వరం యిచ్చాడు. అందువల్ల, యీ గండర గడవాలంటే శివుడికి కొడుకు పుట్టే దారేదో ఆలోచించాలి మనం అని సలహా కూడా యిచ్చాడు శ్రీహరి. అదెలా సాధ్యం? సతీదేవి యోగాగ్నిలో దగ్ధమైనప్పటినుండి ఆయన తపోనిష్ఠలో వున్నాడు. ఇప్పుడు పెళ్ళి చేద్దామన్నా - యెవరో ఓ అమ్మాయిని చేసుకునేవాడు కాదాయన. ఒకవేళ మన మొరవిని కట్టుకున్నా - ఆ పిల్ల శివతేజానికి తట్టుకోగలగాలి గదా ఇలా చర్చించుకుంటూ - డీలాపడిపోసాగారు దేవతలు. విష్ణువు వాళ్ళకి ధైర్యం చెప్పాడు.

మనమేం దిగులు పడనక్కరలేదు. గతములో - పితరుల కుమార్తె అయిన మేనక సనత్కుమారుడి శాపవశాన హిమవంతుడి భార్య అయిందిగదా! అదే సనత్కుమారుడి వరం వల్ల-ఆమేనకాగర్భంలోనే ఆదిశక్తి జన్మించబోతుంది. శివుణ్ణి సమ్మోహపరచగల యేకైక స్త్రీ ఆమె మాత్రమే. వారిద్దరికీ పెండ్లి జరిపించడమే మనపని. అదీ గాక ఆదికాలంలో ఆ మహామాయ దక్షునికి సాక్షాత్కరించినప్పుడే -తనపట్ల గాని-శివునిపట్ల గాని యేమాత్రం తేడా పాడాగా వ్యవహరించినా తానప్పుడే ఆ తనువును చాలించి హిమవంతుని యింట పుడతాననీ - శివుణ్ణే పరిణయమాడతాననీ వాగ్దత్తం చేసినది. అలాగని మనం నిమ్మకు నీరెత్తినట్లు

వూరుకోకూడదనుకోండి. ఊరికే మీకు ధైర్యం కలగడం కోసం చెప్పా నీవిషయం. తక్షణమే వెళ్ళి తుహినగిరీంద్రుణ్ణి భార్యా సహితుడై పరాశక్తిని అర్చించుమని చెప్పండి. అన్ని అనుకూలపడతాయి. అని విష్ణువు చెప్పడముతో- బ్రతుకు జీవుడా అనుకున్నారు. బృందారకులు సరాసరి హిమవంతుడి దగ్గరకు బయలుదేరారు.

# మేనకా హిమవంతుల తపస్సు



భారతమందలి ఉత్తర దిక్కున వుంటాడు హిమవంతుడు స్థిర రూపంలో మహోత్కృష్టమైన హిమాలయ పర్వతాలుగానూ చరరూపంలో హిమ వంత నామంతో పురుష సంజ్ఞతోనూ మసలుతూ ప్రాక్పశ్చిమ సముద్రాలనంటి పరచు కొని, భూమి వెడల్పుకు వెట్టిన కొలబద్దలా వుండేవాడు. పెద్దవాళ్ళపట్ల గౌరవం, సజ్జన సేవాభిలాష; సంతత పరచింతన-మంచి గుణాలన్నీ గుట్టకట్టుకున్నట్టూ, ఆ గుణాల గుట్టమీద మంచువంటి గాంభీర్యాన్నీ కప్పుకున్నట్లూ వుండేవాడు అన్ని విధాలా అతనికి తగ్గ భార్య మేనక.

ఆ మేనకా హిమవంతులిద్దరూ ఆరోగ్యవంతమైన యవ్వనంతో అతిలోక దాంపత్య సౌఖ్యాలనుభవిస్తూ యథేచ్ఛగా ఆనందిస్తున్నారు. వారివద్దకు వచ్చేశారు దేవతలు. ఆ దేవతలను గౌరవించారు ఈ దంపతులు. దేవతలు వారిని దీవించారు. కాసేపు వుండి - వెళ్ళిపోతూ- దంపతులారా! కామోపభోగాలకే అయితే కళ్యాణమూ, కట్టడీ అనవసరం. పెండ్లికి పరమార్థం ప్రాజాపత్యమే కాని మీకు పిల్లలు లేకపోవడం పెద్దలోటుగా అనిపిస్తోంది మామాట విని మీరిద్దరూ ఆ పరాశక్తి గురించి తపస్సు చేయండి. సత్సంతానాన్ని పొందండి మీ దాంపత్యాన్ని ధన్యం చేసుకోండి అని సలహా యిచ్చి మరీ వెళ్ళారు సురలు.

తమ నిస్సంతుతనాన్ని నిలింపులుయెత్తి చూపడంతో-నీరుగారి పోయారు నీహారగిరిదంపతులు. తక్షణమే అక్కడి తాపసులతో సంప్రదించారు. తపో విధానం తర్ఫీదు పొందారు. సంతానాభిలాషులై-ఆ సర్వేశ్వరి గురించి తపస్సుకు కూర్చున్నారు.

అనన్యమైన భక్తి ప్రపత్తులతో, అద్వితీయమైన యేకాగ్రతతో ఆదిశక్తి గురించి అదే పనిగా తపించారు వాళ్ళు. అనుగ్రహించిందాతల్లి ముందుగా పుత్రసంతానం కలుగుతుందనీ, తదుపరి తానే స్వయంగా వాళ్ళ గర్భవాసాన కుమార్తెగా జన్మిస్తాననీ వరం యిచ్చింది. పట్టలేని ఆనందముతో తమయింటి దారి పట్టారా కొండ దంపతులు జగదీశ్వరీ దత్తవర ప్రభావంవల్ల-అనతికాలంలోనే మైనాకుడు అనే కొడుకు కలిగాడు.



## పార్వతీ ప్రభవం

తదనంతర కాలంలో అమ్మవారు తనుయిచ్చిన వరం ప్రకారం హిమవంతుడి అంతఃకరణంలో ప్రవేశించింది. ఎనలేని తేజస్సుతో దీపించాడు హిమ వంతుడు. రతిప్రగల్భుడయ్యాడు. నిజ వీర్యాన్ని మేనక యందు నిక్షేపించాడు తన స్త్రీ స్వభావంతో దానినామె గుణించింది.

తొలుతగా కృశించింది. నక్షత్రకాంతి మాత్ర విరాజితమైన అమావాస్యలా తయారైంది మరి కొన్నాళ్ళకు ఆమె తేజస్సు ప్రవర్ధమానం కాసాగింది. ఆమె ముఖం నుండి మట్టివాసనరాసాగింది ఏమీ కోరలేదామే. అందువల్ల - ఆమె చెలికత్తెల ద్వారా ఆమె రహోవాంఛలను పసిగట్టి - ఆయా వస్తువులు తెచ్చి యిస్తుండేవాడు. సీమంతాది సంస్కారాలన్నీ విధివిహితంగా చేయించాడు కులాచారాలూ కాలాచారాలూ దేశాచారాలూ అన్నీ పాటించాడు. ఎవరేంచెబితే అది చేశాడు.

ప్రసవగృహం చేరింది - పర్వతపత్ని. దేవీ-ప్రాదుర్భావజ్ఞానులై దేవతలంతా పురిటిగది ముందరే దేబిరిస్తూ నిలబడ్డారు. హిమవంతుడు ఆత్రంతోటి ఆనందం లోటి తలమునకలై పోతున్నాడు ప్రసవసమయాన్ని లెక్కలుగట్టిన దేవతలు అమ్మవారిని స్తోత్రం చేసారు.

నక్షత్రాలు, రాశులు, గ్రహాలు సమస్త ఖేచరాలూ ప్రసన్నమై వున్నాయి ఆకాశం ప్రకాశించసాగింది. గిరి, గహన, గ్రామ సాగరాలంకృతమైన భూమి మంగళ మయంగా విరాజిల్లుతోంది నదులు చెరువులు, కడబావులు అనే తేడా లేకుండా

- నీళ్ళున్న ప్రతిచోటా కలువలు వికసించి వున్నాయి. గాలి సుఖం కలిగిస్తుండగా - మంచివాళ్ళ మనసులు గొప్ప సంతుష్టితో నిండివున్నాయి. దుర్మార్గులకేమిటో దుగ్గావుంది ఆ కారణంగానే వాళ్ళు అస్తిమితపడిపోతున్నారు.

అదివసంత ఋతువు తపస్సులో వున్న తార్క్ష్యుడికి కుడికన్నదిరింది.

అది చైత్రమాసం - తపస్సులో వున్న శివుడికి కుడి భుజం అదిరింది.

అది శుక్లపక్షం - నవమితిథి, మృగశిరా నక్షత్ర యుక్తమైన లగ్నంలో అర్ధరాత్రి వేళ అవతరించింది అతిలోకసుందరి.

మహా తపస్సులో వున్న మృడుడు నిలువెల్లా పులకించిపోయాడు రోమాంచితు డయ్యాడు. లక్షో, పదిలక్షలో పున్నమి వెన్నెలలను మించిన దరహాసంతో ఆయన అధరాలు విధురాలయ్యాయి. అంతలోనే యథాస్థితిలో తపోమగ్నుడైపోయాడాయన.

అమ్మవారు పుట్టగానే మేఘాలు ఆనందంతో పురిమాయి. దేవదుంభులు మ్రోగాయి. పుష్పవృష్టి కురిసింది గంధర్వులు తమ ప్రజ్ఞనంతా వుపయోగించి పాడసాగారు అచ్చర కన్నెలు, విద్యాధర స్త్రీలు ఆ పాటల కనుగుణంగా అద్భుతమైన నాట్యాలు చేశారు.

తల్లికి బిడ్డ పుడితేనే ఆనందం పట్టలేం. అలాటిది బిడ్డలకి తల్లి పుడితే నాకేమీ అర్ధంగావడంలేదు. కానీ, ఏదో ఆనందం గొప్ప ఆనందం ధైర్యం. దేవత లంతా మళ్ళా ఓసారి వచ్చారు. అమ్మవారిని స్తోత్రం చేశారు కనుపాప రంగులో వుందామె. నల్లకలువపూల కాంతిలో మిలమిలలాడిపోతూ శ్యామల వర్ణంతో అలరారుతోన్న ఆతల్లి సదాసర్వధా నన్ను రక్షించును గాక. నన్ను ఉద్ధరించుగాక.

# శైశవక్రీడ

అఖిలాండనాయకియే గావచ్చు. బాలికగా వున్నప్పుడు ఆ లీలల్ని ప్రదర్శిండమే ధర్మం. ధర్మవ్యతిరిక్త కాదు ఆ తల్లి. అందువల్ల ఆ లీలలు ప్రదర్శించసాగింది. సాధారణ బాలికవలే రోదించింది రుద్రాణి.

జాతకర్మాదులు నిర్వహింపబడ్డాయ. 'కాళీ' అని నామకరనం చేయించారు. కార్తాంతికులు వర్షాకాలంలో గంగానది లాగా, శరత్కాల శుక్లపక్షాన వెన్నెలలాగా దినదినప్రవర్ధమాన కాసాగింది దేవి. పర్వతరాజపుత్రిక గనుక 'పార్వతీ' అని పిలిచే వారు బంధువులు తమకులాన్ని ఉద్ధరించడానికే పుట్టినదన్నది యెరిగిన

వాళ్ళామెను పర్వతవర్ధిని అని పిలుచుకునే వారు. హిమవంతుడి పుత్రికాబట్టి 'హైమవతీ' అని పిలువబడేది ఇక 'నగజ' 'గిరిజ' 'శైలజ' అంటూ ఎవరిముద్దొచ్చిన పేరుతో వారు పిలిచేవారు ఎవరే పేరుతో పిలిచినా పలికేది ఆ యమ్మ. తనది కాని పేరంటూ యేముంది గనుక! పలక్కపోడానికి? పార్వతి తన చెలికత్తెను కూడి బొమ్మలతో ఆడుకుంది. గుజ్జనగూళ్ళు ఆడింది. బంతిభోజనాలాడింది వామన గుంటలూ ఆడింది. బంతి ఆటలూ ఆడింది జలాశయాల చేరువసైకతా లలో విహరించింది, సైకతలింగాలు చేసి శివారాధన గావించింది.

'చదువు' అని పేరుగల ఆ తల్లిని ఒక మంచి గురువువద్ద చదువు వేశారు, చదువులన్నీ కలసి ఆ చక్కటి తల్లిని సేవించుకుని తరించాయి.

# నారదుడు పార్వతికి భవిష్యము చెప్పుట



ఇలా వుండగా ఓసారి నారదుడు ఓషధీ ప్రస్థానికి విచ్చేశాడు. హిమవంతు డాయనను గౌరవించాడు. పార్వతిని పిలిచాడు. 'నారదా'! ఈ పిల్ల పుట్టడంతోనే యింట్లో దీపం పెట్టి నట్లయింది. అంతా శుభపరంపరాభి వృద్ధిగానే వుంది. అయినా - రేపు ఏం జరుగు తుందోనని ఆత్రపడ్డం జీవలక్షణంగదా! అందువల్ల అడుగు తున్నాను. ఈ నాతల్లి భవిష్యత్తును చెప్ప వయ్యా" అని కోరాడు.

అదృష్టవంతుడు నారదుడు. ఎప్పుడో ఆమె పాదాలు మాత్రమే చూచి నమస్కరించు కునే నారదుడికి - ఏ తపఃఫలమో గాని ఆవిడ హస్తరేఖలు కూడా చూసే అదృష్టం పట్టింది. చూశాడు నారదుడు మెల్లగా యిలా చెప్పాడు. "ఈ పిల్ల జాతకానికేమీ ఢోకాలేదు. నీకులం మొత్తం పావనమైపోతుంది. ఇక భర్తృవిషయాన్ని చూద్దామా అంటే-సాక్షాత్తూ ఆ శివుడొక్కడే యీవిడకు భర్త కాగల యోగ్యుడు" అని చెప్పాడు అది విని బెంబేలు పడిపోయాడు మంచుకొండడు.

శివుడా ఆయన నిత్య తపోనిధి, పరతత్త్వుడు,ఆయనయీ ప్రపంచ భోగాలు వైపు మొగ్గుయెలా చూపుతాడు? ఏదో లాలన పెడదాం అనుకున్నా - ఆయనకీ సంసారసుఖాలేమీ కూడా క్రొత్తగావుగదా! గతంలో దాక్షాయణితో కాపురం చేసిన వాడే గదా! పై పెచ్చు - ఆమె మరణాంతరం తాను అన్య స్త్రీని ఒల్లనని గదా- అంత ఘోరమైన తపస్సుకు కూర్చున్నది? అంటూ తన సందేహాలు వెలిబుచ్చాడు.

ఫక్కున నవ్వాడు నారదుడు. వెర్రివాడా? పుత్రికామోహంలో పడిగతాన్ని విస్మరించకు' అని హెచ్చరించాడు హిమవంతుని తపస్సు అమ్మవారి వరం, ఆవిడే- ఈయనకు కుమార్తెగా జన్మించడం అన్నీ గుర్తుచేశాడు. ఆనాడు దక్షయజ్ఞ వాటిలో ఆత్మార్పణ చేసిన సతీదేవియే ఈనాడు నీ కూతురై పుట్టింది. కాబట్టి - శివుడి కామె స్వకాంతేగాని అన్యకాంత కాదు' అని హితవు పలికాడు. మగతపట్టేవాడి ముఖం మీద పన్నీరు చలికినట్లయ్యింది కొండలరేడికి. దైవస్పృహలోకి వచ్చాడు. నారదుడికి ధన్యవాదాలు తెల్పుకున్నాడు నాదుడు, నిష్క్రమించాడు.

ఆ తర్వాత మేనకా హిమవంతులు యిరువురూ ఆలోచించి-తమ కుమార్తెను శివారాధనయందు నియమించాలనుకున్నారు - మంచి రోజు చూసుకుని - పార్వతితో సహ పశుపతి వద్దకు బయలు దేరినారు.

# కుజుడి జన్మము

సతీవిరహాకులుడైన ఈశ్వరుడు - దక్షోద్ధరణాదులు గావించిన అనంతరం కైలాసం చేరి కొన్నాళ్ళు విరహం అభినయించి - అనంతరం తన ఆత్మానంద ధ్యానంలో మునిగిపోయాడు. ఆ సందర్భంలోనే ఆయననొసలి నుంచి ఒక చెమట బిందువు భూమిని పడి ఆ క్షణమే శిశురూపం ధరించడం జరిగింది. ఆ బిడ్డ నాలుగు చేతులూ, ఎర్రటి కాంతీ, ఆకర్షణీయమూ - ఆనందదాయకమూ అయిన రూపంతో అలరారాడు. లోకాతీతమైన ప్రతిభావ్యుత్పత్తులు, అగమ్యమైన ప్రభావ సంపత్తి అతని ముఖంలో ద్యోతకమయ్యాయి. శివస్వేదావిర్భూతుడైన ఆ బిడ్డ నలాగే వదిలేస్తే శివుడేమనుకుంటాడనే భయంతో భూమి స్త్రీ రూపాన్ని ధరించి ఆ బాలున్ని ఒడిచేర్చి స్తన్యమిచ్చింది. అది చూసిన భవుడు చిరునవ్వు నవ్వి ఆమెను దీవించాడు.

ఈ కుర్రవాణ్ణి చూస్తున్న కొద్దీ ఆనందముగా వుంది నాకు నువ్వే తీసుకువెళ్ళి పెంచుకో. నీ పేరుతోనే వృద్ధి చెందుతాడు ఆధ్యాత్మిక, ఆదిభౌతిక, అధి దైవిక తాపత్రయాలేమీ లేకుండా అఖండమైన పేరు ప్రతిష్ఠలు ఆర్జిస్తాడులే అని చెప్పాడు.

భూమి ఆ బిడ్డను తనతో తీసుకు వెళ్ళింది. ఆ బాలుడు భౌముడనే పేరుతో పెరిగాడు. అనంతరం కాశీక్షేత్రంచేరి - విశ్వేశ్వరార్చన చేసి శివునకై తపించాడు. శివుడనుగ్రహించి-'శుక్రలోకానికి పైనున్న దివ్యలోకంలో వుండమనీ, నవగ్రహాలలో ఒకడవు కమ్మనీవరం యిచ్చాడు. ఆ వరం ప్రభావంతోనే-భౌముడు, అంగారకుడు, మంగళుడు అనే పేర్లతో నవగ్రహాలలో ఒకడయ్యాడు. నిత్యకుమారత్వం పొందాడు. ఇది కుజావిర్భావగాథ. ఈ గాథ జరిగి - శివుడు హిమాలయం చేరి తిరిగి తన తపస్సులో నిమగ్నుడయ్యే సమయానికి - హిమవంతుడు తన కూతురు పార్వతితో సహా అక్కడికి చేరుకున్నాడు.

## పార్వతి శివుని సేవించుట



వేదవిధిగా శివుణ్ణి పూజించి నమస్కరించాడు గిరిరాజు. అనంతరం గిరిజని ఆయన సేవలో నియమించే విషయమై అనుగ్రహించమని కోరాడు. శివుడు ఒప్పుకోలేదు స్త్రీ వల్ల సర్వనాశనం కలుగుతుందన్నాడు. యోగులకూ, స్త్రీలకూ పొత్తుకుదరదన్నాడు. ఆ మాట సూటిగా పార్వతితోటే అనేశాడు. మరో ఆడదీ మరో ఆడది అయితే ఏమయ్యేదో తెలియదు గాని - యీవిడ మహా మాయగదా! అందువల్లనే అంతటి శివుడికి జవాబిచ్చేసింది.

శ్లో॥ యచ్ఛృణోషి యదశ్నాసి కరోషియత్
తత్సర్వం ప్రకృతేః కార్యం - మిథ్యావాదో నిరర్థకః ॥

ఏది వింటున్నావో, ఏది తింటున్నావో, ఏది చూస్తున్నావో, ఏది తాకుతున్నావో అదంతా ప్రకృతే అయివుంది. అటువంటప్పుడు ప్రకృతి మిథ్య అనే వాదం, పట్టి పనికిమాలిన వాదమే అవుతుంది.

ఒకవేళ నువ్వేమైనా ప్రకృత్యతీతుణ్ణి అని ననుకుంటున్నావేమో! అలాగయి నట్లయితే జగద్రచనను విరమించెయ్యి - సృష్టించకు నాకు 'బదులు' పలకకు అప్పలేమీ చెయ్యకూడదు. ఈ ధ్యానమూ తపస్సూ అనేవి కూడ చేయకూడదు ఇంకో విషయం కూడా చెబుతున్నాను నేను (ప్రకృతి) స్త్రీ మాత్రను, నీవు పురుషుడివి, నువ్వు నా కన్నా శక్తిమంతుడవే అయితే - నా ఉనికి వల్ల ప్రమాదమనే భయం దేనికి?" అని కూడా అడిగేసింది.

నవ్వాడు శివుడు. నీ నిర్ణయంలోని బలం యేపాటిదో చూడాలని అలా అన్నానేగాని - నాకే భయం లేదు నీ యిష్ట ప్రకారమే వచ్చి-వేదోక్తమైనంత వరకూ ఏయే సేవలు చేయాలనుకుంటున్నావో ఆయా సేవలు చేసుకో. పరమనిర్లిప్తుడిని నేను. నువ్వు కాదుగదా, నీలాటి వందమంది వచ్చినా నన్నేమీ చెయ్యలేరు" అనేసి - తన ధోరణిలో తాను ధ్యానమగ్నుడైపోయాడా అభవుడు.

హిమవంతుడు పెద్దలను రావించి తగిన శుభముహూర్తం నిర్ణయింపజేశాడు. ఆ ముహూర్తాన, కాళి, కంఠేకాలుని సేవలను ఆరంభించింది.

ప్రతిరోజూ శివచరణాలను అభిషేకించింది పాదతీర్థాన్ని స్వీకరించేది. శుభ్రవస్త్రంతో ఆయన పాదాల తళ్ళు వత్తేది. విధివిధానంగా షోడశోపచారాలతోనూ ఆరాధించేది పునః పునః నమస్కరించేది.

ఒకనాడు ఆడేది. నృత్యప్రియుడైన శివునకు నర్తన సేవలు చేసేది మరొక నాడు సామప్రియుడైన స్వామిని - సంగీతంతో సేవించేది. ఒక్కొక్కసారి కుశలు పుష్పాలు మొదలైనవి తానే స్వయంగా తెచ్చి పెడుతుండేది. స్థలసమ్మార్జనం చేసేది చాన్పుచల్లేది. తపోదీక్షుతుడైన ఆయననే తదేకగా చూస్తూ తన్మయు రాలైపోయేది.

ఒకరివల్ల ఒకరికి ఏదో తృప్తి- ఆనందం తప్ప - మన్మథ వికారమనేది మచ్చుకైనా చేరలేదు. కాళికి అది కాస్తంత కష్టంగానే అనిపించేది. సర్వప్రపంచాన్నీ సమ్మోహింప చేయగల సౌందర్యం తనది. ఆ సౌందర్య సర్వస్వాన్నీ ఆయనకే సమర్పించుకునేందుకు తాను సిద్ధమవుతున్నా సరే- ఆ శివుడు మాత్రం చలించక పోవడం-ఆమె యొక్క అందం తాలూకూ 'ఆహం' మీద తీవ్రఘాతమైంది. అయినా ఆదేమీ పైకి తెలియనీకుండానే, యధా ప్రకారంగానే అన్ని పరిచర్యలూ నిర్వర్తిస్తోందావిడ. సర్వాంతర్యామి శరుదడు ఈవిడ అంతరంగ మథనమంతా

ఆయన కనిపెట్టనే కనిపెట్టాడు. 'అహ తొలగిన తర్వాతనే ఆదరిద్దాంలే అనుకున్నాడు. అట్టే వుండిపోయాడు.

ఆయన ధ్యానం నుండి కళ్ళు తెరవగానే తన అపూర్వ సౌందర్య వయోవిళాసా తొలకబోస్తూ ముందుగా తనే కనబడేది కాళి. శివుడేమో చూచి చూడనట్లుగా వుండిపోయేవాడు. అమ్మవారు బుంగమూతి పెట్టుకునేది. అది కనిపెట్టి చాటుగా నవ్వుకునేవాడు శివుడు.

## ఇంద్రుడు మన్మథుణ్ణి శివుడిపైకి పంపుట



వాళ్ళ సరసాల అల్లరి అలాసాగుతుండగా - ఇక యిక్కడ - మింగలేక, కక్కలేక గంగ వెర్రులెత్తి పోతున్నారు దేవతలు. వాళ్ళకి కావల్సింది యీ ఆత్మా నందంకాదు. ప్రకృతి పురుషులరతి జరగాలి. తత్ఫలం మూర్తీభూతమై కుమారుడుగా రావాలి. రాక్షసబాధలు ఎన్నాళ్ళని యెదురు చూడగలరువాళ్ళు? అందుకే, అంతాకూడా బలుక్కొని కుసుమశరుణ్ణి ఆహ్వానించారు, ఇంద్రుడు తనప్రియ వాక్యాలతో మదనుడిని సంతోషపరచాడు. అనంతరం తారకుడు చేసే తగని పనులనీ, దేవతలకు వాటిల్లిన దీనత్వాన్నీ వివరంగా చెప్పాడు శివకళ్యాణం యొక్క అవసరాలన్నీ-మనసుకు హత్తుకునేలా బోధించాడు. తుదిగా - "అక్కడ అమ్మవారు ఆయన కోసమే సిద్ధాన్నంలా యెదురుచూస్తున్నారు. కాబట్టి, నువ్వు కూడ ఒక్కసారి కలుగ జేసుకున్నావంటే - అటు శివకళ్యాణము జరుగుతుంది. ఇటు లోకకళ్యాణమూ జరుగుతుంది" అంటూ చల్లగా వివరించాడు. 'సరే' నన్నాడు మన్మథుడు. "సర్వ ప్రపంచాన్నీ సమ్మోహింపచేయగలను నేను. అది గొప్పగా అనుకోను. శర్వుణ్ణి చలింపచేస్తేనే కదా నా సత్తా తెలిసేది!' అన్నాడు.

సర్వవ్యాపకమైన మలయపవనం ఖేచరాలైన శుకపికశారికాదులు-చంద్రుడు, భూజవాసితుడైన వసంతుడు. సర్వలోకాల్లోనూ కూడా మగాడనే ప్రతివాడికి కామ

వికారం కలిగించి భ్రష్టుపట్టించడంలో నిపుణాతి నిపుణులైన ఆడవాళ్ళూ- లక్ష్యం తప్పనిదైన మత్తద్విరేఫాళీ గణయుతమైన ధనువు-అయిదంటే అయిదు ప్రాణాంతకాలైన పుష్పబాణాలు ఇవన్నీ పట్టుకునీ తన భోగినియైన రతితో కలిసి చిలుకల్ని పూన్చిన రథాన్నెక్కి హరుడివద్దకు బయల్దేరాడు మరుడు.

## మన్మథుడు శివ ఫాలనేత్రాగ్నిలో కాలిపోవుట



అంబరచుంబి శిఖరాగ్రసుందరం ఆ హిమాలయ పర్వతపంక్తి. ఆ పర్వతా లలో వున్న "ఓషధీ ప్రస్థ" మనే ప్రాంతంలో వున్నాడు శివుడు. అదేపనిగా తపిస్తు న్నాడు. అక్కడికి చేరాడు మన్మథుడు. ముందుగా వాతా' వరణం కోసం వసంతుణ్ణి పురమాయించాడు కోకిల లను కూయమన్నాడు. చిలుకలను పలక మన్నాడు. ఆడమన్నాడు. ఎన్నిచేయాలో అన్నీ చేసాడు. ప్రయోజనం లేకపోయింది. అదే సమయానికి పార్వతీదేవి తన సఖులతో కలసి అక్కడికి వచ్చింది.

సృష్టిలోని సౌందర్యమంతా సమీకరించి పెట్టినా - ఆ కాత్యాయనీదేవి కాలి గోటికి సరిపోలేదు. వందమంది వాచస్పతులు కలిసి ఆమె అందాన్ని వర్ణించ మొదలిడితే వంద సంవత్సరాలు గడచినా సరే - సంపూర్తిగా ఆమెను వర్ణించలేదు. వసంతుడు సిగ్గుపడతాడు. మలయపవనుడు ఆమెను తాకడానికి జంకుతాడు. కోకిలకు గొంతు పెగలదు. హంసలు ఆమె గమనాన్ని ఆశ్చర్యంగా అవలోకి స్తుంటాయి. చంద్రుడి వెన్నెల ఆమె ముఖకాంతి ముందు యెందుకూ కొరగాడు. అటువంటి అందాలకు అందమైన ఆ అంబిక తన సకియలతో కూడి ఆ ప్రాంతానికి వచ్చింది. ఆమెను చూచిన అబ్బురపాటులో కొన్ని క్షణాలపాటు మన్మథుడు తమ వచ్చినపనికూడా మర్చిపోయాడు. అతడు తేరుకునే సమయానికే ధ్యానం నుంచి వెలువడ్డాడు శివుడు. కళ్ళు తెరిచాడు. అదే అదనునుకున్నాడు మదనుడు. అరక్షణం కూడా ఆలస్యం చేయకుండా హర్షణం అనే బాణాన్ని

ప్రయోగించాడు. సరిగా ఆ వేళకే పార్వతి స్వామి ముంగిట నిలచింది మరుక్షణమే మరో బాణాన్ని సంధించి ప్రయోగించాడు.

దృశ్యమాన మవుతున్న జగన్మాత సౌందర్యపు చురుకుదనం అదృశ్యంగా తాకుతున్న మరుని పూలతూపుల తీవ్రతలతో రవ్వంత చలించాడు శివుడు-పార్వతీ సోయగానికి అబ్బురపడ్డాడు. ఆమె అంగాంగ సౌందర్య మధువును మహా భావుకతతో కళ్ళదోసెళ్ళతో త్రాగాడు. మనసు మత్తిల్లినట్లయింది. మనువు కెరిగిన మదనవతి రూపంలో వున్నది యెదురుగా మహామాయ. మనసు మత్తులోంచి మరులలోకి మళ్ళసాగింది. ఒక్కసారి ఆ చక్కని చుక్కని అక్కునచేర్చుకోవాలని పించింది. అంతలోనే తనకు తానే తెప్పరిల్లాడు త్రినేత్రుడు "నాకు యిలాటి ఆలోచనలు వస్తున్నాయేమిటి? ఈ పాపభూయిష్ఠమైన పరాంగనాలాలసత యెందుకు కలిగినట్లు?" అనుకున్నాడు. తక్షణమే కారణాన్ని అన్వేషిస్తూ ఆలోచించ సాగాడు-పరేశఃకింభవేదిహ? అని ఆలోచిస్తున్న ఆయనకు-అటు ధ్యానంలో గాని, ఇటు స్పృహలోగాని లేనప్పుడు తనపై కాముడు జరిపిన అత్యాచారం తోచింది.

ఆగ్రహం ఆక్రమించసాగింది ఆయనను. అదేమి పట్టించుకోవడంలేదు మన్మథుడు. తన రెండు బాణాలు సఫలీకృతం అయిన ఆనందంతో మూడవదైన అమోఘాన్ని వింట సంధించిమింటికెగిసి - ముక్కంటిపై ప్రయోగించాడు. ఎక్కడెక్కడా చిలుకవజీరని దిక్కులు పరికిస్తున్నాడు శివుడు. పడనేపడింది 'అమోఘం' ఆయనమీద. కాని ఏం లాభం? అంతటి గొప్ప బాణమూ కూడా ఆమోఘంగా నిష్ఫలమైపోయింది. శివుడు స్పృహతోనే వుండటంతో, తను వేసిన అమోఘమైన బాణం ఘోరముగా పరాజయం పొందడంతో కాళ్ళూ చేతులూ వణకసాగాయి కందర్పుడకి. కొంపమునిగి పోయిందనుకున్నాడు. ఇంద్రాదిదేవత లను తన రక్షణార్థమై తరలి రమ్మని ప్రార్థించసాగాడు. ఆమోఘం అనే బాణం తనను తాకి పతనం కావడంతో ఆ మన్మధుని ఉనికి కాస్తా దొరికిపోయింది ధూర్జటికి.

ఒక్కసారి అటు చూశాడంతే. ఆ మన్మథుని ఉనికి కాస్తా దొరికిపోయింది ధూర్జటికి. ఒక్కసారి అటు చూశాడంతే. ఆయన ఫాలనేత్రం నుంచి మహానలజ్వాల వెళ్ళి మదనుణ్ణి తాకడం అతడు బూడిదకుప్పలా నేలరాలిపోవడం అన్నీ కూడా అరరెప్పపాటు కాలంలో జరిగిపోయాయి. మదనుణ్ణి రక్షించడానికి పరుగు పరుగున

వస్తున్న సర్వదేవతా బృందం అంతదూరంలో వుండగానే వాళ్ళ కళ్ళెదురుగుండానే కాలి బూడిదగా రాలిపోయాడు కందర్పుడు. కెవ్వున అరిచి స్పృహ తప్పింది రతిదేవి. అంతలోనే తేరుకొని ఘోడుఘోడున విలపించింది. దేవతలంతా ఏకమై తన దేవుణ్ణి నాశనం చేశారని దుఃఖించింది. దేవలామెను ఓదార్చారు.

శ్లో॥ "సుఖదాతా నకోప్యస్తి - దుఃఖదాతా న కశ్చన
సర్వోపి స్వకృత్యం భుంక్తే - దేవాన్ శోచసివై వృథా ॥

ఈ సృష్టి మొత్తంలో ఒకడు ఒకడిని సుఖపెట్టడమూలేదు. ఒకడు ఇంకొకడిని కష్టపెట్టడమూలేదు. ఎవడు చేసిన కర్మనువాడు అనుభవిస్తున్నాడు అంతే. నీ భర్త అయినా అంతే. తన కర్మృత్యరీత్యా బ్రహ్మచే శప్తుడయ్యాడు. దాని రీత్యా ఇలా శైవాగ్నిలో బూడిదయ్యాడు. ఎవర్నీ ఏమీ అనుకో అక్కర్లేదు" అంటూ ఆమెకు వేదాంతం ఉపదేశించారు దేవతలు. ఆ మదనుడి బుగ్గిని జాగ్రత్త పెట్టమనీ, కరుణాంతరంగుడైన శివుడు ప్రసన్నుడు కాగానే మళ్ళా మన్మథుణ్ణి బ్రతికిస్తాడనీ చెప్పారు. భర్తయొక్క బూడిదని కొంగున కట్టుకుంది రతి. ఆమెను తోడు తీసుకొని రుద్రుడి ముందుకు వెళ్ళి ఆయనను అనేక విధాల ప్రార్ధించారు.

రతీదేవి దుఃఖాన్ని మాన్పమని ప్రాధేయపడ్డారు. అనుగ్రహమూర్తి ఆ ఆది దేవుడు. "అలాగే జరుగుతుంది" అన్నాడు. విష్ణువు కృష్ణావతారం ధరించినప్పుడు ఆయనకు రుక్మిణియందు ప్రద్యుమ్నుడనే పేరుతో జన్మించుతాడు మదనుడు. త్వరలోనే అతడు కైలాసం చేరి నాగగణాలతో కొన్నాళ్ళు విహరిస్తాడు. తిరిగి పుట్టేవరకూ అనంగునిగానే వుంటాడు. ప్రద్యుమ్నుడిగా జన్మించగానే శంబ రాసురుడి వలన గండం పాలవుతాడు. రతీదేవి అంతవరకూ శంబరుడి నగరంలోనే వుండాలి. ఆపదలపాలైన ప్రద్యుమ్నుడు గండంగడిచి ఆమెకక్కడే లభిస్తాడు. అనంతరం శంబరుడిని సంహరించి అతనిద్రవ్యం వశపరుచుకొని - తన ప్రియ తమురాలైన రతితో కలిసి సుఖజీవనం సాగిస్తాడు" అని అనుగ్రహించి అదృశ్యమైపోయాడు.

## శివఫాలనేత్రాగ్ని సముద్రంలో దాచబడుట

మన్మథుణ్ణి దగ్ధం చేయడంతోనే మహాదేవుడి ఫాలనేత్రాగ్ని చల్లారిపోలేదు. అది త్రిలోకాలూ తిరగనారంభించింది. దానికి భయపడి అందరూ కలిసి బ్రహ్మను

ఆశ్రయించారు. బ్రహ్మ శివధ్యానం చేస్తూ ఆ-జ్వాలవద్దకు వెళ్ళి-ఆ అగ్నిజ్వాలను బడబారూపంగా మార్చాడు. రవ్వంత సౌమ్య జ్వాలాముఖి అయింది. దానిని తీసుకొని సముద్రుడిని కలిశాడు బ్రహ్మ/లోకరక్షణార్థం ఆ బడబాగ్నిని సముద్రుడి యందు నిక్షిప్తపరిచాడు అక్కడితో లోకానికి శాంతి చిక్కింది.

## పార్వతికి నారదుడి ఉపదేశం

ఇక మనం అసలు కథలోనికి వద్దాం ఎపుడైతే శివుడి నుదుటి కన్ను నిప్పులు చిమ్మిందో మన్మథుడు ఆ నిప్పుల్లోపడి పెద్ద చప్పుడుతో బూడిద కుప్పలా నేల రాలాడో-ఇవన్నీ చూసిన పార్వతి-లౌకికమైన తత్తరపాటుతో స్వగృహం చేరుకుంది. ఆ భయభ్రాంతి ఒక పట్టాన వదలలేదు. ఉన్నట్లుండి "హతాహం" అనుకుంటూ వుండేది. "ఆ శివుణ్ణి చేబట్టలేని నా చక్కదనం, సౌందర్యం, సుగుణాలూ, వయస్సూ అన్నీ నిష్ప్రయోజనాలే కాదా!" అని బాధపడుతుండేది.

"శివ శివ శివ శివ శివ శివ శివ" అంటూ శివనామోచ్చరణమే సకలముగా కలవరింతలతో పలవరింత లతో - తన తల్లి దండ్రుల్నీ, పరివారాన్నీ కూడా కలవర పరచసాగింది. అటువంటి సమయంలో శివుడి మీదకి మన్మథుణ్ణి ప్రేరేపించిన యింద్రుడు పార్వతి చెంతకు నారదుడిని పంపించాడు. నారదుడు ముందుగా హిమవంతుణ్ణి కలుసుకున్నాడు. అతనికి ధైర్యం చెప్పాడు. "శివధ్యానం చేస్తూ వుండు. అన్నీ అవే చక్కబడతాయి. అని చెప్పాడు. అనంతరం పార్వతిని యేకాంతంగా కలుసుకున్నాడు.

"అమ్మా! నీకు చెప్పదగ్గవాడిని కానుగాని - కాలభ్రమణం రీత్యా చెప్పాల్సి వస్తోంది. శివుడు తపస్సాధ్యుడు, భక్తసులభుడు. అంతేగాని అతిశయాల్ని సహించలేడు. నువ్వు నీ సౌందర్యంతో ఆ కట్టుకోవాలని చూశావు. అది బాహ్య సౌందర్యం! దానికి ఆయన అస్సలు లొంగడు. ఆయనకు కావల్సింది-అంతః సౌందర్యం, దానికి భక్తి, తపస్సు-యీ రెండే అనువైన మార్గాలు. నామాటవిని నువ్వాయోగమూర్తి నిమిత్తమై తపించు తల్లీ" అని చెప్పి ఆమె అడిగిన మీదట శివపంచాక్షరి నుపదేశించి వెళ్ళిపోయాడు.

## పార్వతి శివుడికై తపించుట

పార్వతి తపోనిశ్చితయైంది. తల్లిదండ్రుల అనుమతి తీసుకొని అడవులలోనికి వెళ్ళిపోయింది. అనుపమానము, అభూతము, అనితరసాధ్యము అయిన తపస్సు

చేసింది. వేసవికాలంలో అగ్నిహోత్రాల నడుమకూర్చుని "శివ శివ శివ" అంటూ అలమటించిపోయింది. వర్ష ఋతువులో ఆరుబయట భోరున కురిసే వానలో కూర్చుని కపర్ది కోసం ధ్యానించింది. శీతఋతువులో నదీజలాల్లో నిలిచి-రుద్రుణ్ణి జపించింది. తపస్సు మొదలు పెట్టిన తొలినాళ్ళలో పళ్ళను తింటూ వుండేది. కొన్నాళ్ళాయ్యాక, పళ్ళు తినడం మానేసి పర్ణాలు (ఆకులు) తినడం మొదలు పెట్టింది. ఇంకొన్నాళ్ళయ్యాక, ఆమె ఆకుల్ని తినకుండా విసర్జించింది.

ఆమె తపః ప్రాగల్భ్యానికి - ఆ పరిసరాల జంతువులన్నీ తమ సహజ గుణాలు వదిలేశాయి. అక్కడున్న పిపీలికాది క్రూర వ్యాఘ్రపర్యంతం గల ప్రాణులుత్యక్త మాంసాహారాలై పోయాయి. నియమిత శాకాహారాలే, సత్త్వగుణావలంబనులుగా పరిణమించాయి. అటువంటప్పుడు పార్వతి స్థితి యేమిటో ఆమె తపస్త్రీవ్రత యేమిటో వేరే చెప్పనవసరం లేదు గదా! అయినా ఆ నెలవూతలదాలుపు దొరగారు మాత్రం దిగిరాలేదు. మధ్యలో ఓసారి హిమవంతులు వచ్చి పిల్లను చూసుకున్నారు. "ఇంత తపస్సు చేశావు. ఇంకా ఇందుధరుడురాలేదంటే ఈ తపస్సంతా వృథా అనిపిస్తోంది. మా మాట విని ఇంటికి వచ్చేయ్" అన్నారు.

వినలేదా తల్లి. ఈ ఘటం యిలా చెల్లిపోవాల్సిందే లేదా శివుడు కరుణించాల్సిందే. నన్ను యిబ్బంది పెట్టకండి అని కరాఖండిగా చెప్పింది. పార్వతి పట్టుదలకి అచలేశ్వరుడే అబ్బురపడ్డాడు. శుభాన్ని దీవించి వెళ్ళిపోయాడు. పార్వతి తపస్సు కొనసాగుతోంది. ఆమె అత్యుగ్రతపానికి - అఖిల లోకాలూ కూడా ఉడికిపోనారంభించాయి. ఇంద్రాదు లంతా కలిసి విధాతని ముందుంచుకొని కైలాసం వెళ్ళారు. పదే పదే పరమేశ్వరుణ్ణి ప్రార్థించారు. ఏలాగైనా పార్వతిని పరిణయం చేసుకుని ప్రపంచాన్ని కాపాడమన్నారు.

హేశివా! పార్వతియందు నీవు కుమారుడిని కంటేనే తప్ప ఆ తారకుడి పీడ తొలగదు మాకు. కాబట్టి మాయందు నీవు కరుణించవయ్యా" అన్నారు. అలా ఆ అనిమిషులు అంతా కలసి కళ్ళనీళ్ళ పర్యంతమయ్యేదాకా పరితపించగా, పరితపించగా - మెల్లగా అన్నాడు శివుడు-"భక్తులను నేనెప్పుడూ నిర్లక్ష్యం చేయను. మీరన్నట్లే చేస్తాను. మీరు స్వస్థ హృదయులై మీ మీ తావులకు వెళ్ళండి. అని ఓదార్చి పంపివేశాడు. అనంతరం సప్తర్షులను స్మరించగా వారు వచ్చారు. పార్వతి తపస్సునూ, మనోగత భావాల్నీ పరిశీలించి రమ్మనమన్నాడు. వాళ్ళు వెళ్ళారు.

"హే మహాదేవా! ఆరువేల సంవత్సరాలుగా నిరాఘాటంగా తపిస్తోంది ఆ నిర్మమ. మహా తపస్విని నిన్ను చూశాం. మీరు యిద్దరి కిద్దరే యోగమూర్తులు. మమ్మల్నెందుకు మధ్యలో యిరికిస్తావు? నీ హృదయం ఆవిడే. ఆవిడ సర్వస్వం నువ్వే. మీ యేకత్వమే మా ధ్యానాలకీ, యోగాలకీ, తపస్సులకూ గమ్యం" అని విన్నవించి, శలవు తీసుకున్నారు. అనంతరం ఆమెను తానుకూడా పరీక్షించాలన్న తలంపుతో వృద్ధబ్రాహ్మణవేషం ధరించి - మేనకాత్మజ తపస్సు చేసుకుంటున్న తావుకు వెళ్ళాడు శివుడు.

## శివుడు మాయారూపమున పార్వతిని పరీక్షించుట



తానెంతగా తపించినా ఆ శివుడు అనుగ్రహించి సాక్షాత్కరించక పోవడం వలన పార్వతి రవ్వంత నిరాశకు గురిఅయ్యింది. తన జన్మ వృధా అనుకుంది. తక్షణమే చెలికత్తెలచేత చితిని ఏర్పరుప చేసుకొంది. ఆత్మాహుతికి నిశ్చయించుకొని అగ్నిప్రవేశం చేయబోతుండగా - సరిగా సమయానికి వచ్చాడు మాయా బ్రాహ్మణ వేషధారియైన భవుడు అగ్నిగుండంవైపు అడుగువేయబోతున్న అపర్ణ- ఆ మాయా విప్రవేషధారిని చూసి ఆగింది. అర్ఘ్యపాద్యాదులిచ్చి ఆయనను సత్కరించింది. "దివ్య తేజస్సుతో అలరారుతున్నారు మీరు. మీ రాకతో అడవి అడవంతా దేదీప్యమానమై పోయింది. తమరెవరో తెలుసుకోగోరుతున్నాను" అంది. పరోపకారమే ధ్యేయంగా గల తాపసుణ్ణి నేను. సర్వే సర్వత్రా స్వేచ్ఛగా సంచారం చేస్తుంటాను. మరి నువ్వెవరవు? నీ పుట్టుకతో యే వంశాన్ని పునీతం చేశావు? ఏ కోరికతో యింత అసాధ్యమైన తపస్సు చేస్తున్నావు? అని అడిగాడు విప్రుడు.

"అయ్యా! నేను హిమవత్పుత్రికను, హైమవతిని, అంటూ తన సంగతులన్నీ పూసగ్రుచ్చినట్లు చెప్పింది. పార్వతి, చివరగా - "ఇంత తపస్సు చేసి కూడా యీశ్వర సాక్షాత్కారం కాలేదు. బ్రతుకుమీద విరక్తి కలిగింది. అగ్నిప్రవేశం చేయబోతుండగా

వచ్చావు నువ్వు. అతిథి మర్యాదచేయడం విధిగనక-నిన్ను గౌరవించేందుకు ఆగాను. శలవు అని చెప్పి, నాలుగడుగుల్లో వెళ్ళి అగ్ని గుండంలో ప్రవేశించింది కాని - అగ్ని శ్రీగంధంలా శీతలమైపోయాడు. చెక్కుచెదరలేదా శర్వాణి. ఆశ్చర్య పోయింది.

ఆమె ఆశ్చర్యలావణ్యాన్ని అవలోకిస్తూనే వృద్ధుడు "అగ్ని నిన్ను కాల్చ లేకపోయే, ఆ హరుడు దిగిరాకపోయే, చూస్తే జాలి వేస్తోంది. అందువల్ల నీకు కొన్ని హితవాక్యాలు చెప్పాలనుకుంటున్నాను. నువ్వా శివుని మర్చిపో. తలకు మాసినవాడా శివుడు. జడలు కట్టుకు తిరుగుతాడు జడుడు. పులితోలు, ఏనుగు తోలు ఆయనబట్టలు, పుర్రెలు, ఎముకలూ, పాములూ ఆయన నగలు, నిత్య స్మశాన సంచారి విషకంఠుడు., విరూపాక్షుడు, విధ్వంసకారుడు, తరచు దిగం బరుడు, నిత్యబైరాగీ అయిన - అతగాణ్ణి మర్చిపోయి - నిన్ను సుఖపెట్టగలవాణ్ణి వేరే యెవర్నయినా కట్టుకో" అని సలహా యిచ్చాడు.

రుసరుసలాడుతూ చూసింది. పార్వతి ఆ మాయావిని. "నువ్వెవడివో మాయా బ్రాహ్మణుడిలా వున్నావు. ఇలా శివ నింద చేసే నిన్ను అనవసరంగా గౌరవించాను. శివద్వేషి యొక్క ముఖం చూసినా సరే సచేలస్నానం చేయాలని శాస్త్రం చెబుతోంది. నువ్వు యింతసేపు నిలిచిన ఈ తావులో తపస్సు చేయడం కూడా తప్పే అవుతోంది. నేనిప్పుడే మరో స్థలానికి మారిపోతాను" అంతూ ఆవేశంలో అంబిక ప్రయాణం కావడంతోనే - బ్రాహ్మణరూపాన్ని తిరస్కరించి - పురస్కార పూర్వకంగా - పార్వతీ మనోమయమైన రూపంతో నిలిచాడు శివుడు.

ఆయనను చూస్తేనే ఆవేశమంతా చప్పున చల్లారిపోయింది. అమ్మవారికి, పైపెచ్చు, బోలెండంత సిగ్గుపడిపోయింది. ఆమె సిగ్గును చూసి చెలికత్తెలంతా బుగ్గలు నొక్కుకున్నారు.

పురుషోత్తముణ్ణి సిగ్గులతోనే పూజించిందా తల్లి. ముసి ముసి నవ్వులు నవ్వుకున్నాడు ముక్కంటి. అనంతరం మెల్లగా "దేవీ! సర్వస్వతంత్రుణ్ణి నేను. నీ ఒక్క దాని విషయంలో మాత్రం పరతంత్రుణ్ణయి పోయాను. నిన్ను నా అర్ధాంగిగా స్వీకరిస్తున్నాను. సరేనా" అన్నాడు. ఆ మాటలు వింటూనే పార్వతి " మహా భాగ్యం స్వామీ! కాని, లోకాచారరీత్యా మీరు నా తండ్రియైన హిమవంతుడిని కలిసి,

నన్ను కోరి - పరిగ్రహించండి" అని కోరింది. మరింత మృదువుగా నవ్వాడు మృడుడు నవ్వి,

శ్లో॥ "సర్వేషామపి భూతానా - మహమాత్మా సుమధ్యమే
నిర్వికారీ నిరీహశ్చ - భక్తైశ్చోపాత్త విగ్రహః ॥

" చక్కటి నడుముకలదానా! జీవకోటి సమస్తానా అంతరాత్మగా వున్న వాడిని నేనే. నిర్వికారుణ్ణీ, నిరీహుణ్ణీ అయిన నేను భక్తులయిష్ట సిద్ధికై ఆపాదింపబడిన మూర్తిత్వంతో మసలుతున్నాను. సర్వనియామకుడనైన నేను పరుల కడకు యెలా రాగలను? నా విభూతిలోనే మిళితమైన విశ్వంలోనూ నేను మళ్ళా గుణకార్యభేదాన యిరువురిగా ప్రాదుర్భవించానేగాని సరే ఒకటైన మనం రెండుగా సంభాషించుకోవడం దేనికి? నేనెలా ప్రవర్తించడం నీకు ఆనందమో అది చెప్పు" అన్నాడు. హిమవంతుణ్ణి చేరి నన్ను యాచించు. జగద్వ్యాపారార్థం కళ్యాణలీల ప్రదర్శించి లోక కళ్యాణాన్ని అనుగ్రహించు అన్నారు అమ్మవారు. ' అలాగే కాని' మ్మన్నాడాయన. అంతర్హితుడైపోయాడు పితృగృహోన్ముఖయైనది ఆ అవిభక్తశైవం అపర్ణ.

## శివుడు నర్తకవేషం దాల్చుట



పార్వతి కోసం హిమవంతుడిని యాచిస్తానన్నాడు గదా శివుడు అందుకని ఒకానొక నర్తకుడి వేషంలో హిమవంతుడి నగరానికి చేరినాడు. ఎడంచేత్తో కొమ్ము (బూరా) పట్టుకున్నాడు. కుడిచేత్తో డమరుకం మ్రోయిస్తున్నాడు. వెన్నున బొంత కట్టుకున్నాడు. వంటికి ఎర్రటి బట్టలు చుట్టుకున్నాడు. ఆ కొమ్ము బూరా వాయిస్తూ, ఈ ఢమరుకం మ్రోగిస్తూ చిత్ర విచిత్రంగా నర్తించసాగాడు. ఆ నర్తకుడిలో 'నర్తకుడి' రూపం తోచి పార్వతి మోహవివశయై మూర్ఛపోయింది. నర్తకుడి నటనా కౌశలాన్ని మేనకాదేవి మెచ్చుకుంది. అనేక రత్నాలతో కూడిన

పళ్ళెరాన్ని బహుకరించింది. ఆ నటుడది అంటుకోలేదు. "నాకీరత్నాలొద్దు. కన్యా రత్నమైన కాత్యాయనియే కావా" అన్నాడు. అలిగింది మేనక. అవతలకి పొమ్మంది నటుణ్ణి. గంగాస్నానం నుంచి అప్పుడే వచ్చాడు హిమవంతుడు. శివుడతనికి లీలచూపాలనుకున్నాడు విధి, విష్ణు, వివస్వదాది రూపాలనీ, చతుర్థ పురుషాకృతి యైన శివరూపాన్నీ కూడా కనబరచాడు.

"నీ నాట్యం బాగుంది గారడి బాగుంది. అంత మాత్రాన నా కూతుర్నిచ్చేది మాత్రం లేదు. నా కూతురు కేవలం శివునికే దత్తం" అనేశాడు గిరిరాజు. వెళ్ళి పోయాడు విశ్వంభరుడు. ఆయన వెళ్ళిపోయాక - అనుక్షణం యేదో వెలితిగా అనిపించసాగింది వారికి. ఆలోచించగా ఆలోచించగా ఆ నర్తకుడే శివుడని స్ఫురించింది. "అయ్యో ఆయన వచ్చి అమ్మాయి నడిగితే కాదనేశామే! అల్లుడు గారు అలుగుతారో యేమో!" అని ఆందోళన పడసాగినారు.

ఏది ఏమైనాసరే తమ కూతుర్ని మాత్రం శివుడికే కన్యాదానం చేయాలని పునః నిశ్చయించుకున్నాడు. అదే దీక్షగా వుండిపోయాడు హిమవంతుడు. తనకి వరం యిచ్చాడు గనుక - తప్పని సరిగా తనను మనువాడతాడనే నమ్మకంతో ధైర్యంగా వుంది పార్వతిదేవి. అమ్మవారి దీక్ష ఆనందమే గాని - కన్యాదానం విషయంలో హిమవంతుడి దీక్షే దేవతలకి కొంచెం చిక్కు తెచ్చేదిగా అయ్యింది. అంత పట్టుదలగా అమ్మవార్ని శివుడికి కన్యాదానం చేసినట్లయితే - హిమవంతుడు సద్యోముక్తిని పొందేస్తాడు. అంటే పురుషరూపంతో బాటు పర్వతరూపం కూడా పత్తాలేకుండా పోతుంది.

అప్పుడు భూమియొక్క తుల్యత (బేలన్సు) దెబ్బతినేస్తుంది హిమవత్పర్వతాలు లేకుండా భూగోళం యెలా తుల్యావస్థని పొందగలదు? పోనీ - విశాలమైన భూమి పొందిందే అనుకుందాం - ఈ హిమగిరులే గనక ఉత్తర సరిహద్దులు కాకపోతే భరతవర్షం గతేమై పోవాలి? కర్మభూమీ - పుణ్యభూమిగా కీర్తించబడ్డ లోకానికి మధ్య సంబంధ బాంధవ్యాలన్నీ సర్వనాశనం అయిపోయినట్లే గదా! అదంతా అలా వుంచినా - రత్నాల గుట్టకదా హిమాలయం ఆ హిమాలయం గూడా కైవల్యానికి వెళ్ళిందిరా అంటే రత్న సంపదంతా - మళ్ళా యెప్పుడో ప్రళయం వచ్చి - సృష్టి ఆరంభం అయ్యేదాకా బైటపడదు.

కాబట్టి - హిమవంతుడు కన్యాదానం చేసినా - అది యేకాగ్ర చిత్తంతోనే చేయాలి అని నిర్ణయించుకున్నారు దేవతలు, వెంటనే బృహస్పతి దగ్గరకు వెళ్ళారు. శివనిందా వాక్యప్రసంగంతో హిమవంతుడి మనసు వికలం చేయమని కోరారు. ప్రాణం పోయినా శివనింద చేయమనేనన్నాడు బృహస్పతి. బ్రహ్మని ఆశ్రయించ మని సలహా యిచ్చాడు. బ్రహ్మను చేరారు. బృందారకులు. తమ ఆలోచన చెప్పారు. నవ్వాడు విరించి - "కొడుకు బాగుండాలి, కోడలు యేదో అయిపోవాలి- అన్న సామెతగా వుంది మీ ఆలోచన. నేను శివనింద చేస్తానని యెలా వూహించారు? శివనింద చేయడం శివుడికే సాధ్యం ఆయనను ఆయనే తిట్టుకుంటే యే గొడవా వుండదు కనుక వెళ్ళి వున్న కష్టం యేమిటో ఆయనకే చెప్పుకోండి" అన్నాడు, బ్రహ్మతో సహా కైలాసం చేరారు దేవతలు. కష్టమేమిటో కపర్దికి విన్నవించుకున్నారు. త్రివిష్టపులు. శివుడు చిరునవ్వు నవ్వి - సరే మీరు వెళ్ళండి' అన్నాడు.

# శివుడు వైష్ణవ వేషంలో హిమవంతుని కలియుట



దేవతలు వెళ్ళగానే శివుడు హిమవన్నగరం చేరాడు. దండఛత్రాలు ధరించాడు. పులితోలు వదిలేసి పీతాంబరం కట్టుకున్నాడు. నిటలాన తిలకం దిద్దుకున్నాడు మెడలో సాలగ్రామం ధరించాడు. హరినామస్మరణ చేసుకుంటూ వచ్చాడు. బుద్ధిమంతుడైన గిరిరాజు ఆ మాయా వైష్ణవుని గౌరవించి కుశల ప్రశ్నాదికాలు జరిపాడు. తదుపరి ఆ వైష్ణవ వేషియైన విశ్వేశ్వరుడు యిలా చెప్పాడు "పదిమందికీ మంచి జరగాలనే తపనతో వుండేవాణ్ణి నేను.

నువ్వు నీ కూతురైన పార్వతిని ఆ యీశ్వరుడికిచ్చి పెళ్ళి చేయ్యాలనే తలంపుతో వున్నట్లుగా తెలిసింది. నీకో నాలుగు మంచి ముక్కలు చెప్పి పోదామని వచ్చాను. నీకా శివుడి గురించి పూర్తిగా తెలిసినట్లు లేదు. అతను వట్టి నిరాశ్రయుడు. ఎవరితోనూ కలుపుగోలుతనం లేని నిస్సంగుడు. సౌందర్యాది గుణాలులేవు. స్మశానవాసి, దిగంబరుడు, నాగభూషణుడు, కులగోత్రాలు లేనివాడు.

శృంగార విహారాలూ అవీ యెరుగని వాడు. బూడిదరాసుకుంటాడు. క్రుద్ధ భావంతో వుంటాడు. ఇంత వయస్సు అని చెప్పడానికి వీల్లేనంత వృద్ధుడు, జటాధారీ, నిత్యయోగీ భిక్షాటనపరుడూను, వేదమార్గ తిరస్కారి - ఇదీ ఆయన రూపం. టూకీగా చెప్పాను నీకు. ఇటువంటి వాడికి పిల్లనివ్వడం యెంతవరకూ సబబో బాగా ఆలోచించుకో. అతనికి హితవు చెప్పడానికి బంధువులూ వాళ్ళూ యెవరూ లేరు. నీకు అగణిత బంధు, పురోహిత, మిత్రకోటులున్నాయి. అందరి తోటి ఆలోచించి మరీ రంగంలోకి దిగు. ముందుగా పిల్లని కన్న తల్లీ, సాక్షాత్తూ నీ జీవనభాగస్వామిని అయిన మేనకతోటి, ఆమె తరపు వాళ్ళతోటి కూడా సంప్రదించు. రత్నాల రాశులున్న వాడివి నువ్వు, చిల్లపెంకు ఆస్తిగాని సంపాదనగాని ఏమీలేనివాడూ శివుడు. ఇక నీ యిష్టంమరి' అంటూ కవిర్యైన శివుడు శబ్దజాలం చేసి చక్కా పోయాడు.

హిమవంతుడు ఆలోచనలో పడ్డాడు. మేనకాదేవి ఆవేదనలో పడిపోయింది. ఆరు నూరయినా తన కన్న కూతురినా భిక్షుకుడికి యివ్వనంది. 'ఓ పతిదేవా! ఒకవేళ మీరు నా మాట కాదని, పార్వతి నా పనికిమాలిన వాడికిచ్చి చేసేలావుంటే, - నేను విషం త్రాగి చచ్చిపోతాను. లేదా, యిల్లొదిలి పెట్టి వెళ్ళిపోతాను. నా కూతుర్ని తగిలించుకుని అడవులట్టుకు పోతాను. లేదంటే సముద్రంలో దూకుతాను. అంతేగాని ఆ శివుణ్ణి మాత్రం అల్లుణ్ణి చేసుకోనుగాక చేసుకోను" అని తెగేసి చెప్పేసింది. మెడలోని విలువైన హారాలను తెంపి పోగులు పోసింది. కోపగృహానికి వెళ్ళిపోయింది. పార్వతిని శివుడికే కన్యాదానం చేయాలనే దీక్షలో వున్న హిమవంతుడి మనసు చలించింది.

## సప్తర్షులు హిమవంతుడితో సంప్రదించుట

దేవకార్యాన్ని నిర్వర్తించిన తదుపరి కైలాసంచేరి సప్తర్షుల్ని స్మరించాడు. శివుడు. నమ శ్శబ్దాలతో ఆయన ముందు మోకరిల్లారు సప్తర్షులు. జరిగిందంతా వారికి చెప్పాడు శివుడు. "దేవతల హితవుకోసం నేను చేయాల్సింది నేను చేశాను. జగద్ధితాన్ని కోరి మీరు చేయాల్సింది మీరు చేయండి". అని ఆజ్ఞాపించాడు. తక్షణమే హిమవంతుడి నగరమయిన ఓషధి ప్రస్థానికి తరలి వెళ్ళిందా తాపసి సప్తకం. అరుంధతీ సమేతంగా అరుదెంచిన ఋషి మండలాన్ని ఆదరించాడు

తుహిన గిరీంద్రుడు. శివపార్వతుల కళ్యాణ విషయమై కదిపారు వాళ్ళు. కొండరాజు కొంచెంసేపు నీళ్ళునమిలాడు, చివరగా - "మేనక మనసు పాడైంది. ఇటువంటి కార్యాలలో ఆడవాళ్ళదే కదా అగ్రస్థానం, ఆమెను అంగీకరింపచేయండి." అని కోరాడు. త్రిలోకవంద్యాపావన చరిత్రా అయిన అరుంధతి మేనక చెంతకు చేరింది. సప్తర్షులూ శైలేంద్రుడికి హితబోధ చేయసాగారు. అంతా విన్న హిమాలయుడు చేతులు జోడించి"మీరు యెన్నైనా చెప్పండి.



ఆడపిల్లని కన్నవాళ్ళు- తమ బిడ్డని తమకన్న పెద్దింటికి పంపాలనే అనుకుంటారు/పోనీ సమస్థులకైనా యివ్వోచ్చు, కాని బొత్తిగా యిలా రూప వయో గుణాదులేవి లేని వాడికి యివ్వడం యేపాటి న్యాయమో ఆలోచించండి రేపు అమ్మాయి కాపరానికి వెళ్ళాక పిల్ల అక్కడ సుఖ పడాలికదా! అందుకు తగ్గ ఆదాయం, ఆస్తీ ఏమైనా వున్నాయా ఆయనకి! మీమాట కాదనడంలేదు సుమా! మీరెలా చెబితే అలాగే చేస్తాను.

ఎటొచ్చీ పిల్లనిచ్చే విషయంలో పెద్దలమాట వినడం తప్ప మనస్ఫూర్తిగా యివ్వలేను అన్నాడు. నవ్వుకున్నారు ఋషులు - "శహబాసోయ్ హిమవంతా! చివరికి నువ్వు శివుడి ఐశ్వర్యాన్ని శంకించే స్థాయికి వచ్చావన్నమాట. కోవేదశంకరో దుఃఖీ-కుబేరో యస్యకింకరః- సర్వ సంపదలకీ సార్వభౌముడైన కుబేరుడంతటి వాడు ఏ శివుడి ముందు పాలికాపై పడుంటాడో ఆ శివుణ్ణా దరిద్రుడనుకోవటం! సరేవదిలెయ్.

నువ్వు ఔనన్నా కాదన్నా ఆ పార్వతమ్మ యెటూ ఆయిన దగ్గరకే చేరుతుంది. ఆవిడెటూ ఆయన సొత్తే. నువ్వు కన్యాదానం చేస్తావన్న పేరేతప్ప ఆయన పొంద దల్చుకున్న దానిని యెవడాపగలడయ్యా!" అన్నాడు. హిమవంతుడు వారి హిత బోధలతో యిబ్బంది పడ్డాడు. గమనించాడు వశిష్ఠుడు, మృదువుగా చెప్పసాగాడు "కొండరాజా! ఆడపిల్లను కన్న వాళ్ళకి యిటువంటి యిరుకు పరిస్థితులు రావడం సహజమేనయ్యా, ఇవ్వేళ నువ్వేకాదు ఒకప్పుడు అరణ్యుడింతటి వాడు కూడా నీలాగే సందిగ్ధ పరిస్థితిలో పడ్డాడు" అది విని - అరణ్యుడి కథ చెప్పమని కోరాడు వశిష్ఠుడు చెప్పసాగాడు.

# అరణ్యుని కథ

ఈ కాలంలో కొండల గండడివిగా నువ్వెంత వాడివో ఆ రోజులలో అరణ్యుడు కూడా అంతటివాడు. పధ్నాలుగో మనువైన ఇంద్రసావర్ణి వంశంలో మందారణ్యుడనే రాజుకు కుమారుడుగా పుట్టాడు. ఏడు ద్వీపాల్ని యేకచ్ఛత్రాధిపత్యంగా పరిపాలించాడు. భృగుమహర్షిని పురోహితుడిగా వుంచుకుని వంద యజ్ఞాలు చేశాడు. దేవతలంతా వచ్చి ఇంద్ర పదవిని స్వీకరించమని వాళ్ళకు వాళ్ళుగా కోరినాసరే - అంగీకరించలేదు అరణ్యుడు. అతనికి అయిదుగురు భార్యలు పదిమంది కొడుకులు ఒక్కగానొక్కతే కూతురు. ఆనాటి అందగత్తెలందర్నీ క్రిందు చేసేసిన ఆ సౌందర్యవతి 'పద్మ' అనే పేరుతో విరాజిల్లినది. యుక్తవయస్కురాలై రాజలోకం మొత్తాన్ని మోహంలో ముంచేస్తోంది.

అలా వుండగా పిప్పలాదుడనే ఋషి వుండేవాడు. విధివశాన గంధర్వుల కామకలాపాలు తిలకించి కాముకుడై, గృహస్థాశ్రమలాలసుడై, తగినకన్యకోసం వెతకసాగాడు. ఒకనాడు పుష్పభద్రానదిలో స్నానార్థం వెళ్ళిన పిప్పలాదుడు ఆ పద్మను చూసి మనసు పారేసుకున్నాడు సరాసరి మహారాజు దగ్గరకు వెళ్ళి " నీ కూతురు పద్మను నాకిచ్చి పెండ్లి చేయవయ్యా" అన్నాడు. త్రుళ్ళిపడ్డాడు అరణ్యుడు. శివాజ్ఞ వలెనే బ్రాహ్మణాజ్ఞ కూడా శిరోధార్యం కదా భూపతులకి! కానీ, వయసై పోయినవాడికి, ఆస్తీ పాస్తీ లేని వాడికి, ముక్కు మూసుక్కూర్చోవడం తప్ప ముద్దూ ముచ్చటా యెరుగని వాడికి, పద్మ వంటి వయోరూపగుణ లావణ్యవతియైన పిల్లనివ్వడం అంటే కష్టంగానే వుంటుందిగదా! అదే మధనపడ్డాడు అరణ్యుడు, మౌనంగా వుండిపోయాడు.

పిప్పలాదుడు వూరుకోలేదు. తనకు కన్యాదానం చేయని పక్షంలో రాజ్యం అంతా సర్వనాశనం చేసేస్తానన్నాడు. అదో భయం అటు అంతఃపురంలో చూస్తే రాణులంతా ఘోడు ఘోడున విలపిస్తున్నారు. "డబ్బూదస్కం యెవడిక్కావాలి? ఆశ్రమంలో వున్నా అంతఃపురంలో వున్నా ఆరోగ్యంగా యవ్వనంతో వుండి పిల్ల యవ్వనం వృధా కాకుండా ఆమెను సుఖపెట్టాలి గదా!" ఆ అవకాశం యీ ముసలి వాడికి లేదు కదా!" అని వాపోయారు రాణులు. గురు, వృద్ధ, బంధు, పురోహిత, బ్రాహ్మణులందర్నీ పిలిచాడు అరణ్యుడు కర్తవ్యాన్ని వుపదేశించమన్నాడు. "అయ్యా! చిన్నాచితుకూ రాజ్యం కాదు నీది, ఏడు దీవుల ప్రాణికోటి నీరాజ్యం.

అంచేత ఒక్క కూతురు సుఖంకోసం యిందర్నీ బలిచేయడం కన్న, యింతమంది సుఖంకోసం ఆ ఒక్క పిల్లనీ కన్యదానం చేయ్యడమే మంచిది.

కోరి వచ్చాడు కాబట్టి సుఖం సంగతెలా వున్నా అమ్మాయిని యెక్కువగా కష్టపెట్టడనిపిస్తోంది. నువ్వు రాజువు గనుక తుది నిర్ణయం నీ యిష్టం" అని చెప్పారు వాళ్ళు హిమవంతా! అరణ్యుడు కూడా నీకుమల్లేనే బుద్ధిమంతుడూ, యోగ్యుడూను. పెద్దల హితవు విన్నాడు. కూతుర్ని సర్వాలంకార భూషితురాలిని చేసి అప్పటికప్పుడే ఆ పిప్పలాదుడికి కన్యాదానం చేసేసాడు. రాజ్యం సుఖపడింది. ఏడు దీవుల ప్రజలూ ఆపదనుంచి బైటపడ్డారు, ఇదీ విషయం" అని వశిష్ఠుడు ఆపాడు. హిమవంతుడేమీ తక్కువవాడు కాదుగదా! అందుకని మరింత వినయంగా చేతులు జోడించి "చిత్తం సత్యవాచకులు మీరు, పిప్పలాదుడితో పెండ్లి అయ్యాక ఆ పిల్ల యేమైందో యేమిటో కూడా సెలవీయండి" అన్నాడు. ముసి ముసి నవ్వులు నవ్వాడు వశిష్ఠుడు, "నీ వుద్దేశ్యం బోధపడింది. కాని, నువ్వనుకున్నట్లు ఆ పిల్లేమీ యిబ్బందులు పడలేదు లేవయ్యా" అంటూ పద్మావతిని గురించి ప్రవచించసాగాడు.

## పద్మయొక్క పాతివ్రత్య మహిమ



ఋషిత్వానికీ, తపస్సుకీ ఆ కాలంలో వున్న విలువే వేరు. ఋషి పత్ని కావడం అంటే యెన్నో పూర్వ జన్మల సుకృతంగా భావించేవారు. పద్మకూడా అలాగే భావించింది. భర్త సేవే బ్రతుకుకు ధన్యత్వం అనుకుంది. అత్యంత శ్రద్ధాభక్తులతో ఆయనను కొలుచుకుంటోంది. ఒకనాడు ఆమె జలపాతం దగ్గర స్నానానికి వెళ్ళింది. అక్కడక్కడ ధర్మదేవత - ఒక రాజు వేషంలో కనిపించాడు. పద్మ సౌందర్యాన్ని వర్ణించాడు. ఆ ముసలి మొగుణ్ణి వదిలి పెట్టేయమన్నాడు. ఇద్దరం కలిసి లేచిపోదాం అన్నాడు. ఇంకా యెన్నెన్నో ఆశలు చూపినాడు. ఏం ఫలితం లేకపోయింది. నుతి మెత్తగానూ, ఘాటుగానూ కూడా చీవాట్లు పెట్టిందతనికి. "కాలక్రమాను గుణంగా క్షీణించి పోతావు" అని శపించింది. అదిరిపడ్డాడు ధర్మదేవత, తన నిజరూపముతో ఆమె ముందు తోచాడు. ఆమె పాతివ్రత్యాన్ని శ్లాఘించాడు.

తానెవరో తెలియజేసుకున్నాడు. పద్మ రవ్వంత బాధపడింది. ఎవడో మర్త్యుడు లెమ్మని అలా శపించింది కాని ఆ శాపఫలంగా ధర్మమే క్షీణించిపోతే ప్రమాదం గదా! అందుకని ఆలోచించి - "ధర్మదేవా! నువ్వెవరో తెలియక అలా శపించాను, ఇప్పుడు నా శాపాన్ని వెనక్కి తీసుకుంటే సాధ్వీమణులమాటకు విలువ లేకుండా పోతుంది. అందువల్ల నా శాపంలో కొన్ని మార్పులు చేస్తున్నాను, నువ్వు కృతయుగములో నాలుగు పాదాలూ పూర్ణంగానూ, త్రేతాయుగంలో త్రిపాదివి గానూ, ద్వాపరంలో ద్విపదుడివిగానూ, కలియుగంలో ఏక పాదా వశిష్టుడివై - కల్పాంతానికి అది కూడా కరవై నశిస్తావు. కాని, కాల భ్రమణంలో పునఃకృతయుగం రాగానే నాలుగు పాదాలతో విరాజిల్లుతావులే" అని హితవు పలికింది. ధర్ముడు కూడా ఆనందించాడు. "నీ నీతి నియమాలకీ, బుద్ధినైశిత్యానికి నాకు చాలా ఆనందం కలిగినది. నువ్వు కోరకపోయినా నీకు వరాలను యిస్తున్నాను. కాదన కుండా స్వీకరించు. నీ భర్త యౌవనుడై రతి ప్రాగల్భ్య సంపన్నుడగుగాక! సంతాన లబ్ధికి వలసిన స్థిరయౌవనవంతుడు, మార్కండేయుడిలా చిరంజీవి, కుబేరుడి కన్న స్థిర ధనికుడూ, ఇంద్రుడి కన్న వీర్యవంతుడూ విష్ణువు కన్న శివభక్తుడూ, కపిలుడి కన్నా సిద్ధుడూ, బృహస్పతికి సమానుడైన బుద్ధిమంతుడూ అగుగాక! నువ్వు జీవించినంతకాలం సుమంగళివై యుండెదవు గాక. నీ భర్తను మించిన సద్గుణగరిష్ఠులైన పదుగురు పుత్రులను కనిసుఖించెదవు గాక" అని దీవించాడు. ధర్ముడిచ్చిన వరాలతో పద్మ యెంత సుఖపడిందో వేరుగా చెప్పనక్కరలేదు. అంతేకాదు పతివ్రత లందరిలోనూ అగ్రశ్రేణి నధిరోహించి, పుట్టింటిని పునీతం చేసింది - అని చెప్పాడు వశిష్ఠుడు, తుదిగా పార్వతిని పరమేశ్వరుడి కివ్వడానికి అంగీకరించాడు హిమవంతుడు. అరుంధతీ హితబోధలను విని మేనక కూడా అంగీకరించింది. అప్పటికప్పుడే నిశ్చయ తాంబూలాలు అందుకున్నారు వచ్చిన పని సఫలం కావడముతో ఋషిసప్తకం-అరుంధతీ సమేతంగా శివ సన్నిధికై అంత ర్హితమైంది. శంభుడికా శుభవార్త వినిపించి వారి స్థానాలకు వారు వెళ్ళిపోయారు.

## శివపార్వతుల పెండ్లి ముచ్చటలు

సప్తర్షులను పంపిన అనంతరం హిమవంతుడు తమ కులపురోహితుడైన గర్గుణ్ణి ఆహ్వానించి లగ్నపత్రిక వ్రాయించాడు. తన కుమారులైన మైనాకాదులకిచ్చి - దానిని శివుడికి పంపించాడు. శివుడా లగ్నపత్రికని స్వీకరించాడు. అది తెచ్చిన

వారిని సత్కరించాడు. వారిని సాగనంపిన తదుపరి నారదుణ్ణి స్మరించాడు శివుడు. వచ్చాడు నారదుడు. తన పెళ్ళికి అందర్నీ ఆహ్వానించే కార్యాన్ని అతనికి అప్పగించినాడు. తక్షణమే బయలుదేరాడు నారదుడు.



ఓం ప్రథమంగా విష్ణుమూర్తి వచ్చాడు. పెళ్ళి హడావిడితో గరుడవాహనా రూఢుడై, వామాంకాన కలుములతల్లితో, వెనుకనపారిషదులతో, యెక్కడలేని అట్టహాసంతోనూ వచ్చాడు. ఆయన అడుగు పెట్టడంతోనే క్రొత్తకళ వచ్చేసింది కైలాసానికి. శివుడికి - సతీ సమేతంగా అభివాదం ఆచరించి ఆయనచే నియమింపబడిన ఆసనాన్ని అధిష్ఠించాడు అనంతుడు. ఆ వెనకే హంసవాహనా రూఢుడై అజుడు సావిత్రీ, సరస్వతీ, గాయత్రీ సమేతంగా వేంచేశాడు, శివుడికి మ్రొక్కి ఆయన చూపించిన ఆసనాన్ని అలంకరించాడు. వారి తర్వాత దేవేంద్రుడు వచ్చాడు. అంతలోనే తక్కిన దేవతలు రివ్వురివ్వున వచ్చి వాలారు.

## శివుడు పెండ్లికొడుకుగా మారుట

శివుణ్ణి పెళ్ళికొడుకును చేయడం కోసం సప్తమాతృకలూ స్వయంగా వచ్చారు. శివుణ్ణి అలంకరించబోయారు. వాళ్ళింకా 'అలంకరించాలి' అనుకుంటూనే వున్నారు - వాళ్ళ మనస్సుల్లో యెలా అలంకరించాలని వుందో - అలా మారిపోయాడు శివుడు.

నిటలాన నిప్పుకన్ను నిలువు తిలకమయ్యింది. చెవులకు వ్రేలాడే సర్పాలు కర్ణకుండలాలుగా మారాయి. తదితర సర్పాలు ఆయా అవయవాలకి అలంకరింపబడే సువర్ణాభరణాలై పోయాయి. మేనిమీద చితాభస్మం సుగంధ భరితమైన అంగలేపనం అయ్యింది. ఏనుగుతోలు పట్టు తాపితాగా పరిణమించింది. ఆ రూపాన్ని చూసి అందరూ ఆశ్చర్యపోయారు. భక్తి ప్రపత్తులతో నమస్కరించారు. అనంతరం విష్ణువు "శివా! నీ వివాహం పూర్తి వైదిక విధానంతో జరగాలని నా కోరిక. ఇప్పుడు నీ పెళ్ళి యెలా జరిగితే - లోకంలో తక్కిన పెళ్ళిళ్ళన్నీ అలాగే జరుగుతాయి. అందువల్ల నందిముఖం స్థాలీపాకంలాంటి వైదికకర్మలతో కూడుకునేలా వివాహ విధి ఉండాలి." అని ప్రార్థించాడు. ఉత్తి పుణ్యానికే అడిగిన వరాలిచ్చేసే

దయామయుడాయన. ఇప్పుడు పెండ్లికొడుకు కూడా అయ్యాడేమో - మరింత విరివిగా వరాలిచ్చేస్తున్నాడు. ఎటూ అమ్మవారి కోసం లౌకిక వివాహ లీల ప్రదర్శింప బోతున్న స్వామికి విష్ణువు కోరిక యేపాటిది? సరేననేశాడయన. తక్షణమే బ్రహ్మ దేవుడు ముందుకువచ్చి - అభ్యుదయ కర్మకాండ గావింపచేశాడు. ఎందరెందరో విప్రులు, అత్రి, అగస్త్యుడు, అరుణపాలుడు. ఉపమన్యుడు, కణ్వ కశ్యపకుశిక కౌత్సులు, గురుగర్గ్య గౌతమాదులు, చ్యవన జమదగ్నులు, దధీచి, పిప్పల, పరాశర, బృహస్పతులు, భరద్వాజ భాగుర్యాదులు, మార్కండేయుడు, వశిష్ఠ వేదవ్యాసులు, శక్తి శిలాశిలాపాకాదులు ఒకరేమిటి - అనేకానేక మహర్షులు తమ శిష్య ప్రశిష్య గణాలతో సహా వచ్చి బ్రహ్మ చెప్పిన పద్ధతిలో వివాహారంభ ప్రక్రియను ప్రవర్తింప చేశారు. పెండ్లికి బయల్దేరారు మగపెళ్ళివారు.

ఒకళ్ళా - యిద్దరా? క్షేత్రపాలక భైరవులు తమ సమస్తగణాలతోటి వచ్చారు. అటు విష్ణుపారిషదులు-బ్రాహ్మణులు, సర్వాభరణాలతో ముప్పైమూడు కోట్లమంది దేవతలు, ఆ దేవతలకన్నా అనేక రెట్లుగా సుమారు ఇరవై యెనిమిది లక్షల కోట్ల గణాలతో విశాఖ, శంఖవర్ణ కేకరాక్షాది గణాలు-విజయ, వినోద మంగళాట్ట హాసాలతో తరలివచ్చారు. శాకినీశక్తులు, యాతుధానులు, భేతాళులు, బ్రహ్మరాక్షసులు, భూతప్రేత పిశాచాలు-వాటి అల్లరికి అంతే లేదు. వాటికి పూర్తి వ్యతిరేకమైన ధోరణిలో శతమర్కట తుల్యుడైన బ్రహ్మచారి నారదుడి అధ్వర్యంలో తుంబుర, హాహా, హూహూ యిత్యాది గంధర్వుల వీణామృదంగాది మంగళవాద్య ఘోషలు ఒక అందంగా వెలుగొందుతున్నాయి. వీళ్ళూ వాళ్ళూ అని చెప్పటం ఎలా సాధ్యం? దేవుడి పెళ్ళికి అందరూ పెద్దలే కదా!

## వియ్యాలవారి వైభవం

ఇక్కడ హిమవంతుడు - విశ్వకర్మను పిలిచి అద్భుతమైన కళ్యాణ మండపాలూ, విడుదులూ నిర్మింపచేశాడు. ఆ కళ్యాణ మండపాలను రాబోయే విధివిష్ణ్వాది దేవతల విగ్రహాలతో అలంకరించాడు. ఎవరు చైతన్యమూర్తులో ఎవరు శిల్పాలో తెలియనంత గమ్మత్తుగా చేశాడు విశ్వకర్మ. ముందుగా వెళ్ళిన నారదుడు-తన శిల్పాన్ని చూసితనే ఆశ్చర్యపోయాడు. తనకన్న ముందుగా దేవతలెలా వచ్చారో దేవతలెలా వచ్చారో అతగాడికి అర్థం కాలేదు. కాస్సేపు ఆలోచించాక, ఇదంతా

విశ్వకర్మ యొక్క కళా నైపుణ్యంగా గుర్తించి సంతసించాడు. శివ పరివారాన్ని చేరి - యీ చిత్రములన్నీ చెప్పి వారిని ఆనందపరిచాడు. వచ్చిన మగపెండ్లి వారిని చూసి ఆడపెళ్ళివారు అబ్బురపడిపోతుంటే, ఆడపెళ్ళివారు చేసిన యేర్పాట్లకీ, చేస్తున్న అతిథి మర్యాదకి మగ పెళ్ళివారు తెగ మురిసిపోయారు. నగరపు మొగసాలలో ఆగారు శైవులు. వారిని ఆహ్వానించి వెళ్ళారు పర్వతులు. పునరాహ్వానార్ధం తన పుత్రులను పంపాడు పర్వతరాజు. బయల్దేరారు శైవులు.

## అల్లుణ్ణి చూడటం కోసం మేనక తహతహలాడుట



మగపెండ్లివారు వస్తున్నారని తెలియగానే - మేనకాదేవికి ఓ కోరిక పుట్టింది. తన కూతురు అంతగా కష్టపడి తపస్సు చేసిమరీ వరించిన శివుడెలా వుంటాడో చూడాలనుకుంది. వెంటనే నారదుడికి కబురుపెట్టినది. పెండ్లి వారంతా వూరేగింపుగా వస్తుంటారు కదా! వారిలో పెండ్లి కొడుకుని చూపించుమని కోరిందావె. అలాగేనన్నాడు నారదుడు.

మహా ప్రవవాహంలా వస్తోంది మగపెండ్లివారి వూరేగింపు. ఇక్కడ మేనక మనసులో వున్న మాట- అక్కడున్న శివుడు పసిగట్టాడు. మరొక్కసారి లీల చూపించాలనుకున్నాడు, ఎవరెవరి పరివారాలతో వాళ్ళు ఒకళ్ళొకళ్ళుగా వెళ్ళమని ఆదేశించాడు. ముందు దేవతా సైన్యం వెళ్ళింది. మేనకా సైన్యమూ అదీ వచ్చింది. ఆ వెనక గంధర్వులు వెళ్ళారు. ఆ గంధర్వగణాధిపతియైన వసువును చూసి - "నారదా! అతనేనా నాకు కాబోయే అల్లుడు?" అని అడిగింది. "అబ్బెబ్బె - ఈ వసువు మీ అల్లుడి బానిసలకు బానిస తల్లీ" అన్నాడు నారదుడు. "ఓహో" అనుకుని నిరీక్షించసాగింది. యక్షపతి మణిగ్రీవుణ్ణి చూసి-"ఇతడేనా కాలగ్రీవుడు?" అని అడిగింది. కాదని చెప్పాడు నారదుడు. ఈ విధంగా ఆవిడ కంటికి యెవరు కాస్త నదురుగా ఆనితే 'వారేనా పెళ్ళికొడుకా! అని అడగడం, నారదుడు కాదని చెప్పడం జరుగుతోంది.

మేనకలో ఆత్రం పెరుగుతోంది. పెళ్ళివారి వూరేగింపేమైనా చిన్నదా అంటే కొండవీటి చేంతాడంత వుండెనాయె. ఇంతలో రానే వచ్చాడు ఈశ్వరుడు. బహుశ! పెళ్ళికొడుకు వేషం వేస్తే యెవరికైనా అలాటి చిలిపి ఆలోచనలే వస్తాయేమోమరి! అప్పటిదాకా అందగాళ్ళకు అందగాడిలావున్నా ఆ శివుడు కాస్తా - అయిదు ముఖాలూ, మూడుకళ్ళూ, విబూదిపట్లు, పుర్రెలమాలా, పులితోలూ, పినాకం, త్రిశూలం జడలు కట్టేసిన తలతో ఊహించరానంత వికృతంగా కనిపించడం మొదలెట్టాడు. ఘొల్లుమంది మేనక. కథ మళ్ళీ మొదటకొచ్చింది. ఆ వికార రూపుడికి నా పిల్లను యివ్వనుగాక యివ్వను- అంటూ శోకస్నానాలు మొదలెట్టింది.

ఎవళ్ళు చెప్పినా వినడంలేదు అయినా యింక సమయం దొరికినట్లు అప్పుడే చూపాలా అలాటి లీలలన్నీ ఆయన? ఆలోచించాడు విష్ణువు. నారదుణ్ణి పిలిచాడు. "నువ్వెళ్ళి శివుణ్ణి స్తుతించు. ఆయనను ప్రసన్నుణ్ణి చెయ్యి ఈ మేనకాదేవి శివ సౌందర్యం పట్ల శంకాకులితురాలు కావడం వల్లనే క్రుద్ధుడయ్యాడా శివుడు. త్వరగా వెళ్ళు" అని పంపినాడు. వెనువెంటనే నారదుడు శివుణ్ణి చేరాడు. ఎంత కీర్తించాలో అంత కీర్తించాడు. ప్రసన్నుడయ్యాడు పరముడు. వికృతరూపం నుంచి పరమనాగరికమూ తిరస్కృత శతకోటి మదన సౌందర్యమూ అయిన సుందర రూపంతో దర్శనమిచ్చాడు. ఆ రూపాన్ని చూస్తేనే మేనకాదేవి - జరిగినదంతా పీడ కలగా మర్చిపోయింది. ఎలా వున్నాడా వరుడు?

## అత్తను మెప్పించిన అల్లుడిగా శివుడు



చంపకవర్ణ సన్నిభంగా వున్నాడు సదాశివుడు. ఏకవదనుడై వున్నాడు. త్రినేత్రుడై వున్నాడు. చిరునవ్వుతో వెలుగొందుతున్నాడు మెడలో జాజిపూల దండ ధరించాడు. పల్చటి పట్టుతాపితా కట్టుకుని పట్టుకండువా పైన వేసుకుని వున్నాడు. శ్రీగంధం, అగరు, కస్తూరీ మిశ్రితమైన కుంకుమతిలకం (పెండ్లి బొట్టు) ధరించాడు. ఒకచేత అద్దంపట్టుకున్నాడు. ఆనందంలో/ఆర్ద్రమైన నేత్రాలూ, హృదయంతోనూ -కంపిత హస్తాలతోనూ పట్టలేని ఆనందాన్ని మంగహారతిగా మలచింది మేనకాదేవి. స్వామికి మంగళనీరాజనా లర్పించింది. అది చూసి విష్ణ్వాదులందరూ ముసిముసిగా

నవ్వుకున్నారు. హిమవంతుడికేమి పాలుపోలేదుగాని - భార్యని సమర్థించు కోవడానికికా అన్నట్లు "వెర్రిది! అత్తకు అల్లుడాశ అనే సామెతని రుజువుచేసింది" అని మాత్రం అన్నాడు.

ఇక అక్కడ 'అమ్మ' సంగతి చూద్దాం, సర్వాలంకారభూషితను చేసారామెను, కులదేవతా పూజార్థం అంతఃపురం నుంచి వెలుపలికి తీసుకువచ్చారు. అప్పటిదాకా శివసౌందర్య వీక్షణానికే కళ్ళప్పగించిన ప్రాణికోటి సమస్తం-ఇప్పుడు అమ్మవారి అతిలోక లావణ్యాన్ని చూసి నోళ్ళు వెళ్ళబెట్టేసారు. నల్లటి కాటుకరంగుతో మిల మిలా మెరిసిపోతోంది. ఆమె శరీరం. ధరించిన నగలకి అందాలనాపాదిస్తున్నాయి ఆవిడ అవయవాలు. శివునిచేత మాత్రమే గౌరవించబడే కనుకొనలావిడవి, ఇతరుల చూపుల్ని తొలగింపచేసే నేత్రాలా తల్లివి. నవ్వీ నవ్వనట్లుగా వుండే నగుమోము ఆ మాతది. సర్వప్రేక్షక జనమనోరంజకమైన వేణియామెది. కస్తూరీ యుతమైన సింధూర తిలకాన్ని, ధరించిందామె. రత్నకుండల కాంతులతో చేరి మరింత శోభాయమానంగా ప్రకాశిస్తున్న చెక్కిళ్ళావిడవి, ఆరమగ్గినదొండపండు వంటి క్రీపెదవియామెది. ఒక చేత అద్దాన్నీ మరోచేత క్రీడాకమలాన్ని ధరించినది. వినసొంపైన ధ్వనులు చేసే అందెల్ని ధరించింది. పారాణీయుతమైన పాదాలామెవి. యెఱ్ఱనెఱ్ఱని అరికాళ్ళతో అలరారుతోందామె. మెల్లమెల్లగా - సర్వస్వాన్నీ అష్టమూర్తిలో స్పందించే హృదయమంత సుతిమెత్తగా అడుగులో అడుగు వేసుకుంటూ వెళ్ళి కుల దేవతారాధన ముగించిందా తల్లి.

## పెండ్లి పీటలు

పెండ్లి కుమారుణ్ణాహ్వానించమన్నాడు గర్గాచార్యులు నిష్కళంకులయిన శ్రోత్రియ బ్రాహ్మణులతో కలసి వెళ్ళి ఆహ్వానించాడు. హిమవంతుడు. శివుడు మంగళస్నానం చేశాడు. శ్రేష్ఠమైన దుస్తులు ధరించాడు. నందినెక్కి పెళ్ళిపందిరి వైపు కదిలాడు.

"తీసుకు రండయ్యా పెళ్ళికూతురును" అన్నారు పురోహితులు, తెచ్చారు పార్వతిని. సుముహూర్తవేళ, సుమంగళ స్వరాలతో దివ్య మంత్రాలు పఠింపబడు తుండగా - పార్వతి శివుడిపై మంగళాక్షతలు వర్షిస్తూ-ఎనలేని తృప్తితో కూడినదై - ఆయన యొక్క ముఖ ప్రసన్నతా మాధుర్యాన్ని గ్రోలసాగింది. సుమంగళులు

వారికి నీరాజనములు సమర్పించసాగారు. "కానీయవయ్యా కన్యాదానం" అన్నాడు గర్గుడు. వెంటనే సువర్ణకలశానీతపూత జలాలతో - వరుడికి పాద్యాది సమర్పించారు. చందన తాంబూలయుత వస్త్రాలతో సత్కరించినారు. దైవజ్ఞులు తిధివార నక్షత్రాదులను పలుకుతున్నారు. ఆ సమయంలో జరగాల్సిన తంతు ప్రకారం - హిమవంతుడు - శివుణ్ణి "తమ కులం, గోత్రం, నామధేయం, వేదం, శాఖ- యిత్యాదులు త్వరగా సెలవిస్తే ప్రవర పఠించాలి" అన్నాడు.

శివుడు మౌనం వహించాడు. ఆ మౌనం బైటపడకుండా - నారదుడు అదే పనిగా వీణ మీటడం ఆరంభించాడు. ఎవరు చెప్పినా వీణ నాపలేదతను. చివరకు హిమవంతుడు బలవంతం చేసి ఆపించాడు. అప్పుడు నారదుడు నవ్వుతూ - "బ్రహ్మ విష్ణువులకే అంతుపట్టని రుద్రుడి కులగోత్రాలడుగుతున్నావేమిటి బండల గండా! యే రుద్రుడికి ఒకరోజు గడిస్తే కోటి బ్రహ్మలు గతించి పోతారో" అటువంటి శివుడికి ప్రవర చెబుతావా మంచుకొండలరేడా! ఎవడు పరబ్రహ్మమో, ఎవడు నిర్గుణుడో, ఎవడు నిరాకారుడో, ఎవడు ప్రకృతికి అతీతుడో, నిర్వికారుడో, పరాత్పరుడో, సమానాధికవర్జితుడో సమస్తమూ తానేయైనవాడో, సర్వనాముడో, నామ సర్వస్వ మూర్తిత్వమో-ఆయన పేరూ, గోత్రమూ కావాల టోయ్ రాళ్ళరాజా? నీ కూతురు చేసుకున్న పుణ్యం పండి -"అల్లుడిగా వచ్చినందుకు- ఆయన్న డగాల్సిన మాటేనటయ్యా యిది జడగండా? అయినా చెబుతాను విను శివుడు నాదమయుడు.

నాదం శివమయం, నాదానికి కులం గోత్రం యేముంటాయో అవే ఆయనకీ వుంటాయోయ్" అంటూ పెట్టాల్సిన నాలుగూ నిష్కర్షగా పెట్టేశాడు. "అంచేతనే నీ ప్రశ్నలకి జవాబుగా వీణను నాదింప చేశాను. నీకు అర్ధం గాలేదు. వాచ్యమైతేగాని అర్ధం జేసుకోలేని నువ్వు అవాఙ్మానస గోచరమైన శివతత్త్వాన్ని యేం తెలుసు కుంటావయ్యా యింక." అని కూడా అనేశాడు.

అందరికి కనువిప్పయ్యింది హరిబ్రహ్మాదులు నారదుణ్ణి మెచ్చుకున్నారు. "గిరిజజనులారా! ప్రవరలడుగ తగినవేళ కాదుగాని - ముహూర్తం మించిపోకుండా కన్యాదానం కానివ్వండి" అన్నారు.

'ఓం-'తస్మైరుద్రాయమహతే' అనే మంత్రంతో ఆరంభించి "ఇమాం కన్యాం తుభ్య మహం దదామి పరమేశ్వర

భార్యార్థం పరిగృహ్ణీష్వ-ప్రసీద! సకలేశ్వర”

అంటూ అమ్మవారి చేతిని - అయ్యవారి చేతిలో వుంచి కన్యాదానం చేసాడు హిమవంతుడు. అన్ని రకాలైన కోరికల సముద్రాన్నీ అవలీలగా తరించిన ఆనందం పొందాడా తుహినాచలాధీశుడు.

లోకరీతిని పాటించాడు లోకేశుడు-“కో దాత” అంటూ భూమిని స్పృశించాడు. గిరిజాపాణిగ్రహణం గావించాడు. నమఃశబ్దాలతోనూ, జయజయశబ్దాలతోనూ నభోంతరాళాలు నిండిపోయాయి.

మధ్యాహ్నం వేళ తత్సమయోచితస్తోత్రాలతో శివుడిని స్తోత్రం చేశారు. గర్గుడి అనుమతిపై మునులంతా పార్వతిని వేద మంత్రాలలో అభిషేకించారు. దేవాభిధానం వుచ్ఛరించి - పర్యుక్షణవిధిని ఆచరించి ఆనందమే ఆనందమైపోయిందా వివాహ వేదిక.



## వాలఖిల్యోత్పత్తి

బ్రహ్మోక్తంగా - శివుడు వానిని తన వామాంకాన అధివసింపచేసుకుని ఋగ్యజుస్సామమంత్రాలతో అగ్నికి ఆహుతులనీయసాగాడు అమ్మవారికి అన్నగారైన మైనాకుడు పేల దోసిలి బడుతున్నాడు, గౌరీశంకరులు అగ్ని ప్రదక్షిణ చేయసాగారు.

అలాసప్తపది సాగుతుండగా - చంద్రాభమైన అమ్మవారి కాలిగోరు బ్రహ్మగారి కళ్ళబడింది. అంతే, అతి కాముకతతో స్ఖలిత వీర్యుడయ్యాడు. కనిపెట్టాడు కపర్ది. కళ్ళెర్రజేసాడు - అందుకున్నాడు త్రిశూలాన్ని. శరణు శరణు మహాప్రభో శరణుశర” ణంటూ అందరూ యేక కంఠాన స్తుతించారు. రకరకాలుగా ప్రార్థించారు. అంతటితో బ్రహ్మను క్షమించి వదిలేశాడు శివుడు. లేకపోతే ఇప్పుడాయనను త్రిశిరుడని పిలుచుకోవలసి వచ్చేది.

అయితే, బ్రహ్మతన వీర్యాన్ని గోప్యపరచుకోదలచి నేలకువేసి రుద్దడం వల్ల - అందులోంచి వాలఖిల్యమునులు ఆవిర్భవించారు. నాన్నా నాన్నా" అంటూ అరుస్తున్నారు. అది గమనించిన నారదుడు వారినందరినీ గంధమాదన పర్వతానికి సాగనంపేశాడు. అంతటి సర్వేశ్వరుడి పెళ్ళికూడా యెలాగైతేనేం అయ్యిందనిపించారు.

## పెండ్లికొడుకుతో పేరంటాళ్ళ ఛలోక్తులు

ఆ రాత్రి అయ్యవారిని అలంకరించి, శయ్యాగారానికి పంపారు. సర్వమానినీ జనమనోహరంగా వున్న సర్వేశ్వరుని చూస్తూంటే ఆయన 'యజమాని' అన్న సంగతే మర్చిపోయారు. అదో ఆనందం. అందునా ఆడవాళ్ళకు మరీను. దేవ కాంతలంతా అక్కడే వున్నారు. అంతా తలకోరకంగానూ అనసాగారు. "పాపం! సతీదేవి చనిపోయినప్పటి నుంచీ సరసానికి యెడంగా వుండిపోయావు. ఆ విరహం అంతా యిప్పుడు తీర్చుకో" మా పార్వతీ పరిష్వంగంలో సంతృప్తుడివై - ఆమెను సుఖపెట్టు. నువ్వు సుఖపడు, మీ దంపతులకు ఏనాడూ వియోగం కలుగకుండా వుండుగాక అంది సరస్వతి. "ఏం శివా! సిగ్గుపడుతున్నావేంటి? పెళ్ళి అయ్యేదాకా విరహపడిపోయావుగా! సిగ్గెందుకు? చేరదీసుకో" అని అన్నది లక్ష్మి. 'గిరిజచేత యెంగిలిపడేలా చేయించి, నువ్వుకూడా ఆరగించు. ఆలస్యం యెందుకు? ఆ ఔపోసన కార్యక్రమం కానిచ్చేసి తాంబూలం తగిలించవయ్యా!" అన్నది సావిత్రిదేవి.

' ఆ సతీదేవిని భుజాన వేసుకుని ప్రపంచమంతా తిరిగిన వాడివి పార్వతి దగ్గర బిడియపడతావెందుకు!" అన్నది శచీదేవి. అప్పుడందుకుంది అరుంధతి "ఇదిగో శివా! ఈ పిల్లను నీకివ్వనని వాళ్ళమ్మ పట్టుపట్టింది. అలాకాదు నీకే యివ్వాలని ఎంతో కష్టపడి యీ పిల్లనిచ్చి పెళ్ళిచేశాను నీకు. కాబట్టి పిల్ల నొచ్చుకోకుండా బుజ్జగించి సురతం చెయ్యి" సనాతనుడివి నువ్వు. అలాగని యిప్పుడు వృద్ధుడిలా కూర్చుంటే కాదు. ఏ యౌవన ప్రాగల్భ్య మహా సౌందర్యంతో మీ అత్తగారికి ఆనందం కలిగించావో - ఆ యౌవనంతోటే ఏకాంత సుఖాలు పొందవయ్యా' అన్నది అహల్య.

మేం యేదో నీతో ఇలా వచ్చి శృంగారం మాట్లాడుతున్నామని యిబ్బంది పడకు. పెళ్ళిళ్ళలో మా ఆడవాళ్ళం కొంచెం అల్లరిగా వుండటం అదొక వేడుకగదా!"

అని స్వాహాదేవీ, 'కామశాస్త్రకోవిదుడవైన నీకు వేరే చెప్పనక్కరలేదు గాని ముందుగా ఆ ముగ్ధ పార్వతి కోరిక తీర్చు. ఆడవాళ్ళ కామం సముద్రం లాంటిది. భవసాగర తారణుడివి నువ్వు, ఆ పిల్ల చేత కామ సముద్రాన్ని తరింప చేయవయ్యా' అని రోహిణి-అన్నారు.

అంతలో సంజ్ఞాదేవి-కలుగజేసుకుని-మీ ఛలోక్తుల్లోనే తెల్లారేలా వుంది. నోటిమాటలకేమొచ్చులే గాని - నలుగురూ మసలని చోటులో, ఆనందానికి భంగం కాకుండా ప్రక్కవేసి-రత్నదీపాన్నీ, తాంబూలాన్నీ యిచ్చి-శివపార్వతుల్ని సుఖపడనివ్వండర్రా" అన్నది.

అందరూ నవ్వారు. "ఏం శివయ్యా పంపమంటావా!" అన్నారు. అంతటి శివుడు కూడా సిగ్గుపడుతూనే వారి సేతలందుకున్నాడు.

## శివుడు మన్మథుణ్ణి బ్రతికించుట



అదే సరయిన అదనుగా భావించి-సర్వదేవతా ప్రేరితయై రతీదేవి పరమేశ్వరుడి సన్నిధానం చేరింది, "హే శంకరా! పార్వతిని పెండ్లి చేసుకోవడంతో- నీ కామదహన కృత్యం నిరర్థకమే అవుతుంది. నీకళ్యాణ శుభవేళ సర్వప్రపంచమూ ఆనందోత్సవాలతో నిండివుండగా నేను ఒక్కదాన్నీ మాత్రం యిలా పతి వియోగ దుఃఖంతో విరమాతురనై విలపించాలా తండ్రీ!" అంటూ అన్నాళ్ళుగా తన కొంగున కట్టి దాచిన మన్మథుడి భస్మాన్ని శివుడి పాదాల ముందు ఒంపింది రతి.

భర్తపట్ల ఆమెకు వున్న అనురాగానికి అందరూ ఆశ్చర్య పోయారు. విరహమయమైపోయిన ఆమె జీవితంపట్ల జాలి చెందారు. ఆమె సాధ్వీప్రవృతికి కరుణించారు. కనుకనే శారదాది దివ్యలు శివుణ్ణి అర్థించారు. మదనుణ్ణి బ్రతికించి, రతిని వుద్ధరించమని వేడుకున్నారు. కరుణావరుణాలయుడా కంఠేకాలుడు. ఆ మదనుడి భస్మాన్ని తన అమృతవీక్షణాలతో ఒక్కసారి అవలోకించాడు. అంతే తన వైనపూర్వ రూపబల సౌందర్యాలన్నిటితోనూ పునరుద్భవించాడు-

పూవిలుకాడు. రతి ఆనందించింది శివుడికీ, భర్తకూ నమస్కరించింది. మన్మధుడు శివుడికి క్షమాపణస్తోత్రం సమర్పించుకుని ఆశీర్వదింపబడి అమరులను చేరాడు. మన్మధుడి పునరుద్భూతంతో పెళ్ళికళ వెయ్యింతలు పెరిగింది. మదనుణ్ణి అంగీకరించిన శివుడు - అందరానంత ఆకర్షణీయుడైనాడు. సంగవివర్జితులైన పార్వతీపరమేశ్వరులు సంగమించనెంచారు.

# పతివ్రతా ధర్మములు



తెల్లవారింది. లాంఛనాన్నీ నెరవేర్చబడుతున్నాయి అయిదు రోజుల ఆర్భాటంగా జరిగింది. మేనకా హిమవంతులు పార్వతిని శివునకు వప్పగించారు మునిపత్నులు, ముసలిముత్తయిదువలు విప్రమహిళలు కలిసి-పార్వతికి పతివ్రతా ధర్మాలను బోధించారు. మేనకా ప్రేరితలైన ఆ ముత్తయిదువలు అమ్మవారిని జేరి యిలా మనవి చేసుకుంటున్నారు. "ఎరగనిదానవు కాదు తల్లీ! అయినా మా చాపల్యం కొద్దీ యిలా ప్రలపిస్తున్నాము. పతివ్రత ఒక్కర్తే సృష్టిలో ధన్యురాలు. ఆడదానికి ఎన్నెన్ని యోగ్యతలున్నా, అవి పాతివ్రత్యానికి సరిగావు, ఏయోగ్యతలూ, లేకపోయినా సరే పాతివ్రత్యం ఆమెను ప్రపంచానికే పట్టమహిషిని చేస్తుంది.

అమ్మా! భర్త భోజనం చేస్తేనేగాని పతివ్రత భుజించకూడదు. భర్త నిలబడి వున్నట్లయితే తాను కూడా నిలబడే వుండాలి. భర్త నిద్రించిన తర్వాతనే తానూ నిద్రించాలి. పెనిమిటికన్న ముందుగానే నిద్రలేవాలి. భర్తవద్ద యెటువంటి దాపరికాలూ లేకుండా-ఆయనను సేవించుకోవాలి, సాధ్వియైన సారసాక్షి-నిరలంకృతగా భర్తకు కనిపించకూడదు. ఎల్లవేళలా రమ్యాలంకృతయై మాత్రమే ఆయనకు కనుపించుతూండాలి. మగడు గ్రామాంతరం వెళ్ళిన వేళ మాత్రం పసుపు, కుంకం, పుస్తెలతాడు, నల్లపూసలు, మట్టెలు, గాజులు వంటి మంగళ కరమైన వాటిని మాత్రమే ధరించి యితరాలంకారాలు ధరించకూడదు. భర్త తనపట్ల పరుషంగా మాట్లాడినా, తీక్ష్ణంగా మాట్లాడినా, శిక్షించినా, విపరీతంగా ప్రవర్తించినా కూడా యిల్లాలు/ఆక్రోశించకూడదు. ఎంత పనివత్తిడిలో వున్నా

సరే - భర్త పిలుపు వినబడగానే ఆయన వద్దకు వెళ్ళి ఆయనచే పురమాయించబడిన పనిని ముందుగా - అనువైన వేళకు చేయాలి.

వాకిట్లో నిలబడ కూడదు. భర్తయొక్క అనుజ్ఞ తీసుకోనిదే పరాయి గృహాలకు వెళ్ళకూడదు. భర్త తనకు చెప్పిన రహస్యాన్ని యెప్పుడూ, యెట్టి పరిస్థితిలోనూ కూడా యెవ్వరికీ చెప్పకూడదు. భర్త చేసే దైవారాధనా పరికరాలనూ-ఫలపత్ర పుష్పాదులనూ తనకుతానే సిద్ధపరచి వుంచాలి. భర్తచేత పదేపదే చెప్పించుకో కూడదు. భర్తకు యెప్పుడెప్పుడు యేయే అవసరాలు యేర్పడతాయో వాటినీ ఆయా సమయాల్లో నిండుమనసుతో తీర్చేందుకు గాను పతివ్రత యెల్ల వేళలా సంసిద్ధురాలై వుండాలి. కాశీ రామేశ్వరాది పుణ్యక్షేత్రాలకైనా సరే భర్త అనుమతి లేకుండా వెళ్ళకూడదు. ఊరేగింపులు, సామూహిక ఉత్సవాలు మొదలైన వాటిలో కూడా భర్త అభిమతాన్ననుసరించే పాల్గొనాలి. ఆయనకు యిష్టంలేకపోతే - మానివేయాలి. అని నిమిత్తంగా మనసులో క్షోభించకూడదు. గంగాది పుణ్యా తీర్థాలూ, కాశ్యాది పుణ్యక్షేత్రాలూ, కూడా భర్తృచరణోదకాలలోనే వున్నాయని పతివ్రతా ధర్మశాస్త్రం చెబుతోంది. భర్తయొక్క భుక్తశేషాన్ని మహాప్రసాదంగా భావించి భుజించాలి. దేవతానివేదనం చేయకుండాను పితృతిథులలో పెద్దల భోజనం కాకుండానూ అతిథులకు పరిచారకులకు, పశువులకు భిక్షుకులకు పెట్టకుండానూ-పతివ్రత యెంగిలిపడకూడదు. ఇంట్లో సామాగ్రి నెప్పటికప్పుడూ సరిచూసుకుంటూ వుండాలి అనవసర వ్యయం చేయకూడదు అవసరాల విషయంలో లోభత్వం వహించకూడదు. అసలీ 'వ్యయం' అనేది భర్త యొక్క వరుమాన (సాగుమానం, లేదా సంపాదన) ప్రకారం చూసుకోవాలి! భర్త ఆజ్ఞ లేనిదే ఉపవాసం గూడా వుండకూడదు, అలా పతిదేవుని అనుమతిలేని ఉపవాసం నిష్ఫలం అవుతుంది. దానియొక్క సత్ఫలం లభించదు. ఒడయుడు సుఖంగా నిశ్చింతంగా ఉన్నప్పుడూ, యధేచ్ఛా విహార వేళలోనూ ఆయనకు ఆటంకం కల్పించ కూడదు. చెప్పగూడదు, భర్త బలహీనుడైనా, రోగిష్ఠియైనా, ముసలియైనా, మంకువాడైనా, కష్టాలపాలైనా, సంతోషస్వాంతుడైనా ఎటువంటివాడైనా సరే భర్తను మాత్రం పతివ్రత తిరస్కరించకూడదు. రజస్వలగా వుండే మూడు రోజులూ భర్తకు కనబడకూడదు. తన మాటలు ఆయనకు వినబడనీయకూడదు. నాలుగో రోజున స్నానం చేసిన తరువాత ముందుగా భర్త ముఖాన్నే చూడాలి. అటువంటి అవకాశం లేనప్పుడు భర్త రూపాన్ని మనసులో తలుచుకుని సూర్యుణ్ణి చూడాలి.

పసుపు, కుంకుమ, సింధూరం, కాటుక, రవికె, తాంబూలం, మాంగల్యం, మల్లెలు, గాజులు, కమ్మలు- అనే వాటి నిక్షణం కూడా విసర్జింకూడదు. నిత్యం వాటిని ధరించుకునే వుండాలి. చింపిరితలతో వుండకూడదు. చక్కగా తలదువ్వుకున్నదై వుండాలి. అలా వున్న స్త్రీ-తన భర్త బ్రదికివుండాలని కోరుకుంటున్నదనీ, అలా వుండని స్త్రీ భర్త జీవన విషయంలో శ్రద్ధలేనిదనీ గ్రహించబడుతుంది. చాకలి దానితోను-అంకులాడితోనూ, సన్యాసితోనూ, అకారణమైన ద్వేషాలు కలదాని తోనూ, చాడీలు చెప్పే అలవాటున్న దానితోనూ, యేనాడూ కూడా స్నేహం చెయ్య కూడదు, భర్తను పీడించే దానితోనూ, ఒక్కక్షణం కూడా మాట్లాడకూడదు.

ఒంటరిగా వుండకూడదు. దిగంబరిగా స్నానం చెయ్యకూడదు. రోలుమీద గాని, రోకలిమీదగాని, మూకుడుమీద గాని, బండమీద గాని, గడపమీదగాని, బిందె మీదగాని, తిరగలిమీదగాని ఎప్పుడూ కూర్చోకూడదు. భర్తతో కలసి యేకాంత సుఖం అనుభవించేటప్పుడు తప్ప - ఆయనకు ఎదురు మాట్లాడకూడదు. భర్తకు యిష్టమైన వస్తువులపట్లా, పనులపట్లా-తాను ఎంతో శ్రద్ధాళువై వుండాలి. భర్త సంతోషమే తన ఆనందంగా, ఆయన దుఃఖమే తన దుఃఖంగా ప్రవర్తించాలి. సంపదలు వచ్చినప్పుడూ లేనప్పుడూ కూడా భర్తపట్ల అదే విధంగా ప్రవర్తించాలి. గృహావసర వస్తువుల గురించి హితవుగా పలకాలి గాని - విరుచుకుపడి పోతూ గయ్యాళి తనం నెరపకూడదు.

భర్త మాటకాదని వ్రతాలూ-ఉపవాసాలూ చేసే భార్యవల్ల-పెనిమిటి యొక్క ఆయుష్షు నాశనం అయిపోతుందని తెలుసుకోవాలి. భర్త చావును కోరేవారు అలాటి పనులన్నీ చేయవచ్చును. భర్త కఠినంగా మాట్లాడాడుగా అని - తాను కూడా క్రోధంతో సమాధానం చెప్పే ఆడది గ్రామాలలో లేదా అడవులలో సంచరించే ఆడకుక్కగా నక్కగా పుడుతుంది భర్తకూర్చునే పీఠం కన్నా ఎత్తైన పీఠం మీద కూర్చోకూడదు. దుర్మార్గుల చెంతకు వెళ్ళకూడదు.

భర్తనుద్దేశించి నిందావాక్యాలూ బాధాకరమైన ప్రసంగాలూ చెయ్యకూడదు. పరనిందచెయ్యరాదు. పెద్దలయందు అధిక ప్రసంగం. అతిగా నవ్వటం చెయ్య కూడదు. పోట్లాటలు పెట్టుకోకూడదు. భర్త బయటనుండి యింటికి వచ్చునప్పుడు చిరునవ్వుతో ఆయనను ఆహ్వానించాలి. ఆహార పానీయాదులను అందజేయాలి. మార్గాయాసం తొలగిపోయేలా ప్రవర్తించాలి. అలసిన భర్తను- సంతోషముగా

మధురములైన సమయానుకూలమైన మాటలతో మరిపించి- అతని కష్టాన్నీ మరపింపచేసే భార్య-త్రిలోకపూజనీయురాలవుతుంది. భర్తయే దైవం, భర్తయే గురువు, భర్తయే ధర్మంగా బ్రతికే స్త్రీ పొందరానిది యేదీలేదు. భర్తకు వ్యతిరేకంగా గాని, భర్తకు నష్టం కలిగించేలాగగాని, భర్తకు తెలియకుండా స్వతంత్రించి కాని ప్రవర్తించే, స్త్రీ తాను నాశనమవడమేగాకుండా తన సంసారాన్ని నిత్య దరిద్రంలో ముంచేత్తేదవుతుంది. భర్తకు యిష్టమైన పదార్థాలు ఆయన తినకుండాచేసేది, తన పిల్లలను తనే చంపుకుతినే పులిగానో, చెట్టుతొర్రలలో బ్రతికె పురుగుల పుట్టగానో పుడుతుంది. ఊరపందిగాగాని మేకగాగాని జన్మిస్తుంది.

సురతమప్పుడు గాక మిగిలినప్పుడు కూడా - భర్తను యేక వచనంలో పిలిచేది, పరోక్షంలోనైనా యేకవచనంతో సంబోధించేదీ మూగదై పుడుతుంది. ఆడదాని గయ్యాళితనం వల్ల - పుట్టింటివారూ మెట్టినింటివారూ మూడు తరాల బాటు నరకంలో పడతారు. పతివ్రతను కన్నవారూ, కట్టుకున్న వారూ ధన్యులు - ఇటు మూడు తరాలూ అటుమూడు తరాలూతో సహా స్వర్గసుఖాలనుభవిస్తారు, పతివ్రత పాదస్పర్శవల్ల భూమి ధన్యురాలవుతుంది.

ఆమె మసిలినంతమేరా పుణ్యక్షేత్రమవుతుంది. పతివ్రత స్నానంచేస్తే గంగ పవిత్రురాలవుతుంది. పతివ్రత స్పృశిస్తే అగ్ని పరిశుద్ధుడవుతాడు, పతివ్రతవల్ల గాలి పునీతుడౌతాడు. పతివ్రతల దర్శనంకోసం - సూర్యచంద్రాదులు నిత్యం తపనపడుతూ వుంటారు. పతివ్రతను హింసించేభర్త పాపాన్ని మూటకట్టు కుంటాడు.

అందగత్తెలు, అపురూపమైన అంగసౌష్ఠవం, కలవారూ, శృంగార విహార నిపుణులూ అయిన స్త్రీలను సంపాదించవచ్చును. కాని - పతివ్రతను భార్యగా పొందడం అత్యంత క్లిష్టమైన విషయంగా గ్రహించాలి తన పూర్వకృత పుణ్యవశాన తన యిల్లాలైన సాధ్విని హింసించేవాడు యెనుబోతుగా జన్మిస్తాడు. భార్యలేనివాడు దేవతాకర్మలు గాని, పితృకర్మలుగాని చేయడానికి అనర్హుడు. యజ్ఞం, యాగం, పూజ, నోము, వ్రతం, శ్రాద్ధం అనేవన్నీ భార్యా సమేతంగా మాత్రమే ఆచరించదగ్గవి. భార్యలేనిదే ఏ కర్మాచరణా చేయడానికి వీలులేదు. అందువల్ల పుణ్యశీలి, బుద్ధిమంతుడూ, యోగాత్ముడూ అయిన పురుషుడు - భార్యలో యేలోపాలు

న్నప్పటికి కూడా కర్మాచరణ నిమిత్తం సామగ్రిగానైనా ఆమె సత్కరించాల్సి వుంటుంది. వంశం అంతరించకుండా సంతానాన్ని కంటుంది. గనకనైనా ఆమెను గౌరవించాలి. భర్తను యెదిరించే భార్య పదిమంది పిల్లలను కన్నదైనా సరే - పిల్లలతో సహా ఆమెను వదిలేయమని - శాస్త్రాలు చెబుతున్నాయి. అయినప్పటికీ కూడా - పుణ్యాన్నీ కోరేవాడూ, యోగాత్ముడూ, సత్కీర్తిని కోరుకునే వాడూ అయిన పెనిమిటి - భార్యను యెలాగైనా రక్షించుకొని శిక్షిస్తాడే గాని, త్యజించడు.

అటువంటి భర్తనైన ఆదరించలేని భార్య - ఆమె పాపాన ఆమె పోతుంది. కష్టసుఖాలతో నిండివుండేది జీవితం. జీవితాంతం కలిసివుండే భార్య - కర్మ రూపుడైన భర్తకు - ఫలరూపంగా వుండాలేగాని పాపిష్టిగా వుండకూడదు. పురుషుడికి కేవలం సుఖాలు మాత్రమే అందించేది, కష్టాలలో అతనికి యెదురుతిరిగి మనో వ్యగ్రత కలిగించేది వేశ్య అవుతుందేగాని యిల్లాలు కాదు.

భార్య-అనేది మహాదుఃఖకరమైన ముసలితనం వలె పురుషుణ్ణి పీడించ కుడదు. భార్య అనేది రాక్షసి కాకూడదు. కనీసం తాను కన్న బిడ్డల శ్రేయస్సునైనా ఆశించాలి. సాధారణ సతీ విధులే అలావున్నప్పుడు పతివ్రతలు యెలా ప్రవర్తించాలో వేరుగా చెప్పాలంటే తల్లీ? అమ్మా ఉమా! భర్త అంటే ప్రణవం. భార్య అంటే ప్రణవానుసారి యైన వేదంలా వుండాలి. భార్య క్షమ, భర్త తపస్సు, భార్య సత్కార్యం అయితేనే భర్త సత్ఫలుడవుతాడు. దుఃఖపరిచే భార్యవల్లనే భర్త భ్రష్టుడవుతాడు. కాబట్టి - పార్వతీ! పాతివ్రత్యాన్ని అవలంబించి, అనుకూలవై, సాధ్వివై, - పుట్టింటికి మెట్టింటికీ మేలుచేయి. లోకాలకి శ్రేయస్సును చేకూర్చు"- అంటూ పతివ్రతా ధర్మాదులను బోధించారా ముత్తయిదువలు. అనంతరం పార్వతిని-శివుని వెంట కైలాసానికి సాగనంపారు.

అత్యంత ధర్మయుక్తమైన యీ పతివ్రతాధర్మాలు తెలుసుకోవడమే పుణ్యాం, అచరించినవారి సత్ఫలం చెప్పడం ఆదిశేషుడికి కూడా సాధ్యం కాదు. ఓ పుణ్యాత్ములారా! సర్వతాపశమనమూ, సకలపాప హరణమూ, సర్వైశ్వర్యప్రదమూ అయిన శివ కళ్యాణాన్ని వినిపించాను. మీకు వినిపించడం వల్ల నేను ధన్యుడ నయ్యాను వినడం వల్ల మీరు ధన్యులయ్యారు. మరేం వినాలని ఉన్నదో ఆజ్ఞా పించండి" అని సూతుడు అడగడంతో, శౌనకాదులు-"కుమారఖండం" వినిపించ వలసిందిగా కోరారు. అందుకున్నాడు సూతుడు.



## కైలాసంలో కామేశ్వరుడు

క్రొత్త పెండ్లి కూతురైన కొండకూతురు - తన ఎడమచేతి చిటికెన వ్రేలు పట్టుకుని సిగ్గుదొంతరుల నడుమ, చిరుహాసాలతో వెన్నంటిరాగా కైలాసం చేరిన కామేశ్వరుడు కాపురానికి అంకురార్పణ చేశాడు. చిలిపికోరికల చెల్లింపులకు గాను మనోజ్ఞమైన యేకాంత ప్రదేశాన్ని యెంచుకున్నాడు సుగంధపుష్ప సంభరితము, నానావిధ భోగవస్తువులతో కూడినదీ కామోద్దీపన కరమూ, రతి సుఖాలకు అనువైనదీయైన శయ్యా ఫలకాన్ని నిర్మింపజేసుకున్నాడు కాళితో కలసి శృంగారంలో మునిగి పోయాడు. ఏళ్ళూవూళ్ళూ గడిచిపోతున్నాయి. ప్రపంచం కేసి కన్నెత్తి చూడటం లేదా ఆది దంపతులు.

ఇక్కడ ఆ అమరకోటికి దిక్కుతోచడంలేదు. "మనకోసమే మహా దేవుడు మనువాడాడు. మనకోసమే ఆయన మార క్రీడలలో మునిగిపోయాడు కాని యిన్నాళ్ళయినా సంతానం కలగలేదంటే యేమనుకోవాలని ఆలోచించారు. విష్ణువు వాళ్ళని ఓదార్చాడు. "నిత్య తపస్వులా దంపతులు నిత్యయోగమూర్తులా జంట యిన్నాళ్ళకి మనకోసం కామక్రీడలకి దిగారంటే - తెమలాలికదా! పరమోర్ధ్వరేతస్కులైన ఆ ఆలుమగలు. అధోరేతస్కులవడం అంతతేలికైన పనికాదు. మరో వెయ్యేళ్ళు ఆగండి' అన్నాడాయన. సరేనన్నారు దేవతలు. శుభవార్తకోసం నిరీక్షిస్తున్నారు. ఈ లోపల శివశక్తుల రతికేళి విలాసాలవల్ల లోకాలు తల్లడిల్ల సాగాయి. ఆది కూర్మం, ఆదిశేషులు ఆ ఒత్తిడుల భారాన్ని భరించలేక క్రుంగి పోసాగారు. సర్వాధారమైన వాయువు స్తంభించిపోయింది. ఇక తట్టుకోలేని దేవతలు మరోసారి విష్ణువును ఆశ్రయించారు.

## అగ్ని శివ వీర్యమును భుజించుట

విష్ణువుకు కూడా వాయువే కదా బలం దాంతో విష్ణువూ వూరుకోలేక పోయాడు. సురనికరాన్ని వెంటబెట్టుకుని కైలాసంలోని శివుడి అంతఃపుర ద్వారం సమీపించాడు. ముప్పైమూడు కోట్లమంది దేవతలూ కలసి యెలుగెత్తి స్తుతించారు

శివుణ్ణి. "నమః పార్వతీపతే హరహరమహాదేవ శంభోశంకర - రక్షమాం- పాహిమాం -త్రాహిమాం వంటి నినాదాలతో ఆ ప్రాంతమంతా నిండిపోయింది. భక్తహృదయా వాసుడా భర్గుడు. నిలింపుల మొరలన్నీ విన్నాడు. సురతాన్ని విరమించాలను కున్నాడు కాని, పార్వతి యేమనుకుంటుందోననే వుద్దేశ్యంతో కొనసాగించాడు. మళ్ళా వినపడ్డాయి దేవతల రోదనలు. స్వసుఖం కన్నా భక్తులను కాపాడటమే లక్ష్యంగా గల శివుడు సురతాన్ని ఆపాడు.

"ఇప్పుడేవస్తా"నని పార్వతికి చెప్పి శయనాగారం నుంచి ద్వారం వద్దకు వచ్చి త్రిదశులముందు నిలిచాడు. "ఇంతకాలం ఓర్చుకున్నవారు మరికొంచెం తాళివుంటే అంతాసక్రమంగా జరిగి వుండేది. సరిగ్గా నాకు రేతఃస్ఖలనం జరిగేవేళకే బైటకు పిలిచేశారు మీరు. మీకోరికలు మరీ అంతతొందరగా తీరాలంటే యీ నా రేతాన్ని మీరే స్వీకరించండి. " అన్నాడు. దేవతల ప్రోద్బలంతో అగ్ని పావురరూపం ధరించి శివ రేతస్సు సమస్తాన్నీ స్వీకరించేశాడు.

## పార్వతి సురలను నిస్సంతులుగా శపించుట



సంభోగపు మధ్యలో తనని శయ్యమీదే విడిచివెళ్ళిన ప్రాణేశ్వరుడు-ఇంకా రాలేదేమిటా అనుకుంటూ గుమ్మం దగ్గరకు వచ్చింది పార్వతి. జరిగిందేమిటో అర్థమైంది. కడుపు తరుక్కుపోయివుంటుందామెకు, ఓ దేవతలారా! మీరంతా కేవలం స్వార్ధంలోనే శివారాధన చేశారు. మీమీ పబ్బాలు గడుపుకోవడం కోసం, నా శృంగార సుఖాన్ని సర్వనాశనం చేశారు. మీ వల్ల నేను బిడ్డలు లేనిదాన నయ్యాను. ఈ కారణంగా, నన్ను వుసురుపెట్టిన పాపం ఊరికేపోదు.

మీ దేవతలకు మీ మీ భార్యలందు సంతానం కలగకుండా వుండుగాక" అంది, మరీ ముఖ్యంగా శివరేతాన్ని భక్షించిన అగ్ని వంక అంతకన్నా తీవ్రంగా చూసింది అంబ "శివరేతాన్ని స్వీకరించి శివాపరాధం చేసిన అగ్నీ! నువ్వు నిత్యం కష్టాలపాలవుతూ వుండు. సర్వభక్షకుడివైపో" అని శపించింది. అగ్నినీ, అమరుల్నీ అందర్నీ శపించేసింది. తన సంభోగసుఖం తాలూకు అసంతృప్తితో అలమటించి పోయింది అమ్మవారు-ఎట్టకేలకు శివుడామెతో పునఃఅంతఃపురంలోకి నిష్క్రమించాడు.

# ఇంద్రాది దేవతలు గర్భము దాల్చుట

ఇక దేవతల పాట్లు వినండి. అగ్ని భుజించింది దేవతలందరికీ సమానంగా చెందుతుందని మీకు తెల్పిందే కదా! సరిగ్గా అదే అయ్యింది. ఒక్క అగ్నిహోత్రుడు ఆ శివ వీర్యాన్ని భక్షించినందువల్ల దేవతలందరూ కూడా భక్షకులే అయ్యారు. దానిసారం వాళ్ళందరి కడుపులోకి చేరిపోయింది. ఆ కారణంగా - వాళ్ళంతా గర్భం ధరించారు. ఈ హఠాత్సంఘటనకు బెంబేలు పడిపోయారు. మళ్ళా మహేశ్వరుడి నుద్దేశించి ఘోడుఘోడున విలపించారు. పునఃవచ్చాడు పురారి. తమ కష్టం చెప్పుకున్నారు దేవతలు. వమనం చేసుకోమన్నాడు శివుడు.

దేవతలంతా తమ తమ గర్భస్థమైన శివరేతస్సు సమస్తాన్నీ వమనం చేసుకున్నారు. వారికది అగ్నివలన సంక్రమించినది మాత్రమే కావడంవల్ల వారు తిరిగి వెడల గ్రక్కారేగాని, సంకల్ప పూర్వకంగా స్వీకరించినందువల్ల అగ్నిమాత్రం దానిని వమనం చేయలేకపోయాడు. ఈశ్వరుణ్ణే శరణు కోరాడు. శివుడు నారదుణ్ణి చూశాడు. అప్పుడు నారదుడు "అగ్ని హోత్రా! శీతాకాలం వేకువజాములో చన్నీటి స్నానంచేసే ఆడవారికి నీయందున్న శివరేతాన్ని అందించు" అని సలహా యిచ్చాడు. ఆ ప్రయత్నంలో పడ్డాడు అగ్ని.

# కుమారావతరణము

సప్తర్షుల భార్యలు, ప్రాతఃస్నానం ఆచరిం చారు. గంగలో విపరీతమైన చలికి గురయ్యారు. చలి కాచుకోవాలని అగ్నిని మధించారు. అరుంధతి వారించింది. వినలేదా వనితామణులు అరుంధతిని తిరస్కరించి మహిళామణులంతా మంట పెట్టు కుని చలికాచుకోసాగారు. అదే సమయమనుకున్న అగ్ని - తన వేడి ద్వారా - ఆ ఆరుగురు మహర్షి స్త్రీల రోమకూపాలలో కూడా తన వంట్లో వున్న వేడిని దింపేసుకుని 'అమ్మయ్య' అనుకున్నాడు. శివరేతం లోపలపడడమే ఆలస్యంగా గర్భవతు లయ్యారా కృత్తికలు, ఋషులు వాళ్ళని శంకించి యిళ్ళ నుంచి తరిమేశారు.

భర్తలకు యెడంగా వుంటూ, శివతేజాన్ని భరించలేక - దానిని హిమత్పర్వతాల లోని కైలాస, శిఖరాన విసర్జించారు. హిమవంతుడా మహా తాపాన్ని తట్టుకోలేక గాలిని సహాయం కోరాడు. గాలిదేవుడా రేతాన్ని అతి కష్టంమీద యెత్తుకు వెళ్ళి

గంగ కడుపులో పడేశాడు. చల్లని తల్లి గంగమ్మ, కాని. శివ వీర్యధారణంతో ఆమెకు కూడా కాక యెక్కిపోయింది. తన కెరటాలతో దానిని విచ్ఛిన్నం చేస్తూ రెల్లు పొదల నడుమకు చేర్చింది. అలా ఆరు స్థానాలలోనూ పరిపక్వమైన శివ వీర్యం మార్గశిర శుద్ధషష్ఠి తిథినాడు కుమారుడిగా పరిణమించింది.



## కుమారస్వామి లీలలు

ఆ శిశువలా రెల్లు దుబ్బుల్లో పడి వుండగా -అక్కడికి విశ్వామిత్రుడు వచ్చాడు. లోకోత్తర మైన తేజస్సుతో వెలిగిపోతున్న ఆ బిడ్డను చూసి ఆశ్చర్యపోయాడు. దర్శన మాత్రంచేత ఆనందంతో తలవంచి మ్రొక్కాడు. అప్పుడా కుమారుడు -తనకు యుక్తమైన వైదికకర్మలు నెరప మని విశ్వామిత్రుణ్ణి కోరాడు. "నేను బ్రాహ్మణు డనుకాను గాధి అనేరాజు కొడుకును. వైదిక కర్మకు నాకు అర్హతలేదు." అన్నాడా గాధేయుడు. నవ్వాడు కుమారుడు - 'నిన్ను బ్రహ్మగా అను గ్రహిస్తున్నాను. నా వునికినీ జన్మనూ రహస్యంగా వుంచు. ఇకపై నువ్వే నాకు పురోహితుడవు" అన్నాడు. 'బ్రహ్మానందపడ్డాడు గాధేయుడు. తక్షణమే జాతక కర్మలు నెరవేర్చాడు. కుమారస్వామి అనుగ్రహంతో దివ్యజ్ఞానం పొందాడు.

అది జరిగిన అనంతరం అగ్ని వచ్చాడు. కుమారుణ్ణి ముద్దాడాడు 'శక్తి' అనే ఆయుధాన్నిచ్చాడు. ఆ ఆయుధాన్ని ధరించిన కుమారుడు ఒక పర్వతాన్ని యెక్కి, శిఖరాన్ని కొట్టాడు. ఆ శిఖరం పెళపెళార్భాటులతో నేల పడిపోయింది.

శివ వీర్యోద్భవుడి గురించి తెలిసిన తారకుడు ఆ కుమారుణ్ణి వధించమని పది పద్మాల సైన్యాన్ని పంపాడు. కుమార తాడిత శిఖర పతనం వల్ల - ఆ పద్మ దశకమూ కూడా ఆ బండక్రింద పడి సమసిపోయింది. ఆ శిఖర భేదనం వల్ల భూమి కంపించింది. లోకాలలో హాహా కారాలు చెలరేగాయి.

సకలలోకపాలనాధికారియైన యింద్రుడు తన సేనలతో సహా దిగివచ్చా డక్కడికి. ఈ మహార్భాట కారకుణ్ణి చూసి ఆశ్చర్యపోయాడు. అతన్ని నిరోధించా

లనుకున్నాడు. తన వజ్రాయుధముతో కుమారుడి కుడి భాగాన కొట్టాడు. తక్షణమే శాఖుడనే పురుషుడు ఉదయించి విజృంభించాడు.

ఈ సారి కుమారుడి యెడమ భాగాన కొట్టాడు ఇంద్రుడు. ఇటునుంచి విశాఖుడు ఆవిర్భవించి - దేవసేనల్ని అట్టుడికింప చేసేశాడు. అయోమయంలో పడిపోయిన అమరేంద్రుడు కుమారుడి హృదయాన్ని వేధించాడు. తత్ఫలంగా 'నైగముడు' అనే మహాపురుషుడు అవతరించాడు. నలుగురూ యేకమై నాకాధిపుడిని నరికివేయబోయే సరికి, పరుగు పరుగున వచ్చిన బ్రహ్మ కుమారుణ్ణి ప్రార్థించి శాంతింప చేసాడు. ఇంద్రుడు వెన్ను చూపక తప్పలేదు.

అదే సమయాన వచ్చారు ఆరుగురు మునిపత్నులు. 'నాబిడ్డ' అంటే నా బిడ్డ అని వాదులాడుకున్నారు. "ముందుగా నేను స్తన్యమివ్వాలి" అంటే - కాదు, నేను ముందుగా స్తన్యమివ్వాలని కలహించుకోసాగారు. కరుణాంతరంగుడౌ కుమారుడు వారి ప్రేమాతిశయాన్ని గుర్తించాడు. తక్షణమే ఆరు ముఖాలు కలవాడుగా మారి, ఆరుగురు తల్లులవద్దా ఏక కాలంలో స్తన్యం స్వీకరించాడు. కృత్తిక లారుగురూ కుమారుణ్ణి తమతో తీసుకువెళ్ళిపోయారు.

## కుమారస్వామి కైలాసమునకు వెళ్ళుట

ఇలా వుండగా ఒకనాడు పార్వతీదేవి భర్తను చూసి-యేదో అనురాగ ప్రసంగ వశాన - అలనాడు స్ఖలించిన వీర్యం విషయమై ప్రశ్నించింది. వెంటనే శివుడు, సర్వదేవతలనూ, కర్మసాక్షులనూ పిలిపించి వివరాలు చెప్పమన్నాడు. కుమార జననాది విషయాలు తెలుసుకున్నాడు. కుమారుని కైలాసానికి ఆహ్వానించ వలసినదిగా నందికేశ్వరుణ్ణి పంపాడు.

ఆజ్ఞాపించడం ఆలస్యంగా కృత్తికలున్న తావుకు చేరాడు నందికేశుడు. కృత్తికల తనయుడిగా వుండటంవల్ల కార్తికేయ సంజ్ఞతో పెరుగుతున్నాడు కుమారుడు. యుక్తమైన పలకరింపులూ మొదలైన లోకలాంఛనాల అనంతరం నందికేశ్వరుడు ఆయనకు జరిగినదంతా చెప్పాడు. శివాహ్వానాన్ని వినిపించాడు. సత్వరమే కైలాసానికి రమ్మనమని కోరాడు. విన్నాడు కార్తికేయుడు 'సరేపద' మన్నాడు అది తెలిసి కృత్తికలు దుఃఖించారు. వారికి జ్ఞానోపదేశం చేశాడు బాలవడివేలు. పార్వతీదేవి తనకోసం ప్రత్యేకంగా పంపిన నూరు చక్రాల దివ్యరథం అధిరోహించి అమితమైన వేగంతో కైలాసం చేరినాడు కార్తికేయుడు. శివపార్వతుల

ను చూస్తూనే రథం దిగి వెళ్ళివారికి ప్రణామాలా చరించాడు శివుడాతని నాలింగనం చేసుకున్నాడు. శిరస్సు నాఘ్రుణించాడు. దీవించాడు. కడుపున కన్నబిడ్డ తప్పిపోయి, చాలానాళ్ళకి కనపడినంతగా ఆనందపడిపోయింది అమ్మవారు. ఎత్తుకుంది, ముద్దాడింది. అతనిని చూడగానే ఉప్పొంగించేపుకువచ్చిన స్తన్యమిచ్చింది నవ్వింది. నవ్వించింది నిలువెల్లా హత్తుకుంది అప్పటికే దేవతలంతా సమాహితులై వున్నారు. ఆ మహా సభలోనే శివుడా కుమారుణ్ణి పట్టాభిషిక్తుణ్ణి చేసాడు. ఒక త్రిశూలాన్నీ, పినాకాన్నీ, పరశువునీ, శక్త్యాయుధాన్నీ, పాశుపతం అనబడే సంహారాస్త్రాన్నీ, శాంభవీ విద్యనూ ప్రసాదించాడు. ఆ సందర్భాన్నీ పురస్కరించుకుని విష్ణువు కుమారుడికి - ఒక రత్నకిరీటాన్ని, 'వైజయంతి' అనే కంఠహారాన్నీ బహూకరించాడు. బ్రహ్మ దేవుడు ఆగ్నేయుడికి యజ్ఞోపవీతాన్నీ గాయత్రీ మంత్రాన్నీ, వేదాలనూ, కమండలువునీ, బ్రహ్మాస్త్రాన్నీ అర్పించుకున్నాడు.

దేవేంద్రుడు ఐరావతాన్నీ, వజ్రాయుధాన్నీ సమర్పించగా వరుణుడు శ్వేత ఛత్రమాలికలను, సూర్యుడు కవచాన్నీ మనోవేగంగల రధాన్నీ చదివించు కున్నారు. యమధర్మరాజు గాంగేయుడికి యమదండాన్నిచ్చాడు. చంద్రుడు అమృత కలశమిచ్చాడు, అగ్ని- మరో మహాశక్తినిచ్చాడు. నిఋతి స్వకీయాయుధాన్నిచ్చాడు. వాయువు వాయవ్యాస్త్రాన్నీ, కుబేరుడు గదనీ, - ఈశానుడు త్రిశూలాన్ని తదితర దేవతలు నానావిధ శస్త్రాలనీ, మన్మధుడు కామశాస్త్రాన్నీ -కామ విద్యలనీ నివేదించారు.

క్షీరసాగరుడు చెప్పుకోదగ్గ రత్నాల అందెను అర్పించాడు. మాతామహుడైన హిమవంతుడు దివ్యాభరణాలనీ పట్టుబట్టలనీ పెట్టాడు. గరుత్మంతుడు తన కొడుకైన చిత్రబర్హిణుడినే వాహనంగా బహూకరించాడు.

అరుణుడు "తామ్రచూడం" అనే కోడిని సమర్పించాడు. అందరిచ్చినవీ చూసి పార్వతి చిరునవ్వు నవ్వినది. కొడుకుని దీవించింది. ఆ దీవెనలోనే అనుపమానమైన ఐశ్వర్యమూ, చిరంజీవిత్వమూ కూడ సిద్ధింపచేసింది.

లక్ష్మీదేవి వచ్చింది. సంపదల తల్లికదా! వివిధ సంపదల నిచ్చింది. చాలా అందమైన కంఠహారం కూడా యిచ్చింది, సావిత్రీదేవి - సిద్ధ విద్యలను గ్రహించింది. ఇతరత్రావున్న దేవతా స్త్రీలంతా యెవరెవరి ఆధీనాలలో వున్నవి వారిచ్చారు - ఆ మహానంద సమయంలో నిత్యానందుడైన శివుడు - మొత్తం దేవతలందర్నీ

వుద్దేశించి - "నా బిడ్డ నా యింటికి చేరిన శుభవేళను పురస్కరించుకుని- మీకేం కావాలో కోరుకోండి -యిచ్చేస్తాను అన్నాడు. అలా అనడం ఆలస్యంగా "కుమారుణ్ణి పంపించు. తారకాసురుణ్ణి చంపించు, మమ్మల్ని రాక్షస యాతనలనుంచి తప్పించు" అని అడిగేశారు దేవతలు. తారకాసుర సంహారార్థం శివుడు కుమారుణ్ణి ప్రేరేపించాడు. విష్ణువు యొక్క ఆధ్వర్యంలో దేవతలకు సర్వాధికారిగా కుమారుణ్ణి అభిషేకించారు. చతుర్ముఖుడి వేద పఠనంతో పంచముఖుడి ఆశీస్సులతో, తారకుడిపై దండెత్తాడు షణ్ముఖుడు.



## తారక సంహారం

అభూతపూర్వమైన యుద్ధం జరిగింది - దేవదానవుల నడుమ. దొమ్మీలూ కుమ్ము లాటలూ వాటి, దోవన అవి సాగుతూ వుండ గానే - ఇటు ద్వంద్వయుద్ధాలలో తార కాసుర వీరభద్రులు తలపడ్డారు. రెచ్చి పోయాడు వీరభద్రుడు, తారకాసురుణ్ణి చంపేస్తానన్నాడు. ఆయన గర్జనకి దేవదానవు లంతా గడగడలాడి పోయారు. బ్రహ్మదేవుడు వచ్చాడు. "ఆ శివుడొకడు, నువ్వొకడివి, నీ తమ్ముడైన కార్తికేయు డొకడు - మీ ముగ్గురికి ముగ్గురే అజేయులూ, స్థిర సంకల్పులూను - వర యంత్ర, తంత్ర, మంత్ర జప తపాదులు మిమ్మల్నే మీ చెయ్యలేవు- కానీ తారకుడికి వరం యిచ్చినవాణ్ణి నేను ఇప్పుడువాణ్ణి నువ్వు చంపేస్తే నా పరువు పోతుంది. పైగా, ఇంత కష్టపడి పార్వతీ కళ్యాణం చేసి కుమారుణ్ణి కన్నది దేనికి? అంటూ అనేక రకాల బోధించాడు. ఆ వాదోపవాదాల మధ్యలో వచ్చాడు విష్ణువు.

సరాసరి తారకాసురుడితో తలపడ్డాడు. తారకాసుర తార్క్ష్యవాహను లిద్దరూ కూడా చెరోసారీ మూర్ఛపోయారు. విష్ణువు మూర్ఛిల్లడం చూసిన వీరభద్రుడు మళ్ళా సంబరం మొదలెట్టాడు. ఆపాడు అగ్నేయుడు, ఆగవయ్యా! అన్నయ్యా! లబ్ధప్రతిష్ఠుడివి నువ్వు - నీయంతటివాడి తమ్ముణ్ణి - కాస్త నన్ను కూడా పేరు తెచ్చుకోనీ" అన్నట్లుగా వుందా పద్ధతి, చిరునవ్వు నవ్వుతూనే చిచ్చర పిడుగులా

తాకాడు తారకాసురుణ్ణి, అతిలోక భయంకరంగా సాగింది యుద్ధం లెక్క పెట్ట లేనంతమంది మహాయోధులు కూడా మ్రాన్పడిపోయి ఆస్కందతారకుల యుద్ధం చూడసాగారు.

అందరి యుద్ధాలూ ఉపశమించాయి. అటు దానవాధిపతి - ఇటు దేవాధిపతి యుద్ధం చేస్తున్నారు. కుమారుడి దెబ్బకి తారకుడు మూర్ఛపోయాడు. గొప్ప కలకలం లేచింది అయితేనేం. తారకుడు మళ్ళీ కోలుకున్నాడు. అతడు కుమారుణ్ణి వేధించాడు. దాంతో స్కందుడు మూర్ఛిల్లాడు. మళ్ళా గోల చెలరేగబోయింది. హాహాకారాలు చెలరేగే లోపలే తేరుకున్నాడు కుమారుడు.

తన శక్తినందుకున్నాడు తల్లిదండ్రులైన శివపార్వతుల్ని స్మరించాడు. వైరిమారకమైన వేలాయుధంతో ఒక్క వ్రేటు వేశాడు రాక్షసుణ్ణి. అంతే - తారకుడు హరించిపోయాడు. కుమారప్రభ-స్పృష్టి అంతటా తేజరిల్ల సాగింది. సకల లోకాల దివ్యత్వమే వెల్లివిరిసింది. విజయోత్సవాలతో కార్తికేయుడు కైలాసం చేరుకున్నాడు. శివపార్వతులకు నమస్కరించి వారి ఆశీస్సులందుకొని - సర్వజగత్తునూ సంతోషంతో ఓలలాడించాడు.

# బాణ ప్రలంబాదులను వధించుట

ఈ తారకాసుర సంహార శుభవార్త 'క్రౌంచుడు' అనే పర్వతరాజుకు తెలిసింది. అతడు చాలా కాలంగా 'బాణుడు' అనే రాక్షసుడి వల్ల ఎన్నో కష్టాలు పడుతున్నాడు. కుమారుడు తప్ప మరెవరూ తనను రక్షించలేరని నిశ్చయించుకుని, సరాసరి ఆయననే శరణుకోరాడు. బాణుడి దౌష్ట్యాలు యేకరువు పెట్టాడు - కరుణించాడు కార్తికేయుడు. తత్క్షణమే తన శక్తిని శివ స్మరణంతో అభిమంత్రించి - బాణుడి పైకి పంపాడు. ఆ శక్తి రువ్వున వెళ్ళి బాణుని దగ్ధంచేసి, తిరిగివచ్చి శరవణుడి కరాన్ని అలంకరించింది. ఆ సందర్భంగా కుమారస్వామి మూడు శివలింగాలను ప్రతిష్ఠించాడు. ప్రతిజ్ఞేశ్వర, కపాలేశ్వర, కుమారేశ్వరాలు అనే ఆ త్రిలింగ ప్రతిష్ఠా సమయంలోనే - తారక, బాణాసురులను గెలిచిన చిహ్నంగా ఒక జయస్తంభాన్ని నాటించి - ఆ స్తంభ సమీపాన స్తంభేశ్వరుడు అనే పేరుగల మరో శివలింగాన్ని కూడా ప్రతిష్ఠించాడు కుమారుడు. విష్ణ్వాది దేవతలు కూడా - అంతా తలా ఒక లింగాన్నీ ప్రతిష్ఠించారు అక్కడ.

అనంత లింగాలతో ఆ ప్రాంతమంతా పవిత్రమైపోయింది. అదే సమయంలో ఆదిశేషుడి కుమారుడైన 'కుముదుడు' వచ్చి కుమారస్వామిని శరణు కోరాడు. "తారకాసుర సంహార వేళ ప్రాణభీతితో పారిపోయిన ప్రలంబుడు అనేవాడు పాతాళం చేరాడు.

ఆ లోకంలో నివసించే మమ్మల్ని నువ్వే రక్షించాలి అని ప్రార్థించాడు. సరేనన్నాడు స్కందుడు. ప్రలంబుణ్ణి లక్ష్యం చేశాడు. ఉన్నచోటునుంచే తన శక్తిని ప్రయోగించాడు. అమిత వేగంతో ప్రలంబుణ్ణి సంహరించి వెనుదిరిగి వచ్చి స్వామిని ఆశ్రయించింది. కుముదుడు ఆర్ముగుణ్ణి స్తుతించి వెళ్ళిపోయాడు.

ఇలా - తారక, బాణ, ప్రలంబులనే ముగ్గురు రాక్షసులనూ వధించి ధర్మస్థాపన చేశాడు - శ్రీ సుబ్రహ్మణ్యేశ్వరుడు. తనను స్తోత్రించిన దేవతలకు వరాలనిచ్చాడు. "శంకరుని విశిష్టలింగ స్వరూపాలుగా పేరు కలుగుతుంది. కర్మిష్ఠులు, జ్ఞానులు, తాపసులు మిమ్మల్ని యెల్ల వేళలా కొనియాడతారు". అని పర్వతాలను అనుగ్రహించాడు. హిమాలయాలలోగాని, తత్సమీపాలలోగాని తపస్సు చేసేవారికి త్వరలోనే సిద్ధి కలగాలని శాసించాడు. అనంతరం సర్వదేవతాసమేతంగా సాంబశివుణ్ణి దర్శించాడు.

# గణపతి ఆవిర్భావము



ఆ తరువాత ఒకనాడు పార్వతీదేవి స్నానం చేస్తూండగా-శివుడు హఠాత్తుగా లోనికి ప్రవేశించాడు. అందువల్ల అమ్మవారు సిగ్గుపడ్డారు. స్నానాన్ని అర్ధాంతరంగా ఆపేసి హడావిడిగా అంతఃపురములోనికి పారి పోయారు. అనునిత్యం తనచేత వాంఛింపబడేవాడే అయినప్పటికీ కూడా ఆయనల్లా హఠాత్తుగా రావడం అమ్మ వారికి నచ్చలేదు. ఆ సందర్భాన్ని పురస్కరించుకుని అమ్మవారి చెలికత్తెలైన జయవిజయలు ఆ తల్లికి ఒక సలహా నిచ్చారు. "మనం నీ పెనిమిటి యింట్లో వుంటున్నాం, ఇక్కడి వాళ్ళు మనకు యెన్ని సేవలు చేసినా, యేం చేసినా

- వాళ్ళంతా శివగణాలే గాని, మనవాళ్ళు కారు. ఆయనకి యెదురు తిరగరు. శివుడు కూడా వాళ్ళని యేమీ అనడు. అంచేత - మన 'వ్యక్తి' అంటూ ఒకరుంటే తప్ప- యెవరి యధేచ్ఛాగమన నిర్గమనవాలనూ కూడా మనం నిరోధించలేం" ఈ సలహా నచ్చింది. ఈశ్వరికి, శివుడు రాజయితే తాను రాణి. ఆయన దేవుడైతే తాను దేవి. అయ్యగారు పురుషులైతే, అమ్మవారు స్త్రీ స్వరూపిణి. అందువల్ల తన పక్షాన కూడా ఒక గణం వుండడం, అది కూడా - పురుషాకృతిలో వుండేది కావడం ముఖ్యం- అనుకున్నది. తనమేను నలచింది. ఆ వచ్చిన పదార్థంతో ఒక పురుషా కృతిని నిర్మించి, ప్రాణం పోసింది. సర్వాంగ సుందరుడైన ఆ బాలుణ్ణి ఆశీర్వదించి, ద్వారపాలనార్థం నియమించిందా బలుముల తల్లి. అమ్మవారి బిడ్డ ఆ విధంగా మాతృగృహద్వార రక్షణ గావిస్తున్నాడు. ఇంతలో వచ్చారు అయ్యవారు.

## శివ గణపతుల కలహం



అలవాటు ప్రకారం - అంతః పురంలోకి వెళ్ళబోతున్న అయ్యవార్ని ద్వారం దగ్గర నిలిపేశాడు అబ్బాయిగారు. 'అమ్మవారి ఆజ్ఞ లేనిదే అనిలుడైనా అడుగు లోపల పెట్టడానికి వీలులేదు. అని చెప్పాడు. "నువ్వెవరివో క్రొత్త వాడిలా వున్నావు. నేను నీ యజమానురాలి భర్తను" అన్నాడు శివుడు. 'ఫలానా ఆవిడ భర్త నని చెప్పుకుని ప్రవేశానికి అనుమతి నడిగితే మాత్రం యిస్తాననుకున్నావా? అయినా నువ్వు ఆవిడ వల్లభుడవే గాని, నాకు యజమానివి కాదుగదా! కాబట్టి వెనక్కి వెళ్ళిపోవయ్యా" అన్నాడు బాలకుడు. అలిగాడు శివుడు. బాలకుడి జన్మ నుగ్రహించాడు. శక్త్యాశీర్వాద యుతుడైన ఆ కుర్రాడు సామాన్యుడు కాడని తల పోశాడు. సౌమ్యంగా పని సాగించుకోవడం యెలాగా అని ఆలోచనలో పడ్డాడు. కాని, శివగణాలు

యీ కుర్రాణ్ణి సహించలేకపోయాయి. వ్రేలెడంత లేని అర్భకుడేమిటి? విష మాంబకుణ్ణి యెదిరించడమేమిటి? అనుకున్నాయి. వారి ఆలోచనను పసిగట్టాడు పశుపతి. తనకు వినోదంగానూ వుంటుంది వాళ్ళకి అనుభవమూ అవుతుంద నుకున్నాడో యేమోగాని - ద్వారం దగ్గర నుంచి ఆ బాలకుణ్ణి తొలగించ మని తన గణాలకు ఆజ్ఞాపించాడు. తగువుకుదిగారు వాళ్ళు. తగువు ముదిరింది. ఒకసారిగాదు - మూడుసార్లు శివగణాలని తరిమి కొట్టాడా బాలకుడు.

ముమ్మారు పరాజయం చవిచూసిన ముక్కంటి గణాలు - ఈ సారి తమ వారి నందరినీ పోగుచేసుకుని వచ్చి మరీ పోరుకు నిలిచాయి. బైట కలకం విని, జరిగింది తెలుసుకున్న శైలజ - ఆశ్చర్యపోయింది. 'భర్తతో పంతమా' అని రవ్వంత ఆలోచించినప్పటికీ, 'ప్రేమకీ ఆరాధనకీ అర్థం మరీ పుట్టుబానిసలై పోవడం కాదుగదా, అనే నిర్ణయానికి వచ్చి తన సేవికల ద్వారా బాలుణ్ణి ప్రోత్సహించేసింది.

అమ్మవారి ప్రోత్సాహంతో మరింత రెచ్చిపోయాడా బాలుడు. వచ్చిన వాళ్ళని వచ్చినట్లుగానే పచ్చడి పచ్చడి క్రింద బాదేశాడు. యీ విపరీతం తెలిసి బ్రహ్మాదులు వచ్చారు. పశుపతిని ప్రార్థించారు. 'నాకు నేనుగా సంధికి దిగితే - భర్గుడు భార్యా విధేయుడనే అపఖ్యాతి వస్తుంది. అందువల్ల లోకహితార్థం మీరేవైనా సంప్రదింపులు జరపుకుంటే జరుపుకోండి" అన్నాడు శివుడు. భండన భూమికి వచ్చాడు బ్రహ్మ, 'బాబూ!' అంటూ ఆ బాలుడి కేదో చెప్పబోయాడు వింటేగా ఆ కుర్రాడు! వీడెవడో క్రొత్త గణాచారి అనుకున్నాడు కాబోలు - బ్రహ్మగారి గెడ్డాలూ మీసాలూ పెరికేశాడు. మండిపోయింది బ్రహ్మకి. కాని, ఏమీ చెయ్యలేకపోయాడు. చివరికి - "నేను యుద్ధానికి రాలేదయ్యా నాయనా! మధ్యవర్తిగా వచ్చాను. నన్ను వదిలేయ్. నేను బ్రాహ్మణుడిని" అని చెప్పుకుని, ప్రాధేయపడి, ప్రాణాలు నిలుపుకు న్నాడు. శాఖ, విశాఖ, విష్ణ్వాదులంతా విరుచుకుపడ్డారు కాని ఆ బాలుణ్ణి యెవ్వరూ నిలువరించలేకపోతున్నారు. పార్వతీ త్వక్మర్దనోద్భూతుడైన ఆ బాలుడి ముందు - శివ వీర్యోద్భవుడైన సుబ్రహ్మణ్యస్వామి ఒక్కడు తప్ప, మరెవరూ ఆగలేకపోతు న్నారు. ఆ పార్వతీ తనయుడు కొట్టినదెబ్బలకి విష్ణుమూర్తిగారికి వెన్ను పూస విరిగినంత పనైంది. హాహాకారాలు మిన్నుముట్టాయి. అన్ని లోకాలా ఆశ్చర్యం కమ్మివేసింది.

"పాహి పాహి పరమేశ్వరా" అని శంకరుణ్ణి శరణు కోరారు. కదిలాడు కంఠే కాలుడు - ఎత్తాడు తన త్రిశూలాన్ని గురి చూశాడా బాలుడి కంఠానికి - విష్ణువుతో పోరాడుతున్న ఆ బాలుడికి ఉత్తర దిక్కున నిలిచి శూలాన్ని ప్రయోగించాడు శివుడు అప్రతిహతమైన శైవాయుధమది, దూసుకు వెళ్ళిపోయింది.

బాలకుడి శిరస్సుకోసుకుని తిరిగివచ్చి త్రిపురాంతకుడి కరాల నలం కరించింది. గడగడలాడిపోయింది లోకం. కొడుకు వంటి వాడి చావుకి కుతకు తలాడిపోయింది. కొండచూలి. శివుడే సరాసరి యుద్ధానికి దిగగా లేనిది, తాను రంగప్రవేశం చేస్తే తప్పేముంది? అనుకుంది.

ఆమె ఆవేశం నుండి అగణితమైన శక్తులు ఆవిర్భవించాయి. కరాళి, కుబ్జక, ఖంజ, లంబ శీర్ష మొదలైన మహాశక్తులు దొరికిన వాళ్ళని దొరికినట్లుగా చప్పరించేస్తుంటే - ఏం చేయాలో పాలుపోలేదు దేవతలకి. శివుడంతటివాడు శక్తి విజృంభణను చిత్తగిస్తూండిపోయాడే తప్ప - చిటమంత కూడా యెదిరించలేదు. చివరికి దేవతలంతా కలిసి నారదాది ఋషులను అమ్మవారి దగ్గరకు పంపారు. ఆ విడని శాంతింప జేయమన్నారు. నారదాది మునిబృందాలు చేసిన స్తోత్రాలతో రవ్వంత శాంతించింది రాజరాజేశ్వరి. "నా కుమారుడైన బాలుణ్ణి పునర్జీవితుణ్ణి చేస్తేనే నా శాక్తేయ గణాలని వెనక్కి తీసుకుంటాను. అని మాత్రం చెప్పింది.

పార్వతమ్మ చెప్పినట్లు చేయడం ఫాలాక్షుడంతటి వాడికీ తప్పలేదు. "సరే! ఉత్తరదిశగా వెళ్ళి - తొలిగా యే జంతువు కనిపిస్తే దాని తల తెండి." అని ఆజ్ఞాపించాడు శివుడు. ఈ లోపల ఆ బాలుని మొండేనికి స్నానం చేయించారు. పూజా ద్రవ్యాలతో అలంకరించారు. ఉత్తరానికి వెళ్ళిన వారు ఒక యేనుగు తలను తెచ్చారు. దాన్ని మొండేనికి అతికారు. "హే శివా! ఏ నీ తేజస్సు వల్ల మేమందరం జీవులుగా ప్రతిబింబిస్తున్నామో, అ నీ తేజస్సు వల్ల మేమందరం జీవులుగా ప్రతిబింబిస్తున్నామో, అ నీతేజస్సు ఈ బాలకుని కళేబరమందు కూడా ప్రవేశించు గాక" అని ప్రార్థించారు. అనుగ్రహించాడు రుద్రుడు. తక్షణమే నిద్ర లేచినవాడిలా - ప్రాణిమైనాడు బాలకుడు శిరస్సు ఒక్కటి ఏనుగదన్న పేరుగాని-తక్కిన శరీర మంతా యెర్రని రంగుతో వెలిగిపోతోంది. ఆ బాలకుణ్ణి అమ్మవారికి చూపించారు. అల్ప సంతోషిణి అమ్మవారు. గజముఖుడిగానైతేనేం, తన బిడ్డ పునర్జీవితుడు కావడమే చాలనుకుంది. శాంతించింది. ప్రపంచానికి గండం గడచింది.

# శ్రీ వినాయక (గణాధిపతి) పట్టాభిషేకం



అనంతరం దేవతలందరూ కలసి గొప్ప ఉత్సవం చేశారు. సర్వగణాధిపతిగా - ఆ బాలకునికి పట్టాభిషేకం చేశారు. పార్వతి ఆనందించింది. శ్రేష్ఠమైన వస్త్రాలూ అలంకారాలతో గజముఖుణ్ణి బహూకరించింది. అనేక విధాలైన సిద్ధులను అనుగ్రహించింది. 'సింధూర వర్ణముతో అలరారుతున్నావు నువ్వు, అందువల్ల నువ్వు సింధూరంతో పూజింపబడతావు. దేవతలందరిలోనూ అగ్రపూజ నీకే దక్కుతుంది. గంధం, పువ్వులు, పచనం చేసిన పదార్థాలూ పండ్లూ, తాంబూలం, హారతి, దక్షిణ నమస్కారాదులతో నిన్ను పూజించిన వారికి విఘ్నాలు తొలగిపోతాయి. సర్వ సిద్ధులూ సమకూరుతాయి.' అని వరాలు యిచ్చింది. శివుడు గణాధి పతిని తనబిడ్డగా ప్రకటించాడు. శివ పుత్రుడుగా విఘ్నేశ్వరుడు అర్హులైన సర్వులనూ గౌర వించాడు. విష్ణ్వాదులు అతనిని దీవించారు. 'మావలే నీవు కూడా సర్వత్రా పూజనీయు డగుదువుగాక! ఎవళ్ళయితే నిన్ను పూజించ కుండా మమ్మల్ని పూజిస్తారో వారి పూజ నిరర్థకమై పోవుగాక! ముందుగా నిన్ను కొలిచిన వారికి సర్వ విఘ్నాలు తొలగి పోవునుగాక" అని అనుగ్రహించారు.

ఈశ్వరుడు కూడా వినాయకుడిని ఆశీర్వదించాడు. 'భాద్రపదమాస, శుక్లపక్ష చతుర్థినాడు చంద్రోదయానికొక ఝాము ముందర ఉదయించావు గాబట్టి - అది నీ జన్మదినమై విరాజిల్లుతుంది. సాలుకు ఒక్కసారైనా ఆభాద్రపద శుద్ధ చవితినాడు నిన్ను ఆరాధించిన వారికి ఆ సంవత్సరమంతా నిర్విఘ్న ప్రదమవుతుంది. మార్గశిర శుద్ధ చవితిని రమాచతుర్థి అంటారు, ఆ రోజుకూడా నిన్ను పూజించాలి. ఇలా ప్రతి మాసంలోనూ వచ్చే శుద్ధ చవితినాడు (మొత్తం పన్నెండు చవితులు) నిన్ను పూజించి 2వ సారి ఉద్యాపన చేసుకున్న వారికి - ఇహ పర లోకాలలో తిరుగులేని సౌఖ్యాలు కలుగుతాయి' అని అనుగ్రహించాడు.

"ఓ శౌనకాది ఋషులారా! మీ కోరిక మేరకు గణేశుని అవతరణ చెప్పాను. మరేం వినదలుచుకున్నారో సెలవీయండి" అని అడిగాడు సూతమహర్షి. " అయ్యా! శివకుమారులైన గజముఖ, షణ్ముఖలిద్దరూ కూడా మహావీరులు, గుణసంపన్నులే. అన్నదమ్ములకు ఆదర్శప్రాయులయిన వీరిరువురి మధ్యా వివాహం విషయమై వివాదాలేవో వచ్చాయని వినికిడి. దయచేసి ఆ ఘట్టాన్ని సవివరంగా వినిపించి మమ్మల్ని ధన్యులను చేయు" మని ఋషులు కోరిన మీదట - యిలా ప్రారంభించాడు సూతమహర్షి.

# కుమార గణపతుల వివాహాల ప్రసక్తి



కుమార గణపతులిద్దరూ దిన దిన ప్రవర్ధమానులై వివాహానికి తగిన వయసు వారయ్యారు. ఒకనాడు వారు జగదంబా జగదీశ్వరుల వద్దకు వచ్చి తమకు పెళ్ళి చేయమని కోరారు. కానీ, తన పెళ్ళి ముందు జరగాలని కుమారస్వామి, తన పెండ్లే ముందు జరగాలని గణపతీ తీవ్రంగా పట్టుపట్టారు. అప్పుడు ఆది దంపతులు వారికో నియమము పెట్టారు. "ఎవరైతే ముందుగా భూప్రదక్షిణం చేసివస్తారో వారికే ముందుగా పెళ్ళిచేస్తాం" అన్నారు.

తత్క్షణమే కుమారస్వామి చిత్రబర్హిణుడిని అధిరోహించి భూప్రదక్షిణానికి బయలుదేరాడు. గణపతి మాత్రం కైలాసంలోనే వుండిపోయాడు. తనా స్థూల కాయుడు. సులువుగా ప్రయాణం చేయలేడు. అందువల్ల బుద్ధి నుపయోగించా లనుకున్నాడు ఒక మంచి యెత్తు వేశాడు.

శివ పార్వతుల నిమిత్తమై ఒక పీఠాన్ని యేర్పాటు చేశాడు. తాను వెళ్ళి ఆకాశ గంగలో స్నానం చేశాడు. తల్లిదండ్రుల్ని వచ్చి ఆ పీఠంపై ఆసీనులు కావలసి నదిగా కోరాడు. సరేనని వచ్చి, ఆసీనులయ్యారు వారు, గణపతి వారిని షోడశోప చారాలతోనూ పూజించి యేడుసార్లు ప్రదక్షిణం చేసి, చేతులు జోడించి నిలబడి - మెల్లగా ఇలా అన్నాడు.

# వినాయక వివాహం

శ్లో॥ "పిత్రోశ్చ పూజనం కృత్వా - ప్రక్రాంతించ కరోతియః
తస్యవై పృథివీ జన్యం ఫలం భవతి నిశ్చితమ్"

తల్లిదండ్రులను అర్చించి-వారికి ప్రదక్షిణ మాచరించినట్లయితే భూప్రదక్షిణం గావించిన పుణ్యం కలుగుతుంది. ఇది నిశ్చయం - అని వేద శాస్త్రాలు ఘోషిస్తున్నాయి. నేను యేడు పర్యాయములు ప్రదక్షిణము చేశాను. అంటే ఏడుసార్లు భూ ప్రదక్షిణం చేసినట్లయ్యింది. కాబట్టి వెంటనే నాకు పెళ్ళి జరిపించండి లేదా - వేదశాస్త్రాలు చెబుతున్న వన్నీ వట్టి అబద్ధాలని ఒప్పుకోండి, మీరేం చేయాలనుకుంటే అది చేయం'డన్నాడు.

నవ్వుకున్నారు నగజా, నగజామాతలు "ఆపత్సమయంలో బుద్ధినుపయోగించిన వాడే మేధావి గణపతీ! వేదశాస్త్రాలు యేమైతే చెబుతున్నాయో - వాటిని సత్యం చేయడమే మా సంకల్పం. నువ్వే గెలిచావు. ముందుగా నీ వివాహం గురించే ప్రయత్నిస్తాం" అని ఆశీర్వదించారు.

అదే సమయానికి విశ్వరూప ప్రజాపతి అక్కడకు వచ్చాడు. శివ నిర్ణయం తెలుసుకుని ఆనందించాడు. శివపార్వతులకు నమస్కరించి "అయ్యా! నాకు సిద్ధి, బుద్ధి అనే యిద్దరు కుమార్తెలున్నారు. తమకు అంగీకారమైతే ఆ నాబిడ్డల్ని మీ వినాయకుడికిచ్చి కన్యాదానం చేసుకుంటాను" అని అర్థించాడు. సరేనన్నాడు సాంబశివుడు.

వైభవంగా జరిగింది విఘ్నేశ్వరుడి వివాహం. గణపతి - తన భార్యలైన సిద్ధితోనూ, బుద్ధితోనూ కులాసాగా గడిపేశాడు. సిద్ధియందు 'క్షేముడు అనే పుత్రుడూ, బుద్ధియందు 'లాభుడు' అనే కుమారుడూ కలిగారు.

# కుమారస్వామి అలక

అప్పటికి భూప్రదక్షిణం పూర్తి చేసుకుని వచ్చాడు శరవణుడు. నారదుడు కుమార స్వామికి యెదురు వెళ్ళాడు. 'వేలాయుధా! నేనంటున్నా నని కాదుగాని - సృష్ట్యాది నేటివరకూ యే తల్లిదండ్రులూ తమ బిడ్డలకు చేయని అన్యాయాన్ని ఆది దంపతు లైన శివపార్వతులు నీ పట్ల చేసే శారయ్యా! భూప్రదక్షిణం నెపంతో నిన్ను దూరంగా పంపేసి - ఇక్కడ వినాయకుడికి పెళ్ళి కానిచ్చేశారు.

శ్లో॥ దద్యా ద్యది గరం మాతా - విక్రీణీయాత్ పితా యది
రాజా హరతి సర్వస్వం - కస్మై కించ బ్రవీతు వై ?"

కన్నతల్లే విషం పెట్టినప్పుడు కన్నతండ్రే అమ్మకానికి పెట్టినప్పుడు రక్షకుడైన రాజే ఆస్తిపాస్తుల్ని అపహరించేనప్పుడు - ఇక మనం యెవరికి మొరపెట్టుకోగలమో నువ్వే చెప్పు, నీ సంగతేమో గాని, బుద్ధిమంతుడైన వాడెవ్వడూ కూడా తనకు అపకారం చేసిన వారి ముఖం కూడా చూడకూడదని వేదం! కదా!' అని వుద్దేశాడు.

అంతటి సుబ్రహ్మణ్యుడూ రవ్వంత చలించాడు. అమ్మా నాన్నల మీదేనన్న మాటేమిటి? అఖండమంతటి మీదా అలిగాడు. వెంటనే గౌరీశంకరులకు ఓ నమస్కారం చేసి - కైలాసం వదిలి పెట్టి క్రౌంచపర్వతానికి వెళ్ళిపోయాడు. అక్కడే వుంటూ - భక్తాభీష్టాలు నెరవేరుస్తూ వుండిపోయాడు. ఒక్క రహస్యం చెబుతున్నాను వినండి - యజ్ఞాలూ, యాగాలూ, జపాలూ అన్నీ ఒక్క యెత్తు, కార్తీక మాసంలో పౌర్ణమినాడు కృత్తికా నక్షత్రం వుండగా - కుమారస్వామి దర్శనం చేసుకోవడం ఒక్కటి ఒకయెత్తు, చేసుకున్న పాపాలన్నీ చెప్పా పెట్టకుండా చెల్లిపోతాయి, అలా స్వామివారి దర్శనం చేసుకున్న భక్తుల పుణ్యం లెక్కగట్టడం నాలుగునోళ్ళ బ్రహ్మకు గాని, రెండు వేల నాలుకల ఆదిశేషుడికి గాని శక్యం గాదు.

## శ్రీ శైలావిర్భావము



సరే - కార్తికేయుడలా క్రౌంచాద్రి మీద కాపురం వుండిపోయాడు, ఆయన లేక పోవడం కైలాసవాసులకి చాలాలోటుగా వుంది. పార్వతీదేవి అయితే - పుత్ర వియోగాన్ని అసలు భరించలేకపోయింది. శివుణ్ణి వేడుకుంది. పార్వతీ పరమేశ్వరు లిద్దరూ కలసి క్రౌంచ పర్వతము చేరారు. అక్కడే యీశ్వరుడు మల్లికార్జునుడనే పేరుతో జ్యోతిర్లింగంగా ఆవిర్భవించాడు, అమ్మవారు భ్రమరాంబగామారారు. వారిద్దరూ కుమారస్వామి నిమిత్తంగా ఆ కొండమీదే చాలాకాలం కొలువుండి పోయాడు. అప్పుడే కాదు. ఇప్పుడూ వున్నా రక్కడ, ఈ నాటికీ భక్తులకు కొంగు బంగారమై అలరారుతున్నారు.

ఇది నచ్చలేదు కుమారుడికి. అందువల్ల క్రౌంచ పర్వతాన్ని కూడా వదిలి యెటో వెళ్ళిపోవడానికి నిశ్చయించుకున్నాడు. అది భరించలేని దేవతలూ, ఋషులూ కట్టగట్టుకు వెళ్ళి ఆయన కాళ్ళ మీద పడ్డారు. "దురితవిదూరా! మాకు దూరమైపోవద్దు" అని ప్రార్ధించారు. కరుణా సింధువు ఆ కార్తికేయుడు. వారిపట్ల ప్రసన్నుడయ్యాడు. అందువల్ల ఎక్కువ దూరం కాకుండా, కేవలం మూడు యోజనాలు (ఇరవై నాలుగు మైళ్ళు) మాత్రం యెడంగా వెళ్ళి అక్కడ స్థిరపడ్డాడు. అయినా కొడుకు పట్ల మోహం వదులుకోలేని కారణంగా, ప్రతి అమావాస్యనాడూ చంద్రశేఖరుడూ, పున్నమినాడూ కాళీమాతా - కుమారస్వామి వద్దకు వెళ్ళి ఆయనను చూసుకువస్తుంటారు.

"ఓ ఋషులారా! సర్వపాప వినిర్ముక్తము సద్యఃఫలప్రదమూ అయిన శరణభవ చరిత్రాన్ని వినిపించాను. ఇది తెలుసుకున్న వారు అన్ని కష్టాల నుంచి, పీడల నుండి బైటపడతారు. శివజ్ఞానం పొందుతారు" అంటూ ఆపాడు సూతుడు.

# త్రిపురాసుర సంహార గాథ

ఏతత్కథానంతరం, ఋషుల కోరికపై త్రిపురాసుర సంహారాన్ని వినిపించాడు సూతుడు. కారణ జన్ముడైన కార్తికేయుడి చేతిలో తారకాసురుడు నశించిపోయాడని గతంలో విన్నారు కదా! ఆ తారకాసురుడికి ముగ్గురు కొడుకు లున్నారు. పెద్దవాడి పేరు తారకాక్షుడు. రెండోవాడు విద్యున్మాలి. మూడోవాడు కమలాక్షుడు. వీళ్ళు ముగ్గురు కూడా సమాన బలవంతులు, మహావీరులు కూడాను. తండ్రి చావుకు తల్లడిల్లి పోయారు. దేవతల మీద అంతులేని ద్వేషంతో అట్టుడికిపోయారు. పగ తీర్చుకోవాలనే పట్టుదలతో పంకజాసనుడి కోసం తపస్సు చేయడం మొదలు పెట్టారు. వేసవి కాలం అగ్నిగుండాల మధ్య కూర్చుని తపించారు. శీతాకాలం నీళ్ళలో నిలబడి ధ్యానించారు. వర్షాకాలం జడపదార్థాల్లాగా జడివానల్లో తడుస్తూ జపించారు. వందసంవత్సరాల పాటు ఒంటికాలు మీద నిలబడి తపస్సు చేశారు ఆ తర్వాత తిండి తిప్పలు మానేసి కేవలం గాలి మాత్రమే పీలుస్తూ వెయ్యి సంవత్సరాలు ధ్యానం చేశారు. ఆ మీదట - తల క్రిందికీ, కాళ్ళు పైకీ పెట్టి మరో వందేళ్ళు తపించారు. అప్పటికి బ్రహ్మదేవుడు ప్రత్యక్షం అయ్యాడు. "ఓ రాక్షసులారా! యేమి కావాలో కోరుకోండి" అన్నాడు బ్రహ్మ.

ఆయన మాట అనడం ఆలస్యంగా అడగడం ఆరంభించారు అసురులు. "ఇప్పటివరకు పుట్టిన వాళ్ళకుగాని, ఇకముందు పుట్టబోయే వాళ్ళకుగాని దుర్భేద్య మైన మూడు నగరాలను నిర్మించి యియ్యిమాకు. మేమా నగరాలతో సహా బ్రహ్మాండమందంతటా సంచరించాలి. మాలో తారకాక్షుడికి బంగారపు నగరం, కమలాక్షుడికి వెండి నగరం, విద్యున్మాలికి యినుముతో చేసిన నగరం కావాలి. మేం నగరప్రవేశం చేసిన వెయ్యి దివ్య సంవత్సరాల తర్వాత, ఒకానొక మిట్ట మధ్యాహ్నంవేళ, చంద్రుడు పుష్యమీ నక్షత్రంలో వున్న అభిజిన్ముహూర్తంలో, అంతరిక్షంమీది నక్షత్రాలు అంతర్హితాలై యుండగా, పుష్కల-ఆవర్త నామక మేఘాలు ఘోరాతి ఘోరంగా వర్షిస్తున్నప్పుడు మామూడు నగరాలూ ఒకే ప్రాంతంలో సంచరించడమే గనుక తటస్థించినట్లయితే - అటువంటప్పుడు మాత్రం - సర్వ దేవతా సార్వభౌముడైనవాడు సర్వవిధ సమరోపకరణాలతో సమాయత్తుడై - అంతః పరంలో అసాధ్యమైనదీయైన రథంపై అధిరోహించి - సద్యోవినిర్మితమూ అపూర్వ మూయైన ఒకే ఒక్క బాణంతో మమ్ములను వధించగలిగేలా అను గ్రహించుచాలు. అన్నారు.

బ్రహ్మ దేవుడికి నాలుగు గొంతుకలూ యెండిపోయినంత పనైంది అయినా ఒక్కసారి శివనామస్మరణం చేసుకుని, తనకి తనే ధైర్యం చెప్పుకుని, వాళ్ళకి ఆ వరాన్ని అనుగ్రహించేశాడు. తక్షణమే వాళ్ళకి మూడు మహానగరాలూ సిద్ధించాయి. బంగారు నగరం స్వర్గ ప్రాంతంలోనూ, వెండి నగరం ఆకాశంలోనూ, ఇనుపనగరం భూమి మీదా నిలిచేలా మలిచాడు మయుడు. త్రిపురాసురుల కోరికపై ఆ మయుడు కూడా వారితో బాటే ఆయా నగరాల్లో నివసించసాగాడు. ఆ నగరాల్లోని రాక్షసులకు యుద్ధవిద్యలు కూడా నేర్పాడు.

సేనలను సిద్ధపరచుకుని, తమ రాక్షస బుద్ధిని ప్రదర్శించారు త్రిపురాసురులు. తల్లిడిల్లిపోయాయి దేవగణాలు. పరుగుపరుగున కైలాసం చేరారు. వాళ్ళ మొర్రలన్నీ విన్నాడు శివుడు.

"ఇంద్రాదులారా! త్రిపురాసురులు మిమ్మల్ని యెంత హింసించినప్పటికీ కూడా శ్రౌతస్మార్తకర్మలు మాత్రం విధివిధానంగా జరుపుతున్నారు. ధర్మాత్ములని దండించడం నాకు యిష్టం వుండదు. అందువల్ల వాళ్ళు ధర్మచ్యుతులయ్యే దాకా వేచి వుంచండి. లేదా, వారికి ధర్మచ్యుతుల్ని చేసి నాకు చెప్పండి. వెళ్ళండి" అన్నాడు ఈశ్వరుడు.

దేవతలంతా కలిసి వైకుంఠం చేరారు. శివుడు చెప్పిన మాటల్ని చెప్పారు. రాక్షసులను ధర్మ భ్రష్టులను చేయాలనుకున్నాడు - విష్ణువు తత్క్షణమే తన నుండి అరిహన్ అనే మాయావిని సృష్టించాడు.

## త్రిపురాసురులు విష్ణు మాయా మోహితులగుట



పూర్ణముండితమైన శిరస్సుతో ప్రాచేలాలతో వున్నాడు అరిహానుడు. భుజానికో పానపాత్ర తగిలించబడివుంది. చేతిలో పుస్తకం వుంది. మూతికి గుడ్డ నడ్డంపెట్టుకుని "ధర్మం ధర్మం" అని సణుగుతున్నాడు. విష్ణువుకు నమస్కరించి, ఏదైనాపని చెప్పమని కోరాడు. విష్ణువు అతనిని దీవించి "నాయనా అరిహానా! నానుంచి ఆవిర్భవించావు గనుక - నావలెనే నువ్వుకూడా పూజలు పొందుతావు. శ్రౌతస్మార్తాలకు విరుద్ధంగానూ, వర్ణాశ్రమధర్మాలకు వ్యతిరేకంగానూ, అప శబ్దయుతంగానూ, అక్కడక్కడ ద్వంద్వార్థాలు స్ఫురించేలాగానూ, పదహారువేల శ్లోకాలతో ఒక మాయాశాస్త్రాన్ని సృష్టించు. తద్వారా త్రిపురాలలో నివసిస్తున్న దైతేయుల్ని దగాచేసి ధర్మభ్రష్టులుగా చెయ్యాలి. వారిని వైదిక ధర్మంనుంచి తొలగించి నీ ప్రయత్న సర్వస్వంతో నీమతంలో చేర్పించాలి. నీలాంటి వాళ్ళనే నలుగురు శిష్యుల్నీ కూడా సృష్టించుకో. ప్రస్తుతం త్రిపురాలకు ప్రాకబోయే నీ 'పనికిమాలిన ధర్మం' కలియుగంలో బహుళ వ్యాప్తిని పొందుతుంది. నిజానికిది చాలా పాపకృత్యం అయినప్పటికీ కూడా నా ఆజ్ఞాబద్ధుడవై నీవు యీ పనిని

నిమిత్తమాత్రంగా చేయడం వలన నీ కెటువంటి పాపమూ అంటదు." అని ఉపదేశించాడు.

శ్రీమన్నారాయణుడిచే ప్రేరితుడైన నారదుడు జగద్రక్షణార్ధం అరిహన్ యొక్క మాయామతాన్ని స్వీకరించినవాడివలె నటిస్తూ జటజూటాదులూ అవి విసర్జించి తానుకూడా అరిహన్‌కు మల్లేనే వేషం ధరించి త్రిపురాసురులను కలిసి "అరిహన్ చెప్పిందే అసలు వేదం శివారాధనాగట్రా అంతా మిధ్య" అన్నాడు. తనుకూడా తలగొరిగించుకుని మతం మార్చుకున్నానన్నాడు. ఆశ్చర్యపోయారు రాక్షసులు. నారదుడితో కలిసివెళ్ళి అరిహన్ దర్శనం చేసుకున్నారు. వెంటనే విష్ణుమాయలో పూర్తిగా మునిగిపోయారు. మతదీక్ష నీయమని ప్రార్ధించారు. అరిహన్ తన 'పనికిమాలిన' మతాన్ని వారికి దీక్షగా యిచ్చి, నియమాల్ని చెప్పాడు. ఆ రాక్షస రాజులద్వారా రాజోద్యోగులకు, తద్వారా - సాధారణ రాక్షసులకూ కూడా ఆ మాయా మతం ప్రాకిపోయింది.

ఈ విధంగా అరిహన్ వల్ల ప్రచారం కాబడ్డ పనికిమాలిన మతం పుణ్యమా అని త్రిపురాలు కూడా పాతివ్రత్యం యెరగని స్త్రీలతోనూ, వర్ణ సాంకర్యంతోనూ, విపరీత మేధావులతోను నిండిపోయాయి. త్రిపురేంద్రుల తపశ్శక్తి క్షీణించి పోయింది. మయుడితో సహా తమ తమ తేజాలు కోల్పోయారు వాళ్ళు. అదే అదనుగా త్రిపురాలలోనూ దరిద్రదేవత తన దక్షిణ పాదాన్ని మోపింది.

త్రిపురాలలోని రాక్షసులంతా చెడిపోయారని తెలియగానే, దేవతలందర్నీ వెంటబెట్టుకుని కైలాసం వెళ్ళాడు విష్ణువు. శివుణ్ణి స్తోత్రం చేశారు వాళ్ళు. "హే నీలకంఠా! నీ దయవల్ల రాక్షసులను ధర్మచ్యుతుల్ని చేశాము. నువ్వా త్రిపురాసురులను సంహరించడమే ఆలస్యం అని వేడుకున్నారు. 'సరే యుద్ధపరికరాలను సిద్ధం చేయండి' అన్నాడు శివుడు.

## శివుడి యుద్ధ సన్నాహాములు

దేవతలు రథం చేసేపనిని విశ్వకర్మకు వప్పగించారు. సర్వలోక సారాన్నీ ఆకర్షిం చాడు విశ్వకర్మ. దానితో చేశాడు రథాన్ని. ద్వాదశాధిపతులు పన్నెండు ఆకులు కాగా ప్రత్యక్ష తేజోమూర్తియైన సూర్యుణ్ణి రథానికి కుడిచక్రంగా అమర్చాడు. పదహారు కళలతో కూడుకున్న చంద్రుణ్ణి ఎడమచక్రంగా అమర్చాడు.



ఆరు బుతువుల్నీ కమ్ములుగా చేశాడు. ఆకాశాన్ని అవకాశంగా మలిచాడు. మందరగిరిని రథస్థలంగా మార్చాడు. ఉదయ అస్తాచలాలను నొగలుగా కూర్చాడు. మేరుగిరిని అధిష్ఠానంగాను, కేసరపర్వతాలను ఆశ్రయాలుగాను, సంవత్సరాలను రథవేగంగాను, అయనాలను చక్రాల కూర్పులుగాను, ముహూర్తాలను చక్రనేముల క్రింద నుండే కర్రలుగాను, కళలు చీలలగాను, కాష్ఠలు ఘోణములుగాను, క్షణాలు రథపుకలప గాను, నిమిషాలు నొగలి క్రింద యెత్తుగా పరిచే తుండుగానూ పేర్చాడు. అనులవాలు ఏడికోలలు, స్వర్గమోక్షాలు పతాకలు, అవ్యక్తం ఏడుకోలల దండం. మరో అవ్యక్తంరథ సంచార ప్రదేశంగాను తీర్చాడు. అహంకార కోణాలుగా, పంచభూతాలను సత్తువగా, ఇంద్రియాలను అలంకారాలుగా, శ్రద్ధను గమనంగాను, షడ్వేదాంగాలు, పురాణ, న్యాయమీమాంసా, ధర్మశాస్త్రాలు అప్రధాన భూషణాలుగా, మంత్రాలు ఘంటలుగా, వర్గాలు తదితర పరికరాలుగా దిశోపదిశలే పాదాలుగా, సాగరాలు ఆకర్షణాలుగా అమరించాడు. గంగాది దివ్యనదులు స్త్రీ రూపాలు దాల్చి రథ స్థలం యిరువైపులా చామరాలు వీస్తూ వున్నాయి. పర్వతాలు రథం యెక్కేందుకు బంగారపు మెట్లుగా పరిణమించాయి.

ఆ మహాద్భుత రథానికి బ్రహ్మదేవుడు స్వయంగా సారధిగా మారాడు. దేవతలు పగ్గాలు బట్టారు. ప్రణవం కంచీ కర్రగా మారింది. మందరం కామగానూ, అకారం దానిమీద గొడుగుగానూ పరిణమించాయి. మేరుపర్వతం ధనుస్సు కాగా - ఆదిశేషుడు ఆ వింటికి అల్లె త్రాడు (నారి) గా మారాడు. సరస్వతీదేవి. రథం యొక్క ప్రధాన ఘంటికను ఆవహించింది.

ఇక సద్యోజాతమైన బాణం కావాలి, ఆలోచించగా ఆలోచించగా - సర్వం సహాస్థితి కర్తా, రుద్రతుల్యుడూ అయిన శ్రీ మహావిష్ణువు అనూహ్యామైన శరంగా మారిపోయాడు. మారడం ఆలస్యంగా అగ్నిహోత్రుడు ఆ బాణపు ముక్కును ఆక్రమించాడు. ఇంతెందుకు -సప్తర్షులు పురోగాములై వేదమంత్రాలు వల్లిస్తుండగా, వేదాలు గుర్రాలుగా పూన్చబడిన ఆ రథం, దానికదే ఒక బ్రహ్మాండంగా భాసిల్లుతోంది.

# త్రిపురాసుర దహనం



శివుడు యుద్ధోచితమైన రూపం దాల్చాడు. రథం అధిష్ఠించాడు. బ్రహ్మ ఆ రథాన్ని ముందుకు దూకించాడు. త్రిపురాల తావు చేరారు అందరూ.

శివుడు తన మహాపర్వత ధనువుకు, ఆది శేషుణ్ణి అల్లె త్రాడుగా బిగించాడు. అగ్నిముఖ విష్ణువును బాణంగా వింటికి సంధించాడు. మూడు పురాలని యేక కాలంలో కొట్టాలిగదా! అందుకని - 100 సంవత్సరాల పాటు గురిచూశాడు. గురి కుదిరింది. అప్పటికి - తారక పుత్రులు త్రిపురాసురులుగా మారి వెయ్యి దివ్యవర్షాలు పూర్తయ్యాయి. చంద్రుడు పుష్యమీ నక్షత్రయుక్తుడై వున్నాడు. సరిగ్గా మధ్యాహ్నం అయ్యింది, పుష్కలావర్తాలు హఠాత్తుగా పురిమి వర్షింపసాగాయి. అభిజిన్ముహూర్తం చూసుకున్నాడు శివుడు. అంతే, నారిని ఆకర్ణాంతంలాగి వదిలాడు బాణం. ఏకకాలంలో త్రిపురాలూ ఒకేచోట సంఘటిత పడ్డాయి. అంతే భగ్గున మండిపోయాయి-భర్గ బాణాగ్నిలో, యెలావున్న రాక్షసుల లానే కాలిపోయారు. పారిపోయిన వాళ్ళోపది అడుగుల్లోపలే పరమపదించారు.

తదనంతరం బ్రహ్మాదులు అర్హనాదులను చేరబిలిచి. మీ కర్తవ్యం పూర్త య్యింది. కలియుగారంభం వరకూ పర్వతాగ్రాలపై నివసించండి. ఆ యుగారంభం నుంచీ ప్రజలు మీమతమందు మోహితులై మిమ్మల్ని ఆశ్రయిస్తారు. పుణ్యాత్ములు మాత్రం మిమ్మల్ని గుర్తెరిగి మీపట్ల వుదాసీనులై చరిస్తారు. పాపాత్ములు మిమ్మల్నే నమ్ముకుని దుర్గతి పాలైపోతారు- అని చెప్పి పంపేశారు.

జయజయ నినాదాల నడుమ త్రిలోకాలూ విజయోత్సవ సమ్మానాలనూ ఆరాధలనూ అందుకుంటూ శివుడు సపరివారంగా కైలాసం చేరాడు.

# జలంధరోత్పత్తి

అనంతరం ఋషుల కోరికపై, సూతుడు జలంధరుడి గురించి చెప్ప సాగాడు - ఒకసారి పురందర బృహ స్పతులు యిద్దరూ కలిసి కైలాసము వెళ్ళారు. శివుడు వారి జ్ఞానాన్ని పరీక్షించ సంకల్పించి భేతాళరూపంలో కనిపించాడు. దేవేంద్రు

డాయనను గుర్తించ లేక 'యెవరు నువ్వు? ఇలా వ్రేళ్ళాడుతున్నావేమిటి? శివుడు కైలాసంలో వున్నాడా యెక్కడికైనా వెళ్ళాడా? అని ప్రశ్నించాడు. కిమపినాస్తిగా వుండిపోయాడు ఆ శివుడు. ఎంతైనా దేవతల రాజు కదా యింద్రుడు! ఆ అధికార మత్తత వల్ల ఆగ్రహించాడు. వజ్రాయుధంతో ఆ భేతాళరూపాన్ని ఖండించ బోయాడు. కాని - ఆ రూపంలో వున్న శివుడు వజ్రాయుధంతో సహా వాసవుని చేతిని స్తంభింపచేశాడు. ఆశ్చర్యపోయాడు అమరేంద్రుడు. శివుని ఫాలనేత్రం నుండి అగ్ని ఆవిర్భవించింది.

అప్పుడర్థమైంది బృహస్పతికి - ఆ భేతాళ రూపుడే సర్వేశ్వరుడని, వినయంగా నమస్కరించి, ఆయనను స్తుతించాడు. ఇంద్రుణ్ణి ఆయన పాదాలమీదకు నెట్టాడు. ఎలాగైనా సరే ఇంద్రుణ్ణి కాపాడమని శతధా ప్రార్థించాడు. బృహస్పతి కృతస్తోత్ర పాఠాలకు శివుడు సంతసించినాడు - తన ఫాలనేత్రాగ్నిని లవణ సముద్రంలోకి విసిరివేసి తాను అంతర్హితుడైపోయాడు.

అలా ఈశ్వరుడిచేత ఉప్పు సముద్రంలోకి విసరివేయబడ్డ ఆ అగ్ని తక్షణమే బాలుడిగా పరిణమించింది. ఆ బాలుడే జలంధరుడు. బ్రహ్మ వరప్రభావంతో మహా బలశాలియైనాడు. రాక్షసరాజైన కాలనేమి కూతురు బృందను వివాహ మాడాడు. రాక్షస బంధుత్వంతో రాక్షసరాజుగా మారి సుఖంగా వున్నాడు జలంధరుడు.

## జలంధరుడి జులుం



ఒకనాడు భార్యా, బంధు, మిత్ర, పరివార సమేతుడై - కొలువుదీరి, తలలేని రాహువును చూసి, అతని కాగతి యెందువల్ల కలిగిందో చెప్పమని శుక్రుణ్ణి అడిగాడు. శుక్రుడు క్షీరసాగర మధన వృత్తాంతం అంతా చెప్పాడు. అది విన్న జలంధరుడు దేవతా ద్వేషిగా మారాడు. సర్వసైన్యాలనూ సమాయత్తం చేసుకుని స్వర్గంపై సమరభేరి మ్రోగించాడు. అతిలోక భయం కరమైన యుద్ధం జరిగింది. తట్టుకోలేని దేవతలు పారి పోయి మేరుపర్వత గుహల్లో దాక్కున్నారు. స్వర్గాన్ని

యథేచ్ఛగా ఆక్రమించాడు జలంధరుడు. శుంభ, నిశుంభాది వీరుల్ని తగిన పదవులలో నియమింపజేశాడు.

శత్రుశేషం వుంచకూడదనే రాజనీతి ననుసరించి, దేవతలందర్నీ హరించే నిమిత్తం తాను స్వయంగా మేరుపర్వతం వైపుకు సాగాడు. ఇది తెలిసింది దేవతలకి వెంటనే మేరుపర్వత గుహలు ఖాళీచేసి, వైకుంఠానికి పారిపోయారు అక్కడ విష్ణువును శరణు కోరారు. ఆయన వారికి అభయం యిచ్చాడు.

# విష్ణు జలంధర సంగ్రామం



సర్వదేవతా సంరక్షణార్థంగా శౌరి, జలంధరుడిపై యుద్ధానికి బయలుదేర బోయాడు. లక్ష్మీదేవి ఆయనను వారించింది. "ప్రాణేశ్వరా నేనూ సముద్రుడి కూతుర్నే - ఆ జలంధరుడు కూడా సాగరతనయుడే కాబట్టి అతడు నాకు తమ్ముడవుతాడు, దయచేసి నా తమ్ముణ్ణి వధించకండి" అని ప్రార్థించింది. విష్ణువామెను ఓదార్చాడు. మనోహరీ! నువ్వు దిగులుపడకు. స్థితి కర్తను కాబట్టి, యిప్పుడు దేవతా రక్షణార్థం నాకీ యుద్ధం తప్పదు. కాని, జలంధరుణ్ణి నేను వధించను. యెందుకంటే అతన్ని నేను చంపలేను. అతడు శివఫాలనేత్రాగ్ని సంజాతుడు పైగా బ్రహ్మ లతనికి వరం కూడా యిచ్చివున్నాడు. శివాజ్ఞననుసరించి కాస్సేపు అతనితో కలహమాడి వచ్చేస్తాన'ని చెప్పి రనరంగానికి వెళ్ళాడు. అది తెలిసి అగ్రహోదగ్రుడైపోయాడు జలంధరుడు. సరాసరి శ్రీహరితో యుద్ధానికి - తనే వచ్చాడు. అంతూ పొంతూ లేకుండా సాగుతున్న ఆజలంధర, జలజనాభుల జగడంలో "జయలక్ష్మి" యెవర్నీ వరించకపోవడంతో- అఖిల లోకాలూ ఆశ్చర్యంలో మునిగిపోయాయి. తుదిగా, విష్ణువు చిరునవ్వు నవ్వుతూ, "జలంధరా! ఆది కాలం నుంచీ రాక్షసులకూ నాకూ రగడ జరుగుతూనే వుంది.

కాని, యెటువంటి అస్త్ర శస్త్రాలకూ చలించని నీ బలపరాక్రమాలు నాకు చాలా ఆనందం కలిగిస్తున్నాయి. నీ శక్తి సామర్ధ్యాల యందు నేను ప్రసన్నుడి

నయ్యాను. యేదైనా వరం కోరుకో" అన్నాడు. జలంధరుడు కూడా మందహాసం చేశాడు. "బావా లక్ష్మీ పతీ! నిజంగానే నువ్వు ప్రసన్నుడివై వరం యిచ్చేలా వుంటే - మా అక్కగారైన లక్ష్మితో కలిసి వచ్చి నువ్వు నా యింటనే నివసించు" అని కోరాడు "సరే" నన్నాడు శౌరి. వైకుంఠాన్ని వదిలి, భార్యతో సహా బావమరిదియైన జలంధరుడింటికి మకాం మార్చేశాడు విష్ణువు.

ఉన్న ఒక్క అండా అలా అయిపోవడం ఉసూరుమన్నాయి దేవగణాలు. జలంధరుడు అందర్నీ జయించి, అలనాటి సాగరమథనవేళ సంభూతాలైన శ్రేష్ఠరత్న చయాల్ని కైవసం చేసుకున్నాడు. దేవతలపదవులలో రాక్షసులను స్థాపించాడు. మూర్తీ భూత పరిపాలనమైన - విష్ణువే అతనింటవుండగా, అతని పరిపాలనలో లోటేముంటుంది? సద్ధర్మానుసారియై జలంధరుడు ప్రజలను కన్న బిడ్డల్లా పరిపాలించసాగాడు.

## నారదుడు జలంధరుని రెచ్చగొట్టు రాహువు రాయబారము



ప్రజలెంత సుఖంగా వుంటే మాత్రం ఏమిటి? పదవులు పోగొట్టుకున్నవాళ్ళు వాళ్ళు. అందుచేత దేవతలంతా కలసి దీనులై శివస్మరణ చేసుకోసాగారు. వారి శివధ్యానం ఫలితంగా, శివప్రేరితుడైన నారదుడు దేవతార్థమై జలంధరుడి వద్దకు వెళ్ళాడు. లాంఛన మర్యాదలన్నీ అయ్యాక నారదుడు కపట ప్రసంగం ఆరంభించాడు. "జలంధరా! జగజ్జేతగా పేరొందిన నువ్వు శ్రేష్ఠమైన రాళ్ళను సంపాదించావు. రత్నాలన్నీ సంపాదించావు. వృక్షరత్నమైన కల్పతరువు. గజరత్నమైన ఐరావతం, అశ్వరత్నమైన ఉచ్చైశ్రవం యిలా అన్నీ వున్నాయి నీకు. కాని - నారీ రత్నం లేదయ్యా స్త్రీలందరిలోకి సర్వశ్రేష్ఠ పార్వతి.

ఆవిణ్ణి కూడా నీ జనానాలోకి చేర్చుకుంటేనే తప్ప-నీ-జగజ్జేత బిరుదానికి సార్థకత లేదోయ్" అని చెప్పాడు జలంధరుడి మనసును జగన్మాత మీదకి

మళ్ళించి - తన దారిన తను చక్కా బోయాడా జగడాలమారి. వెంటనే 'రాహువు'ను శివుడి వద్దకు రాయబారిగా పంపాడు జలంధరుడు, "శంకరా! వల్లకాట్లో తిరుగుతూ బూడిద పూసుకుని-భూత ప్రేత పిశాచాలతో కేరింతలాడే నీకు భార్యయొక్క అవసరమేమీ లేదు వున్నా, పార్వతి వంటి ప్రపంచోత్తమమైన పడతిని పరిపూర్ణంగా ప్రేమించడం నీ వల్ల కాదు. ఇది "స్త్రీ నిరాదరణా నిరోధ చట్టం" క్రింద నేరమే అవుతుంది. అనవసరముగా అర్ధాంగిని కలిగివుండటం-అక్రమార్జితాన్ని నిల్వ చేసినంత నేరం అవుతోంది. కాబట్టి, యీ కబురందిన వెంటనే మీ ఆవిడయైన మీనాక్షిని - రత్నాకర పుత్రుడనైన నాకు సమర్పించుకో" అని చెప్పమన్నాడు.

ఆజ్ఞాపించడం ఆలస్యంగా కైలాసానికి వెళ్ళి, జలంధరుడు చెప్పమన్న నాలుగు ముక్కలూ-జగదీశ్వరుడికి వినిపించాడతను. ఆ మాటలు వినీ వినగానే అంబికాపతి కనుబొమ్మల నడిమినుంచి ఒక ఉగ్రరూపుడు ఉద్భవించాడు. పుట్టడం పుట్టడమే - రాహువును చేతబట్టి నోటపెట్టుకోబోయాడు/ఘొల్లుమన్నాడు రాహువు. నేను జాతికి రాక్షసుణ్ణే అయినా, కులానికి బ్రాహ్మణ్ణి, నన్ను రక్షించండి, నే చెప్పిందాంట్లో యేదైనా దుర్మార్గం అంటూ వుంటే - అది నాదికాదు. నేను దూతనే గాని దుష్టుణ్ణి కాదు. కాబట్టి నన్ను రక్షించండి ప్రభో" అని ఆర్తనాదాలు చేశాడు.

అది విని శివుడు శాంతించాడు. ఆ ఉగ్రరూపుడిని ఆగమనీ, రాహువుని వదలమనీ ఆజ్ఞాపించాడు. అతగాడు రాహువును వదిలాడు, అలా విసర్జించబడిన రాహువు సరాసరి వెళ్ళి బర్బరదేశంలో పడ్డాడు. అప్పటినుండి రాహువుకు బర్బరుడు అనే పేరు వచ్చింది.

ఆ బర్బరుడు (రాహువు) వెళ్ళి, జరిగిందంతా జలంధరుడికి చెప్పాడు 'గయ్' మన్నాడు గండరగండడు. తక్షణమే గంగాధరుడిపై యుద్ధానికి తరలాడు. కాలనేమి, శుంభుడు, విశుంభుడు, మొదలైన వీరులతో జగజ్జేత జలంధరుడు జగదీశ్వరుడైన గంగాధరుడి మీద జగడానికి బయలు దేరగానే, ఒంటికన్ను శుక్రాచార్యుడూ, తలకాయలేని రాహువూ యెదురువచ్చారు. జలంధరుడి కిరీటం జారి పడింది. మేఘావృతంగాకుండానే ఆకాశం నల్లబడినది. 'మృత్యువు తప్పనిసరి' అని సూచించే శకునాలు యెన్ని వున్నాయో - అన్ని శకునాలు తోచాయి, అదే అలుసుగా భావించి దేవతలంతా సాంబశివుణ్ణి ఆశ్రయించారు. తమ కష్టాలు చెప్పుకున్నారు.

లక్ష్మీ నారాయణుల పరిస్థితిని వివరించారు. వెంటనే శంకరుడు విష్ణువును స్మరించాడు. తక్షణమే తార్క్ష్యవాహనుడు ఆయన ముందు స్ఫురించాడు. "ఏమిటిదంతా అని అడిగాడు. ఈశ్వరుడు.

" ఇంద్రుణ్ణి కాల్చవలసిన నీ ఫాలనేత్రాగ్నిని, నీరధిలోకి నెట్టావు నువ్వు, ఆ నిప్పే జలంధరుడిగా మారి దేవతలకు ముప్పుగా పరిణమించింది. వాడు నీ అంశతో పుట్టడం వలన, సముద్రంద్వారా జన్మించి లక్ష్మికి సోదరుడు కావటం వలననా, సృష్టికర్తగారైన నాలుగుతలకాయల వారు ఆ రాక్షసుడు శివుడిచేత మాత్రమే నిర్జింపబడేటట్లు వరాన్ని దయ చేయడం చేతా నేనతన్ని చంపలేక పోయిన మాట నిజమే, మహాశ్చర్యకరమైన అతని బలపరాక్రమాలకిగాను వరం కోరుకోమంటే - రమాసహితంగా తన యింటనే వుండుమని కోరుకోమన్నాడు. ఆడిన మాట తప్పలేక యిన్నాళ్ళు అక్కడే మసలుతున్నాను, ఇక నీదయ" అన్నాడు విష్ణువు.

# శివ జలంధర యుద్ధం



అరక్షణం మౌనంగా వున్నాడు. అంబికా నాధుడు, అనంతరం మృదువుగా అన్నాడు. "వాణ్ణి నేనే వధిస్తాను. మీరు నిశ్చింతగా వుండండీ" అని

నోట్లోమాట నోట్లోనే వుంది -అవతల్నుంచి రాక్షస కోలాహలం వినిపించ సాగింది. వెంటనే ప్రమధగణాలు యుద్ధ సన్నద్ధా లయ్యాయి దొమ్మీ ప్రారంభమైంది. ఆ దొమ్మిలో మరణించిన రాక్షసు లందరినీ శుక్రుడు తనవద్దనున్న మృత సంజీవని విద్యతో బ్రతికించేయసాగాడు. భృగుడు చేస్తున్న పనిని భర్గుడి చెవిలో వేశారు ప్రమధులు ఆగ్రహించాడాయన. అంతే - ఆయన నోటినుండి 'కృత్య' అనే శక్తి ఆవిర్భవించి యుద్ధరంగం చేరింది.

చచ్చినవాళ్ళని బ్రతికించే అవకాశం లేకుండా అక్కడికక్కడే భక్షించేయసాగింది, అయినా ఆగలేదు శుక్రాచార్యుడు చెదురుమదురుగా దొరిగిన శవాల్ని సైతం బ్రతికించివేయసాగాడు. అది నచ్చలేదు కృత్యకు, వెంటనే శుక్రుణ్ణి పట్టుకుని

తన యోనిలో బంధించేసి తాను ఆకాశానికి యెగిరిపోయింది. ఇది చూసి - కుంభ, నికుంభ కాలనేమ్యాదులు కార్ముకాలు సంధించారు. ఆ సంగతి తెలియ గానే, అటునుంచి నందీశ్వరుడు, విఘ్నేశ్వరుడు, సుబ్రహ్మణ్యేశ్వరుడు యుద్ధంలోకి వచ్చారు. ఆ ముగ్గురు ఈ ముగ్గురు ద్వంద్వ యుద్ధానికి దిగారు. అదే అదనుగా వూడిపడ్డాడు వీరభద్రుడు, ఇక చెప్పేదేముంది.

యుద్ధభూమి నుంచి వేగులు తెచ్చే ఒక్కొక్క వార్తా వింటూనే వెర్రెక్కి పోసాగాడా జలంధరుడు. ఆ పిచ్చి ఆవేశంతోనే శివగణాలమీద విరుచుకుపడ్డాడు. అనూహ్యామైన రీతిలో శివగణాలన్నిటినీ అతలాకుతలం చేసి వేయసాగాడు. అతని పరాక్రమ పటాటోపాలకి - నందీశ్వర, గణనాయక, కార్తికేయ వీరభద్రులు నలుగురూ కూడా నివ్వెర పోయారు. కైలాసాన పుట్టిన కాలకేతువులా వున్నాడు. జలంధరుడు. ఈ వార్త శివుడికి చేరింది. తక్షణమే తన పినాక ధనుస్సును ధరించాడు. జలంధరుడి బాణాలన్నిటినీ చెల్లాచెదురు చేసేశాడు. తన బాణాలతో ఆకాశాన్ని కప్పేశాడు.

లెక్క పెట్టడానికి వీల్లేనంతమంది రాక్షసుల్ని చంపేశాడు అది చాలదన్నట్లు మహావీరుడు ప్రచండుడు అనే యిద్దరు దానవదండ నాయకుల్ని తన త్రిశూలంతో పొడిచిచంపేశాడు. ఘస్మరుడనే వాడిని తన గదతో కొట్టి నేలమీద పడేశాడు. మంచుగడ్డతో-బలాహకుడి తల రెండు చెక్కలు చేసేశాడు. తన పరశువుతో ఖడ్గరోముడి శిరసు తెగనరికేశాడు. సర్రున యెదురొచ్చాడు జలంధరుడు. డబ్భై బాణాలు వేశాడు శివుడిమీద, శివుడు వాటన్నిటినీ తునాతునకలు చేసేశాడు. ఏడంటే ఏడే ఏడు బాణాలతో జలంధరుడి రథ, అశ్వ, ధ్వజ, ఛత్రధనుస్సులను పిండి చేసేశాడు. జలంధరుడు గద విసిరాడు. అది కూడా శివబాణానికి నుగ్గు నుగ్గయిపోయింది. వందమంది రాక్షసులకు వచ్చినంత కోపం వచ్చింది ఒక్క జలంధరుడికి. తక్షణమే పిడికిలి బిగించాడు. ముక్కంటిని ముష్టిఘాతంతో చంపెయ్యాలనుకున్నాడు. నవ్వుకున్నాడు నాగభూషణుడు, మాంచి బాణం ఒకటి తీసి జలంధరుడి గుండెలగాడ గొట్టాడు. ఆ మహాబాణ పాతానికి-జలంధరుడు రెండు మైళ్ళ వెనక్కి వెళ్ళి పడ్డాడు.

"శివుణ్ణి బలప్రయోగంతో జయించలేం" అని గుర్తించాడు జలంధరుడు. తిరిగి రణరంగం చేరి గంధర్వ మాయను ప్రవేశపెట్టాడు ఆ మాయ వల్ల రణరంగం

గంధర్వాప్సరసల గానాబజానాలతో నిండిపోయినది. స్తబ్ధుడైపోయాడు స్థాణుడు 'అమ్మయ్య' అనుకున్నాడు జలంధరుడు శివుడివేషం ధరించి - అమితమైన కాముకతతో అమ్మవారి దగ్గరకు వెళ్ళాడు.

చెలికత్తెల నడుమ కూర్చున్న మహామాయ-గంధర్వమాయ పూసుకు వస్తున్న మదగంధర్వుడైన జలంధరుడి మాయా శివుడి వేషం చూసింది. మరింత పెద్దపెద్ద కళ్ళు చేసుకుని, చెలికత్తెల నడుమనుండి అతని ముందుకు వచ్చింది. పరమ శివుడి పురుషాహంకారమే తన రూపంగా గలిగిన ఆ మహా మాయని నిలువెల్లా చూశాడు జలంధరుడు.

ఆ ఆనందానికి చలించిపోయి, చూసి చూడగానే వీర్యంస్ఖలించుకున్నాడు, తక్షణమే తల్లి ఉత్తరమానసం వైపుకు అంతర్ధానమైపోయినది. అక్కడికి చేరి విష్ణువును తలచింది. వినయంగా ప్రత్యక్షమయ్యాడు విష్ణువు. "విష్ణూ! ఆ జలంధరుడేం చేయబోయాడో, నువ్వు అదే విధముగా ప్రతిచర్య చెయ్యి. జలంధర పత్నియొక్క పాతివ్రత్యాన్ని నాశనం చెయ్యి. నా ఆజ్ఞ మేరకు నువ్వీ పని చేయడం వలన పాపం అంటదు వెళ్ళు' అంది.

## విష్ణువు బృందను చెరచుట



జలంధరుడి భార్య బృంద. ఆమె అంతః పురంలో శయనించి వుంది. విష్ణుమాయ వల్ల ఆమెకు పీడకల వచ్చింది. ఆ కలలో జలంధరుడు దిగంబరుడై వళ్ళంతా నూనె రాసుకుని, నల్లటి పూలు ధరించి మాంసభక్షకాలైన జంతువులచే చుట్టబడి - దున్నపోతు నెక్కి తిరుగుతున్నాడు. త్రుళ్ళిపడి లేచిందామె. అశాంతితో అటూ ఇటూ తిరుగుతు వుద్యానవనం చేరింది. అక్కడ భయంకరవదనులైన యిద్దరు రాక్షసులూ, ఒక ముని కనిపించారు.

ఆ రాక్షసులకు భయపడిన బృంద "నన్ను రక్షించండి తాపసోత్తమా!" అంటూ ఆ ముని గారి కంఠాన్ని వాటేసుకుంది. ఆ ముని చేసిన హూంకారంతో రాక్షసులు మాయమైపోయారు. తదనంతరం బృంద తన భర్త గురించి భయపడింది. ముని

ఆకాశం కేసి చూసి ఏవేవో కనుసైగలు చేశాడు. తక్షణమే రెండు కోతులు జలంధరుడి శరీరావయవాలను విడివిడిగా తెచ్చి అక్కడ పడేశాయి.

భర్త యొక్క శరీరావయవాల మీద పడి గగ్గోలు పడిపోయింది బృంద. దయచేసి తన భర్తని బ్రతికించమని ప్రార్థించింది. ముని కపటమైన కరుణ నటించి ఆ విగత శరీరావయవాలను తగు ఆకారంగా పేర్చి మాయతోటే బ్రతికించి తాను మాయమైపోయాడు అలా పునర్జీవితుడైన పురుషుణ్ణి చూసి భ్రమపడింది. బృంద, అతనితో కలసి అనేక రోజులా వుద్యానవనంలోనే యిచ్ఛాసురతాలనుభవించింది.

ఒకనాడు - మాయా జలంధరుడు పరాకుగా వుండటం వల్ల అతని యధార్థ రూపం బృందకు తెలిసిపోయింది. అతన్ని విష్ణువుగా గుర్తించి శపించింది. "నువ్వు చూపించిన మాయారాక్షసులే నిజంగా రాక్షసులయి జన్మించి నీ భార్యని అప హరింతురు గాక! నువ్వు భార్యా వియోగ దుఃఖంతో అడవులు ద్రిమ్మరి వానర సహవాసుడవగుదువు గాక! నీకు శిష్యుడైన ఆదిశేషుడే నీ సహచరుడగుగాక! అని శపించింది. విష్ణువెంత వారిస్తున్నా వినకుండా లుప్తపాతివ్రత్య దుఃఖతప్తయై - అగ్నిప్రవేశం చేసింది. బ్రహ్మాది దేవతలంతా బయలులో బారులు దీరి నిలబడి చూస్తుండగానే - బృంద యొక్క 'ఆత్మ జ్యోతి' సరాసరి పార్వతిలో లీనమై పోయింది. విష్ణువా బృందను తలుచుకుంటూ తరగని దుఃఖంతో ఆమె కాష్ఠంలోని బూడిదలో పడి దొర్లసాగాడు.

## జలంధరవధ



ఇక్కడ - పార్వతి అంతర్హిత కావడంతో జలంధరుడు రణరంగానికి మళ్ళాడు. అతనికి వీర్యస్ఖలనం కావడం వల్ల గంధర్వమాయపట్టు తప్పింది. దాంతో యుద్ధ భూమిలో స్తబ్ధుడైవున్న గంధర్వుడు తిరిగి ధనుష్టంకారం చేశాడు. రణరంగం చేరిన జలంధరుడు మళ్ళా మాయను పన్నాడు మాయా పార్వతిని సృష్టించి - ఆమెను శుంభ నిశుంభుల రథానికి కట్టించి కొట్టించ సాగాడు. అది చూసి విషమాంబకుడు విషణ్ణుడై పోయాడు. అదే అదననుకుని జలంధరుడు మూడు వాడి బాణాలతో ముక్కంటిని గాడనేసాడు.

అంత బాధలోనూ కూడా ఆ బాణాల దెబ్బలకు అల్లల్లాడిపోయాడా అల్లల్ల వీరుడు. పార్వతి గురించిన దుఃఖమును ప్రక్కకు పెట్టి, మళ్ళా ధనుస్సందుకు న్నాడు. దద్దరిల్లిపోయారు దైతేయులు, శుంభ, నిశుంభులు పారిపోసాగారు. అది గమనించిన శివుడు "ఓరోరే శుంభ నిశుంభుల్లారా! యుద్ధం నుంచి పారిపోతున్న వాళ్ళని చంపడం ధర్మం కాదు గనక వదిలేస్తున్నాను. కాని పార్వతిని బంధించి యెనలేని అపచారం చేసిన మీరు, ఆ పార్వతి చేతిలోనే మరణింతురుగాక" అని శపించాడు.

ఈ లోపల జలంధరుడు మళ్ళా విజృంభించాడు. తన పరిఘతో వాహనమైన వృషభాన్ని తాడించాడు. ఆ దెబ్బకు గొడ్డుపెట్టిన పరుగును పశుపతి కూడా నిలవరించలేకపోయాడు. ఎట్టకేలకు యెద్దును ఆపి - ఆపుకోలేని కోపంతో చేరువలో తోచిన నీటిలో తన కాలి బొటన వ్రేలు రాశాడు. ఆ రాపిడిలోంచే ఒక అద్భుతమైన చక్రం ఆవిర్భవించింది. ఆ చక్రాన్ని చేతబట్టి, గిరగిర త్రిప్పి జలం ధరుడి మీద ప్రయోగించాడు. కోటి సూర్య ప్రతీకాశమై మహాగ్ని చ్ఛటాజ్వంభితమైన ఆ చక్రం అతని శరీరాన్ని రెండు ఖండాలుగా చీల్చేసింది. తక్షణమే జలంధరుడి ఆత్మజ్యోతి శివునిలో లీనమైపోయింది. లోకాలూ శాంతించాయి జలంధర బాధితులైన దేవతాదులందరూ ఆనందించారు అంటూ ఆపాడు సూతుడు.

## శంఖచూడుని వృత్తాంతము



దను, కశ్యప దంపతులకు పౌత్రుడు దంభుడు. ఈ దంభుడు గొప్ప విష్ణు భక్తుడు కావడం వల్ల పుష్కరక్షేత్రం వెళ్ళి - కృష్ణ మంత్రాన్ని జపిస్తూ లక్ష సంవత్సరాలు తపస్సు చేశాడు. కరుణించాడు కమలాక్షుడు. దంభుడి ముందు ప్రత్యక్షమయ్యి-"ఏం కావాలో కోరుకో" మన్నాడు. "మహా బలపరాక్రమశాలీ, దేవత లందర్నీ జయించ గలిగినవాడూ, నీకు భక్తుడూ అయిన కుమారుణ్ణి ప్రసాదించమని కోరాడు దంభుడు. అనుగ్రహించి అంతర్హితు డయ్యాడు అనంతుడు.

అనతికాలంలోనే - గోలోకంలో రాధా దేవిచే శపించబడిన సుధాముడనే గోపాలుడు - దంభుడి భార్యయొక్క గార్భన పడ్డాడు. శుభముహూర్తాన జన్మిం చాడు. శంఖచూడుడు అని పేరు పెట్టి, ఆ కుర్రాణ్ణి ప్రేమగా పెంచుకోసాగాడు దంభుడు.

కొన్నాళ్ళకి శంఖచూడుడు పెద్దవాడయ్యాడు. జైగీషవ్యుడనే వారివద్ద వుపదేశం పొంది బ్రహ్మకోసం తపస్సు చేసి, దేవతలెవరూ తనను జయించలేనట్లుగా వరంపొందాడు. బ్రహ్మ తనకు తానుగా అతనికి కృష్ణకవచం ఉపదేశించాడు బదరికాశ్రమంలో తపమాచరిస్తున్న ధర్మధ్వజుడి కుమార్తె తులసిని వివాహ మాడమని చెప్పి అంతర్ధానమైపోయాడు.

ఆయన మాట ప్రకారమే శంఖచూడుడు బదరికాశ్రమం చేరి, తులసిని గాంధర్వ విధిని వివాహం చేసుకున్నాడు. భార్యా సమేతంగా స్వగృహానికి మరలివచ్చి, యిచ్ఛాభోగాల ననుభవించాడు. ఆ మీదట శుక్రాచార్యుడిచే ప్రేరితుడై నిర్జరులను నిర్జించాడు. పూర్వజన్మ స్మృతితో అలరారుతున్న శంఖచూడుడు - శాపవశాన రాక్షసుడయ్యేడే గాని, యేమాత్రమూ దుర్మార్గుడు మాత్రం కాలేదు. జన్మరీత్యా - చిరకాలముగా వున్న దాయాది వైరంతో దేవతలపట్ల మాత్రమే కాస్తంత కఠినంగా ప్రవర్తించేవాడు.

బ్రహ్మ విష్ణువులను ముందరుంచుకుని దేవతలంతా శివుణ్ణి దర్శించారు. "చూడుడు, చూడుడు ఆ శంఖచూడుడు, మాకు తలదాచుకో నీడ కూడా లేకుండా చేసాడు". అని విన్నవించారు. రుద్రుడు వారి నోదార్చి శంఖచూడుడిపై యుద్ధం ప్రకటించాడు.

## శివుడు శంఖచూడుని సంహరించుట

ఇరు పక్షాలూ యుద్ధభూమి చేరాయి. వీరవేషుడై, వృషభాధి రూఢుడై, వీరభద్ర, భైరవ, క్షేత్రపాలాదులు వెన్నంటి నిలువగా యుద్ధోత్సాహంతో జగన్మోహనంగా వున్న చంద్రచూడుణ్ణి చూడగానే శంఖచూడుడు - రథం దిగాడు. సాంబుడికి సాష్టాంగ దండ ప్రణామాలాచరించాడు. అనంతరం రథారూఢుడై - ధనుష్టం కారంతో యుద్ధం మొదలుపెట్టాడు.

శివుడూ శంఖచూడుడూ తలపడ్డారు. చిన్నగా మొదలయిన యుద్ధం తేరి చూడరానంత భయంకరంగా పరిణ మించింది. అతిలోక భీకరమైన ఆరుద్ర,



శంఖచూడులిద్దరూ - వంద సంవత్సరాలపాటు దెబ్బలాడుకున్నారు. 'ఇంకె న్నాళ్ళిలా దెబ్బలాడటం? అనుకున్నాడు శివుడు అంతలోనే ఆకాశవాణి రుద్రా! ఆ శంఖచూడుడి చేత కృష్ణకవచం వున్నంతవరకూ, అతని ఆలి శీలవతిగా వున్నంత వరకూ - అతనిని జరామృత్యువులు సోకలేవని జలజోద్భవుడి వరం వుంది. ముందర ఆ పని చూడు" అని గుర్తుచేసింది. వెంటనే శివుడు విష్ణువుని పిలిచి చెయ్యాల్సింది చెప్పాడు. తక్షణమే విష్ణువు/వృద్ధవిప్రుడి వేషంలో శంఖ చూడుణ్ణి సమీపించి, కృష్ణకవచాన్ని దానంచేయ్యమని అడిగాడు.

మహాదాత శంఖచూడుడు. నిస్సంకోచంగా, నిర్మలంగా - ఆ కవచాన్ని మాయా బ్రాహ్మణుడికి ధారపోశాడు. దాన్ని హస్తాన వుంచుకుని శంఖచూడుడి వేషం ధరించి - అతని భార్యయైన తులసి దగ్గరకు వెళ్ళాడు విష్ణువు.

చేత కృష్ణ కవచం ఉండడంవల్ల ఆ సాధ్వి అతనిని అనుమానించలేదు. విష్ణువామెతో రతిసలిపాడు. ఆమె పాతివ్రత్యం గంగలో కలిసి పోయింది. అది గుర్తించాడు గంగాధరుడు. 'విజయం' అనే పేరుగల తన త్రిశూలాన్ని తీసి శంఖ చూడుడిపై ప్రయోగించాడు. వంద మూరల వెడల్పు, వెయ్యి ధనుస్సుల పొడవూ ఉన్న ఆ 'విజయ'మనే శూలం నిరాఘాటంగా వెళ్ళి ఆ నిశాచరరాజుని తాకి దగ్ధం చేసింది. అంతరిక్షాన పయనించి శంకరుణ్ణి చేరింది.

ఆకాశం నుంచి పుష్పవర్షం కురిసింది. దేవతాకోటి ఆనందించింది. అప్సరసలు ఆడారు. గంధర్వులు పాడారు. 'జయ జయ' నమోనమః నినాదాల నడుమ వృషభవాహనారూఢుడైన శివుడు చాలా ఠీవిగా కైలాసానికి వెళ్ళిపోయాడు. సూతుడిలా చెప్పగానే మరి ఆ తులసి సాధ్వి యేమైంది?" అని అడిగాడు ఋషులు.

# విష్ణువు తులసి పాతివ్రత్యమును భంగపరచుట



చెబుతున్నాడు సూతుడు - ఏముంటుంది? శంఖచూడుడి వేషం లో వెళ్ళిన విష్ణువు - తన కల్లబొల్లి కబుర్లతో తులసిని పాన్పుకి చేర్చాడు. అయితే, రమించే విషయంలో వచ్చింది తేడా. ఆహార నిద్రా భయ మైధునాలు నాలుగూ కూడా యెవరి ధోరణిలో వాళ్ళకి వుంటాయేకాని పోలికలుండవు అన్నాళ్ళు శంఖ చూడునితో కాపరం చేసిన ఆ తులసి రతివేళ సాగే చేష్టలవల్ల - తనతో కలసి వున్న పురుషుడు తన మగడు కాదని గుర్తించింది. యేం లాభం, అప్పటికే శీలం చెడి పోయింది. అయినా తెగించి "ఎవరు నువ్వు" అని నిలదీసింది. విష్ణువు తన నిజరూపం చూపించాడు. ఆమె ఆవేశపడిపోయింది. "విష్ణూ? నీమనసింత కఠినమై పోయిందేమిటి? ఛీ ఛీ, నా భర్త నీకు అత్యంత ప్రియభక్తుడు కదా! ఆయన్నెందుకలా చేశావ్? భక్త రక్షకుడవైన నువ్వే యిలా ప్రవర్తించావంటే నీది గుండె కాదు. బండయి వుండాలి.

ఇందుకు ప్రతిఫలంగా నువ్వు రాయివైపో" అని శపించింది. ఎవరూ ఓదార్చ లేనంత దుఃఖాన్ని పొందింది. యేం చేయడానికి తోచని హరి తక్షణమే శివుడిని తలుచుకున్నాడు. ప్రత్యక్షమయ్యాడు రుద్రుడు. తులసిని ఓదార్చాడు. మానవ శరీరాన్ని వదిలి దివ్యదేహంతో వైకుంఠం చేరుకుని శ్రీహరితో సుఖించమన్నాడు.

విసర్జించబడ్డ నీ శరీరం 'గండకి' అనే నదిగా పరిణమిస్తుంది. నీ శాపం వల్ల నారాయణుడు పాషాణమై నీయందే పడి ఉంటాడు." అంటూ తులసీ, సాలగ్రామం శంఖం - ఇత్యాదులకు తగుపూజ్యత నేర్పరచి శివుడు కైలాసం వెళ్ళిపోయాడు. తులసి భౌతిక దేహం వదలి దివ్యరూపం దాల్చింది.

శ్రీహరి ఆమెను వైకుంఠమునకు తీసుకువెళ్ళిపోయాడు. ఆమె విడిచిన పార్థివ దేహం గండకీ స్రవంతిగా మారింది. ఆమె తనువు విడిచిన ఠావున ఆమె పేరిట "తులసి" అనే మొక్క మొలిచింది. ఇది తులసి చరిత్రం- అని ముగించాడు సూతుడు. అనంతరం ఋషుల కోరిక మీద అంధకాసురుడి గురించి చెప్పసాగాడు.

# అంధకాసుర చరిత్రము

ఒకానొప్పుడు శివపార్వతులిద్దరూ మందరగిరిమీద విహరించడానికి వెళ్ళారు. అక్కడ శివుడు తూర్పుదిక్కును చూస్తూ నిలబడి వుండగా - అమ్మవారు చిలిపితనంగా ఆయన వెనుక చేరి స్వామివారి నేత్రత్రయాన్ని మూసింది. అంతటితో మొత్తం లోకాలకు చీకటి క్రమ్మినట్లయ్యింది. అప్పుడు అమ్మవారి చేతి చెమ్మటపడీ, అయ్యవారి కన్నులకు అలిమిన చీకటి సంఘటిత పడడంతో అంధకుడనే గ్రుడ్డిబాలుడు ఆవిర్భవించాడు.

శివుడా బిడ్డని పార్వతికి అప్పగించుతూ-"నీ అతి కొంటెతనంవల్ల పుట్టాడు. వీడి పెంపకపు బాధ్యత మనదే సుమా! జాగ్రత్త" అని చెప్పాడు. పార్వతి ఆ అంధకుణ్ణి చెలికత్తెల కిచ్చి జాగ్రత్తలు చెప్పింది. వారు కూడా ఆ అంధకుణ్ణి జాగ్రత్తగానే పెంచుతున్నారు.

ఇలా వుండగా హిరణ్యాక్ష, హిరణ్యకశిపులని యిద్దరు రాక్షససోదరులున్నారు. వారిలో హిరణ్యాక్షుడికి పిల్లలు లేని కారణంగా శివుడికై తపించాడు. ప్రత్యక్షమయ్యాడు శివుడు. కొడుకును ప్రసాదించుమని కోరాడు హిరణ్యాక్షుడు. అంధకుణ్ణి అతనికిచ్చేశాడు శివుడు. హిరణ్యాక్షుడు ఆ బిడ్డతో తన రాజధాని చేరాడు. అనంతరం భూతల పాతాళాదిలోకాలన్నీ వశపర్చుకున్నాడు. భూమిని చాపగా చుట్టి సముద్రంలో ముంచబోయాడు. అమరులూ, మహర్షులూ అందరూ గగ్గోలు పడిపోయారు.

అప్పుడే విష్ణువు వరాహరూపం ధరించి ఆ హిరణ్యాక్షుణ్ణి చంపేశాడు. అతని రాజ్యానికి అంధకుణ్ణి రాజునిచేశాడు, శివుడంతటి వాడికి కొడుకైపుట్టి హిరణ్యాక్షుడికి దత్తుడవడంవల్ల అంధకుడు అంధకాసురుడిగా చెలామణి అయ్యాడు. పుట్టు గ్రుడ్డివాడు కదా అంధకుడు. అందువల్ల అతనివల్ల తమకేమీ భయం లేదనుకున్నారింద్రాదులు.

పాపం! అంధకుడు కూడా సాధువుగానే వుండేవాడు. కాని, ఒకనాడు ప్రహ్లాదాది జ్ఞాతులంతా కలిసి అతనిపై దాడి జరిపారు. "ఓయి అంధకాసురా! నువ్వు గ్రుడ్డివాడివి గనుక రాజుగా పనికిరావు. పైపెచ్చు నువ్వు హిరణ్యాక్షుడి సొంత కొడుకువి కాదు.

అంచేత కూడా నీకు రాజ్యార్హతలేదు." అని చెప్పి - అతన్ని పదవీ భ్రష్టుణ్ణిచేసి, రాజ్యం తామే ఆక్రమించుకున్నారు. పుట్టుగ్రుడ్డియైన అంధకుడు అరణ్యాల పాలయిపోయాడు. బ్రహ్మగురించి ఘోరమైన తపస్సు చేశాడు. బ్రహ్మ ప్రత్యక్ష మయ్యాడు అంధకుడికి చూపును, బలపరాక్రమాలను అనుగ్రహించాడు. అతని కోరిక మీదట కోరరాని కోరిక కోరే వరకూ ప్రాణభీతిలేని వరాన్ని కూడా ప్రసాదించాడు ఆ వరబలంతో అంధకుడు మళ్ళా తనరాజ్యం చేరుకున్నాడు. తన పిత్రార్జితాన్ని గెల్చుకున్నాడు. దేవతలందర్నీ గెల్చాడు. అడ్డూ ఆపూ లేకుండా పరిపాలించాడు. పదివేల సంవత్సరాలపాటు వళ్ళూపై తెలియకుండా ప్రపంచంలో ఉన్న అందెగత్తెలందరితోటి కామోపభోగాలనుభవించాడు.

ఒకనాడు మందర పర్వతం చేరి, అక్కడ విలాస మందిరాలు నిర్మించుకుని యిచ్చా భోగాలననుభవిస్తుండగా - అతని మంత్రులు పరుగు పరుగునవచ్చి 'ప్రభో, ఈ కొండమీద ఓ సన్యాసి ఉన్నాడు. అతని భార్య చాలా అందంగా ఉంది. మగాడన్న తర్వాత ఆ పిల్లని పొంది తీరాలి" అన్నారు. అంధకుడు వెంటనే ఆ మునికి రాయబారం పంపాడు. ఆ పిల్లను తనకు వప్పగించి మునిని యెటైనా పొమ్మనమన్నాడు. దూతలు వెళ్ళి చెప్పారు. ఆ ముని వాళ్ళ మాటని వినిపించు కోలేదు. "నన్ను రుద్రుడంటారు నా భార్యను రుద్రాణి అంటారు. ఈ కలిగినదంతా నాదీ నా భార్యదీను. అలాగని అట్టే సంబంధ బాంధవ్యాలు పెట్టుకునే వాణ్ణి కాను నేను-శక్తి హీనుడయిన యజమానిని కాలేను. అది దృష్టిలో పెట్టుకుని-నాకున్న వాటిల్లో మీకు కావల్సిన దాన్ని పొందవచ్చు' నన్నాడు. ఆ మాటలే దూతలు రాజుకు చెప్పారు.

మధుపానమత్తుడై వున్న అంధకుడు అఖండబలగంతో వెళ్ళాడు రుద్రుడున్న గుహదగ్గరికి. ఈ వార్త తెలిసి ప్రహ్లాద, విరోచన, బలి, బాణ, శంబర, వృత్రాది రాక్షసులు అతనికి తోడయ్యారు. ఈ యుద్ధ ఘోషలు, తొప్పెట్లు తాళాలు శివ ధ్యానానికి అంతరాయం కలిగించాయి. ఆయన ప్రత్యక్షంగా తలపడ్డాడు రాక్షసుల తోటి. శివుని రంగప్రవేశంతో హరి బ్రహ్మాదులంతా ఆయన ననుసరించారు.

యుద్ధం తీవ్రమైంది. యుద్ధంలో మరణించిన రాక్షసులను శుక్రాచార్యుడు - పునర్జీవింపచేయసాగాడు. దానితో దేవతా బలానికి యెడతెగని అలసట రాక్షస వర్గానికి తరగని బలమూ సంప్రాప్తమౌతున్నాయి. అది తెలిసిన శివుడు శుక్రుణ్ణి గుటుక్కున మ్రింగేశాడు. భార్గవుడు-భర్గుడి కడుపులోకి వెళ్ళిపోయాడు.

## అంధక నిర్మూలనం

శుక్రుడు లేక పోవడంతో మృతులు మృతులుగానే మిగిలిపోవడము వల్ల అంధకుడి సైన్యం అంతకంతకూ కొరబడిపోయింది. జరుగుతున్న దానికి నివ్వెరపోయిన అంధకుడిని తన త్రిశూలానికి గ్రుచ్చి పైకెత్తాడు శివుడు.

చావూ, బ్రతుకు గాని ఆ స్థితికి తట్టుకోలేక పోయిన అంధకుడు సామవేద సూక్తయుక్తంగా సాంబశివుణ్ణి ప్రార్థించాడు. హర్షించిన హరుడు అంధకుడికి గణాధి పత్యాన్ని యిచ్చాడు. ఇదీ అంధకుడు గణాధిపత్యం పొందిన కథ - అని ఆపాడు సూతుడు. "మరి శివగర్భస్థుడైన శుక్రుడేమైనట్లు?" అని ప్రశ్నించారు శౌనకాదులు! అది చెప్పడానికి ఆరంభిస్తూ - 'వినండి' అన్నాడు సూతుడు.

## శుక్రుడి పునరుద్భవం

శివోదరంలో జేరిన భార్గవుడు తన పరిస్థితికి యెంతగానో చింతించాడు. ఎంతైనా తెలివైనవాడు కావడం వల్ల - ఆ శివుణ్ణే ప్రార్థించసాగాడు. శివుడి యొక్క 108 నామాలనూ, మూర్తులనూ అదే పనిగా జపించాడు. అలా జపించగా జపించగా, కరుణాళుడైన కంఠేకాలుడు శుక్రుని తన మూత్రం ద్వారం గుండా 'వీర్యం'గా బైట పడేశాడు. అప్పటికి మూడు వేల సంవత్సరాలు గడిచిపోయాయి. తేరిపార చూస్తున్న అతనిపై అనుగ్రహంతో శివుడు "భార్గవా! నా యొక్క శుక్ర రూపములో వెలువడ్డావు గనుక - ఇకనుండి 'శుక్రుడు' అనే పేరుతో వర్ధిల్లుతావు" అన్నాడు. తన కడుపున త్రిసహస్ర వర్షాలు వున్న కారణంగా తన కుమారుడిగానే చెలామణి అవ్వాలని కూడా ఆశీర్వదించాడు. ఇంక ఆ తరువాత సంగతి చూద్దాం.

## బాణాసుర చరిత్రము

వెనుకాముందు చూడకుండా వామనుడి కోర్కెదీర్చి, మహాదాత అనిపించు కున్నాడు. "బలి". అదిగో ఆ బలిచక్రవర్తికి ఔరసపుత్రుడే బాణాసురుడు. అతను కూడా దాతా, వదాన్యుడూ. శివారాధనాపరుడూను, కాని రాక్షసుడు కదా! అందునా

రాజు జిగీషాపరుడై త్రిలోకాలనీ తన అదుపులోకి తెచ్చుకున్నాడు. ఆ బాణా సురుడికి వెయ్యి చేతులుండేవి. అతను తన వెయ్యి చేతులతోటి తప్పెట్లూ తాళాలూ మ్రోగిస్తూ, తాండవ నృత్యం ఆడుతూ, శివుణ్ణి స్తుతించాడు.

శివుడు ప్రసన్నుడై వరం కోరుకోమన్నాడు. తననూ తన పరివారాన్నీ రక్షించేందుకుగాను తన శోణితపురంలో కొలువై ఉండమని కోరాడు బాణా సురుడు. అనుగ్రహించడమే లక్షణంగా గల అంబికేశుడు అలాగేనన్నాడు. అనడమే ఆలస్యంగా - అప్పటికి తనతో ఉన్న ప్రమథాది పరివారయుతంగా శోణిత పురంలో కాపరం పెట్టేశాడు.

ఇలా ఉండగా, ఒకానొక వసంతవేళ - రాజశేఖరుడి మనసు రాగరంజిత మైంది. అమ్మవారి అవసరం వచ్చింది - అమ్మవారికి వెంటనే నందికేశ్వరుడి ద్వారా కబురు పంపించాడు.

ఇన్నాళ్ళకు తన భర్త శృంగార విలాసార్థమై తనను ఆహ్వానించాడన్న ఆనంద ముతో పార్వతిదేవి శోణితపురానికి బయల్దేరింది. ఈ లోపున బాణాసురుడి కూతురు "ఉష" అనే పిల్ల చెలికత్తె అయిన చిత్రలేఖ ప్రోత్సాహం వల్ల తాను పార్వతిలా అలంకరించుకుని శివుణ్ణి చేరబోయింది. అప్పుడు వచ్చింది పార్వతమ్మ, ఉష మనసు గ్రహించింది. "కార్తీక శుద్ధ ద్వాదశి నీకు ఉపవాస నియమ దినం. ఆ రోజే నిన్ను ఒక పురుషుడు రమించి నీకు భర్త అవుతాడులే" అని శాసించి, ఆమెను పంపివేసింది.

## శివుడు బాణుడి ననుగ్రహించుట

ఆ కథ అలా ఉండగా ఓరోజు బాణుడు శివుణ్ణి సమీపించి ఆయనను సంతుష్టుణ్ణి చేసి "తండ్రీ! పర్వతాభాలైన సహస్రబాహువులను ప్రసాదించావు గాని, వీటియొక్క బలాన్ని సార్థకపరచుకోడానికి తగిన ప్రత్యర్థి నివ్వలేదు నువ్వు కాబట్టి నా వెయ్యి చేతులతోటి యేక కాలంలో యుద్ధం చేయడానికి సరిపడేంత ప్రత్యర్థి యెవడైనా ఉంటే చూపించు" అని అడిగాడు.

అందుకు శివుడు కినిసి- నీకు గర్వం పెరిగింది బాణాసురా! మానవ శిరంగల నీ మయూరధ్వజం గాలిలేకుండా పడిపోయిననాడు. ఘోరయుద్ధం రాబోతుందని తెలుసుకో, ఆ యుద్ధంలో నా ప్రియభక్తుడే నీ పర్వతాభాలైన వెయ్యి చేతుల్నీ కట్టెలక్రింద కొట్టేస్తాడు. నీ భుజ మదమణగడానికి- ఆ వేళకు నిరీక్షించు" అన్నాడు.

'చిత్తం' అని వెళ్ళిపోయాడు బాణాసురుడు. శివుడు చెప్పినట్లే ఓ శుభ ముహూర్తమున యేమాత్రపు గాలిపాటూ లేకుండానే ఆమయూరపు ధ్వజం నేల పడిపోయింది. తన బాహుమదం అణచుకునే సమయం చేరువయ్యిందని- బాణాసురుడు చాలా ఆనందపడిపోయాడు.

# ఉషా - అనిరుద్ధులు

బాల్యం నుంచీ విష్ణు భక్తురాలైన ఉష-కార్తీక శుద్ధ ద్వాదశినాడు ఉపవాసిత అయి, రాత్రి నిద్రిస్తుండగా - శివ సంకల్పంవలన కృష్ణుడి మనుమడైన అనిరుద్ధుడు రహస్యంగా ఆ అంతఃపురం చేరి-ఉషతో రమించాడు. ఉష రతి సుఖానికి మురిసి పోయింది గాని, పెళ్ళి కాకుండా యిలా జరిగిపోయింది గదా అని బాధపడింది. తనకు అత్యంత ఆప్తురాలయిన చిత్రలేఖకు యీ విషయం చెప్పుకుంది.

వెంటనే చిత్రలేఖ దేశదేశ రాకుమారుల చిత్రపటాలూ తెప్పించి చూపించగా - వారిలో యాదవ వంశానికి చెందినవాడూ, శ్రీకృష్ణుడికి పౌత్రుడూ, అయిన అనిరుద్ధుడి చిత్రం చూసి-తనను రమించినది ఆతడేనని గుర్తించి, చిత్రలేఖకు తెలిపింది. యోగశక్తిగల చిత్రలేఖ, ఆ రాత్రికి రాత్రే అనిరుద్ధుణ్ణి అపహరించి తెచ్చి ఉష యొక్క శయ్యాగారంలో ఉంచినది, ఉష చేసిన పరిచర్యలతో మేలుకున్న అనిరుద్ధుడు ఆమె అందాలకు ముగ్ధుడై స్వేచ్ఛగా ఆమెతో/రతి క్రీడలాడసాగాడు.

ఇది గమనించిన ద్వారికులు బాణుడికి విన్నవించారు. బాణుడు పదివేల సేనలతో వచ్చి ఉషయొక్క అంతఃపురాన్ని చుట్టుముట్టాడు. అనిరుద్ధుణ్ణి చంపెయ్యాలనుకున్నాడు. కాని, అనిరుద్ధుడు తిరగబడి బాణుడితో వచ్చిన పదివేల సైన్యాన్ని పట్టిపల్లార్చేశాడు. ఆశ్చర్యపడ్డ బాణాసురుడు మాయా యుద్ధాన్ని అవలంబించి - అనిరుద్ధుణ్ణి నాగపాశాలతో బంధించాడు. బంధితుడైన అనిరుద్ధుణ్ణి వధించబోయాడు, కాని ఆకాశవాణి వారించడం వల్ల ఆగిపోయి, చెరసాలలో పడేయించాడు.

దుర్భరమైన నాగపాశాల దంష్ట్రాఘాతాలకు తట్టుకోలేని అనిరుద్ధుడు, మనసును అమ్మవారిపైకి మళ్ళించాడు, 'శరణ్యే చండికా! నన్ను రక్షించు. నువ్వు తప్ప వేరే దిక్కు నాకు లేదు.' అని అదేపనిగా ప్రార్థించడంతో జ్యేష్ఠ బహుళ చతుర్దశి నాటి రాత్రి దుర్గాదేవి ప్రత్యక్షమై తన పిడికిటి పోట్లతో నాగ బంధాలను త్రుంచివేసి, అనిరుద్ధుణ్ణి అంతఃపురములోని ఉష దగ్గరకు చేర్చింది. ఉషా, అనిరుద్ధులు యధేచ్ఛగా రతి సుఖాలలో మునిగిపోయారు.

# కృష్ణుడు బాణాసురునిపై దండెత్తుట



అనిరుద్ధుడు అదృశ్యమైపోయిన కారణంగా ద్వారకలో అందరూ దుఃఖ మగ్నులై ఉండగా - నారదుడు వచ్చి జరిగిన దంతా వినిపించాడు. వెంటనే శ్రీకృష్ణుడు పన్నెండు అక్షోహిణీల సైన్యంతో బాణుడి శోణపురాన్ని ముట్టడించాడు.

బాణాసురుడు కూడా యుద్ధానికి సిద్ధమయ్యాడు. బాణాసురుని సర్వస్వాన్నీ పరిరక్షించడం కోసమే అక్కడ కొలువై వున్న శివుడు కూడా యుద్ధానికి సిద్ధ మయ్యాడు. యుద్ధభూమిలో శివ కేశవులిద్దరూ యెదురెదురుగా తటస్థించారు. "శివా! నువ్వు బాణాసురుడిని శపించావన్న ధైర్యంతోటే నేను యింత అట్టహాసంగా సమరానికి వచ్చాను. నీకు అత్యంత ప్రియభక్తుడినైన నాకే నువ్వు అడ్డుపడేలా ఉంటే - నీ శాపం ఎలా నెరవేరుతుంది? వ్యర్థమైపోతుంది సుమా! కరుణించి అడ్డుతొలగ' మన్నాడు కృష్ణుడు.

అది విని చిరునవ్వు నవ్వాడు శివుడు. 'కృష్ణా! నువ్వు చెప్పింది నిజమే. నా వరం యెలాగో, అలాగే నా శాపం కూడా వృధా కానివ్వను. నువ్వు జృంభణాస్త్రాన్ని ప్రయోగించు, మాననీయమైన ఆ అస్త్రాన్ని నేను మన్నిస్తాను. ఆ పైన నీ పని నువ్వు చూసుకో' అని సలహా యిచ్చాడు.

శివబోధనతో కృష్ణుడు రణభూమిని వదిలి దూరంగా వెళ్ళాడు అనుష్ఠానం నిర్వహించుకుని జృంభణాస్త్రాన్ని ప్రయోగించాడు శివుడు దానిని గౌరవించి స్తబ్దుడిగా వుండిపోయాడు.

అది గుర్తించి కృష్ణుడు పునః యుద్ధభూమిని ప్రవేశించి, బాణాసురుడితో తలపడ్డాడు. లోకాశ్చర్యకరమైన యుద్ధం చేశారు. వాళ్ళు, కడగా కృష్ణుడు తన సుదర్శనాన్ని ప్రయోగించి బాణాసురుడి యొక్క తొమ్మిది వందల తొంబై యారు

చేతుల్ని త్రుటిలో ఖండించి వేశాడు. నాలుగు చేతులను మాత్రం మిగిల్చాడు. మళ్ళా సుదర్శనాన్ని యెత్తాడు కృష్ణుడు.

ఈసారి బాణుడి శిరస్సుకి గురిపెట్టబోయాడు. తక్షణమే వారి మధ్యకు వచ్చాడు శివుడు, "కృష్ణా! బాణుడి చేతులు తెగాలనే శపించానుగాని, శిరః ఖండనాన్ని చెప్పలేదు. అందువల్ల నువ్వు నీ సుదర్శనాన్ని విరమించుకో అని చెప్పి వారిద్దరికి సంధిచేశాడు. ఉషా అనిరుద్ధులకు కళ్యాణం జరిగింది. కృష్ణుడు మనుమడితోనూ, అతని భార్యతోనూ, సైన్యంతోనూ ద్వారకకు తరలి వెళ్ళి పోయాడు. ఆ అనంతరం బాణాసురుడు నందికేశ్వరునిచే బోధితుడై అనేక రకాలుగా శివుణ్ణి స్తుతించగా ఆయన ప్రసన్నుడయ్యాడు. ఆయన దయవల్ల ఆ బాణాసురుడే కైలాసంలో 'మహాకాలు'డనే గణాధిపతిగా పరిణమించాడు.

# గజాసుర వృత్తాంతము

బాణాసుర వృత్తాంతరం విన్న తర్వాత గజాసుర వృత్తాంతం వినిపించమన్న మునుల కోరికపై ఆ కథ చెప్పసాగాడు పౌరాణికుడు.

మహిషాసురుడి కొడుకు గజాసురుడు. అతడు బ్రహ్మ గురించి తపస్సు చేసి కామమోహితులైన స్త్రీ పురుషులచేత గాని, ఇతర దేవతల చేతగాని చావు లేకుండానూ, దేవతల సర్వ వైభవాలూ తానే అనుభవించేలాగానూ వరం పొందాడు. వరం చేతికి రాగానే దేవతల మీద దండెత్తాడు.

త్రిలోకాలనూ తన ఆధీనంలోకి తెచ్చుకున్నాడు. సన్మార్గులనూ, భక్తులనూ యెడతెగని హింసలపాలు చేశాడు. ఓసారి అదో పనిగా పెట్టుకుని కాశీ వెళ్ళి అక్కడ శివభక్తులను హింసలకు గురిచేశాడు. కాశీలో వున్న భక్తులనే కడగండ్లపాలు చేశాడంటే శివుడూరుకోలేడు గదా! త్రిశూలం తీసుకుని బయలుదేరాడు.

గజాసురుడు కూడా యుద్ధానికే సిద్ధమయ్యాడు. అద్భుతమైన యుద్ధం జరిగినది. ఆ యుద్ధంలో తొమ్మిదివేల చదరపు యోజనాల వైశాల్యంగల గజాసురుణ్ణి తన త్రిశూలానికి గ్రుచ్చి గొడుగులా యెత్తి పట్టుకున్నాడు శివుడు.

ఏ శివుడే సర్వానికీ, ఊర్ధ్వంలో ఉన్నాడో ఆయన ఊర్ధ్వభాగాన ఛత్రంగా భాసించాడు గజాసురుడు. అప్పుడా కరిదానవుడు యిలా అన్నాడు.

"కపర్దీ! కాముణ్ణి గెలిచిన కళ్యాణ మూర్తివి. నువ్వు నీచేత చంపబడ్డం నా పుణ్యం, నేను పునీతుడి నయినాను. అందుకు చిహ్నంగా దిగంబరుడవైన నీవు నా తోలును వలువగా ధరించు అంటూ శివుణ్ణి అనేక విధాల స్తుతించాడు. శివుడు ప్రసన్నుడయినాడు'. గజాసురా! నీ యీ శరీరం శివలింగమై వెలయుగాక. అది కృత్తివాసేశ్వరుడను నామమున విరాజిల్లుగాక' అని అనుగ్రహించాడు అనంతరం/గజాసురుడిచర్మాన్ని వొలిచి, ఆ దిగంబరుడు తాను కట్టుకున్నాడు. అప్పటి నుంచే ఆయనకు కృత్తి వాసుడు, కరిచర్మాంబరధారి యిత్యాది పేర్లు వచ్చాయి. ఇదీ గజాసురుడి కథ - అంటూ ఆపాడు సూతుడు.

# వ్యాఘ్రేశ్వరుని ఆవిర్భావం

మళ్ళా అడిగారు మునులు, - సూతమహర్షి! గజాసుర వధాఘట్టం వల్ల శ్రీవారు సింధురత్వగుత్తరీయుడిగా పేరు పొందారు సరే మరి ఆయనను వ్యాఘ్రేశ్వరుడని కూడా అంటారు కదా! ఆ పేరెలా వచ్చింది? అని సూతోవాచ- హిరణ్యాక్షహిరణ్యాశివుల/ బావమరిది ఒకడుండేవాడు. వాడిపేరు దుందుభి నిర్హ్రాదుడు.

జేష్ఠస్థానం అనే అడవిలో ఒక శివరాత్రి నాడు ఒక భక్తుడు శివుడిని అత్యంత భక్తితో ఆరాధిస్తుండగా యీ దుందుభి నిర్హ్రాదుడనే వాడు పెద్దపులి వేషంలో వెళ్ళాడు కాని భక్త రక్షణార్థం భర్గుడక్కడ ప్రత్యక్షమయ్యాడు. నిర్హ్రాదుడు సరాసరి నిటలాక్షుడి మీదకి లంఘించాడు. శివుడా పులిని - పిల్లి పిల్లని పట్టినట్లుగా పట్టి, చంకనిరికించి - పిడికిలి బిగించి, మాడుమీద ఒక్కగ్రుద్దు గుద్దాడు అంతే పెడబొబ్బలు పెడుతూ నేలపడి చచ్చాడా రాక్షసుడు.

(ఆ అరుపులు విని భీతావహులయి పెడబొబ్బలు పెడుతూ నేల పడి చచ్చాడా రాక్షసుడు. ఆ అరుపులు విని భీతావహులయి అక్కడకు చేరిన భక్తులు మహాదేవుడి దర్శనంతో అఖండానందాన్ని పొందారు ఆ రూపంతోనే అక్కడ వెలసి తమను సర్వదా రక్షించమని ప్రార్థించారు.

తక్షణమే అక్కడొక లింగంగా పరిణమించాడు శివుడు పులిని చంపిన ఆతావున వెలసిన కారణంగా వ్యాఘ్రేశ్వరుడిగా ఆరాధించబడ్డాడు. ఆ లింగారాధన చేసి యుద్ధాలకి వెళ్ళేవాళ్ళు విజయం పొందుతారు. శివుని ఇంకో చిత్రమైన పేర వెలసిన కథ చెబుతా వినండి.

# విదలోత్పల సంహారం

పూర్వం విదలుడు - ఉత్పలుడు అని యిద్దరు రాక్షసులుండేవారు వాళ్ళు పురుషుల చేతిలో చావులేకుండా వరం పొంది, దేవతలందర్నీ పీడించసాగారు. ఒకనాడు శివేచ్ఛావశాన నారదుడు వారి వద్దకు వెళ్ళి పార్వతి సౌందర్యాన్ని వర్ణించి చక్కాబోయాడు. అప్పటినుంచీ ఆ పాపిష్ఠి వాళ్ళకి మోహం కలిగింది. ఆ తల్లి నందుకోడం కోసం ఆకాశంలో పడి వెదుక్కోసాగారు.

మరి వాళ్ళ పాపమే పండిందో పున్యమే పుచ్చిందోగాని - అమ్మవారు పరమేశ్వరుడితో కలిసి విలాసంగా పూలబంతి నాడుతూ కనిపించింది. అసలే యెర్రెర్రని చేతులావిడవి. యీ పూలబంతి తాకేసరికి కంది - మరింత యెర్రబారి - శివుడి హృదయాన్ని రాగరంజితం చేస్తున్నాయి. అటువంటి రసవత్తర ఘట్టములో దాపురించారీ విదల-ఉత్పలులు, అమ్మవారి అందాల్ని చూసి ఆరాటపడిపోయారు. ప్రమధుల వేషాలు ధరించి సమీపానికి వెళ్ళారు. ఆదొంగ ప్రమధులు, అక్కడికి చేరగానే కనిపెట్టాడు శివుడు. ఓరగా చూశాడు. వాళ్ళని అమ్మవారూ కనిపెట్టేశారు.

వారిద్దరూ నవ్వుకుని కందుకకేళితో మునిగిపోయారు. ఉన్నట్టుండి అమ్మవారు తన చేతి బంతి ఆ యిద్దరి మీదకు విసిరింది. ఆ దెబ్బకి గింగిరాలు తిరిగి అంతయెత్తు నుండి కాశీక్షేత్రంలో పడిచచ్చారు. వాళ్ళని తాకిన బంతికూడా వారి వెనుకే భూమికి జారి - కాశీలోని జ్యేష్ఠేశ్వర లింగం ప్రక్క లింగాకృతిలో నిలిచింది. ఆ లింగానికే "కందుకేశ్వరలింగం" అని పేరు వచ్చింది హరి బ్రహ్మాదు లంతా వచ్చి ఆ లింగాల్ని ఆరాధించి వెళ్ళేరు. ఇలా అనంతమైన నామాలూ, అపురూపమైన లీలలూ గల అమృత తత్త్వమాశైవ తత్త్వం. ఓ ఋషులారా! శ్రీ శివ మహాపురాణంలో రెండవదైన రుద్రసంహిత ఇంతటితో పూర్తి అయ్యింది" అంటూ ధ్యానమగ్నుడయ్యాడు సూతుడు.

వేదవ్యాస మహర్షి విరచితమైన

శ్రీ శివ మహాపురాణమున రుద్రసంహిత సమాప్తము

✦ ✦ ✦



# శ్రీ శివ మహాపురాణము

## శతరుద్ర సంహిత

## పంచ బ్రహ్మావతారములు

**సూతఉవాచ :** శివుని యొక్క తొట్టతొలి అవతారం పందొమ్మిదవ శ్వేత లోహిత కల్పంలో జరిగింది. అప్పట్లో బ్రహ్మ ధ్యానంలో వుండగా ఎరుపు- తెలుపు -నలుపు వన్నెలతో కలిసి ప్రకాశిస్తున్న కుమారుడుగా ఆవిర్భవించాడు. శివుడు. ధ్యాన ఫలంగా అప్పటికప్పుడు పుట్టడం వల్ల ఆ అవతారాన్నే సద్యోజాత బ్రహ్మావతారం అన్నారు. ఆయన నుంచి-నందనోపనంద సునంద విశ్వనందులనే నలుగురు శ్వేతవర్ణులు శిష్యులుగా ఉదయించారు. సద్యోజాతుడు బ్రహ్మకు సృష్టి గురించి తెలివికలిగేలా అనుగ్రహించి-శివజ్ఞానప్రచారార్థం అదృశ్యుడయ్యాడు.

ఆ తర్వాత యిరవయ్యవరక్తకల్పంలో - ఎర్రరంగుతో కూడిన బ్రహ్మ, శివుణ్ణి ప్రార్థిస్తూండగా - కలిగినది వామదేవావతారం ఆయనతోబాటే విరజ, వివాహ, విశోద, విశ్వభావనులనే నలుగురు శిష్యులు కూడా కలిగారు. ఆ వామదేవుడే బ్రహ్మకు ప్రపంచాన్ని పుట్టించే శక్తిని ప్రసాదించి అంతర్హితుడైపోయాడు.

పీతవాసం అనే యిరవయ్యొకటో కల్పంలో - శివుడు తత్పురుష బ్రహ్మగా పీతాంబరధారియై అవతరించాడు. ఆ అవతారంలో బ్రహ్మకు సృష్టిలో సామర్థ్యాన్ని అనుగ్రహించి అంతర్ధానుడైనాడు. అప్పుడతనికి పీత వస్త్రధారులైన దివ్య

కుమారులు అనేకులు యోగమార్గ ప్రవర్తకులై జన్మించినారు. అటు తర్వాత శివకల్పంలో నల్లరంగు శరీరంలో నల్లబట్టలూ నల్ల పూలమాలికలూ, నల్లటి జందెమూ, నల్లకిరీటం ధరించి అఘోర బ్రహ్మగా ఆవిర్భవించాడు. శివుడు, కృష్ణ, కృష్ణాస్య, కృష్ణశిఖ, కృష్ణ కంఠధరులు నలుగురూ ఆ అవతారంలో ఆయన శిష్యులు, అప్పటికి బ్రహ్మకు పరిపూర్ణ సృష్టి సామర్థ్యాలను సమకూర్చి వెళ్ళిపోయారు.

అయిదవది ఈశానావతారం, ఆ తరువాత విశ్వరూపకల్పంలో బ్రహ్మ సృష్టికారక పురుషుణ్ణి పొందగోరి శివధ్యానం చేస్తుండగా ఒక మహానాదం ఆవిర్భవించింది. ఆ నాదంలోంచే శుద్ధ స్ఫటిక వర్ణాస్యుడు - సర్వభూషణ భూషితుడు అయిన ఒక పురుషుడు పుట్టాడు. ఆయనే ఈశానుడు. ఈ యీశానుడే బ్రహ్మకు సృష్టియొక్క క్రమాన్ని ప్రసాదించాడు. జటి, ముండి, శిఖండి, అర్ధముండి - ఈశానుడి శిష్యులు.

ఈపై అయిదు అవతారాలే పంచబ్రహ్మవతారాలు, వీరిలో ఈశానుడు ముఖ్యుడు జీవుణ్ణి అధిష్ఠించి వుండే వాడు ఈయనే. తత్పురుషుడు. సత్త్వరజస్తమో గుణాదిక భోగాశ్రయుడు. అఘోరుడు బుద్ధి తత్త్వవాసి. వామదేవుడు అహం కారాన్ని, సద్యోజాతుడు మనస్సునీ ఆవహించి వుంటారు. వీటి తర్వాత చెప్పుకో దగ్గవి శివుడి యొక్క అష్టమూర్తులు.

## శివుని అష్టమూర్తులు

శివుడు యెనిమిది మూర్తులుగా స్ఫురిస్తుంటాడు. ఇవి ప్రత్యక్షాలు కూడాను. వాటిలో మొదటి మూర్తిశర్వుడు ఈయన భూమిని అదిష్ఠించి వుంటాడు. అంటే భూమే మూర్తిగా కలిగినవాడు శర్వుడని అర్థం అలాగే ఉదకాధిష్ఠాత భవుడు జలరూపుడు. మూడవదైన అగ్నిరూపుడు రుద్రుడు. బహిరంతరాలలో నిత్యం చలించేదైన వాయురూపమే నాలుగవదైన ఉగ్రుడు.

ఆకాశరూపుడు భీముడు. అయిదవవాడు. క్షేత్రజ్ఞుడై జీవాత్మలో వుండేది. ఆరవమూర్తి అయిన పశుపతి. సూర్యాంత్వర్తియై ప్రకాశమానుడు. సప్తమమూర్తి ఈశానుడు. చంద్రాధిష్ఠాత అయిన మహాదేవుడి అష్టమూర్తిత్వం దృశ్యమానం. వీటికి అతీతంగా సచ్చిదానందమయ స్వరూపంతో సర్వేసర్వత్రావ్యాపించి, అనూహ్య విలక్షణస్థానంలో విరాజిల్లుతున్నాడు శివుడు. ఇకపై చెప్పుకో దగ్గది ఆయనయొక్క అర్ధనారీశ్వరావతారం.

# అర్ధనారీశ్వరావతారం



పంచ బ్రహ్మలు, అష్టమూర్తులు - వెరసి పదమూడు అవతారాల పైన పధ్నాలుగో అవతారం యిది. బ్రహ్మ ప్రజలను సృష్టించాడు కాని వాళ్ళు యెదుగూ బొదుగూ లేకుండా వుండి పోయారు. వారి నుంచి ప్రజోత్పత్తి జరగడంలేదు. (కణవిభజన కాబోలు) అప్పుడు ఆకాశవాణి "స్త్రీ పురుషుల జంటలను కల్పించ"మని ఆదేశించింది. కాని బ్రహ్మకు స్త్రీ రూపం యేమిటో బోధపడలేదు. శివుణ్ణి ప్రార్థించాడు. అనుగ్రహించాడు శివుడు, సగము ఆడుదీ, సగము పురుషుడూగా దర్శనమిచ్చాడు.

తననుండి శక్తిని విడదీసి చూపించాడు అప్పుడు బ్రహ్మ "అమ్మా! స్త్రీలను సృష్టించడం నావల్లగావడంలేదు. కాబట్టి ఆ శక్తిని అనుగ్రహించు తల్లీ" అని ఆర్థించాడు. అప్పుడు శక్తి కనుబొమల నుండి ఒకదేవి ఆవిర్భవించింది. తక్షణమే శక్తి శివుడి యందు లీనమైపోయింది. తత్కాలావిర్భూతమైన శక్తిని చూసి, - 'శక్తీ! ఆ బ్రహ్మ నీకై తపిస్తున్నాడు. అతనిని అనుగ్రహించు" మని చెప్పి అంతర్హితుడైపోయాడు శివుడు.

# నవావతారములు

ఇక - వారాహ కల్పంలోని యేడవ వైవస్వత మన్వంతరంలో సంభవించే ద్వాపరయుగాంతంలో - వేదవ్యాసుడి జ్ఞాన ప్రచారాన్ని సమర్థించే నిమిత్తం - శ్వేత, శ్వేతశిఖ, శ్వేతలోహితులనే నలుగురు శిష్యులతో కలిసి శ్వేతాచార్యుడనే పేర శిఖాయజ్ఞోపవీత ధారుడై అవతరిస్తాడా శివుడు. ఆ తరువాత రెండవ ద్వాపరాంతంలో వేదవ్యాసునకు సహకరించే నిమిత్తం దుందుభి. శతరూప, హృషీక, కేతుమంతాఖ్యులైన శిష్యులతో కలిసి 'సుతారుడు' అనే యోగిగా ఆవిర్భవిస్తాడు శివుడు.

తృతీయ ద్వాపరంలో - విశోక, విశేష, విపాప, పాపనాశనులనే నలుగురు శిష్యుల చేత శుశ్రూషించబడుతూ దమనుడనే పేరున జన్మిస్తాడు.

నాలుగో ద్వాపరంలో 'సుహోత్రుడు' అనే యోగీశ్వరుడిగా అవతరిస్తాడు శివుడు వ్యాసుడు చెప్పే సనాతన ధర్మాలకి వత్తాసు పలకడమే ఆ అవతార లక్ష్యం, సుముఖ, దుర్ముఖ, దుర్ధర దురతిక్రములు శిష్యులు.

అయిదో ద్వాపరంలో సనక, సనందన, సనాతన, సనత్కుమారులనే నలుగురు శిష్యులతో సహా 'కంకుడు' అనే యోగిగా వుంటాడు.

ఆరో ద్వాపరంలో విజయ, విరాజ, సుదామ, సంజయులనే శిష్య చతుష్టయ సేవితుడై 'లోకాక్షి' అనే యోగిగా ప్రబోధం చేస్తాడు. సప్తమ ద్వాపరంతో 'జైగీషవ్య' నామంతో జన్మించి సారస్వత, యోగీశ, మేఘవాహ, సువాహకులనే శిష్యులద్వారా శాంభవ ధర్మ ప్రచారం గావింపచేస్తాడు. అష్టమ ద్వాపరంలో ఆసురి, పంచశిఖ, కపిల, శాల్వలులనే శిష్యసమేతుడైన 'దధివాహన' యోగిగానూ, నవమ ద్వాపరంలో గర్గభార్గవగిరీశ పరాశరులనే ఛాత్రచతుష్కం భావ్యుడైన 'ఋషభుడు' అనే యోగిగానూ అవతరిస్తాడు.

ఈ విధంగా యిరవై యెనిమిది ద్వాపరాలలోనూ అవతరిస్తాడు శివుడు పదియవ ద్వాపరంలో తపోధనుడిగాను. 11వ ద్వాపరంలో తపుడుగాను, 12వ ద్వాపరాన అత్రి అనే పేరునా, 13, 14 ద్వాపరాలలో బలి, గౌతమ నామధేయాల లోనూ, 15, 16, 17 ద్వాపరాలలో వేదశిర, గోకర్ణ, గుహావాసులు గానూ, 18, 19, 20, 21 ద్వాపరాలలో శిఖండి, మాలి, అట్టహాసుడు, దారుకుడు అనే పేర్లతోనూ అవతరిస్తాడు. 22 నుండి 28 వరకుగల ద్వాపరాలలో వరుసగా - లాంగలీశ, శ్వేతయోగి, శూలి, దండి, సహిష్ణువు, సోమశర్మ లకులీశాది అవతారాలనెత్తి ధర్మ రక్షణ శైవప్రచారం నెరపుతాడు - అంటూ యింక యిలా చెప్పసాగాడు.

# నందీశ్వరావతారము

పూర్వం శిలాదుడనే ఋషి వుండేవాడు. అతనికి సంతానం లేదు ఇంద్రుడి సలహాపై శివారాధన చేయగా చేయగా - ఎన్నాళ్ళకో ప్రత్యక్షమయ్యాడు యీశ్వరుడు. ఏం కావాలో కోరుకోమన్నాడు. ఆయనసలు దిగిరావాలేగాని, వస్తే వరాలకేం కొదవ! "నాకు అయోనిజుడైన కొడుకు కావాలి, వాడు నీ అంతటి

వాడయ్యుండాలి, వాడికసలు చావు రాకూడదు. అనుగ్రహించు మహాప్రభో" అంటూ కాలకాలుడి కాళ్ళపై పడ్డాడు శిలాదుడు. "అనుగ్రహించాను నన్ను మానవ రూపాన జన్మించమని బ్రహ్మాదులు కోరివున్నారు. అందువల్ల ఆ పుట్టేదేదో అయోనిజుడిగా ఈనీబిడ్డగానే అవతరిస్తాను" అనిచెప్పి అంతర్ధానుడయ్యాడు శివుడు.



కొన్నాళ్ళుతర్వాత-శిలాదుడు ఆశ్రమంలో యజ్ఞం చేస్తుండగా-యజ్ఞ గుండం నుంచి శివలాంఛనాలతో- ఒక బాలుడు ఆవిర్భవించాడు/ శిలాదుడతనికి 'నంది అని పేరు పెట్టి జాత కర్మాదులు నెరిపి, విద్యాబుద్ధులు చెప్పసాగాడు ఒకనాడు శివ ప్రేరితులైన మైత్రావరుణులనే ఋషులు శిలాదాశ్రమానికి విచ్చేసారు.

వారునందిని పరామర్శించి "ఇంక నీవు ఒక్కయేడాదే జీవిస్తావయ్యా!" అని చెప్పి చక్కా బోయారు. శిలాదుడు కుమార మరణంపట్ల భీతావహుడై దుఃఖించ సాగాడు. నంది శిలాదుడికి ధైర్యంచెప్పాడు. 'శివారాధనమనే తంత్రంతో మృత్యువును వంచిస్తాను చిరంజీవినౌతాను, నువ్వు ధైర్యంగా వుండు' అని తండ్రికి చెప్పి, తాను తపోవనాలు పట్టి వెళ్ళిపోయాడు.

నందిచేసిన తపస్సుకు ఆనందించిన అంబికేశ్వరుడు కుమార, గణపతీ, పార్వతీ సమేతంగా ప్రత్యక్షమయ్యాడు. 'నందీ! నిన్ను పరీక్షించడానికే మైత్రావరుణులను పంపాను నేను - నీ భక్తికి, తపశ్చర్యకూ సంతోషించాను. నీకు చావులేదు. నువ్వు చిరంజీవివి, అంతేకాదు, నీ తండ్రితోనూ, బంధువులతోనూ సహా/ కైలాస వాసివైనాతో సమంగా గౌరవించబడతావు, నిత్యం నా చెంతనే వుంటావు, గణాధి పతివౌతావు, అని చెప్పి నిజ జటాస్థిత గంగోదకంతో నందిని గణాధిపతిగా అక్కడి కక్కడే అభిషేకించి 'ఇక నుంచి నందికేశ్వర నామంతో వర్ధిల్లు మని దీవించాడు.

ఆయనలా దీవించుతూనే తన మెడలోని కమలాల మాలనా నంది మెడలో వేశాడు. ఆ మాల మెడలో పడగానే నంది త్రిలోచనుడిగా, దశభుజుడిగా, రెండవ శివుడా అన్నట్లు రూపుదాల్చాడు, అభిషేకించిన జలధార-సుతోయ, జటోదక,

త్రిస్రోత, వృషధ్వని, జంబువులనే అయిదు ప్రవాహాలుగా పరిణమించింది. యీ అయిదింటి మూలస్థానం 'పంచనదం' అనే పేరుతో అలరారుతుంటుంది.

శివుడలా అభిషేకించి - ఇతర గణాధిపతులనూ, దేవతలనూ స్మరించాడు. తక్షణమే వారు వచ్చి గణాధిపతిగా నూతనాభిషిక్తుడైన నందిని సత్కరించారు. అదే సమయంలో సప్తమరుత్తులు - తమ కూతురయిన "సుయశ" అనే కన్యను తెచ్చి నందికిచ్చి పెండ్లి చేశారు. సుయశా నందికేశులు ఆలుమగలైనారు తానున్న ప్రతి తావులోను తన యెదుట నందీశ్వరుడు ఉండి తీరాలని శాసించాడు శివుడు, అనంతరం శివుడు, నందికేశ్వరుణ్ణి - అతని బంధుజనాలనీ వెంట తీసుకుని - ప్రమథుల కొలువులందుకొంటూ పార్వతీ సమేతంగా కైలాసం చేరాడు.

# భైరవావతారము

ఒక సమయంలో దేవర్షులు బ్రహ్మను సమీపించి 'స్వామీ పరమాత్మ - పరబ్రహ్మ అంటుంటారు కదా! ఆయనెవరో తెలియ జెప్పమని అడిగారు. అందుకు జవాబుగా శివమాయా మోహితుడైన బ్రహ్మ "నేనే పరమాత్మని" అన్నాడు. అక్కడే విష్ణువు కూడా వున్నాడు. ఆయన కలగజేసుకుని "నీతండ్రిని నే నిక్కడుండగానే అలా మాట్లాడతావేమిటి? నేనే నిజమైన పరమాత్మున్ణి - యజ్ఞ నారాయణుణ్ణి అన్నాడు. హరిబ్రహ్మలలా వాదించుకుంటూండగా వారి మధ్యనుండి ఒక జ్యోతిష్పు బయలు వెడలి బ్రహ్మాండమంతా నిండి ప్రజ్వలించసాగింది.

ఆ వెలుగులో త్రిశూల పాణియై నీలలోహిత రుద్రుడు స్ఫుటంగా ప్రత్యక్ష మయ్యాడు. అతనిని చూడగానే బ్రహ్మ ఫక్కున నవ్వాడు. "నువ్వటోయ్! నానొసటిలోంచేగా నువ్వు పుట్టింది పుట్టగానే భోరున యేడుస్తుంటేను - సర్లెమ్మని జెప్పి తెచ్చుకుని, నన్ను ప్రార్థించుకో - నీకు రక్షణ కల్పిస్తాను" అన్నాడు. విధాత యొక్క అహంభరిత వచనాలకి కినిసాడు రుద్రుడు. తక్షణమే భైరవాకృతితో ఒక మహాపురుషుణ్ణి సృష్టించాడు.

"భైరవాకారా! కాలాభా! కాలరాజా ముందుగా యీ బ్రహ్మను శిక్షించు, చెడుపట్ల కుపితుడవై -వాటిని మర్ధిస్తావు నువ్వు, అందువల్ల 'అమర్ధకు'డనే పేరు పొందుతావు, భక్తుల పాపాలను భక్షించి పాప భక్షణుడనే పేర వర్ధిల్లుతావు, కాశీకి క్షేత్రాధిపుడివవుతావు ముందుగా యీ బ్రహ్మను శిక్షించు"అన్నాడు రుద్రుడు.

ఆజ్ఞాపించడమే తడవుగా ఆ కార్యాన్ని కానిచ్చేసాడు కాలభైరవుడు. తప్పుచేసిన అవయవమే శిక్షింప బడాలనే న్యాయం రీత్యా బ్రహ్మగారు - ఏముఖంతో రుద్రుణ్ణి అవహేళన చేశారో ఆ అయిదవ ముఖాన్ని తన యెడమచేతి కొన వ్రేలి గోటితో మీటేశాడా అమర్ధకుడు.

దాంతో ఆ పద్మగర్భుడికి బుద్ధి వచ్చేసింది. అహం తొలగిపోయింది. పద్మ నాభుడితో కలిసి, తనుకూడా పశుపతిని ప్రార్థించాడు. అపరిమిత దయామూర్తిగదా ఆ రుద్రుడు, వెంటనే వారిని అనుగ్రహింపచేశాడు. హరిబ్రహ్మలను యేమరక సత్కరించమని భైరవుడికి చెప్పాడు. బ్రహ్మదేవుడి అయిదవ తల యొక్క కపాలాన్ని చేత ధరించి లోక సంచారం చేస్తూ, బ్రహ్మహత్యా పాతకాన్ని పోగొట్టే కపాల వ్రతాన్ని బోధించవలసిందిగా ఆజ్ఞాపించాడు. "బ్రహ్మహత్య" అనే కన్యను సృష్టించి - కాశీచేరేదాకా భైరవుణ్ణి వెంబడించ మన్నాడు.

# కాలభైరవ మహిమ

విధి పుర్రెను కేలపూని కాలభైరవుడు లోకాలు చరిస్తుండగా అతని వెనకాలే వెడుతోంది. 'బ్రహ్మహత్యా' కన్య, మున్ముందుగా వైకుంఠం వెళ్ళాడు భైరవుడు. విష్ణువాతనికి స్వాగత సత్కారాలు చేశాడు. అఖండమైన అతిధి మర్యాదలు చేశాడు, అంతలోనే శ్రీ మహాలక్ష్మి-రత్నమణి సువర్ణయుతమైన 'మనోరథపతి' అనే పేరుగల భిక్షతెచ్చి, భైరవుని చేతనున్న పుర్రెలో వుంచింది. భైరవుడు వైకుంఠం నుంచి బయలుదేరుతూ - "విష్ణూ! అతిధి మర్యాద లెరిగిన నీ పట్ల తృప్తుడనయ్యాను ఏంకావాలో కోరుకో" మన్నాడు. "నీ పాదాలయందు భక్తి చెదరకపోవడమే చాలు" నని కోరాడు విష్ణువు. అనుగ్రహించాడు భైరవుడు. "ఇక నుంచి నరులకేగాక సురలకు గూడా వరదుడవవుతా"వని దీవించాడు.

అలా లోకాలన్నీ తిరిగి తిరిగి కాశీ చేరాడు కాలభైరవుడు. ఆయన కాశీలో అడుగుపెట్టగానే వెన్నంటి వస్తున్న బ్రహ్మహత్యగావు కేకలు పెడుతూ పాతాళానికి క్రుంగిపోయింది చేతినుంచి బ్రహ్మకపాలం రాలి పడిపోయి - కపాలతీర్థం యేర్పడింది. ఆయన కాశీలోనే స్థిరనివాసం యేర్పరచుకుని భక్తులను రక్షిస్తూ వారి అభీష్టాలను తీరుస్తూ వుండిపోయాడు.

మార్గశిరమాసం, కృష్ణపక్షం, అష్టమీ తిథినాడు జన్మించాడు కాలభైరవుడు. ప్రతి సంవత్సరం ఆరోజు ఉపవసించి కాలభైరవ సన్నిధానంలో భక్తియుతంగా

జాగరణ చేసినట్లయితే - ఆస్వామి, వారి సర్వపాపాలనూ పార ద్రోలతాడు. కాశీ లోనే నివసించే వారు మాత్రం ప్రతి అష్టమి, చతుర్దశీతిథులలోనూ, మంగళవారం నాడూ కూడా ఖచ్చింతంగా కాలభైరవ దర్శనం చేసుకోవాలి, అలా చేయని వారి పాపాలు శుక్లపక్షం చంద్రుడిలా దినదినాభివృద్ధి చెందుతాయి. ఈ కాలభైరవో పాఖ్యానాన్ని ఆసాంతం అర్ధసంయుతంగా పఠించినవారికి కారాగారాది బంధాల నుంచి కూడా విముక్తి లభిస్తుంది.

# ఉగ్రనరసింహుడు

కాలభైరవ కథానంతరం ఋషులు శివుని శరభావతారం గురించి కోరడాన్ని పురస్కరించుకుని, సూతుడా దివ్యగాథనిలా వినిపించసాగాడు. సనకనందనాదుల శాపంవల్ల, వైకుంఠ ద్వారపాలకులైన జయవిజయు లిద్దరూ-కశ్యపుని వల్ల దితి యందు హిరణ్యాక్ష హిరణ్యకశిపులుగా ఆవిర్భవించారు. హిరణ్యాక్షుడు భూమిని చాపలా చుట్టి యేట్లోకి విసిరివేశాడు. అప్పుడు శ్రీహరి వరాహరూపం ధరించి, వాణ్ణి వధించి-వసుధను యథాస్థాన స్థితను చేశాడు. అందుకు అలిగిన హిరణ్యాక్షుడి జ్యేష్ఠ భ్రాతహిరణ్యకశిపుడు లోక కంట కుడిగా పరిణమించాడు. అంతటి లోకకంటకుడూ పరమ విష్ణుద్వేషీ అయిన హిరణ్యక శిపుడికి - నిరంతర విష్ణుచింతనా పరాయణుడూ, విష్ణుభక్తులలో శ్రేష్ఠాతి శ్రేష్ఠుడూ అయిన కుమారుడు కలిగినాడు. ఆ కుమారుడే ప్రహ్లాదుడు ఆగర్భ నారాయణాన్వేషియై తపించే అతగాడు తండ్రికి కంటకుడయ్యాడు విద్యాభ్యాసం వల్ల బిడ్డలో మార్పు రావచ్చు నని ఆలోచించిన హిరణ్యకశిపుడు శుక్రాచార్య నందనులైన చండామర్కులను రావించి-విద్యా శిక్షణ నిమిత్తం ప్రహ్లాదుణ్ణి వారికి వప్పగించాడు. అయినా ఫలితం లేకపోయింది.

దాంతో హిరణ్యకశిపుడు ప్రహ్లాదుణ్ణి చదువు మాన్పించివేసినాడు. విష్ణు భక్తి మానకపోతే వేదనలపాలు చేస్తానని జడిపించాడు. జంకలేదు ప్రహ్లాదుడు. వళ్ళుపై మర్చిపోయాడా హిరణ్యకశిపుడు కర్కోటకుల వంటి కింకరులకు అప్ప గించాడు ప్రహ్లాదుణ్ణి కొండలమీదనుంచి తోయించాడు సముద్రంలోకి నెట్టించాడు.

అగ్ని గుండాలలోకి విసిరివేయించాడు. ఏనుగులతో త్రొక్కించాడు. మరుగు తున్న నూనెలో వేపించాడు. పాములచేత కరిపించాడు. కొట్టించాడు, తిట్టించాడు - చిట్టచివరికి కాలకూట విషంకూడా పెట్టించాడు. అయినా చావలేదు ప్రహ్లాదుడు.

ఎంతకీ చావని కొడుకుతో తానెలా చావాలో అర్థంగాలేదు హిరణ్యాకశిపుడికి, ఒకనాడు కొడుకును యేకాంతలోకి పిలిచాడు విష్ణువు విష్ణువని ఇంత నమ్మకంగా ఆరాధిస్తున్నావే - ఆ విష్ణువు నెప్పుడైనా చూశావా?" అని అడిగాడు. చూడకపోవడ మేమిటి! ఇప్పుడు కూడా చూస్తూనే వున్నా'ని చెప్పాడు ప్రహ్లాదుడు. 'నాకు చూపిస్తావా' అని అడిగాడు రాక్షసేంద్రుడు. "నువ్వు చూడాలేగాని - ఆయన లేని దెక్కడ?/ఇందుగలడందులేడని సందేహమెందుకు! ఎందెందు వెదకినా అందందాయన గోచరుడేగదా!" అని కూడా అన్నాడా బాలకుడు.

"ఏమిటేమిటీ? ఎక్కడబడితే అక్కడవున్నాడా?" ఆ విష్ణువు? అయితే యేడి? యీ స్తంభంలో కూడా వున్నాడా?' అని అడిగాడు రాక్షసరాజు. 'ఉన్నా' డన్నాడు ప్రహ్లాదుడు, 'ఏడీ! చూపించు' అంటూ, పిడికిలి బిగించి - సభా స్తంభానికి హిరణ్యాక శిపుడు వేసిన వ్రేటుతో - పగిలిన స్తంభంలోంచి రగుల్తున్న అగ్నిలా నరహరి రూపంలో ఆవిర్భవించాడు విష్ణువు.

మనిషీకాక, మృగమూ కాక - నృసింహ రూపంలో ఆవిర్భవించిన విష్ణువును గుర్తించలేక భయంతో కంపించిపోయాడు హిరణ్యాకశిపుడు, ఆ నరసింహస్వామి హిరణ్యాకశిపుణ్ణి తనతొడలపై పరుండబెట్టుకుని, ప్రాణులూ - అ ప్రాణులూ కాని తన - వజ్ర సమనఖాలతో అతని ఉరఃకుహరాన్ని చీల్చేశాడు. దేవతలు పూలవాన కురిపించారు దుందుభులు మ్రోగించారు. అచ్చరలు ఆడారు, గంధర్వులు పాడారు సిద్ధ, చారణ, మహర్షులు విష్ణు సంకీర్తనం చేశారు, బ్రహ్మో మరేంద్రాదులు హరిని యెంతగానో స్తుతించారు.

# నరసింహుని ఉగ్రత

అలా దేవతలందరి చేతా స్తుతించబడ్డాడే గాని - ప్రసన్నుడు మాత్రం కాలేదా నృసింహుడు, పైగా, హిరణ్యాకశిపుడి పేగులను మెడలో ధరించాడు. ఆ రాక్షసుడి వక్షోరుధిరధారల్ని యెర్రగంధం పూసుకున్నట్లు పూసుకున్నాడు. అదీ చాలదన్నట్లు బీజశోధనం కూడా చేశాడు. అప్పటికి ఆవేశం అణుచుకోలేక హిరణ్యాకశిపుని కళేబరాన్ని - రక్తం ఓడుతున్న దాన్ని మెడలమీద వేసుకుని - దుర్భర గర్జనారావా లతో విశ్వాన్ని మింగేసేటంత నోరు తెరచుకుని లోకం మీద పడ్డాడు.

ఆ నరసింహుడి గర్జనలకి ఆకాశంలో మేఘాలు ముక్కలు ముక్కలై పోయాయి. పక్షులు గుండెలవిసి నేలకు రాలిపోయాయి. నక్షత్రాలు వణికాయి,

గ్రహాలు గతులు తప్పిపోనారంభించాయి. సముద్రాలు పొంగాయి. సూర్యుడు తేజో హీనుడైపోసాగాడు. సిద్ధ, చారణ యక్ష, విద్యాధరాదులు తలా ఒక దిక్కుకూ పరుగు లెత్తసాగారు.

కులగిరులు కంపించాయి. ఆయన పదఘాతాలకు భూమి గడగడ రాలిపో సాగింది. ఏవిపాతమూ లేకుండానే మహా వృక్షాలు నేల పడిపోయాయి. మహా మునుల తపస్సులు అంతరాయ భరితాలైపోయాయి. యోగుల ధ్యానాలు నిలకడ మానివేశాయి. ఋషులు హాహాకారాలు చేశారు. దేవతలు అల్లాడిపోయారు. సప్తమహర్షులూ శాంతి ప్రవచనాలు మొదలు పెట్టారు. అయినా నరసింహస్వామిలో ఉగ్రత్వం చల్లారలేదు.

భగవంతుడు భక్తులకేగాని అన్యులకు సులభుడు కాదు గదా! అందువల్ల ఆయన భక్తులైన నారదాదులు గాని, వైకుంఠంలో వుండే ఆయన నిత్య సేవకులు గాని, పారిషదులు గాని, చివరికి లక్ష్మీదేవి కూడా ఆయన తీవ్రత్వాన్ని నిలువరించ లేకపోయారు. బ్రహ్మదేవుడంతటి వాడికి కూడా ఏం చేయాలో పాలుపోలేదు. అందరూ వెళ్ళి శివుణ్ణి శరణువేడారు. శివుడు వారికి అభయమిచ్చి, వీరభద్రుణ్ణి నృసింహస్వామి చెంతకు పంపాడు.

వెళ్ళాడు వీరభద్రుడు, నృసింహుడితో మృదువుగా మాట్లాడాడు. ఉగ్రత్వాన్ని చల్లార్చమన్నాడు. వినలేదా నరసింహుడు 'నువ్వెవడివి నాకు చెప్పడానికి? నేను తలుచుకుంటే చరాచర విశ్వం మొత్తం చప్పరించేస్తాను జాగ్రత్త" అన్నాడు. అంతేనా! తానే పరబ్రహ్మననీ, మృత్యుంజయుడిననీ ప్రయసంగించాడు.

'నువ్వెలా పరబ్రహ్మవవుతావు? పరబ్రహ్మ అంటే శివుడే' అని సోదా హరణంగా వివరించాడు వీరభద్రుడు, కానీ నరహరి చెవికవేవీ యెక్కలేదు. 'ఇక లాభం లేదనుకున్నాడు వీరభద్రుడు. తక్షణమే మహాద్భుతమైన రూపాన్ని ధరించాడు.

## వీరభద్రుని శరభావతారము

ఆ రూపంతో ఆయన సర్వాకాశాన్నీ ఆక్రమించేశాడు, బంగారు రంగులో వెలిగిపోతున్నాడు. సమస్తమైన తేజస్సులూ ఆయనలో లీనమై పోతున్నాయి. వేయి చేతులతో జడదారియై, చంద్రరేఖాజూటుడై సువిశాలమైన రెండు రెక్కలతో,



పొడవైన ముక్కుతో, పెద్ద పెద్ద కోరలతో, వజ్రాభాలైన గోళ్ళతో, నీలకంఠంతో, నాలుగు కాళ్ళతో మూడు కళ్ళతో హుం కారాలు చేస్తూ - విజృంభించాడు.

ఆ శరభరూపాన్ని చూస్తూనే తన బల సామర్ధ్యాలను కోల్పోయాడు నర సింహుడు. శరభాతారుడైన ఆ వీరభద్రుడు నృసింహుడి చేతులను పట్టుకున్నాడు. రెక్కలతో అతని నాభినీ, పాదాలనీ తాడిస్తూ పుచ్ఛంతో అతనిని బంధించాడు. నృసింహుడిచే భీతావహులైన వారు అంతా తన పరాక్రమానికి అబ్బురపాటూ, మెచ్చికోలూ జోడించి 'అశ్శరభశరభ-అల్లల్లవీర' అని ఉత్సాహ పూరితంగా పాడుతూ ఆడుతుంటే-వీరభద్రుడు నృసింహుడి రొమ్మున దెబ్బలు కొడుతూనే- గరుత్మంతుడు పాముని లేపుకుపోయినట్లుగా అతనిని తన్నుకుపోయాడు కైలాసానికి అతగాడి మొండేన్నీ, తలనీ విడదీసేశాడు. సూక్ష్మరూపం శివుడిలో కలిసి పోయింది. స్థూలపదార్ధం యొక్క చర్మాన్ని శివుడు కట్టుకున్నాడు. శిరస్సును తన మెడలోని ముండమాలికలో 'తరళ' స్థానంలో అలంకరించుకున్నాడు తదనంతరం కథ వినండి.

# గృహపతియను వైశ్వానరునకు అగ్ని పదప్రాప్తి కలుగుట

బహుకాలపూర్వం నర్మదా నదీ తీరంలో ధర్మపురం అనే పట్టణము వుండేది. అక్కడ-శాండిల్య గోత్రుడైన విశ్వానరుడనే విప్రుడు తన భార్యయైన శుచిష్మతి అనే ఆమెతో కలసి - ధర్మానువర్తియై - నైష్ఠికుడై వుంటున్నాడు. సంతానం తప్ప సర్వసంపదలూ వున్న విశ్వానరుడు-ఒకనాడు భార్యయొక్క మనోవాంఛితాన్ని నెరవేర్చదలచి సత్పుత్రసిద్ధికై శివారాధనే శ్రేయమని యెంచి కాశీ వెళ్ళాడు. అక్కడే నివాసం యేర్పరచుకుని, అచటి వీరేశ్వరలింగమును యధాశక్తి ఏడాది పాటు

ఆరాధించాడు. ఆరాధనా నిమిత్తమై శ్రీ వీరేశ్వర లింగాన్ని సమీపించేసరికి ఆ లింగ మధ్యంలో - ఎనిమిదేళ్ళ కుర్రాడు కనిపించాడు.

ఆ బాలుణ్ణి చూసి - అతనినే మహేశ్వరుడిగా భావించి స్తుతించాడు విప్రుడు. బాలక రూపంలో వున్న బాలేందుధరుడు సంతుష్టి చెందాడు. విశ్వానరా! నువ్వు చేసిన ఈ స్తుతిపాఠం అభిలాషాష్టకమనే పేర ప్రసిద్ధి మవుతుంది. రోజుకి 3 వేల చొప్పున సంవత్సరం పఠిస్తే సిద్ధిస్తుంది. ఇక - నీ కోరిక ప్రకారమే నేను నీ వల్ల నీ భార్యయైన శుచిష్మతియందు ఆవిర్భవిస్తాను.' అని అనుగ్రహించాడు.

అనుగ్రహించిన ప్రకారమే ఒకానొక శుభముహూర్తాన శుచిష్మతి నుండి ప్రసవింపబడ్డాడు. బ్రహ్మదేవుడంతటివాడు స్వయంగా దిగివచ్చి - ఆబిడ్డకు "గృహపతి" అని నామకరణం చేసి వెళ్ళిపోయాడు. నాలుగో నెల రాగానే విశ్వానరుడు ఆ బిడ్డకు అన్నప్రాశనం, కర్ణవేధ చేయించాడు. అయిదవ యేట ఉపనయనం చేయించాడు. ఉపాకర్మాదులు కూడా నెరవేర్పించి వేదాభ్యాసంలో దింపాడు. ఇలా యెనిమిదిదేళ్ళు గడిచిపోయాయి. తొమ్మిదవ యేట నారదుడు వచ్చాడు. ఆయన పిల్లవాణ్ణి చూసి, ఆనందించి - విశ్వానరా! అన్ని లక్షణాలూ అద్భుతంగా వున్నాయి కాని - యీ పిల్లాడికి పన్నెండో ఏడాదిలో పిడుగు గండం ఉందయ్యా" అని హెచ్చరించి వెళ్ళిపోయాడు.

నారదుడు చెప్పిన కీడు తలుచుకుని శుచిష్మతీ దంపతులు పొగిలి పొగిలి యేడ్చారు. అప్పుడు గృహపతి తల్లిదండ్రులను ఓదార్చి సర్వకరణ కారణుడూ, శాశ్వతుడూ, మృత్యుంజయుడూ అయిన శివుణ్ణి ఆరాధించి - ఆపదను అధిగమిస్తాను. కాశీ వెళ్ళేందుకు అనుమతించమని కోరాడు. అంగీకరించారు తల్లిదండ్రులు, ఒక సుముహూర్తమున బయలుదేరి వారణాశి చేరాడు గృహపతి.

మొదటి ఆరు నెలలూ కందమూలాలు మాత్రమే తింటూ ఆరాధించాడు. తరవాత ఆరు నెలలూ పండుటాకులే భుజిస్తూ సేవించాడు. ఆపై ఆరు నెలలూ గాలిని సైతం బంధిస్తూ రోజు ఒక్కంటికి ఒకే ఒక్క నీటి చుక్క చొప్పున తీసుకుంటూ తపించాడు.

గృహపతికి పదకొండు సంవత్సరాలు గడిచాయి. పన్నెండో యేట అడుగు పెట్టాడు, ఆ మొదటి రోజునే గృహపతికి ఇంద్రరూపం సాక్షాత్కరించింది, 'వరం

యిస్తాను కోరుకో' మన్నాడు ఇంద్రమూర్తి. గృహపతి తిరస్కరించాడు, ఇంద్రమూర్తి నచ్చ చెప్పబోయాడు. వినలేదు వైశ్వానరుడు. 'నేనే విశ్వేశ్వరుణ్ణి ఆరాధిస్తున్నానో ఆ విశ్వేశ్వరుడే నాకు వరం యిస్తాడునీతో పనిలేదు పొమ్మన్నాడు ఆ మాట వింటూనే యింద్రమూర్తి వజ్రాన్ని ఝుళిపించి ఆ బాలునికి చూపించాడు. అది చూస్తూనే నారదవచనం గుర్తొచ్చి గృహపతి స్పృహతప్పబోయాడు, తక్షణమే తోచాడు శివుడు. దృశ్యమానుడవుతూ బాలుణ్ణి తాకాడు, ఆ స్పర్శవల్ల గృహపతి వెంటనే కోలుకున్నాడు, కట్టెదుట నున్న కంఠేకాలుణ్ణి అట్టే చూస్తుండిపోయాడు ఆనందంతో నోట మాట రాలేదు.

కరుణామయుడైన కపర్ది చిరునవ్వు నవ్వాడు - "నీ మనసు నాకు తెలుసు, నిన్ను పరీక్షించడానికి నేనే యింద్రమూర్తిలా కనిపించాను. నిన్ను మెచ్చాను. దేవతా స్థానాలన్నిటా శ్రేష్ఠతరమైన అగ్ని పదవిని నీకు యిస్తున్నాను, ప్రాణులందరిలోనూ జఠరాగ్నివై ఉంటావు. నీచే ప్రతిష్ఠించబడిన లింగం 'అగ్నీశ్వరలింగం' అనే పేరుతో ప్రసిద్ధమవుతుంది.

ఆ లింగాన్ని ఆరాధించిన వారికి అగ్ని భయం, వజ్ర భయం వుండవు' అని వరాలిచ్చి - అతనిని ఆగ్నేయ దిశాధిపతిగా అభిషేకించి, తానా అగ్నీశ్వర లింగం లోనికి అంతర్థానుడై పోయాడు. అందువల్లనే అగ్నికి 'వైశ్వానరుడు' అనే పదం వాడుకలోనికి వచ్చింది.

# ఆరంభావతార విశేషములు

ఇక్కడికి 47 అవతారాలయ్యాయి. ఇక సజ్జనులయిన వారు భక్తి జ్ఞాన, వైరాగ్యాల ద్వారా గుర్తించి ఆరాధించే శివుని యొక్క తొలి అవతారాలు చెబుతాను వినండి. 1. మహాకాలుడు, పరదేవత మహాకాళి, 2. తారుడు, పరదేవత తారాశక్తి 3. బాలభువ నేశ్వరుడు, బాలభువనేశ్వరి పరదేవత, 4. షోడశశ్రీవిద్యేశ్వరుడు ఆమెషోడశశ్రీవిద్యేశ్వరి, 5. భైరవుడు, పరదేవత, భైరవి, 6. ఛిన్నమస్తకేశ్వరుడు, అదే పేరుగలది పరదేవత, 7. ధూమవదీశ్వరుడు, ధూమేశ్వరి పరదేవత. 8. బగళా ముఖేశ్వరుడు, అమ్మవారు బగళాముఖి. 9. మాతంగేశ్వరుడు, ఆమెపేరు మాతంగి 10. కమలేశ్వరుడు పరదేవత కమలాదేవి.

# యక్షావతారము

ఏతదనంతరం చెప్పుకోదగ్గది యక్షావతారము. ఒకప్పటి దేవాసుర సంగ్రామంలో - దేవతలు విజయం సాధించారు. అది కేవలం శివానుగ్రహ ప్రాప్తమేనన్నది విస్మరించి అహంరెచ్చి - మాయామోహితులై అంతా తమ గొప్ప తనంగానే ప్రగల్భించసాగారు. అలా ప్రగల్భిస్తున్న ఆ దేవతల ముందు యక్ష రూపంలో ప్రత్యక్షమయ్యాడు శివుడు.

"ఓ దేవతలారా! ఏమిటి అట్టహాసం?" అని అడిగాడు. వాళ్ళు చాలా గర్వంగా "మేమంతా రాక్షసులను ఓడించేశాం" అని గొప్పలు చెప్పుకున్నారు అపుడా యక్షరూపుడు "వెర్రి వాళ్ళలారా! అంతా శివ కటాక్షమేగాని వేరుగాదు. ఆయన కరుణ రవ్వంత తప్పినాసరే - మీరు గాని, మీ ఆయుధాలు గాని, మీ శక్తులుగాని యెందుకూ కొరగాకుండా పోతాయి.

కావాలంటే ఇప్పుడు చూపండి మీ ప్రతాపం ఇదిగో ఈ గడ్డిపరకను ఏం చేయగలరో చేయండి" అన ఒక తృణాన్ని చూపించాడు. అగ్ని దాన్ని కాల్చలేక పోయాడు వాయువు దాన్ని కదపలేకపోయాడు యముడు దాన్ని నిర్జీవం చేయలేక పోయాడు ఇంకా బలవంతులు కూడా దానిని పెకలించలేకపోయారు.

చివరికి ఇంద్రుడి వజ్రాయుధం కూడా - ఆ గడ్డిపరకని ఖండించలేక పోయింది. దాంతో దేవతలు బుద్ధి తెచ్చుకుని శివుణ్ణి స్మరించగా - యక్షరూపుడు శివమూర్తిగా సాక్షాత్కరించి, వారిననుగ్రహించాడు, ఇదీ యక్షావతారం కథ.

# "నమో రుద్రేభ్యః" - ఏకాదశ రుద్ర వివరణము

ఇక యిప్పుడు ఏకాదశ రుద్రావతారాలూ చెబుతాను వినండి. ఆది కాలంలో, దేవతలు రాక్షసుల బాధపడలేక తమ తండ్రియైన కశ్యపుణ్ణి చేరి ప్రార్థించారు. ఆయన కాశీ వెళ్ళి లింగ ప్రతిష్ఠచేసి దేవతాశ్రేయం లక్ష్యంగా తపించాడు. శివుడు ప్రత్యక్షమయ్యాడు. కశ్యపుడాయనకు దేవతా దుఃఖాన్ని చెప్పి రక్షించమన్నాడు. సరేనన్నాడు శివుడు. ఆ కారణంగా - కాలాంతరంలో - కశ్యపుడికి సురభియందు పదకొండుగురు తనయులుగా ఆవిర్భవించాడు.

1. కాపాలి, 2. పింగళుడు, 3.భీముడు 4. విరూపాక్షుడు, 5. విలోహితుడు, 6. శాస్త, 7. అజపాత్, 8. అహిర్బుధ్న్యుడు, 9. శంభుడు, 10. చండుడు,

11. భవుడు అనేవి వారి పేర్లు, ఆ 11 రూపాలతోనూ రుద్రుడు దేవతా పక్షాన్న వలంబించి పోరాడి రాక్షసులను జయింపచేశాడు. మహాత్ములయిన ఆ రుద్రులు పదకొండుగురి, అవతరణమే ఏకాదశ రుద్రావతరణంగా కీర్తించబడుతోంది. వారు ఈశానదిశలో తావునేర్పరచుకుని భక్తరక్షణ చేస్తూ - సర్వవిధ లీలా విలాసాలన్నీ ప్రదర్శిస్తున్నారు. ఈ పదకొండుగురి వల్లనే రుద్రాధ్యాయంలో 'నమోరుద్రేభ్య' అనే మంత్రం యేర్పడింది.

## దుర్వాసావతార ఘట్టము

ఒకప్పుడు అత్రి మహర్షి సంతాన వాంఛతో కూడినవాడై 'ప్రత్యక్ష కులం' అనే పర్వతంపై తపించాడు. 'ఏ వికారములేని పరమాత్ముడెవరో ఆ పరమాత్ముడు నాకు పుత్రవరము నీయుగాక' అని సంకల్పించాడు. అలా తపించగా - బ్రహ్మ విష్ణు, మహేశ్వరులు ముగ్గురు ప్రత్యక్షమయ్యారు. 'మా మా అంశలతో నీకు ముగ్గురు పుత్రులు పుడతారు' అని వరమిచ్చారు.

ఇచ్చినట్లుగానే ఆ అత్రికి అనసూయ యందు బ్రహ్మాంశతో చంద్రుడు, విష్ణ్వంశతో దత్తుడు (దత్తాత్రేయుడు), రుద్రాంశని దుర్వాసుడూ అనే ముగ్గురు పుత్రులు కలిగారు. వారిలో దుర్వాసుడు భక్తులను పరీక్షించడం, ఉద్ధరించడం వంటివి చాలా చేశాడు. ఆ పద్ధతే విచిత్రంగా ఉండేది. ఓ చిన్న కథ ఉదాహరణకి చెబుతాను వినండి.

## దుర్వాస అంబరీషుల కథ

సూర్యవంశంలో అంబరీషుడనే రాజు వుండేవాడు. అతను ఏకాదశీ వ్రతం చేసి, ద్వాదశినాడు బ్రాహ్మణ సంతర్పణ చేస్తుండేవాడు. ఇది తెలిసి దుర్వాసుడు శిష్య సమేతంగా అతని దగ్గరకు వెళ్ళాడు. సరిగ్గా ద్వాదశిపారణ సమయం అది. ఆయనను కూడా భోజనానికి కూర్చోమని కోరాడు, అంబరీషుడు. స్నానంచేసి వస్తానని చెప్పి దుర్వాసుడు శిష్య సమేతంగా నదికి వెళ్ళాడు. అంబరీషుణ్ణి పరీక్షించే నిమిత్తం అక్కడ ఆలస్యం చేయసాగాడు.

ఇక్కడ అంబరీషుడు - ద్వాదశీపారణ సమయం దాటితే వ్రతభంగమవు తుందనే ఉద్దేశ్యంతో - శాస్త్రానికి ఓ చుక్క నీళ్ళు పుచ్చుక్కుని - దుర్వాసుడి

కోసంయెదురు చూడసాగాడు. రానే వచ్చాడు దుర్వాసుడు. వస్తూనే, అంబరీషుడి జలప్రాశన విషయం కనిపెట్టేశాడు. నన్ను భోజనానికి పిలిచి, వచ్చే లోపలే యెంగిలి పడతావా? నిన్ను దూషించేస్తాను, జాగ్రత్త" అని గదిమాడు.

ఆ గదుములకూ, గర్జనలకూ - అక్కడే వున్న సుదర్శచక్రం మేల్కొంది. అంబరీషుడి రక్షణార్థం, అక్కడ వుంచబడింది. అది లేచి దుర్వాసుడిపై పడ బోయింది. అంతలో ఆకాశవాణి, 'ఓ అంబరీషా! రాక్షససంహారార్థమై శివునిచే విష్ణువుకీయబడిన యీ సుదర్శనం సాక్షాత్తూ శివాంశ సంభూతుడైన దుర్వాసునిపై పడబోతోంది. నువ్వు సత్వరమే దానిని శాంతపరచు. దుర్వాసుడు సామాన్యుడు గాదు. ఆయనను ప్రసన్నం చేసుకో" అని చెప్పడంతో, ఆ అంబరీషుడు సుదర్శనాన్ని ప్రార్థించాడు.

సుదర్శనం కూడా - దుర్వాసావతారంలో వున్న శంకరుణ్ణి గుర్తించి, శైతల్యాన్ని వహించింది. అనంతరం అంబరీషుడు దుర్వాసుని పలువిధాల ప్రార్థించగా, దుర్వాసుడతని కెన్నో వరాలిచ్చాడు.

## కృష్ణుడూ-దుర్వాసుడూ కథ



ఆ తదుపరి ఒకసారి శ్రీకృష్ణుడు-బ్రాహ్మణ సమారాధనా వ్రతాన్ని అవలంబిం చాడు. ఆ కృష్ణుణ్ణి పరిశీలించే నిమిత్తం దుర్వాసుడు అక్కడకు వెళ్ళాడు. తన రథానికి గుర్రాల బదులుగా రుక్మిణీ కృష్ణుడూ కాడె మోసి నడపాలని నియమిం చాడు. వారందుకంగీకరించి దుర్వాసుడెక్కిన రథానికి తాము గుర్రాలుగా ప్రవర్తించారు. ప్రసన్నుడైన దుర్వాసుడు కృష్ణుడికి అజేయత్వాన్నీ, వజ్రశరీరాన్ని యిచ్చాడు.

ఇంకొకసారి - దుర్వాసుడు ఆకాశగంగలో స్నానం చేస్తుండగా ఆయన కౌపీనం కొట్టుకుపోయింది. అందువల్ల బయటకు రావడానికి సిగ్గుపడ్డాడు. అదే సమయంలో అటు స్నానానికి వచ్చిన ద్రౌపది-తన చీర చెంగు చింపి ఆయనకై విసరగా అందుకు ప్రతిఫలంగా దుర్వాసుడు "ఆపత్సమయంలో అక్షయ వస్త్రవౌతా" వని వరం యిచ్చాడు. ఆ వరంవల్లనే కురుసభలో ద్రౌపది మానభంగ ప్రమాదం నుంచి బైటపడింది.

# శివుడు హనుమంతుడిగా అవతరించుట

ఇలా ఒకటనిగాదు ఆ ఒడయడి అవతార విశేషాలు ఒకసారి - విష్ణువు మోహిని వేషం కట్టినప్పుడు - శివుడు మనోవికారం ప్రకటించి వీర్యాన్ని స్ఖలించాడు. సప్తమరుత్తులూ కలసి - ఆ రేతాన్ని తీసుకు వెళ్ళి గౌతమ పుత్రికయైన అంజనాదేవి చెవిలో వేసారు. తత్ఫలితంగా ఆమెకి గర్భం నిలిచి, ఒకానొక శుభవేళ - ఆ శివబీజం హనుమంతుడిగా ప్రసవింపబడింది.

ఓ రోజు తెల్లవారుఝామున - ఉదయిస్తున్న సూర్యబింబాన్ని చిన్న పండుగా భావించి - ఒక్క యెగురు యెగిరి, ఆ బింబాన్ని చటుక్కున మ్రింగేశాడు ఆంజనేయుడు.

ఆయన శివాంశ సంభూతుడని యెరిగినందువల్ల దేవతలంతా వచ్చి ప్రార్థించగా తిరిగి సూర్యుణ్ణి వెలిగ్రక్కాడు హనుమ. దేవతలూ, ఋషులూ - అనేక రకాల వరాలనిచ్చి ఆయన అనుగ్రహం పొందారు.

అనంతరం బాలాంజనేయుడు తన తల్లి ఆజ్ఞ ప్రకారం సూర్యరథంతో సమంగా సంచరిస్తూ-అష్టాదశ విద్యల్నీ నేర్చుకున్నాడు. తల్లి ఆన, గురుడి అనుమతీ తీసుకుని - సూర్యవంశోద్భవుడైన సుగ్రీవుడికి సఖుడై, అతనితోనే గడపసాగాడు. ఆ తర్వాత తర్వాత రామాయణగాథా ఇదీమీకు తెలిసినదే గదా! అందుచేత హనుమంతుడు గూడా శివావతారమే. ఇలాటిదే మరో అవతారం మహేశావతారం.

# భైరవుని భేతాళావతారము-ఇతరములు

క్రీడావిలాసులైన పార్వతీ పరమేశ్వరులు - భైరవుని ద్వారపాలకునిగా నియమించి-లోపల తాము కేళీవిలాసాలలో మునిగిపోయారు. అసలు కేళీ విలాసాల తర్వాత హాస్యక్రీడా విలాసాలు మొదలయ్యాయి. అమ్మవారు ఉన్మాదినిగా నటిస్తూ - ద్వారం చేరింది. కావలివున్న భైరవుడు ఆమెను సాధారణ స్త్రీగా భావించి - నిరోధించాడు, ఆమె ఆగ్రహించి "భూమిలో మానవుడవై పుట్టు" మని శపించింది.

మానవ యోనిలో 'భేతాళుడు'గా జన్మించాడు భైరవుడు. ఆ భైరవుని మీద ప్రేమతో శివుడు అమ్మవారితో కలిసి భూమిని అవతరించారు. ఆయన పేరు మహేశుడు. ఆమె పేరు శారద.

అంతేకాదు, క్షీరసముద్ర మథన వేళ జరిగిన దేవాసుర యుద్ధములో విష్ణువు రాక్షసులను తరుముకుంటూ పాతాళం చేరాడు. అక్కడ సుందరీమణులను మరిగి - రతి సుఖాలలో మునిగిపోయాడు. అనేకమంది పిల్లల్ని పుట్టించాడు. వాళ్ళంతా విష్ణ్వంశ సంజాతులు కావడంవల్ల మహాబలులై - స్వర్గ పాతాళలోకాల్ని అతలాకుతలం చేయసాగారు. దేవతలంతా శివునకు మొరపెట్టుకున్నారు. అప్పుడాయన వృషభావతారం ధరించాడు.

సరాసరి పాతాళం చేరి తన పుచ్ఛంతో కొట్టి డెక్కలతో తొక్కి, కొమ్ములతో పొడిచి-విష్ణునందనులను వధించి - ఒక్క రంకె వేశాడు. అది విని - సంభోగశాల లోంచి బైటకొచ్చిన విష్ణువు పుత్రుల మృతికి దుఃఖించి-దానిక్కారణం 'ఎద్దే'నని తెలిసి అనేక అస్త్రాలనూ, శస్త్రాలనూ ఆ వృషభంపై ప్రయోగించాడు.

ఆ వృషభం అన్నింటినీ మ్రింగేసి మరింతగా రంకె పెట్టింది. అప్పటికే జ్ఞానో దయం అయ్యింది హరికి, ఆ వృషభం వృషభం గాదనీ, వృషేశ్వరుడనీ గుర్తించాడు. ప్రణమిల్లాడు. శివుడతనికి సద్బుద్ధిని బోధించి వైకుంఠానికి పదమన్నాడు. "వస్తాను లోపల నా చక్రం వుంది తెచ్చుకోవాలి' అన్నాడు శౌరి "అక్కర్లేదు. అంతకన్నా మంచి చక్రం యింకొకటి యిస్తాను" అని - వేరొక సుదర్శనాన్ని యిచ్చాడు శివుడు ఆ రెండవ సుదర్శనం తీసుకుని విష్ణువు మోహాన్ని వదిలి శివస్మరణ చేసుకుంటూ తన లోకానికి వెళ్ళాడు.

# పినాకి పిప్పలాదుడగుట

వృత్రాసురుడికీ, దేవతలకీ యుద్ధం జరిగినప్పుడు - దేవతలంతా ఓడి పోయారు. 'వృత్రుణ్ణి చంపడం యెలాగా?' అని బ్రహ్మను అడిగారు. అప్పుడు బ్రహ్మ 'దధీచి అని ఒక మునివున్నాడు, శివానుగ్రహం వల్ల అతను తన బొమికల్ని వజ్రమయాలయ్యేలా వరం పొందాడు. కాబట్టి - మీరా దధీచి అస్థులను సంపాదించి - వజ్ర దండాన్ని నిర్మించితే వృత్రుడు దానితో చావవచ్చు".నన్నాడు.

దేవతలంతా దధీచిని ప్రార్థించారు. ఆయన అనుగ్రహించాడు ప్రాయోపవేశం చేసి, శాశ్వత శివ సాయుజ్యాన్ని పొందాడు. తెల్లబోయారు దేవతలు.

"ఫలానా ఫలానా విధానేన షోడశోపచార పూజాంకరిష్యామిత్యమేవ దేవుడు:- అహమేవశంకరః" అనుకుంటూ అజన్మాంతం ఆరాధించినా సరే, మానవులకు

ఓ చిన్న వరం యివ్వడానికి వెనకాముందూలాడే ఆ చావులేని జీవాల బృందం మొత్తం 'దధీచి' అనే "మనిషి" చేసిన త్యాగానికి ముక్కున వ్రేలేసుకుంది. ముక్కోటి పై చిలుకు దోసిళ్ళతో ఆయన మీద ముమ్మరంగా పూలవాన కురిపించింది.

ఆయన ఆస్థికలను కామధేనువుచేత వెలికి తీయించారు. అవి విశ్వకర్మకు యిచ్చి ఆయుధాలు చేయమన్నారు. ఆయన దధీచి యొక్క వెన్నెముకతో వజ్రాయుధం చేసి యివ్వడం, వృత్రసంహారం, అదంతా ఓ కథ అనుకోండి ఇక యిక్కడ ప్రాయోపవేశం చేసి పడివున్న దధీచి దగ్గరకు వద్దాం ఆయన భార్య సువర్చ-భర్త మరణం తెలియగానే పవిత్రాగ్ని సిద్ధపరచి ఆత్మాహుతి చేసుకో బోయింది.

కాని "దధీచి తేజం నీ గర్భంలో శిశురూపాన వుంది. కాబట్టి నువ్వు యీ ప్రయత్నానికి అర్హురాలివి కావు' అని ఆకాశవాణి ఆమెను హెచ్చరించింది. ప్రసవమయ్యేదాకా ఆగలేకపోయింది. ఆ దధీచీ ప్రియ. తక్షణమే అక్కడ వున్న ఒక రాతితో తన గర్భాన్ని పగలగొట్టుకుంది. అందులోంచి వెలువడ్డాడు - వెలుగే రూపంగా వెలుగుపోతున్న శిశువు. ఆ బిడ్డను చూసుకుని తృప్తిపడి, అతనినో రావిచెట్టు మొదట్లో పరుండబెట్టింది. 'నాయనా! ఇక్కడే వుండి నీ భక్తులను రక్షించు' అని చెప్పి, తన దారిన తను అగ్నిలోకి ప్రవేశించింది సువర్చ.

దేవతలా బాలుడికి జాతకర్మలు చేశారు. "పిప్పలాదుడు" అని పేరు పెట్టారు. ఆ బిడ్డ అక్కడే పెరిగాడు. అలా రావిచెట్టు మొదట్లోనే కూర్చుని అఖండమైన తపస్సు చేసాడు.

## పిప్పలాదుడు శనిని శపించుట



తదనంతరం లోకులకి శనిగ్రహ పీడ విపరీతంగా ఉండడంవల్ల 'మానవులు పుట్టింది మొదలు పదమూరు సంవత్సరాల ప్రాయం వచ్చేవరకూ శనిపీడ పొందకుండెదరు గాక! శివభక్తులను ఆ శని నిరంతరము పీడింప కుండునుగాక! ఇందుకు వ్యతిరేకిస్తే ఆగ్రహం భస్మమై పోవును గాక!" అని శపించాడు.

అదుగో - ఆ పిప్పలాదుడి శాపం వల్లనే - బాల్యమరణాలు (శనివల్ల కలిగే మరణాలు తగ్గాయి. ఇప్పటికీ శని పట్టిందంటే రుద్రాభిషేకం చెయ్యమంటారు. శివభక్తులను ఆ శనైశ్చరుడు యేమీ చెయ్యడు.

# వైశ్యనాథావతారం

పూర్వం నంది గ్రామంలో మహానంద అనే వేశ్య ఉండేది. అప్పటిలో ఆమె పొందు కోరనివాడు ఉండేవాడు కాదు. అది చూసిందిరా అంటే చచ్చిన మన్మథుడు బ్రతికి వెనక్కొస్తాడు. అంతటి హొయలు దానివి. కాని - పరమ శివభక్తురాలు, వ్యభిచారం పూర్తికాగానే పరిశుభ్రంగా స్నానాదికాలు ముగించి - చేసిన పాపానికి అభిచారం తలపెట్టిందా అన్నట్లుగా శివార్చన చేసేది. ఆ ధ్యానంలో ఒక్కోసారి తన్మయురాలైపోయి నాట్యం చేసేది కూడాను.

ఆమెను పరీక్షించాలనుకున్నాడా శివయ్య. వెంటనే ధనికుడైన వైశ్యుడి వేషం కట్టాడు. ముంజేతికి మోహనకరమైన రత్న కంకణం పెట్టాడు. వీర శైవుడిలా అలంకారమంతా చేసుకున్నాడు. మహానంద యింటికి వచ్చాడు. ఆమె అతనికి మర్యాదలు చేస్తూ చేస్తూ చేతిన వున్న రత్న కంకణాన్ని చూసి మనసుపడింది. తనకు యిమ్మని అడిగింది.

"కావాలంటే యిస్తాను కాని, ఎంత వెల కడతావు?" అని అడిగాడు శివుడు. "అయ్యా! నేను కులానికి, వృత్తికి కూడా వేశ్యనే అందువల్ల నువ్వు నాకా కంకణాన్ని యిస్తే - మూడురోజులపాటు నేను నీ ధర్మపత్నిలా వుంటాను" అంది మహానంద. ప్రమాణం చేయించుకున్నాడా శివుడు, అనంతరం ఆమెకు ఒక రత్న లింగాన్నిచ్చి దానిని తన ప్రాణసమానంగా దాచమన్నాడు. ఆమె ఆ రత్న లింగాన్ని నాట్యశాల మధ్యలో దాచింది. ఆ రాత్రంతా ఆ వైశ్యుణ్ణి సేవించుకుంది.

అర్ధరాత్రికాగానే వైశ్యవేషుడైన వైద్యుడు తన మాయతో నాట్యశాలలో మంటలు లేపాడు. మహానంద ఎంత ప్రయత్నించినా రత్న లింగాన్ని తప్పించ లేకపోయింది. ఆ ప్రయత్నంలో వుండగానే మండపస్తంభాలా లింగంపై కూలిపడి అది రెండు ముక్కలై పోయింది.

రత్న లింగం పగిలినందుకు మాయా వైశ్యుడు యెంతగానో దుఃఖించాడు. ఆ రత్న లింగం లేని తన జీవితం వ్యర్థమేనన్నాడు, తనకు చితి పేర్పించమన్నాడు మహానంద పేర్పించిన చితిలో దూకేశాడా మాయా వైశ్యుడు, అప్పుడు మహానంద

కూడా సహగమనానికి సిద్ధపడింది. ఆమె పరివారమంతా నిరోధించబోయారు. అందుకామె - "రత్న కంకణం తీసుకున్నాను నేను. మూడు రోజులాయనకు సహధర్మచారిణిగా వుంటానని ప్రమాణం చేశాను. విధి వశాత్తూ ఇలా జరిగి పోయింది. ధర్మపత్నికి సహగమనమే ధర్మంకనుక, నేను కూడా సహ గమిస్తాను." అంది చితిలో దూకబోయింది ఠక్కున ప్రత్యక్షమయ్యాడు శివుడు. "భక్తురాలా! అసమానమైన నీ భక్తికీ, సత్యసంధతకి సంతోషించాను. ఏం కావాలో కోరుకో" అన్నాడు. ఆమె శివుడికి ప్రణమిల్లి 'ప్రభో! నాకు సాలోక్యమిప్పించు. పునర్జన్మ లేకుండా నిన్నే ఆరాధించుకోనీ' అని కోరింది. అనుగ్రహించాడు శివుడు. ఇదే వైశ్యనాథ కథ. ఇక ద్విజేశ్వరావతారం వినండి.



# ద్విజేశ్వరావతారము

శివుడు ఋషభయోగిగా అవతరించి నప్పుడు భద్రాయువు అనే రాచపట్టి నను గ్రహించిన సంగతిని చెప్పాను కదా! ఆ శివానుగ్రహంతో భద్రాయువు శత్రువుల నోడించి రాజయ్యాడు. ఒక నాడు భార్యా సమేతంగా వన విహారానికి వెళ్ళాడు భద్రాయువు.

అప్పుడతనిని పరీక్షించదలచి, పార్వతీ పరమేశ్వలు వృద్ధ బ్రాహ్మణ దంపతుల రూపంతో వచ్చారు, "ఓ మహారాజా! మమ్మల్నొక పులి చంపుకు తినబోతూవుంది. నువ్వే రక్షించాలి." అని ప్రార్థించారు. ఆ రాజు ధనుర్బాణాలు సర్దుకునే లోపలనే మాయా పులి - బ్రాహ్మణ ముత్త యిదువుని యీడ్చుకు పోయింది. మాయా విప్రుడు భద్రాయువును నిందించాడు. భద్రాయువు తన చేతగాని తనానికి సిగ్గుపడ్డాడు. జరిగిందేదో జరిగింది. ఇప్పుడేం కావాలో కోరుకోండి' అన్నాడు.

'నాకేం కావాలి? పోయిన పెళ్ళాం గావాలి. దాన్ని యెలాగూ తేలేవు. అందుకు బదులుగా నీ భార్యని దానం చేయ" మని అడిగాడా బ్రాహ్మణుడు. భద్రాయువు వెంటనే చితిని పేర్చుకున్నాడు. తన భార్యను జలధార పూర్వకంగా బ్రాహ్మణుడికి

దానం చేసి, తాను చితిలో దూకబోయాడు. మాయా బ్రాహ్మణుడు అతనిని వారించి తన నిజ స్వరూపం చూపించాడు. 'ఏం కావాలో కోరుకో' అన్నాడు.

భద్రాయువు - తన తల్లిదండ్రులైన వజ్రబాహు మహారాజు దంపతులకూ, పద్మాకరుడనే వైశ్యునకూ, అతని కొడుకు సునయునకూ పరధామంలో శివ కింకరత్వాన్ని అనుగ్రహించమని కోరాడు, తన తల్లి దండ్రులైన సీమంతిని చంద్రాకరులకు కూడా శివసాన్నిధ్యాన్నిమ్మని ప్రార్థించింది రాణి. అందరికీ అన్నీ యిచ్చి అంతర్హితమైన అద్భుత అవతారమే ద్విజేశ్వరావతారం.

# యతినాథ - హంసావతారములు

అద్భుతం అనే పర్వత ప్రాంతంలో అహుక-అహుకుడు అనే భిల్లదంపతులుండే వారు. నిత్య శివసేవా తత్పరులై, ధర్మపద్ధతిలో జీవిస్తున్న ఆ పామరులను పరీక్షించాలనుకున్నాడు పరమేశ్వరుడు వెంటనే యతినాథుడి వేషంలో అహుకుడి యింటికి వచ్చాడు. వారిచ్చిన అతిథ్యం స్వీకరించాడు, ఆ రాత్రికి అక్కడే తల దాచుకోనిమ్మని అడిగాడు. అసలే వాళ్ళది బుల్లి గుడిసె. ఇద్దరికి తప్ప చాలదు. అంచేత తాను బైట కాపుంటానని చెప్పి, యతినీ తన సతినీ గుడిసెలో పడుకోమన్నాడు అముకుడు. బైట కాపున్న అహుకుడు ఆ రాత్రి క్రూరమృగాల బారిన పడిచనిపోయారు. ఉదయం గుడిసె వెలుపలికి వచ్చిన యతీ అహుకా-అహుకుడి శవాన్ని చూసి నివ్వెరపోయాడు. అహుక చితి పేర్చించుకుని భర్తతోబాటే అందులో దుమికింది. అప్పుడు కనిపించాడు శివుడు. మిమ్మల్ని పరీక్షించ వచ్చిన యతినాథుణ్ణి నేనే. వచ్చే జన్మలో నేను మరలా "హంస"గా పరిణమించి, మిమ్మల్ని కలుపుతాను అని వరం యిచ్చాడు. శివుడక్కడే లింగంగా మారిపోయాడు. అక్కడ నుంచి కదలాలనిలేనట్లు సూచిస్తున్నందున ఆ లింగమును 'అచలేశ్వర లింగ' మంటారు.

ఆ మరుసటి జన్మలో ఆహుకుడు నిషధాధీశుడైన వీరసేనునకు నలుడు అనే పేర కుమారుడిగా జన్మించాడు. అహుక విదర్భదేశంలోని భీమరాజుకు "దమయంతి" అనే కూతురుగా అవతరించింది. ఇచ్చిన మాట ప్రకారం శివుడు హంసగా అవతరించి నలదమయంతులను దంపతులను చేశాడు. భక్తుల గుండెల్లో సరే - భావుకుల హృదయాల్లో కూడా వారికి - తనకీ అనూహ్యమైన ఉన్నత శాశ్వత స్థానాన్ని ఆపాదించి పెట్టాడు. ఇవి-యతినాథ, హంసావతారాలు.

# శివుడు కృష్ణ దర్శనుడగుట

శ్రాద్ధదేవుడి తొమ్మిదవ కొడుకు నభగుడు. ఆస్తి పంపకాల విషయంలో దాయల చేత దగాపడ్డాడు. తండ్రికి ప్రణమిల్లి, జరిగింది చెప్పాడు నభగుడు. ఆయన నభగుడిని అంగీరసుల యజ్ఞం చేసే చోటికి వెళ్ళి వైశ్వదేవసూక్తం,వల్లించ మన్నాడు. నభగుడు అలాగే చేయగా అంగీరసులు సంతృప్తులై తమ వాటా యజ్ఞ శేషాల్ని అతనికిచ్చారు. నభగుడు ఆ యజ్ఞ ద్రవ్యం అందుకోబోతుండగా శివుడు కృష్ణదర్శనుడనే పేర అక్కడకు వచ్చాడు. "ఓయీ ఈ యాజ్ఞీకమంతా నా సొత్తయి వుండగా, దీని నందుకోడానికి నువ్వెవడివి? అని అడిగాడు 'అంగీరసులిచ్చా'రని చెప్పాడు - నభగుడు.

'వాళ్ళిచ్చినప్పుడు అడ్డుపడకుండా, నేను పుచ్చుకోబోయేటప్పుడు అడ్డువస్తావేమిటి?' అని అడిగాడు. 'అయితే యీ వివాదం మీ నాన్నే తీర్చాలి వెళ్ళి - కృష్ణ దర్శనుడనేవాడు వచ్చాడని చెప్పు. మన సంభాషణ యథాతథంగా చెప్పు' అన్నాడు. నభగుడు అలాగే వెళ్ళి చెప్పాడు శ్రాద్ధ దేవుడు ఆశ్చర్యపోయాడు. 'నాయనా! వచ్చినవాడు శివుడే కాని, అన్యుడు కాడు. ఒక్క యాజ్ఞీక మేం కర్మ! విశ్వమంతా ఆయనదే. వెళ్ళి క్షమాపణలు చెప్పుకో" మన్నాడు.

తను కూడా వెనకాలే బయలుదేరాడు. నభగుడు వెళ్ళి శివుణ్ణి అర్చించాడు. "తప్పు కాయ" మన్నాడు. దయామయుడయిన శివుడు నభగుణ్ణి దీవించి పంపాడు. ఆ తరువాతది అవధూతేశ్వరావతారం ఆ అవతారంలోనే ఫాలనేత్రాగ్నిని సముద్రంలో వదలగా, అది జలంధరుడిగా పరిణమించింది. ఆ కథనింతకు ముందుకు చెప్పియున్నాను గనుక, తదుపరి కథ చెబుతాను వినండి.

# భిక్షువర్యావతారము

రథుడనే విదర్భరాజు శత్రువులచే చంపబడ్డాడు. అతని భార్య నిండు చూలాలు. ప్రాణభీతితో అడవులకు పారిపోయింది అడవిలో ఒక చెరువు గట్టున సర్వ లక్షణ సంపన్నుడైన బాలుణ్ణి ప్రసవించింది. దప్పికవల్ల ఆమె ఆ చెరువు నీరు త్రాగబోగా ఒక మొసలి ఆమెను ఆహారంగా స్వీకరించింది. పుడుతూనే తల్లిదండ్రులను పోగొట్టుకున్న ఆ రాచకందు సరస్తీరాన ఆకలి దప్పులతో రోదిస్తుండి పోయాడు.

అది గమనించిన శివుడు ఒక బ్రాహ్మణ భిక్షుకుని దారిమళ్ళించి రాచబిడ్డ వున్న రేవుకు పంపాడు. అప్పటికే ఆమె చంకలో ఆమె కుమారుడు - ఏడాది బిడ్డ వున్నాడు. ఆమె యీ రాచబిడ్డని చూచి తీసుకువెళ్ళి పెంచుకోవాలనుకుంది. కానీ, యెవరో యేమిటో తెలియకుండా చేరతీయడం మంచిదిగాదని సందేహించింది. అప్పుడు శివుడు బ్రాహ్మణ భిక్షుకుని వేషంలో వచ్చి ఆ బిడ్డను తీసుకెళ్ళమని చెప్పాడు.



"చాలా పూర్వం శివభక్తుడైన పాండ్య రాజు శత్రుభీతివల్ల శివార్చనావిధిలో లోపం చేశాడు. తత్ఫలితంగా యీ జన్మలో సత్య రథుడిగా పుట్టి శత్రువుల చేతనే చని పోయాడు. ఆ తండ్రి చేసిన పాపంవల్లనే ఈ బిడ్డ యిలా అనాథగా పడివున్నాడు. ఇతని తల్లి గతజన్మలో తన సవతిని కపటో పాయాన చంపిన కారణంగా ఈ జన్మలో మొసలిచే వధింపబడింది. కాబట్టి ఈ బిడ్డను తీసుకువెళ్ళి నీ బిడ్డతో బాటే పెంచు. అంతా శుభం అవుతుంది." అని చెప్పాడు శివుడు, తన నిజం రూపం కూడా చూపించి వెళ్ళాడు. అదే భిక్షువర్యావతారం ఆ బ్రాహ్మణ స్త్రీ బిడ్డను తీసుకు వెళ్ళింది. ధర్మగుప్తుడని పేరు పెట్టి పెంచింది. అతను ఒక గంధర్వ కాంతను వివాహమాడి/అత్తింటివారి సాయంతో తిరిగి తన రాజ్యం గెలుచుకుని భార్యతో సుఖంగా జీవించాడు.

అటు మీదట ఉపమన్యుణ్ణి కాచేందుకు సురేశ్వరుడిగా కూడా అవ తరించాడు. ఇక పార్వతీదేవిని పరీక్షించేందుకు బ్రహ్మచారిగా వెళ్ళిన ఘట్టమూ, హిమవంతుడి ముందు మాయా నర్తన వేషంలో ప్రవర్తించడమూ, వైష్ణవ వేషంలో వెళ్ళి మేనకా హిమవంతులకు శివుడిపట్ల సందేహం కలిగించడం అనేవి కూడా శివావతారాలుగానే చెప్పబడుతున్నాయి. ద్రోణుడికొడుకైన అశ్వత్థామ కూడా శివుడి అవతారమే.

# అశ్వత్థామావతారము



ప్రశస్తమైన భిక్షువర్యావతారానంతరం గాథలలో అశ్వత్థామగా శివుడు అవతరించడం ఒక ప్రధానఘట్టం. నాయక ప్రతినాయకులైన పాండవేయ, ధార్త రాష్ట్రేయులకు గురువుగా భాసించిన ద్రోణాచార్యుడు-తాను కౌరవుల తోనే వుండటం తటస్థించడం వలన,కౌరవర క్షాదీక్షతో శివుడి గురించి గొప్ప తపస్సు చేశాడు. ప్రత్యక్షమైన పరమేశ్వరుడు- ఏం కావాలో కోరుకోమన్నాడు?

"ఈశ్వరా! ఓటమి నెరుగనివాడూ, అజేయబల పరాక్రమశాలి, మహా యోధుడూ, అతిరథుడూ, నీయంశతో కూడినవాడూ అయిన ఒక పుత్రుణ్ణి అనుగ్రహించు" అని ప్రార్థించాడు ద్రోణుడు. 'సరే' నన్నాడు శివుడు అనతికాలం లోనే ద్రోణుడికి ఒక కుమారుడు కలిగాడు. అతనే 'అశ్వత్థామ' సర్వాస్త్ర శస్త్ర విదుడూ, అప్రతిహత యోధుడూగా పరిణమించాడా అశ్వత్థామ కురుక్షేత్రంలో కౌరవపక్షాన పోరాడాడు.

ఈ అశ్వత్థామకు భయపడే-అర్జునుడు 'పాశుపతాస్త్రం' సంపాదించి పెట్టు కోవలసి వచ్చింది. అయితే, భారత యుద్ధంలో దాన్ని ప్రయోగించవలసిన అవసరం రాలేదు. యుద్ధానంతరం అశ్వత్థామతో ద్వంద్వ యుద్ధానికి దిగాడు.

అశ్వత్థామ బ్రహ్మాస్త్రం ప్రయోగించాడు. అప్పుడిక తప్పనిసరియై అర్జునుడు పాశుపతం ప్రయోగించి బ్రహ్మాస్త్రాన్ని శాంతిపచేశాడు. అనంతరం అశ్వత్థామ పాండవ వంశం సమూలంగా తుడిచి పెట్టేయాలనే తలంపుతో, ఉత్తరా గర్భస్థ శిశువును చంపే నిమిత్తం బ్రహ్మాస్త్రాన్ని మళ్ళించాడు.

అది తెలిసిన శ్రీ కృష్ణుడు శివుణ్ణి ఆరాధించి శివానుగ్రహంతో ఆ శిశువును కాపాడాడు. అశ్వత్థామ కాశీ మొదలైన క్షేత్రాల పర్యటనకై వెళ్ళిపోయాడు. అశ్వత్థామకు చావులేదు. ఆయన చిరంజీవి ఇది అశ్వత్థామ అవతారం, తదుపరిది పార్థుణ్ణి పాశుపతాస్త్రశరాఢ్యుణ్ణి చేసిన శాంబరీభిల్లుడి అవతారం. దానినే "కిరాతావతార" మంటారు.

# కిరాతార్జునీయము

పాండవులు అరణ్యావాసం చేసే రోజులలో ఒకనాడు వ్యాసుడు వారివద్దకు వెళ్ళాడు, భావికురుక్షేత్ర ప్రయోజనార్థం - దివ్యాస్త్రాల నిమిత్తమై అర్జునుణ్ణి తపస్సు చేయమని ఆదేశించాడు. తపోవిద్య నుపదేశించాడు. మంచిరోజు చూసుకుని, వాసవి తపస్సుకు బయలుదేరాడు.

ఇంద్రకీల పర్వతం చేరి - తపోలగ్నుడయ్యాడు. అనతికాలంలోనే ఉలూచీ ప్రియుడి తపస్సు వుగ్రరూపం దాల్చింది. ప్రసన్ను డయ్యాడు - ఫాలాక్షుడు, కాని, దివ్యాస్త్ర ప్రధానానికి ముందు నరుడి శక్తి సామర్థ్యాలని పరిశీలించదలిచాడు. ఆలీలానిమిత్తమై 'మూకాసురు'డనే రాక్షసుణ్ణి పిలిచి-అర్జునుడి తపస్సుకు విఘ్నం కలిగించమని ప్రేరేపించాడు. మూకుడు పందిరూపం ధరించి అర్జునుడి తపః ప్రాంతమంతా అల్లకల్లోలం చేసి వేయసాగాడు. వాడి ఘోరకృత్యాలకూ, ఘర్ఘరింపులకూ కుతకుతలాడిపోయాడు. కవ్వడి, తక్షణమే ధనుర్బాణాలందుకుని ఆసూకరాన్ని వెంబడించాడు.

ఇటు శివుడు కిరాత వేషాన్ని ధరించాడు. ప్రమథులు బోయగణాలై వెన్నంటి రాగా, పార్వతి చెంచెతయై చెంగటనడువగా, వేదాలు నుడువలేని ఒడయడు- అంగారనేత్రాన్ని సింధూర తిలకంగా మార్చుకుని అర్జునుడి తపోభూమి కరుదెంచాడు.

హరపార్థులిద్దరూ అటుఒకరు, ఇటుఒకరుగా పందిని తరిమారు. ఇద్దరూ ఒకేసారి బాణాలు వేశారు. అర్జునుడు వేసిన అమ్ము పంది ముఖాన గ్రుచ్చుకుని - గుదస్థానం నుంచి వెలువడింది. శివుడు వేసినకోల పృష్ఠభాగంలో దిగబడి -ముఖంగుండా దూసుకుపోయింది. అశనిపాతాలను మించిన ఆ బాణా పాతాలకు అంతటి రాక్షసుడూ అంతరించిపోయాడు. వేట పరిశీలనార్థం విషమాంబక విజయులిద్దరూ పందిని సమీపించారు. బాణాలు తిరిగి తీసుకునే విషయంగా యిద్దరూ తగవుపడ్డారు. ఆ తగవు యుద్ధానికి దారితీసింది. ఆ మాయా కిరాతుడి ప్రతిభాపాటవాలు గమనించి అచ్చెరువందాడు అర్జునుడు. శస్త్రాలతో శాంబరుడిని గెలవడం కష్టమనుకున్నాడు. ఆటవికుల మీద ప్రయోగించరానిదే అయినా జిగిషా

ధర్మాన - పార్థుడు అస్త్రాన్ని సంధించాడు దానికి ప్రతి అస్త్రాన్ని ప్రయోగించాడు భిల్లుడు. దిమ్మ దిరిగిపోయింది దేవేంద్ర సూతికి.

'అటవికుడికి అస్త్ర ప్రయోగమేమి?' అనుకుంటూనే తన బాణాల్ని తీవ్రతరం చేశాడు అర్జునుడు. అదుగైనా జంకలేదు మాయా కిరాతుడు. పనిగట్టుకు మరీ చూడదగిన అస్త్రయుద్ధం చేశారా భక్త-భగవానులు.

అర్జునుడి వద్ద బాణాలు నిండుకున్నాయి - సరాసరి గాండీవమెత్తి శివుడి కొట్టబోయాడు శివమాయవల్ల గాండీవం అదృశ్యమైపోయింది నిరాయుధుడైన నరుడు హరుడితో బాహాబాహీకి దిగాడు. వల్లమాలిన పంతాలతో సాగిన ఆ మల్లయుద్ధాన్ని చూస్తూ అమరలు తాము ఆకాశంలో వున్నారో - ఆశ్చర్యంలో వున్నారో తేల్చుకోలేక పోయారు అంత యుద్ధంలోనూ కూడా - క్షణమైనా శివ స్మరణ వదలలేదా కౌంతేయుడు. ఎంతటి భక్తుడో - అంతటి శక్తియుక్తులు కూడా కల అర్జునుడిని మెచ్చుకున్నాడు అ భవుడు. తక్షణమే తన దివ్యరూపంతో తోచి అర్జున వాంఛితమైన పాశుపతాస్త్రాన్ని అనుగ్రహించాడు.

# ద్వాదశ జ్యోతిర్లింగములు

ఈ అవతారాలే కాకుండా, భక్తశ్రేయాన్నెంచి భగవానుడైన శివుడు ద్వాదశ జ్యోతిర్లింగాలుగా కూడా ప్రకటితుడయ్యాడు. వాటిల్లో మొదటిది సౌరాష్ట్రంలోని సోమనాథ జ్యోతిర్లింగం **2.** శ్రీశైలంలో మల్లికార్జున జ్యోతిర్లింగం, **3.** ఉజ్జయినిలోని మహా కాళేశ్వర లింగం **4.** ఓం కారేశ్వరలింగం, **6.** నామ రూపేశ్వర లింగం, **7.** కాశీ లోని విశ్వేశ్వరుడు, **8.** త్ర్యంబకేశ్వరుడు, **9.** వైద్యనాథుడు, **10.** నాగేశ్వరలింగం **11.** రామేశ్వర లింగం **12.** ఘుశ్మేశ్వర జ్యోతిర్లింగం ఈ ద్వాదశ జ్యోతిర్లింగాల చరిత్రను తెలుసుకున్న వాళ్ళు భాగ్యశాలులు. కనీసం ఈ పన్నెండు లింగాల పేర్లనైనా నిత్యం స్మరించేవారు సద్భావులౌతారు. ఈ పన్నెండు లింగాలతోనూ కలిపి రుద్రుని యొక్క వంద అవతారాల గురించీ వివరించే - 'శతరుద్రసంహిత' పూర్తయింది.

వేదవ్యాస మహర్షి రచించిన శ్రీ శివపురాణము

శత రుద్రసంహిత - సమాప్తము.

★★★

# శ్రీశివ మహాపురాణము

## కోటిరుద్ర సంహిత

**సూతఉవాచ :** ఎక్కడెక్కడైతే భక్తులు భగవంతుణ్ణి ప్రార్ధించారో - అక్కడక్కడల్లా లింగరూపాన అవతరించాడా జంగమయ్య. ముందుగా ఆ ద్వాదశ జ్యోతిర్లింగాలనూ స్తుతించి తత్ఫలం తెలుసుకుందాం.

## ద్వాదశ జ్యోతిర్లింగ స్తోత్రం

ఓం శ్లో॥ సౌరాష్ట్రే సోమనాథం చ - శ్రీశైలే మల్లికార్జునం
ఉజ్జయిన్యాం మహాకాళం - ఓంకారే పరమేశ్వరం 1
కేదారం హిమవతః పృష్ఠే ఢాకిన్యాం భీమశంకరం
వారాణస్యాం చ విశ్వేశం - త్ర్యంబకం గౌతమీ తటే 2
వైద్యనాథం చితా భూమౌ - నాగేశం దారుకావనే
సేతు బంధే చ రామేశం - ఘుశ్మేశం చ శివాలయే

## స్తోత్ర పఠన ఫలం

శ్లో॥ ద్వాదశైతాని నామాని ప్రాతరుత్థాయ యః పఠేత్
సర్వ పాపవినిర్ముక్తః సర్వసిద్ధిం ఫలం లభేత్ ॥ 4
యం యం కామమపేక్ష్యైవ పఠిష్యంతి నరోత్తమాః
ప్రాప్యంతి కామం తంతంహి పరత్రేహ మునీశ్వరా ॥ 5

యే నిష్కామతయా తాని పఠిష్యంతి శుభాశయాః
తేషాం చ జననీ గర్భే - వాసోనైవ భవిష్యతి ॥ 6
ఏ తేషాం పూజనేనైవ వర్ణానాం దుఃఖనాశనం
ఇహలోకే పరత్రాపి ముక్తిర్భవతి నిశ్చితం ॥ 7

ప్రొద్దుట నిద్రలేవగానే - ఉపర్యుక్త ద్వాదశ జ్యోతిర్లింగాల పేర్లనుగాని, లేదా, పై శ్లోకాలని గాని భక్తితో చదివేవారు పాపాల నుండి విముక్తులై - కృతార్థులౌతారు. ఎవరెవరు యేయే కోరికలతో పఠిస్తారో - వారు వారు ఆయా కోరికలు తప్పక సిద్ధింప చేసుకుంటారు. ఏ కోరికలూ లేకుండా కేవలం శుద్ధ భక్తితోనే స్మరించేవారు - పునర్జన్మ లేని పదం పొందుతారు. స్మరణమేగాకుండా - ఆయా జ్యోతిర్లింగాలను దర్శించి, అర్చించినవారు ఈలోకంలో పరువూ - ప్రతిష్ఠ, పాడి - పంటా, పైడీ - వెండీ కలిగి ప్రఖ్యాతులై సుఖించి పరంలో శివలోకం చేరుకుంటారు.

# జ్యోతిర్లింగములకు ఉపలింగములు



ఈ పన్నెండు జ్యోతిర్లింగాలకు పన్నెండు ఉపలింగాలున్నాయి.

1. సోమనాథుడికి ఉపలింగం అంతకేశుడు. 'మహీ' నదీ సముద్రసంగమం చెందే చోట వుంది అది. 2. శ్రీశైల మల్లికార్జున జ్యోతిర్లింగానికి ఉపలింగం 'భృగుకక్ష'లోని రుద్రేశ్వరలింగం 3. మహాకాలేశ్వరుని ఉపలింగం నర్మదా తీరంలో దుగ్ధేశ్వరలింగం, 5.కేదారేశ్వరునికి - యమునా తీరాన భూతేశ్వరం, 6. భీమ శంకరుడికి సహ్యాగిరిమీద భీమేశ్వరలింగం, 7. మల్లికా సరస్వతీనదుల సంగమం వద్ద నున్న మరో 'భూతేశ్వర' లింగం నాగేశ్వరలింగానికి ఉపలింగం. 8. రామేశ్వరుడి ఉపలింగం గుప్తేశ్వరుడు. 9. ఘుశ్మేశ్వరుడి ఉపలింగం వ్యాఘ్రేశ్వరుడు. ఈ ఉపలింగాల్ని దర్శించే వారి ఉపకర్మలన్నీ ఊడ్చుకుపోతాయి. ఇక్కడికి ప్రధాన, ఉప-లింగాలు వెరసి ఇరవై నాలుగు చెప్పాను. మరికొన్ని ప్రసిద్ధ లింగాలు వినండి.

# ప్రాగుదీచీ లింగములు

కాశీక్షేత్రం దానికదే ఒక మహాలింగంగా గౌరవించబడుతోంది. ఆ వారణాశిలో - ఆ విముక్త, కృత్తివాస, వృద్ధబాల, తిలభాండ, దశాశ్వమేధేశ్వరాది శివ లింగాలు అనేకం వున్నాయి. గంగాసాగర సంగమం వద్ద భూతేశ్వర, సంగమేశ్వర లింగాలు - కౌశికీతీరానా గండకీతీరానా అర్ధనారీశ్వర వటుకేశ్వర లింగాలు. ఫల్గుణ నదీ తీరాన పూర్ణేశ్వర, సిద్ధినాథేశ్వరులూ ప్రసిద్ధులు.

ఉత్తర నగరంలో దూరేశ్వర, శృంగేశ్వర, వైద్యనాథులు ప్రముఖులు. దధీచి మహర్షిదగుయుద్ధ ప్రాంతాన జపేశ్వర, గోపేశ్వర, రంకేశ్వర, వామేశ్వర, నాగేశ్వర, కామేశ్వర, విమలేశ్వర, వ్యాసేశ్వర, సుకేశేశ్వర, భాండేశ్వర, హుంకారేశ్వర, సులోచనేశ్వర, భూతేశ్వర, సంగమేశ్వర లింగాలు తెలుసుకోతగ్గవీ, దర్శించుకో దగ్గవీ, అర్చిందగ్గవీ అయివున్నాయి.

ఇక తప్తకాతటిని కుమారేశ్వర, సిద్దేశ్వర, సేనేశ్వర, కుంభేశ, నందీశ పుంజేశ లింగాలు ముఖ్యమైనవి. పూర్ణాసమీపంలో గల పూర్ణకేశ్వర లింగం, ప్రయాగలోని కాశీదశాశ్వమేధ ఘట్టంలో బ్రహ్మచే స్థాపించబడిన బ్రహ్మేశ్వర, భారద్వాజేశ్వర సోమేశ్వర, శూలటంకేశ్వర, మాధవేశ లింగాలు ప్రతిష్ఠాత్మకమైనవి. సాకేతనగరం లోని నాగేశుడు పురుషోత్తమ నగరాన గల భువనేశ లోకేశ, కామేశ, గంగేశ, శక్రేశ, శుక్రసిద్ధేశ, వటేశ్వర లింగాలు సుప్రసిద్ధాలు, సింధునదితీరాన వెలసిన - కపాలేశ, వక్త్రేశ, ధౌతపాపేశ్వర, పరమేశ్వర, భీమేశ్వర సూర్యేశ్వర నందేశ్వర, నాకేశ్వర, రామేశ్వర, విమలేశ్వర, కంటకేశ్వర లింగాలు అత్యంత ప్రసిద్ధాలు. పూర్ణసాగర సంగమం చెంత చెలువారే ధర్మేశ్వర, చంద్రేశ్వర, సిద్ధేశ్వర, బిల్వేశ్వర, అంధకేశ్వర, శరణేశ్వర, కర్దమేశ లింగాలు చూసి తీరదగినవి అర్బుదాచలంలో కోటీశ అచలేశుని అర్చిం తీరాల్సిందే కౌశికా తీరస్థనాగేశ అనంతేశ్వర, యోగీశ్వర, వైద్యనాథేశ్వర, కోటీశ్వర, సప్తేశ్వర, భద్రేశ్వర చండీశ్వర, సంగమేశ్వర లింగాలు భుక్తి, ముక్తి ప్రదాలుగా అలరారుతున్నాయి. ఇవన్నీ ఉత్తర దిక్కున - తూర్పు దిక్కున గల శివ లింగాలు. ఇక దక్షిణ దిశగా చూద్దాం.

# దక్షిణాది లింగాలు

చిత్రకూట పర్వతాన బ్రహ్మపురిలో బ్రహ్మదేవుడు 'మత్త గజేంద్రేశ్వరుడు' అనే శివలింగాన్ని స్థాపించాడు. దీనికి తూర్పు దిక్కున కోటీశుడనే లింగం వుంది.

గోదావరికి పడమటి తీరాన "పశుపతినాయకుడు" అనే లింగం ఒకటుంది. అలాగే దక్షిణాన అత్రీశ్వరలింగం వుంది. ఇది మహా సాధ్వి అనసూయను తృప్తి పరచేందుకు వెలసిన లింగమని చెప్పబడుతోంది.

## అత్రి - అనసూయల కథ

బ్రహ్మ మానస పుత్రుడు అత్రి. ఆయన కళత్రం అనసూయాదేవి "కామదం" అనే వనంలో ఆ దంపతులు తపస్సు నాచరిస్తుండంగా సర్వ ప్రజాసంతాపకరమైన శతవర్ష క్షామం దాపురించింది. ఆ కారణంగా భూలోకంలో అన్నపానాదులు దాదాపు నిండుకున్నాయనే చెప్పాలి. వడగాలులు తప్ప - తడితలపైనాలేని కాలమిది. కరువుదీర యేడ్వబోయిన కూడా - కన్నీళ్ళుబదులు అవిరులొస్తున్న రోజులవి. అయినాసరే అత్రి ప్రాణాయామ పరాయణుడై ధ్యానంలోనే వుండిపోయాడు.

గురుడు ధ్యానగతుడవడంవల్లనూ, తమకు తగిన ఆహారాదిక సదుపాయం లభించకపోవడంవల్లనూ, శిష్యకోటి అంతా వలసలు వెళ్ళిపోయారు. అనసూయ మాత్రం ఒంటరిగా నిలబడింది. అణుమాత్రమైనా జంకకుండా పార్థివ లింగార్చన మొదలు పెట్టింది. క్షామ కారణంగా శివారాధనకు తగిన వస్తువులు లేకపోవడం వలన మానసిక పూజనే చేయసాగింది, చీటికీ-మాటికీ 'శివా శివా' అనుకుంటోంది. ప్రదక్షిణలు చేస్తోంది. పూజగా ప్రారంభమైన ఆ జగత్కళ్యాణకరమైన తలంపు, తపస్సుగా పరిణమించింది. తపోజ్వాలలు ఆకాశానికి, కీర్తికాంతులు నాలుగు దిక్కులకూ ప్రాకసాగాయి. ఆలుమగలిద్దరూ శివ ధ్యానంతో మునిగిపోయారు.

అనసూయమ్మ పాతివ్రత్యాన్ని తలచుకొని తలచుకొని మురిసిపోయింది మహారసన (గంగ). ఆమె కేదో ఒక వుపకారం చేస్తేనే గాని అక్కణ్ణుంచి వెళ్ళ కూడదను కున్నదామె. అత్రి తపస్సుకు ఆనందించిన గంగాపతి - అనసూయమ్మ గారు చేసిన పార్థివమూర్తినిచేరి స్థాణువులా వుండిపోయాడు. అప్పటికి యాభై నాలుగు సంవత్సరాలుగా కరవుతాండవిస్తూనే వున్నది.

ఉన్నట్టుండి అత్రి మహర్షిధ్యానంనించి తేరుకుని "నీళ్ళుకావాల" న్నాడు. ఎక్కడున్నాయి నీళ్ళు? ఎక్కడాలేవు మహాపతివ్రత ఆ అనసూయమ్మ, తక్షణమే కమండులువు చేదాల్చి జలాన్వేషిణియై బయలుదేరింది. కొంతదూరం వెళ్ళేక గంగాదేవి తారసపడింది. తనను గూర్చి చెప్పింది. అనసూయ ఆమెను గౌర

వించింది. జలాన్ని అర్థించింది గుంట త్రవ్వమన్నది గంగ, త్రవ్వింది అనసూయ, గంగ ఆ గుంట నిండా జలాన్ని ఏర్పరచింది. తాను భర్తతో వచ్చి - చెప్పే వరకూ గంగను ఆ గుంటలోనే వుండమని ప్రార్థించి, కమండలువుతో నీరుముంచుకుని భర్తను చేరి దాహం తీర్చి, ఆయనను తనవెంట ఆ గుంటవద్దకు తెచ్చింది అనసూయ. గంగాదేవిని ప్రార్థించి సతీసమేతంగా సరి గంగ స్నానం చేశాడు అత్రి.

అదే సమయంలో ఐదు ముఖాలతోనూ, పది చేతులతోనూ అందం అనే దాన్ని ఆకట్టుకోగల యేకైక పురుష సౌందర్యంతో ప్రత్యక్షమయ్యాడు శివుడు. వారాయనను స్తుతించి, అమ్మగారితోబాటు అక్కడే కొలువై వుండమని కోరారు.

అప్పుడు గంగ "నే నిక్కడ వుండాలంటే నీ పుణ్యంలో ఒక సంవత్సరకాలపు పాతివ్రత్య పుణ్యాన్నీ, అంతే సమయపు శివారాధనా ఫలాన్ని నాకు ధారపోయాల్సి వుంటుంది" అన్నది. అలాగే చేసింది అనసూయ.

గంగ అక్కడ నెలవైంది. శివుడక్కడ - అత్రి మహర్షి పేరువ అత్రీశ్వరుడుగా లింగరూపాన వెలిశాడు. అదిగో, అలా అత్రి అనసూయల పుణ్యమా అంటూ ఆవిర్భవించిన గంగోదకం, ప్రాదుర్భావించిన అత్రీశ్వర లింగాల మహిమ వలన - ఆ ప్రాంతపువారూ, భూలోకవాసులూ దీర్ఘాయువులై జీవించారు.

## నందీశ్వరాది ఇతర లింగములు



ఆ తరువాత చెప్పుకోదగినది నందికేశ్వర లింగం ఇక కాలంజరమనే కొండ మీద నీలకంఠుడే శివలింగమూ. అదే పేరుగల తీర్థమూ కూడా వుండేవి. అసలు నర్మదా తీరానగల శివలింగాలకు అంతూ పొంతూ లేదు. భక్తదురితాప హారాలయిన ఆర్తేశ్వర, పరమేశ్వర, సింహేశ్వర, శర్మేశ్వర, కుమారేశ్వర, పుండరీకేశ్వర, మండపేశ్వర, తీక్ష్ణేశ్వర, మంగళేశ్వర లింగాలూ -ఆంజనేయస్వామిచే స్వయంగా ప్రతిష్ఠించబడిన 'మహాకపిలేశ్వర లింగం'- ఇవన్నీ నర్మదానదీ తీరానే అలరారుతున్నాయి.

ఒకానొకప్పుడు సువాదుడనే బ్రాహ్మణుడు తన తల్లి అస్థికలను కాశీగంగలో కలిపే నిమిత్తంగా స్వగ్రామం నుంచి పదహారుమైళ్లు ప్రయాణించి అక్కడున్న 'వింశతి' అనే గ్రామంలో ఒక బ్రాహ్మణుడింట తొలిమజిలి చేశాడు. ఆ రాత్రి తొలిజాము తుదిలో ఒక విచిత్రం జరిగింది.

ఆ యింట్లో - ఆ రోజు పాలు పితకడం ఆలస్యం అయింది. చేపుకోసం దూడను. ఆవువద్దకు తెస్తుండగా- సమయాతిక్రమణం కారణముగా ఆకలితో నున్న దూడ తన తొందరలో ఆ గృహస్థు కాలు తొక్కింది. అందుకాగ్రహించిన విప్రుడు, దుడ్డుకర్ర తీసుకుని దూడను బలంగా బాదివేశాడు. అయినా కోపం తీరక, తాను పాలు పితుకుకున్నాక కూడా దూడను తల్లి దగ్గరకి చేరనీయలేదు. కాస్సేపటికి ఊరంతా మాటు మణిగింది. దూడమాత్రం యేడుస్తూనే వుంది. ఆవు తన లేగని ఓదార్చింది. తనకు కలిగిన కష్టమే ఆ బ్రాహ్మణుడికి కూడా కలిగిస్తానంది. తద్వారా బ్రహ్మహత్యాదోషమే సంభవించినా సరే అది పోగొట్టుకొనే మార్గం కూడా తనకు తెలుసునని చెప్పింది ఇదంతా విన్న సువాదుడు 'మర్నాడు యేం జరుగుతుందో" నని ఉత్కంఠతో ప్రయాణం అవుతున్నాడు.

మర్నాడుదయం ఇంటియజమాని పనిమీద బైటకు వెడుతూ వెడుతూ పాలు పితికే బాధ్యత కొడుక్కి అప్పగించాడు. ఆ విప్రబాలుడావును సమీపించగానే అదా కుర్రవాణ్ణి ఒక్క కుమ్ముకుమ్మింది. అతడు కన్నుమూశాడు. అంతా హాహాకారాలు చేశారు. ఈ కబురంది ఇంటికి చేరిన బ్రాహ్మణుడా ఆవుని చితక గొట్టేశాడు. బ్రహ్మహత్యాదోషం వల్లనో, బ్రాహ్మణుడు కొట్టిన దెబ్బల వలనో గాని - దాని వళ్ళంతా నల్లగా మారిపోయింది. కట్లు విప్పేసి బైటకు తోలేసారు దానిని. సువాదుడు మాత్రం ఆ ఆవును అనుసరించాడు. అది వడివడిగా వెళ్ళి నర్మదా నదిని చేరింది.

అక్కడ నందీశ్వరలింగం వున్న ప్రాంతంలోని రేవులో దిగి మూడు సార్లు మునిగి పైకివచ్చేసరికి కముకుదెబ్బలూ లేవు, కారునలుపురంగూలేదు. ఎప్పటిలా మీగడ రంగులో మిలమిల్లాడిపోసాగింది. అది చూసి ఆశ్చర్యపడిన సువాదుడు, నర్మదను అర్చించి - కాశీకి బయల్దేరగా గంగ స్త్రీ రూపంలో కనిపించి - 'ఆ ఆవు జలకమాడిన చోటనే నీ తల్లి అస్థికలను కలుపు. అలా చేస్తే - ఆమె దివ్య రూపధారియై శివ సాన్నిధ్యం చేరుకుంటుంది. ఈ రోజు వైశాఖ శుద్ధ సప్తమి నేడు గంగ యీ నర్మదలోనే నివసిస్తుంది" అని చెప్పి అదృశ్యురాలైంది.

ఆమె చెప్పినట్లే సువాదుడు తల్లి అస్థికల నా రేవులో నిమజ్జనం చేయగా, అతని తల్లి దివ్యవేషంతో కనిపించి 'నాయనా! నన్ను ముక్తురాల్ని చేశావు గనక, నువ్వు ధన ధాన్య సమృద్ధితో దీర్ఘాయుష్మంతుడవై వర్ధిల్లుతావు, వంశ విస్తరణ కర్తవవుతావు అని ఆశీర్వదించి పరాన్ని చేరింది.

# శివుడు ఋషికను కరుణించుట

"వైశాఖశుద్ధ సప్తమినాడు గంగ నర్మదలో యెందుకు చేరుకుంది?" అని అడిగారు ఋషులు. చెప్పసాగాడు సూతుడు -

పూర్వ ఋషిక అనే బ్రాహ్మణుల అమ్మాయి. విధివశాత్తు బాల్యమందే వితంతు వయింది. ఐహిక వాంఛలు అణచి, ఈశ్వరుడి పై ధ్యాస నిల్పి, నర్మదా తీరంలో నిత్యం పార్థివ లింగారాధన చేసింది. ఒకనాడు 'మూఢు'డనే రాక్షసుడామెను చూసి, వలచి, సంభోగాని కాహ్వానించాడు. ఆమె పట్టించుకోలేదు. వాడు జడిపించడం మొదలుపెట్టాడు. ఋషిక శివుణ్ణే శరణు వేడింది. తత్క్షణమే ప్రత్యక్షమై, ఆ మూఢుడి తల తరగేశాడు శివుడు.

ఋషిక ఆయన నెన్నోవిధాల ప్రార్థించింది. ఆ నర్మదా తీరంలోనే శాశ్వతంగా వెలసివుండమని కోరింది. అదే అదనుగా గంగ వచ్చింది అక్కడికి. ఆరోజు వైశాఖశుద్ధ సప్తమి గనుక - స్వామి అవతరించిన ఆరోజు తాను స్వయంగా నర్మదను ఆవేశిస్తానని పలికింది. అంగీకరించారు భక్తులూ, భగవంతుడూ కూడా. ఋషిక చేసిన పార్థివలింగాన్ని ఆశ్రయించాడు శివుడు. బ్రహ్మాదులంతావచ్చి ఆ లింగానికి 'నందీశ్వర లింగ' మని పేరు పెట్టారు. నాటినుంచీ వైశాఖశుద్ధ సప్తమికి గంగ నర్మదలో వుంటోంది.

# పశ్చిమ దిశా శివ లింగములు

ఇక పశ్చిమాన చూస్తే - కపిలా నగరంలో వున్న కాలేశ్వర, రామేశ్వర లింగాలు రెండూ కూడా అతి పవిత్రమైనవి. దర్శన మాత్రంచేతనే పాపాలని పోగొడతాయవి. పశ్చిమ సముద్రతీరానగరల మహా సిద్దేశ్వర లింగం ధర్మార్ధ కామ మోక్షాలను ప్రసాదిస్తుంది. సర్వాభీష్ట ఫలప్రదమూ, బ్రహ్మ హత్యాది భయంకర పాపాగ్ని నివారకమూ అయిన గోకర్ణక్షేత్రం ఈ పశ్చిమ దిక్కునే పరిఢవిల్లుతోంది.

ఇక్కడ ప్రధాన లింగం మహాబలేశ్వరుడు, కృతయుగంలో నల్లగాను, త్రేతలో ఎర్రగాను, ద్వాపరంలో పసుపు పచ్చగాను, కలియుగంలో నల్లగానూ వుండే యీ మహాబలేశ్వర లింగాన్ని పూజించిన వారు - అన్ని పాపాలనూ అవనిమీదే వదిలి కైవల్యం పొంది తీరుతారు.

## మహాబలేశ్వర లింగావిర్భావము

వెనకటి కొకసారి శివుడు రావణా సురుడి కొక లింగాన్ని అనుగ్రహించి - లంకకు చేరే వరకు దానిని యెక్కడా వుంచవద్దని మరీ చెప్పాడు సరేనన్న రావణుడు ఆ లింగాన్ని దోసిటబట్టి లంకాభిముఖుడయ్యాడు.



అసలే రాక్షసుడూ, అమిత బలుడూ, అమరద్వేషి అయిన రావణుడు - ఆ లింగాన్ని లంకలో ప్రతిష్ఠిస్తే లోకాలకి మరెంత ముప్పు వాటిల్లతుందో - నని భయపడ్డారు దేవతలు. సర్వాపన్నివారకుడైన విఘ్నేశ్వరుణ్ణే ప్రార్థించారు.

రావణాసురుడు ప్రయాణించే మార్గ మధ్యంలో పశువులు కాసుకునే కుర్రవాని వేషంలో సంచరించసాగడు గణపతి. అక్కడిదాకా వచ్చిన రావణుడికి - 'లఘుశంక' ఏర్పడింది. దూరంగా కనిపిస్తున్న పశువుల కాపరిని పిలిచి, కాస్సేపులింగాన్ని పట్టుకోమని చెప్పి, తాను శంక దీర్చుకోవాటానికి వెళ్ళాడు. అందుకోసమే ఎదురు చూస్తున్న పశువుల కాపరి వేషధారియైన విఘ్నేశ్వరుడు ఆ శివ లింగాన్ని అక్కడే శయనించి వున్న ఆవు చెవిలో పెట్టి, తన దారిన తను చక్కబోయాడు.

శుద్ధుడైన రావణుడు జరిగిందానికి క్రుద్ధుడైపోయాడు. కానీ ఏం చెయ్య గలడు? వింశతి బాహుప్రయత్న పూర్వకంగా గోకర్ణం నుండి ఆ లింగాన్ని తీయాలనుకున్నాడు. అతనివల్ల కాలేదు.

రావణుడు బలవంతుడయితే - శివుడు మహాబలుడుగదా! చివరికది అక్కడే స్థిరపడిపోయింది. మహా బలిష్టమైన ఆ లింగం మహా బలేశ్వరుడిగా కీర్తించబడింది. శివప్రీత్యర్థమై వసువులు, ఆదిత్యులు, ఋషులు, ఇతరదేవతలూ, బ్రహ్మేంద్రా దులు సహితంగా తమతమ అంశలతో అక్కడే తూర్పున నివసించ సాగారు.

దక్షిణ ద్వారంలో యమధర్మరాజు, మృత్యుదేవత చిత్రగుప్తుడు, అగ్ని పితృ దేవతలు, ఏకాదశ రుద్రులూ - పశ్చిమ ద్వారాన వరుణుడు, సముద్రుడు, గంగా మొదలైనవాళ్ళూ - ఉత్తరాన వాయువూ, కుబేరుడూ, భద్రకాళీ - చండికాదులూ శివార్చన చేస్తుంటారు. మాతృ దేవతలు కూడా అక్కడే వుంటారు.

ఎంత పాపాత్ములైనా సరే మాఘబహుళ చతుర్దశి (మహా శివరాత్రి) నాడు యీ గోకర్ణక్షేత్రంలోని మహా బలేశ్వరుణ్ణి పూజించినట్లయితే వాళ్ళు అనాయాసంగా శివ సాయుజ్యం పొందుతారు. ఈ గోర్ణక్షేత్రమే కాలాంతరాన 'భూకైలాసం' అనే పేర అభివృద్ధి చెందినది.

## చండాల స్త్రీకి ముక్తినిచ్చిన భూకైలాసం



కారునలుపు మేనిచాయతో, పుట్టు గ్రుడ్డిగా ఛండాల స్త్రీగర్భవాసాన జన్మించింది సౌదామిని. తల్లిదండ్రులు చిన్ననాడే పోయారు. వయసు వచ్చేసరికి కుష్ఠువ్యాధి క్రమ్మివేసింది. పాపాను భవమే తప్ప, జీవితం తాలూకు భోగానుభవం లేకుండానే వృద్ధురాలైపోయింది. అలా వుండగా శివరాత్రి వచ్చింది. భక్తులంతా గోకర్ణానికి బయలు దేరారు సౌదామిని వారితో కలసి బయలుదేరింది.

దారిపొడుగునా యాత్రికుల్ని అడుక్కోసాగింది. ఒకానొక గడుసుదాతగారు ఆమె చేతిలో గుత్తిగా వున్న బిల్వ పత్రాలు పడవేశాడు. అదేదో తినే వస్తువేమోనని కొంత ప్రయత్నించింది సౌదామిని. కాని తినవీలు కాదని తెలిసి దుఃఖంతో దూరంగా విసిరేసింది. ఆ బిల్వగుచ్ఛం సరాసరి వెళ్ళి ఓ శివ లింగంమీద పడింది. ఆకలి తీరని సౌదామిని అడుక్కుంటూనే ఆ రాత్రంతా జాగరణ చేసింది. శివరాత్రి నాడు వస్తూ చేసిన జాగరణా, విసిరిన బిల్వగుచ్ఛం శివ లింగాన్ని అలం కరించడం జరిగాక - ఆమె తిరిగివస్తు నిస్సత్తువు వల్ల మార్గం మధ్యలోనే మరణించింది. శివ దూతలామెను కైలాసం తీసుకువెళ్ళారు.

# మిత్ర సహుని చరిత్రము

ఇంకో కథ కూడా వినండి వెనుకటికి, సూర్యవంశంలో మిత్రసహుడనే రాజు వుండేవాడు. వశిష్ఠ శాపంవల్ల రాక్షసుడుగా మారిన ఆ రాజు ఆకలి కోర్వలేక ఒక బ్రాహ్మణుని చంపుకు తినేశాడు. కాలాంతరాన - శాపవిముక్తుడై రాజుగా మారేడే గాని, బ్రహ్మ హత్యాపాతకం మాత్రం అతన్ని వదల్లేదు. అతడు గౌతమ మునిని ఆశ్రయించాడు. "యీ బ్రహ్మ హత్యాపాతకంనుంచి విముక్తి కలిగించండి" అని పదే పదే వేడుకున్నాడు. గౌతముడు బాగా ఆలోచించి - "సర్వ పాపహరుడైన ఆ శంకరుడు గోకర్ణ క్షేత్రంలో మహా బలేశ్వరుడనే పేర అవతరించి వున్నాడు.

నువ్వా క్షేత్రంచేరి అక్కడి తీర్థాలలో స్నాతుడవై ఆ స్వామిని అర్చించు" అని చెప్పాడు. మిత్ర సహుడాక్షేత్రానికి వెళ్ళి మహాబలేశ్వరుడిని అర్చించాడు. తక్షణమే అతని బ్రహ్మ హత్యాపాతకంతోబాటు ఇతర పాపాలన్నీ కూడా నశించిపోయాయి.

# చంద్ర ఫాలేశ్వరాది లింగములు

ఇక గోకర్ణక్షేత్రంలోని మహావనంలో రావణాసురుడు ఒక లింగాన్ని ప్రతిష్ఠించాడు. దానిపేరే చంద్రఫాలేశ్వర లింగం, అదేవిధంగా 'మిత్రర్షివర' మనే తీర్థంలో దధీచి మహామునిచే ప్రతిష్ఠించబడిన శివ లింగం దధీచీశ్వర లింగం - ఇక్కడికి వెళ్ళినభక్తులు శివ లింగంతోబాటే - అక్కడవున్న దధీచిముని విగ్రహాన్ని కూడా పూజించాలి. నైమిశారణ్యంలో ఋషులచే/ప్రతిష్ఠితమైన ఋషీశ్వర లింగం ఎటువంటి పాపాలనైనసరే నాశనం చేస్తుంది. హత్యాదోషహరణ తీర్థంలో గల శివలింగారాధన వల్ల-కోట్లాది హత్యాదోషాలు తొలగిపోతాయి.

దేవ ప్రయాగలోనిలలితేశ్వరలింగం భక్తుల పాలిట శుభ భాండారం. నయపాల (నేపాల)లోని పశుపతీశ్వర లింగం, దాని చేరువనే వున్న ముక్తి నాథేశ్వర లింగం -ఈ రెండింటి సేవా పరమానందదాయకమూ, పరమార్థ ప్రదమూ అయి అలరారుతోంది.ఇలా చెప్పాలంటే యెంతైనా చెప్పవచ్చు, నింగిలోని తారకలనీ, భూమి మీద గల యిసుక కణాలనీ లెక్కగట్టడం యెంత కష్టమో, శివలింగాలన్నింటినీ గణించడం వాటి గుణ గణ చరిత్రాదుల్ని చెప్పగలగడం -అంతకు రెట్టింపు కష్టం - అంటూ ఆగాడు సూతుడు.

# లింగస్వరూప వివరణం

"సూతా! శివలింగంలో - పిండం శివుడనీ పానపట్టం శక్తి అనీ అంటారు గదా! ఆ స్వరూపాల్ని వివరించు" అని శౌనకుడు కోరడముతో సూతుడిలా తెలియ జేశాడు. "దారువనంలో తన భక్తులైన ఋషుల్ని పరీక్షించే నిమిత్తమై శివుడొకనాడు బూడిద మాత్రం పూసుకున్న దిగంబరుడిలా ఆ వనానికి వెళ్ళాడు.

ఆ సమయానికి మునులంతా సమిత్కుశాదులకోసం వెళ్ళారు. ఆశ్రమంలో వున్న మునుల భార్యలు క్రొత్తగా వచ్చిన నగ్న సుందరుణ్ణి చూసి వికారం పొందారు. ఆయనను ఆలింగనము చేసుకున్నారు. చుంబించారు. ఒకరినొకరు నెట్టివేస్తూ ఆయన స్పర్శకోసం తహతహ లాడిపోయారు.

ఇంతలోనే వచ్చిన మునులు తమ భార్యలచేత అనుభవించబడుతున్న ఆ దిగంబరుణ్ణి చూసి, శివ జ్ఞానశూన్యులై కోపించారు. "ఏ పురుష సంజ్ఞను బైటవేసుకు తిరుగుతూ స్త్రీలకు భ్రాంతి కలిగించావో, ఆ నీ పురుష సంజ్ఞ రాలిపోనూ" అని శపించారు.

తక్కున రాలిపడింది లింగం. శివుడు అంతర్ధానమై పోయాడు. రాలిపడ్డ ఆ లింగాన్ని నిలవరించలేకపోయింది భూమి, అభ్యుదయమే లక్ష్యంగా గల ఆ లింగం ముల్లోకాలు నిండిపోసాగింది. దానియొక్క ఉష్ణోగ్రత-ప్రాణకోటిని అస్తిమితం చేసింది.

ఋషులంతా కంగారుపడిపోయారు. బ్రహ్మను ప్రార్థించారు. ఆయన కరుణించారు. శివస్మరణ యుక్తంగా పార్వతిని పార్వతిని ఆరాధించుమన్నాడు. మునులలా చేయగానే ముక్కంటీ ఆయనగారి ముద్దరాలూ కూడా అనుగ్రహించారు.

పార్వతి పానపట్టంగా మారి ఆ లింగాన్ని ధరించింది. అంతతో శాంతించి, అగ్నిలింగం జ్యోతిర్లింగమై, దారువనంలోనే స్థాపించబడింది. ఇప్పటికీ అక్కడే వుంది. విప్రశాపహతమై నేలబడిన లింగం గనుక దానికి హాటకేశ్వర లింగం అని పేరు వచ్చింది శివభక్తులు పిండపానవట్టములుగా యేర్పడిన ఈ లింగం అత్యంత మహిమాయుతమై అలరారుతుంది.

# వటుకోత్పత్తి - మహిమ

దదీచికి సుదర్శనుడనే కొడుకున్నాడు. అతని భార్యదుకూల తన శరీర సుఖమే సమస్తమూ ననుకునేపిల్ల. ఆమె ఒకనాడు దధీచి గ్రామాంతరం వెళుతూ శివార్చన విధులన్నీ కొడుకుకు వప్పగించాడు. అంతలోనే శివరాత్రి వచ్చింది. సుదర్శనుడు ఉపవసించాడు. అన్ని కార్యాలూ దీక్షగా నెరవేర్చాడు. కానీ, రాత్రి అర్చనకు ముందు కామవేధితయైన భార్యచేత పీడింపబడి - తప్పని పరిస్థితిలో రతిసలిపాడు. అంతలోనే శివారాధనావేళ మించిపోవడంతో - స్నానమైన చేయకండా, బట్టలైనా మార్చకండా అలాగే శివార్చన చేశాడు. రుద్రుడాగ్రహించి జడుడిని కమ్మని శపించాడు. సుదర్శనుడలాగే వుండిపోయాడు.

మరలి వచ్చిన దధీచి జరిగినదానికి చింతించి, కొడుకుచేత చండిక నారాధింప చేశాడు. ఆయమ్మ ప్రత్యక్షమైంది. సుదర్శనుడిని కైలాసం తీసుకుని వెళ్ళి నచ్చచెప్పింది. 'ఇతనిని నా పుత్రవత్తుగా భావిస్తున్నాను. కాబట్టి మీకు కుమారుడే అవుతాడు" అంటూ శివదక్షిణాంకాన్ని అధిరోహింప చేసింది పార్వతి మాటలకు ప్రసన్నుడైన శివుడు సుదర్శనుణ్ణి అనుగ్రహించాడు.

"సుదర్శనా! మాకై నివేదింపబడిన సమస్తాన్నీ నీవు అనుభవించేలా అనుగ్రహిస్తున్నాను నిత్యం స్నానంచేసి, నుదుట వర్తులా కారంగా తిలకం ధరించి - శివ సంధ్య వార్చి, శివ గాయత్రి జపించి ముందుగా నన్ను అర్చించి తరువాతనే కులాచారాలను పాటించు" అన్నాడు. సుదర్శనుడి నలుగురి కొడుకులనూ నాలుగు దిక్కులా అభిషేకించాడు ఇకనుంచి వటువులుగా స్థిరులై వుండండి. మిమ్ములను పూజించిన పిమ్మట మమ్ములను పూజిస్తేసంతసిస్తా" నని వరంయిచ్చాడు.

# వటు భోజన మహిమ

వటువుల మహిమ అంతా ఇంతా అని చెప్పనలవిగాననిది. భద్రుడనె రాజు వుండేవాడు/శివుడతని యందనుగ్రహించి, అతనికొక జెండాను యిచ్చాడు "రాజా! ఇది పగలు వృద్ధిచెంది, రాత్రి పతనమై పోతుంటుంది. బ్రాహ్మణ భోజనము కాకపోతే మాత్రం రేయింబవళ్ళు నిలబడే వుంటుం'దని చెప్పాడు ఆయన చెప్పినట్లే ఆ ధ్వజం రోజూ పగలు వృద్ధిచెంది, రాత్రి పతననమై పోతుంది. ఒకనాడు

బ్రాహ్మణ భోజనం కాకుండానే ఆ ధ్వజం పతనమైపోయింది. అబ్బురపడ్డ రాజు పండితులను పిలిచి కీడు మేళ్ళు తెలియజేయమన్నాడు. వాళ్ళు పరిశీలించి, మహారాజ! బ్రాహ్మణ భోజనం కాని మాట నిజమేగాని, అంతముందుగా చండీ పుత్రులైన వటువుల భోజనాలు ముగిసాయి.

ఆ మాహాత్మ్యం వల్లనే ధ్వజ పతనం సంభవించింది. నీ వ్రతం పరిపూర్ణ మైంది. పార్వతీ పరమేశ్వరులు సంతుష్టి చెందారు" అని చెప్పారు. వటుభోజనం అంత ఫలప్రదమైనది ఈ వ్రతంలో బ్రహ్మచారులకే అధికారం వుంటుం'దని శివ శాసనం వటుభోజనంతోనే శివ పూజనం పరిసమాప్తమవుతుంది అంటూ సూతుడింకా యిలా చెప్పసాగాడు.

# సోమనాథ జ్యోతిర్లింగ చరిత్ర



దక్షసంతతిలోని అశ్విని మొదలు రేవతి వరకూ గల ఇరవేయ్యే డుగురు కన్యలనూ చంద్రుడికిచ్చి పెళ్ళిచేశారు. వారిలో రోహిణి ఒక్కతే యందే అధిక మైన వాంఛాయుతుడైన చంద్రుడు-తక్కిన 26 గురినీ నిర్లక్షంగా చూసే వాడు. వాళ్ళంతా కలసి తండ్రియైన దక్షుడికి తమ కష్టాలు చెప్పుకున్నారు.

దక్షుడు ఒకటికి రెండుసార్లు చంద్రుణ్ణి మందలించి చూశాడు. కాని, చంద్రు డేమీ మారలేదు. ఎప్పట్లాగానే 26 గురు భార్యల యవ్వనాన్నీ మరగబెడుతూ - తాను ఒక్క రోహిణితో మాత్రమే సుఖపడుతున్నాడు. కడుపు తరుక్కుపోయింది దక్షుడికి - "క్షయరోగివైపో"మ్మని శపించాడు అల్లుడిని. తక్షణమే అంటుకుంది ఆ జబ్బు. దాంతో చంద్రకాంతి తరిగిపోనారంభించింది. దీనాతి దీనుడైన చంద్రుడు బ్రహ్మను ఆశ్రయించాడు. "ప్రభాస క్షేత్రంలో పార్థివ లింగారాధన చెయ్యి"- అంటూ అతనికి మహా మృత్యుంజయ మంత్రాన్నుపదేశించాడు బ్రహ్మ.

ఆయన చెప్పినట్లే తపించాడు చంద్రుడు. మృత్యుంజయ మంత్ర జపం పదికోట్లు పూర్తయ్యేసరికి ఆరు నెలలు పట్టింది. ప్రత్యక్షమయ్యాడు పశుపతి.

ఇకనుండి కృష్ణపక్ష దినాలలో నీ కళలు తగ్గి, తిరిగి శుక్లపక్షంలో దినాదినాభివృద్ధి చెందుతాయి' అని దక్ష శాపాన్ని సంస్కరించి దీవించాడు. ఆవేళకక్కడికి చేరిన బ్రహ్మేంద్రాదుల కోరికపై చంద్రుడి పేరుమీద అప్పటికప్పుడే 'సోమనాథ' మనే జ్యోతిర్లింగంగా పరిణమించాడు. ఇక్కడి చంద్రకుండంలో ఆరుమాసాలు విడవ కుండా స్నానం చేసిన వారికి సర్వ రోగాలూ నశిస్తాయి. ఈ క్షేత్ర ప్రదక్షిణ వలన భూ ప్రదక్షిణ పలం సిద్ధిస్తుంది. సోమనాథుడి నర్చించిన వారికి కుష్ఠ, క్షయాది సమస్త మహావ్యాధులూ ఉపశమిస్తాయి.

జ్యోతిర్లింగాలలో రెండవదైన మల్లికార్జున లింగం గురించి గతంలో చెప్పే వున్నాను. తదుపరి మహాకాళేశ్వర లింగం.

## శ్రీ మహాకాళేశ్వర జ్యోతిర్లింగ గాథ



పూర్వం అవంతీ నగరంలో వేద విప్రుడనే విప్రుడుండేవాడు నిత్యం పార్థివ లింగారాధన చేస్తూ శివానుగ్రహాన్ని పొందాడు. అతనికి దేవ ప్రియుడు, ప్రియ మేథుడు, సుకృతు, ధర్మవాహి అని నలుగురు కొడుకులు. ఇలా వుండగా "దూషణుడు" అనే రాక్షసుడు తన సేనా సమేతంగా వచ్చి నగరం నాలుగు వైపులనుంచీ ముట్టడించాడు. ప్రజలను హింసించాడు. ఎంత దుర్మార్గం చెయ్యాలో అంతా చేస్తున్నాడు. దిక్కుతోచని ప్రజలు ఆ రాక్షస మూకను యెదిరించలేక - వేద ప్రియుడి కుమారులు నలుగురినీ ఆశ్రయించారు.

వాళ్ళు అప్పుడు పార్థివ లింగారాధనలో వున్నారు. అయినా ప్రజల గోడు విన్నారు. "మాకైనా మీకైనా ఈ సమస్త విశ్వానికైనా ఆ మహా శివుడే రక్ష. మాతోబాటే మీరు శివుణ్ణి ధ్యానించండి' అని చెప్పి రాక్షసులను సరకు చేయక శివ ధ్యానంలో మునిగిపోయారు. అంతలోనే దూషణుడు వచ్చి - ఆ నలుగురు బ్రాహ్మణులనూ చంపబోయాడు. తక్షణమే పార్థివ లింగానికివున్న ఒక చిన్న బొరియవంటి దాని

నుంచి వికట రూపంతో మహాకాలుడిగా ఆవిర్భవించాడు శివుడు, ఒకే ఒక్క హుంకారంతో దూషణుణ్ణి, ఆ పరిసరాలలోని రాక్షసుల్నీ దగ్ధం చేశాడు.

ప్రజలూ, బ్రాహ్మణులూ కూడా ఆ వికట రూపుడికి మోకరిల్లి ఎంతగానో ప్రార్థించారు. అక్కడే వెలసి వుండమని అర్థించారు - ఆ కోరిక ననుసరించి - శివుడక్కడ మహాకాలేశ్వరుడనే పేరున జ్యోతిర్లింగంగా ఆవిర్భవించాడు.

# శ్రీ కేదారేశ్వర లింగావిర్భావ ఘట్టము



కర్మ పరిపాకం వల్ల విష్ణు వొకసారి ధర్ముడికి నరనారాయణులనే పేర పుత్ర ద్వయంగా అవతరించాడు. బదరి కావనంలో ఆ నరనారాయణులు తపస్సు చేశారు. నిత్యం వాళ్ళు పార్థివ లింగార్చన చేసేవారు. విష్ణ్వంశ సంభూతులు కావడం వల్ల ఆరాధన వేళకి రుద్రుడు ప్రత్యక్ష మయ్యేవాడు. ఒకనాడు వారి అర్చనానంతరం "ఏదైనా వరం కోరుకో" మన్నాడు. ఆ తావున నిలిచి వుండమని కోరారు వారు. ఆ కోరిక మేరకు హిమశిఖరాగ్రస్థిత కేదారఖండాన - కేదారేశ్వరుడనే పేర జ్యోతిర్లింగమయ్యాడు శివుడు.

పాండవుల మహా ప్రస్థాన వేళ వాళ్ళని పరీక్షించేందుకుగాను శివుడు యెనుబోతు రూపంలో పరుగెత్తాడు. శివలీల గుర్తించిన పాండవులు శివుణ్ణి అక్కడే శాశ్వతంగా నిలువరించాలనే ఉద్దేశ్యంతో అన్నివైపులా పట్టి లాగడంవల్ల ఆ మాయాజంతువు మూడుభాగాలుగా విడిపోయింది శిరోభాగంనయపాల (నేపాల) దేశానబడి లింగరూపమందింది. పాదాలు కేదార మార్గాన గల ఉన్నత ప్రదేశంలో పడి తుంగనాథేశ్వర లింగంగా ప్రసిద్ధి చెందింది. పృష్ఠమే కేదారేశ్వర జ్యోతిర్లింగం.

ఆ కేదారేశ్వరుణ్ణి అర్చించగోరువారు అక్కడ ఒక కడియాన్ని సమర్పించాల్సి వుంది. అలా అర్పించేముందు - ఆ ద్వారాన అంత శ్శివుణ్ణి దర్శించడమే ప్రతీక యని ప్రాజ్ఞులు చెబుతారు. సర్వ వాంఛలనీ సత్వరంగా తీర్చే స్వామి ఆ కేదారేశ్వర జ్యోతిర్లింగ స్వరూపుడు.

# భీమాసురుడి పూర్వగాథ

విరాధుడి భార్య కర్కటి. విరాధుణ్ణి రాముడు చంపివేయడముతో తలచెడి తిరగసాగిన కర్కటి ఒకనాడు కుంభకర్ణుడి కంటబడింది అతడా వితంతువును బలాత్కారంగా అనుభవించి వెళ్ళిపోయాడు. తత్ఫలంగా ఆమెకు భీమాసురుడనే కొడుకు పుట్టాడు. తన చరిత్రనంతా తల్లివల్ల తెలుసుకొన్న భీమాసురుడు-గడిగట్టే వయస్సుకొచ్చేసరికే ద్వేషం పెంచుకున్నాడు.

బ్రహ్మకోసం తపించాడు. సృష్టిలో తనను మించిన బలవంతుడుండ కూడదనీ, వున్న వాళ్ళందరికన్నా అధికబలాన్ని తనకు ప్రసాదించమనీ కోరాడు రాక్షసుడు. అనుగ్రహించి అంతర్హితుడైనాడు అబ్జాసనుడు. వరబలశాలియైన భీమాసురుడు - దేవలోకంమీద విరుచుకుపడి దేవతల్ని నానా యాతనలూ పెట్టాడు. భూలోకవాసుల్ని బొంగరాలాడించినట్లు ఆడించాడు. పాతాళలోకం వెళ్ళి యుద్ధంలో అక్కడున్న కామరూపేశ్వరుణ్ణి ఓడించి అతనినీ అతని భార్య సుదక్షిణనీ కూడా కారాగారంలో బంధించాడు.

# శ్రీ భీమేశ్వర జ్యోతిర్లింగ ప్రాదుర్భావము



సుదక్షిణా కామరూపేశ్వరులు సంపూర్ణ శివభక్తులు. నిత్య శివా రాధకులు, యథా అవకాశంగా - ఆ భార్యా భర్తలిద్దరూ ఒకరి కొకరు సాయం చేసుకుంటూ - ఆ చెరసాలలోనే అనుదినమూ పార్థివ లింగా రాధన చేయసాగారు. ఒకరోజున ఖైదీల పరిశీలనార్థం వచ్చేదండనాయకు డొకడు రాజ దంపతులు చేస్తున్న పార్థివ లింగారాధనను చూసి భయపడ్డాడు.

సరాసరి భీమాసురుడి వద్దకు వెళ్ళి "ఓ రాక్షస రాజా! ఆ పాతాళరాజు నిన్ను పతనం చేయడం కోసం యేదో కుతంత్రం చేస్తున్నాడు. కారాగారంలో ఏదో బొమ్మలా తయారుచేసి చెరుపో, చిల్లంగో చేస్తున్నా"డన్నాడు. అదిరిపడ్డ

భీమాసురుడున్న పళంగా కారాగారానికి వచ్చి "రేయ్ రాజాధమా! ఏమిట్రా నువ్వు చేస్తున్నది? అని అడిగాడు. 'శివుణ్ణి ఆరాధిస్తున్నా' నన్నాడు కామరూపేశ్వరుడు.

అది విని ఫక్కున నవ్వాడు భీమాసురడు. "యేమిటేమిటి? మా పినతండ్రి యైన బాణాసురుడి ఇంటి ముందు ద్వారపాలకుడిలా పడివున్న శంకరుణ్ణేనా నువ్వు అర్చించేది? కట్టబట్టలేనివాడూ, నిత్యం తిరిపెమెత్తుకు జీవించేవాడూ అయిన - వాడా నిన్ను రక్షించేది? వాడు నాకు కనబడలేదు గనక సరిపోయింది. కనిపించి వుంటే కాలరాసి వుండేవాణ్ణి, నువ్వాపూజలుగట్రా ఆపేయి. లేదంటే నిన్నూ, నీ వారాధించే ఆ మట్టి బొమ్మనీ కూడా మర్దించేస్తాను" అన్నాడు.

వినలేదు కామరూపుడు, వెర్రెక్కిపోయాడు భీమాసురుఢు. తనంతటి వాడిని నిర్లక్ష్యం చెయ్యడమా! అందునా ఒక ఖైదీ, పై పెచ్చు మట్టిముద్దను నమ్ముకుని! "హుః! ముందస్తుగా ఆ మట్టి కుప్పని కొట్టేయా"లనుకున్నాడు. హిరణ్యాకశిపుడు స్తంభాన్ని వ్రేసినట్లు -భీమాసురుడు తన చేతి ఖడ్గంతో కామరూపుడిచేత ఆరాధించ బడుతున్న పార్థివమూర్తిని ఒక్కవ్రేటు వేశాడు - అంతే ఫెళ ఫెళార్భటులతో విచ్ఛిన్న ఆ మృత్పిండం నుంచి వెలువడ్డాడు మృడుడు, భక్త రక్షణే నా వ్రతం, ఆశయం, రూపం అంటూ ఒక్క హుం' కారం చేసేసరికి భీమాసురుడూ, వాడి సైన్యమూ కూడా బూడిదైపోయారు. అక్కడితో ఆగకుండా ఆ హుంకారాగ్ని పారి పోతున్న దనుజులను వెంట తరిమింది. అడవులూ, పర్వతాలూ ఆక్రమించింది. భీమాసుర పరివారాన్నంతా దగ్ధం చేసింది. ఆ బూడిదే కాలాంతరాన ఓషధు లయ్యింది.

భక్తులైన సుదక్షిణా కామరూపుల సంరక్షణార్థం వెలసిన ఆ స్వామిని ఆ తావుననే కొలువుండమని కోరగా - భీమేశ్వరుడనే పేర జ్యోతిర్లింగంగా ఆవిర్భవించాడాయన, సర్వ సంకటహారకుడు, సమస్త బంధన విమోచకుడు అయిన ఆయన దర్శనం, అర్చన అత్యంత పుణ్యాదాయకాలు.

## శ్రీ విశ్వేశ్వర లింగము - చరిత్ర

ఈ బ్రహ్మాండం యొక్క వైశాల్యం మొత్తం యాభైకోట్ల యోజనాలని (ఒకప్పటి) మునుల అంచనా. ఇంత పెద్ద బ్రహ్మాండంలో బ్రహ్మచే సృష్టించ బడే జీవకోటి కర్మానుసారంగా మాయాలంపటమై పడబోయే శ్రమలను ముందు గానే గుర్తించిన పరమశివుడు - జీవులను ఉద్ధరించే నిమిత్తమై యేర్పరచిన



ప్రాంతమే కాశి. పంచక్రోశాత్మక మైనదీ పాపనాశి. ఇక్కడే ఒకప్పుడు విష్ణువు ఆశ్చర్యంతో తలపంకించగా - ఆయన కర్ణ కుండలాలకున్న మణి త్రుళ్ళి పడిందట.

ఆ మణిపడ్డ ప్రాంతం మణికర్ణికా ఘట్టంగా ప్రసిద్ధం. పరమేశ్వరుడైన సదా శివుడు తానే ఒక లింగాన్ని స్వయంగా ప్రతిష్ఠించి - కాశీని విడవరాదని శాసించాడు. ఆ కారణంగా ఆ లింగం అవి 'ముక్తేశ్వరుడు'గానూ, కాశీ 'అవిముక్తం'గానూ పిలువబడుతున్నాయి. 'కర్మణాం కర్షణాచ్చైవ-కాశీతి పరిపఠ్యతే'.

ప్రకృతి పురుషులిద్దరూ కూడా తమ జననీజనకులైన మాయా మహేశ్వరులను చాలా కాలంపాటు లేని గాంచ నేరముని చేసి చింతాక్రాంతులైపోయారు. అప్పుడు శివవాణి వారిని తపించమంది. తపస్సుకు తగినతావు నిమ్మని ప్రార్థించగా - శివతేజస్సారము అయిదు క్రోసులు పొడవు, అయిదు క్రోసులు వెడల్పుగల ప్రదేశాన్ని నిర్మించి సుందర నగరంగానూ మలచి పంపడం జరిగింది. పురుషుడైన శ్రీహరి అక్కడే తపించాడు. ఆ తపోలింగమే కాశీని అలరించింది. ప్రపంచ జీవుల దుష్కృతా లన్నిటినీ నశింపచేసేది. కాబట్టి దానిని "కాశీ అన్నారు.//

# గౌతముడి తపస్సు - పరోపకారము

దక్షిణాదిని గల బ్రహ్మగిరి మీద గౌతమ మహర్షి, తన భార్యయైన అహల్యతో కలసి తపోదీక్షలో వున్న సమయంలో శతవర్ష క్షామం యేర్పడింది. ఎక్కడా వానలు లేవు. పంటలు లేవు. వాగులు ఎండిపోయాయి. సామాన్యులు మలమల మాడి పోసాగారు. అనేకమంది అపమృత్యువు పాలయ్యారు. ఆ జనక్షోభను చూసి గౌతముడి హృదయము కరుణతో నిండిపోయింది.

తక్షణమే వరుణుడి కోసం తపించాడు ఆయన ప్రత్యక్షమై శివేచ్ఛా పరంగా సాగే ప్రకృతిని నిరోధించరాదని వర్షించడం తప్ప మరేదైనా కోరుకోమనీ అన్నాడు. కరువు రోజులు గడపడానికి కాసిని నీళ్ళు యిప్పించు" మని కోరాడు గౌతముడు ఒక గుంట త్రవ్వమన్నాడు వరుణుడు.

మూరెడులోతు గుంట, త్రవ్వాడు గౌతముడు. వరుణుడు దానిని దివ్య జలంతో పూరించాడు. 'గౌతమా! ఇది అక్షయ తీర్థమై నీ పేరుతో ప్రసిద్ధి చెందు తుంది, ఇక్కడ చేసే దాన, ధర్మ, తపః, పితృ శ్రాద్ధాదులన్నీ కూడా అమిత ఫలవంతా లవుతాయి" అని వరమిచ్చి అదృశ్యుడయ్యాడు.

# గౌతమునిపట్ల - భార్యా విధేయుల కృతఘ్నత

అప్పట్నించీ ఆ ప్రాంతాల వారంతా ఆ గుంటల్లో నీళ్ళనే వాడుతున్నారు. ఓరోజున గౌతమ శిష్యులు జలార్థం ఆ గుంట దగ్గరకు వచ్చి నీళ్ళు పట్టుకో బోతుండగా అక్కడ చేరిన యితర మునుల భార్యలు "స్త్రీలే ప్రథమం" అంటూ గొడవకు దిగారు. వారినోటిధాటికి - తట్టుకోలేక బ్రహ్మచర్యా నిష్ఠులయిన గౌతమ శిష్యులు ఆశ్రమం చేరి అహల్యకు విన్నవించుకున్నారు, ఆవిడ స్వయంగావచ్చి మునిపత్నులను మందలించి కావలసిన జలాన్ని తానే తీసుకువెళ్ళింది.

అహల్యా చేసిన హితబోధతమకవమానంగా తలపోశారాముని పత్నులు. అహల్యా గురించీ, లేనిపోనివన్నీ కల్పించితమ తమ ఆడతనాలకి వారి వారి తలకాయల్నీ తపస్సునీ 'నాతిచరామీ' చేసుకుని వున్న తమ భర్తలను ఆజ్ఞాపించారు.

భార్యా వాక్యమే బ్రహ్మవాక్యంగా భావించిన మునులు గౌతముడికి కీడు తలపెట్టి యీ గణపతిని ఆరాధించారు, ప్రత్యక్షమయ్యాడాయన.

గౌతముడి చేనులోయవలూ, యితర ధాన్యాలు చక్కగా పండివున్నాయి. ఆవు రూపంలో వచ్చిన విఘ్నేశ్వరుడు ఆ ధాన్యాలన్నీ మేసివేయసాగాడు. అదే సమయంలో అటుగా వచ్చిన గౌతముడు - స్వరక్షణార్థం/ ఆవును తరమడం అవశ్యం గనక బెదరింపుగా ఓ నాలుగు గడ్డిపరకలను దానిపై విసిరాడు. అవి తగలడం ఆలస్యంగా ఆ మాయదారిగోవు అక్కడికక్కడే మరణించింది.

"గౌతముడు గో హత్య చేశా" డన్నది పరిసరాలంతటా వ్యాపించింది. అదను కోసం చూస్తున్న అసమ్మతి ఋషులంతా కలిసి 'గో హంతకుణ్ణి చూడ్డమే మహా పాపం, కాబట్టి తక్షణమే ఆశ్రమం ఖాళీ చేసి వెళ్ళిపో'మ్మన్నారు వారి మాట ప్రకారమే గౌతముడు ఆశ్రమం ఖాళీ చేసి - రెండుమైళ్ళు అవతలకు వెళ్ళిపోయారు. అయినాకూడా ఆయనకు మనశ్శాంతి లేక మళ్ళా ఆశ్రమ ప్రాంతం ఋషులు

వద్దకు వెళ్ళి 'ఏదయినా ప్రాయశ్చిత్తమన్నా చెప్పండని ప్రాధేయపడ్డాడు. గౌతముడిని మరింత కష్టపెట్టాలనుకున్నారు వాళ్ళు. అందువల్ల - "గౌతమా! మరీ మరీ అడుగుతున్నావు గనుక చెబుతున్నాం శ్రద్ధగా విను. ముందుస్తుగా మన ఈ బ్రహ్మగిరికి పదకొండు ప్రదక్షిణాలు చేయాలి. అనంతరం తట్టా పారాయే పట్టుకుంటావో, తపస్సే చేస్తావోగాని - గంగానదిని ఇక్కడకు రప్పించాలి. అందులో స్నానం చేసి - ఒక కోటి పార్థివ లింగాలని అర్చించాలి, అనంతరం మళ్ళా గంగాస్నానం చేసి - వంద కుంభాలతో - గంగా జలాన్ని తెచ్చి రుద్రాభిషేకం చేయాలి, ఇలా చేస్తే ప్రాయశ్చిత్తమౌతుంది" అని చెప్పారు.

## గోదావరి పుట్టుక - త్ర్యంబకేశ్వర లింగం



సుముహూర్తం చూసుకొని, ఋషులు చెప్పినట్లుగానే ముందుగా బ్రహ్మగిరికి పదకొండు ప్రదక్షిణలు చేశాడు. వరుణ ప్రసాదితమైన దివ్య కుండంలోనే స్నానం చేశాడు. కోటి పార్థివ లింగాల్ని ఆరాధించాడు. కోటిలింగార్చనలూ పూర్తయిన మరుక్షణంలోనే ప్రత్యక్షమయ్యాడు సాంబశివుడు. అహల్యా గౌతములిద్దరూ - పార్వతీ పరమేశ్వరులకు ప్రణతులర్పించారు. గంగను అనుగ్రహించుమని వేడుకున్నారు.

శివుడు అనుగ్రహించాడు. అఖండ గంగ అతివ రూపంలో ద్యోతకమైంది 'గౌతమీ' గోదావరిగా పేరంది ఆగామి వైవస్వత మన్వంతరంలోని యిరవై ఎనిమిదో కలియుగం వరకూ భూమియందుండుమని ఆమెను శాసించాడు భవుడు. కొంచెం తటపటాయించింది రసమూర్తి. ఓరకంట ఒడయుడిని చూస్తూ - 'అయితే, నువ్వు నా తీరంలో అందాలకి అందంగా, మహా సౌందర్యరూపుడవై వెలసి వుండాలి' అని కోరింది. ఆమె మనసునర్థచేసు కున్నాడాసరసుడు 'సరే నన్నాడు. పులకించి పోయిందా తల్లి.

ఈ వార్త దేవతలకు యెలా తెలిసిందోగాని, రెక్కలు గట్టుకు వాలారు వాళ్ళు. శివుణ్ణి, జగదంబనీ, జగదంబుపునీ ఏకకాలంలో ఆరాధించి, తమ దైవత్వాలను ధన్యం చేసుకున్నారు.

వాళ్ళు కూడా గంగా - నిస్సంగులనక్కడే నివసించమన్నారు. గంగామతల్లి నవ్వుతూ - 'మరి నేను యిక్కడ వున్నందుకు నా కేదైనా ప్రత్యేకత కల్పించాలి' అని అడిగింది. అంగీకరించారు దేవతలు, గురువు సింహరాశిలో చేరినప్పుడు 'గోదావరి'కి పుష్కర మహోత్సవమన్నారు. తక్షణమే గంగ అక్కడి మేడిచెట్టు కొమ్మ అడుగునుంచి జలరూపంలో వెలువడి గౌతముడిని పునీతుణ్ణి చేసింది.

అది గంగా ద్వారంగా ప్రసిద్ధి చెందింది. గౌతముడిపట్ల అపచారం చేసిన మునులు కూడా గంగ గురించి విని స్నానానికి వచ్చారు కాని వారు చెంతకు రాగానే గంగ అదృశ్యమై పోయింది. 'ఉపకారికి అపకారము నెపమెన్నుచు చేసిన ధగిడీలచేత' తాను తాకబడనంది. గౌతముణ్ణి ఆశ్రయించి - బ్రహ్మగిరికి 101 ప్రదక్షిణలు చేస్తే మరో తావున మాత్రం అనుగ్రహిస్తానంది ఋషులంతా లెంప లేసుకుని గౌతముడిని క్షమాపణ కోరారు.

బ్రహ్మగిరి చుట్టూ 101 పర్యాయాలు యెడతెరిపి లేకుండా ప్రదక్షిణలు చేశారు. అనంతరం ఆ గిరి యొక్క దిగువ ప్రదేశంలో - గౌతముడు దర్భకొనను త్రిప్పగా అందులోంచి గంగ ఉదక రూపాన వెలువడింది. ఆ తీర్థంలో ముందుగా గౌతమ దంపతులు స్నాతులైన పిదప, తక్కిన మునులూ వాళ్ళూ కూడా స్నానమాడి పాప విముక్తులయ్యారు. గౌతముడు దర్భకొనతో చేసిన గుండమే 'కుశావర్తం' అనే పేర ప్రసిద్ధమైంది. ఆ విధంగా రసశేఖరుడైన శివుడు. అందాలకి అందమైన త్ర్యంబకేశ్వర లింగంగా పరిణించిన తావునుంచి ప్రవహిస్తూ - గౌతమీనామంతో నదిగా వర్ధిల్లి గోదావరిగా ప్రసిద్ధి చెందింది.

"గోదావరి గోదావరి" అని జపించడమే పని. అందం, ఆరోగ్యం, ఐశ్వర్యం, జ్ఞానం, మంచితనం, కళాభిజ్ఞత, అనురాగం, ఆయుష్షు - ఒకటేమిటి? అన్నీ కలిగించే కరుణాల తల్లి ఆ తల్లి.

ఆ గోదావరి ఆవిర్భావం, శ్రీ త్ర్యంబకేశ్వర లింగావతరణాల అనంతరం గౌతముడు తనకు ద్రోహం చేసిన వారందరూ వంశపారంపర్యంగా పరమ దరిద్రులూ శివేతర జ్ఞానులూ అవుతారనీ - మట్టిబొట్లు ధరిస్తూ నరక గాములవు తారనీ శపించినట్లుగా ఒక కల్పాంతర గాథకూడా వుంది. అలా శపితులైన వారంతా - కాంచీ క్షేత్రం చేరి అక్కడే స్థిరపడిపోయారు. వారి సంతానం కూడా శివనిష్ఠా రహితంగానే పరిణమించింది. ఋషులారా! ఈ గౌతమీ (గోదావరీ) ప్రాదుర్భావం,

తను వచ్చేదాకా పట్టుకొమనీ - యింకెక్కడా పెట్టకూడదనీ చెప్పి-శంక తీర్చు కోవడానికి వెళ్ళాడు రావణుడు తిరిగి వచ్చేసరికి ముహూర్త (2 ఘడియల) కాలం పట్టింది.

అంతసేపూ శివలింగాన్ని మోసే అవసరం కాని, జ్ఞానం కాని పామరుడికేల వుంటాయి? అందువల్ల గొడ్డుల్ని కాసుకొనె ఆ కుర్రాడు లింగాన్ని-అక్కడే వుంచడంతో అది అక్కడే భూస్థాపితమైపోయింది. తన ఇరవై చేతులతోటీ దాన్ని పెకలించ ప్రయత్నించాడా రావణుడు, అయినా కదిలిందికాదా కల్లు. చేసేదిలేక లంకాధిపతి ఇంటిముఖం పట్టాడు, అంతటి శివలింగమూ గూడా ఒక పశువుల కాపరిచేత ప్రతిష్ఠింపబడి అక్కడే వుండిపోయింది. జగత్కల్యాణకరుడైన ఆ జంగమయ్య భారతదేశం వదిలి లంకకు వెళ్ళలేక కాబోలు - వైద్యనాథేశ్వర నామంతో స్వదేశంలోనే స్థిరపడిపోయాడు.

# శ్రీ నాగేశ్వర జ్యోతిర్లింగావిర్భావం



చాలా కాలం పూర్వం దారుక, దారుకుడు అనే రాక్షస దంపతులు వుండే వారు, వారిలో దారుక దేవీ భక్తురాలై-తపించింది. అనుగ్రహించిన తల్లి - పశ్చిమ సముద్రతీరంలో పదహారు యోజనాల విస్తీర్ణంగల అరణ్యం వారి అనుభవంలోకి వచ్చేలా చేసింది, దారుకకు యెనలేని బలాన్ని కూడా ప్రసాదించింది అప్పట్నుంచీ ఆ రాక్షస దంపతులిద్దరు అమిత బలదర్పంతో - ప్రవర్తించేవారు. సాధారణంగా జరిపే రాక్షస హింసే కాకుండా - తమ అడివి మొత్తం పెకిలించి మోసుకుపోయి ఏ గ్రామం మీదనో పెట్టేవారు. ఆ అరణ్యాన్ని మోయలేక గ్రామం మొత్తం అప్పడం కన్నా అధ్వాన్నంగా అణగిపోయేది.

ఈ పీడ భరించలేని కొందరు వెళ్ళి ఔర్వమునిని ఆశ్రయించారు. ప్రజో పయోగాన్ని చింతించిన ఔర్వుడు 'ఇది మొదలుగా - జనులు ఉన్న భూమిపై జనపీడ చేసే రాక్షసులు అక్కడికక్కడే మరణింతురుగాక" అని శాపించాడు.

ఆ శాపం దారుక, దారుకులకు కళ్ళెం వేసినట్లు అయ్యింది. పైగా భూమిమీద రాక్షస బలం తరిగిపోనారంభించినది, అదే అదనుగా దేవతలు సాయుధులై - రాక్షసులతో యుద్ధం చేయడానికి భూమిమీదకు రాసాగారు. అప్పుడు దారుక - దేవీదత్త వరబలంతో తన అడవి మొత్తాన్ని సముద్ర మధ్యానికి యెత్తుకొనిపోయి అక్కడ నీటిలో స్థాపించినది. రాక్షసులకు అదే రక్షణా శిబిరం అయింది.

ఔర్వ శాపం వల్ల భూమిమీదకి వెళ్ళే అవకాశం లేని రాక్షసులు సముద్ర యాత్రీకులమీద విరుచుకుపడ సాగారు, తిన్నంతమందిని తినడం, తినగా మిగిలిన వాళ్ళని నిలువచేసుకొని ఆహారం క్రింద చెరసాలలో బంధించడం చేసేవారు. ఒకసారి ఒక ఓడ మీద దాడిచేసి కొందర్ని బంధించారు.

ఆ బంధితులలో 'సుప్రియుడు' అనే శైవుడు వున్నాడు. అతడు నిష్ఠాపరుడైన కారణంగా కారాగారంలో కూడా శివారాధనని మానేవాడు గాదు, తానొక్కడే కాకుండా - కారాగారంలోవున్న యితర శైవుల్ని కూడా ప్రోత్సహించాడు. మిగతా వారికి శివారాధనను ప్రబోధించాడు. దాంతో ఆ చెర సాల శైవం కానారంభించింది. సంతుష్టుడైన శివుడు - సుప్రియుడు చేసిన అర్చనలనీ స్వయంగా అందుకో సాగాడు. అయితే ఈ విషయం సుప్రియుడు గమనించనేలేదు.

ఈ శివారాధన అవీ - రాక్షసులకు గిట్టలేదు. వాళ్ళు ఖైదీల మీద దమన కాండకు దిగారు. ఖైదీలంతా 'హర హర మహాదేవ శంభో శంకర-నమః పార్వతీపతే -రక్ష రక్ష- పాహిపాహి' అన్నారు. తక్షణమే చతుర్ద్వారాలు గల ఆ ప్రాంగణోత్తరాన జ్యోతిర్లింగం కనుపట్టింది. సుప్రియుడు ఆ లింగాన్ని అర్చించాడు. అందులోంచి వచ్చాడు శివుడు. రాక్షసులను సంహరించి, భక్తులను కాపాడాడు "ఇక నుంచి - ఈ దారుకావనం వర్ణాశ్రమ ధర్మాదులతో వర్ధిల్లుతుందని వరం యిచ్చాడు.

ఇదంతా తెలిసిన దారుకదేవిని ఆరాధించింది, ఆవిడవచ్చింది అంబ- దారుకకు అభయమిచ్చింది, దాంతో అమ్మవారికీ, అయ్యవారికీ మధ్య రవ్వంత కలహం పుట్టింది. కాని. పిల్లలు చూస్తుండగానే తల్లి తండ్రులు కలహించుకోవడం బాగుండదు కాబట్టి - పార్వతీ పరమేశ్వరులు ఆ క్షణమే ఓ ఒప్పందానికి వచ్చేశారు.

అమ్మవారి మాట మేరకు ఒక యుగకాలం ఆ దారుకావనం రాక్షసుల అధీనంలో వుండేటట్లు ఈ లోపల వర్ణాశ్రమ ధర్మాల్ని పాటించే వారెవరయినా

అక్కడికి వచ్చినా ఆపద కలగకుండా వుండేటట్లు - నాగేశ్వరుడనే పేరుతో వెలుగొందే ఆ జ్యోతిర్లింగాన్ని అర్చించినవారికి చక్రవర్తిత్వం సిద్ధించేటట్లు ఒప్పు కున్నారు. రాక్షసులకు యుగాంతం వరకూ పుత్ర సంతానం కూడా అను గ్రహించారు. ఆ ఒప్పందం ప్రకారం ఆ యుగాంతంలో వీరసేనుడనే రాజు శివ భక్తుడై - అక్కడికి చేరి, నాగలింగేశ్వర లింగాన్ని ఆరాధించి - పాశుపతవిదుడై - దారుకా వంశాన్ని నాశనం చేసేశాడు. ఆ వీరసేనుడి కొడుకే నలచక్రవర్తి. ఇది నాగేశ్వర జ్యోతిర్లింగ చరిత్ర ఆ పైది. రామేశ్వర లింగం.

# శ్రీరామేశ్వర జ్యోతిర్లింగ కథ



రావణ వధార్థమై విష్ణువు రాముడిగా మానవావతారం దాల్చినాడు, సీతను మనువాడాడు. తాను అరణ్యావాసానికై వెళ్ళేటప్పుడు ఆమెను కూడా తనతో తీసుకెళ్ళాడు. అక్కడ లంకేశ్వరుడు సీత నపహరించాడు. రాముడు లంకమీద దండు ప్రకటించాడు. 'ఎక్కడోనడి సముద్రంలో వుందా లంకానగరం ఎలా వెళ్ళడం?" అని ఆలోచించిన రాముడు శివార్చనే తరణోపాయంగా భావించి - ఆసముద్ర తీరాననే పార్థివ లింగాన్ని అర్చించాడు. శివుడు ప్రత్యక్షమయ్యాడు "ఏంకావాలో కోరుకో" మన్నాడు. అడిగినవన్నీ యిచ్చాడు.

చివరగా రాముడు "స్వామీ! నాయందు అనుగ్రహంవుంచి, ఇక్కడే స్థిరుడవు కావయ్యా" అని ప్రార్థించినమీదట - శివుడక్కడ రామేశ్వరుడనే పేరున జ్యోతిర్లింగమే ప్రాదుర్భవించాడు.

ప్రయాగ నుంచి గంగాజలం తెచ్చి ఈ దక్షిణ సముద్రతీరానగల రామేశ్వర లింగాన్ని అర్చిస్తే వచ్చే ఫలం అంతా ఇంతా కాదు. అర్చించిన మరుక్షణంలోనే జీవన్ముక్తులౌతారని శివుడు అనుగ్రహించాడు. అట్టి భక్తులకు అమరులకైనా లభించని భోగభాగ్యాలు కలుగుతాయని కూడా శివుడే ప్రకటించాడు.



# ఘుశ్మేశ్వర లింగోదయము

భారతదేశానికి దక్షిణ దిశలో వున్న దేవగిరి అనే పర్వతం వద్ద ఒక సుసంపన్న మైన గ్రామం వుండేది. ఆ గ్రామంలో సుధర్ముడు. అనే బ్రాహ్మణుడు వున్నాడు. అతని భార్య సుదేహ, ఎన్నాళ్ళయినా ఆమెకు సంతానం కలగకపోవడం వలన స్వయానా తన చెల్లెలైన ఘుశ్మ అనే కన్యతో భర్తకు మారు మనువు చేసింది. ఘుశ్మ మహా శివభక్తురాలు. ప్రతిరోజూ 101 పార్థివలింగాల్ని అర్చిస్తుండేది. ఆమెకు నెల తప్పింది. సుముహూర్తాన ఒక కొడుకు పుట్టాడు. సుధర్ముడు బ్రహ్మానంద పడ్డాడు. సుదేహ కూడా సంతో షించింది. కాని ఆ ఆనందం యెన్నాళ్ళో నిలబడలేదు. ఇరుగు పొరుగు అమ్మ లక్కలందరూ పుత్రవతిగా ఘుశ్మను గౌరవిస్తూనే, 'గొడ్రాలు గొడ్రాలు అంటూ సుదేహను ఎత్తిపొడిచేవారు. ఆ అవమానాలు ఆమెలో ఘుశ్మనందనుడిపట్ల యీర్ష్యాద్వేషాలను జనింపచేశాయి.

కుర్రవాడు పెరిగి పెద్దవాడయ్యాడు. తగిన కన్యను చూసి కళ్యాణం జరి పించారు వియ్యాలవారు ఘుశ్మను గౌరవించినట్లుగా సుదేహను గౌరవించలేదు. ఇంటికి పెద్ద ఇల్లాలయినప్పటికీ ఆమెను గొడ్రాలనే భావనతోనే చూశారు ఘుశ్మ యొక్క కొడుకు కోడలూ మాత్రం సుదేహను యెంతో గౌరవంగానూ ప్రేమగానూ చూసుకునేవారు. సుధర్ముడు కూడా పెద్దభార్యగా ఆమెను అమితంగా ప్రేమించే వాడు. అయినా సుదేహ మనసులో పుట్టిన ఈర్ష్యాసూయలు అంతరించలేదు. చివరకామె ఒక రాత్రివేళ నవోఢాయుక్తుడై శయనించిన ఆ క్రొత్త పెళ్ళికొడుకుని - ప్రక్కనున్న వధువుకు కూడా తెలియకుండా నరికివేసింది. ఆ శరీరాన్ని ఖండ ఖండాలుగా చేసి-మూటగట్టి తీసుకువెళ్ళి-ఘుశ్మ-పార్థివ లింగాలను పడవేసే కూపంలోకి విసిరేసి ఏమీ యెరగనట్లు వచ్చి నిద్రబోయింది.

తెల్లవారింది, సుధర్ముడు ఘుశ్మ తన నిత్య విధులలో లీనమైపోయారు. ఘుశ్మ తన ఏకోత్తర శత పార్థివ లింగార్చనలో పడిపోయింది. సుదేహ యేమీ

తెలియని దానిలాగ వంటగదికి వెళ్ళింది, కాని, కోడలుపిల్ల నిద్రలేచేసరికి - ప్రక్క మీద భర్తలేడు సరికదా, రక్తపు డాగులూ, చిన్న చిన్న మాంస ఖండాలు వుండటంతో బెంబేలు పడిపోతూ అత్తగారినీ మామగారినీ ఆశ్రయించింది. మహేశ్వర ధ్యానంలో మునిగిపోయిన అత్తగారూ పట్టించుకోలేదు. వినపడకకాదు శివారాధనకు ఆటంకం యిష్టంలేక.

ఎలాగైతేనేం మధ్యాహ్నం వేళకి-నూటొక్క పార్థివ లింగాలనూ మనసా వాచా కర్మణా త్రికరణశుద్ధిగా ఆరాధించి, ఆ లింగాలను నిత్యం తను నిక్షిప్తం చేసే కూపంలో నిక్షిప్తంచేసి. యింటికి మరలి రాసాగింది ఘుశ్మ. అలా వస్తుంటే మార్గ మధ్యంలో నున్న చెరువు గట్టున - మరణించిన ఆమె కుమారుడు సజీవుడై కనిపించాడు. అప్పుడే శివుడు కూడా ఆమెకు దర్శనమిచ్చాడు. శివుడు వరం కోరుకోమన్నాడు. తన పేరున అక్కడ వెలసి వుండుమని కోరింది. ఘుశ్మను అనుగ్రహించాడు శివుడు. తక్షణమే అక్కడ ఘుశ్మేశ్వరుడనే పేరున జ్యోతిర్లింగంగా ప్రకటింరబడ్డాడు. పార్థివలింగాలతో నిండిన కుండం 'శివాలయం' అనే పేర పుష్కరిణిగా మారింది. ఇది ఘుశ్మేశ్వర చరిత్ర, దీనితో ద్వాదశ జ్యోతిర్లింగాల చరిత్ర పూర్తయింది. మరేం వినాలని వుందో చెప్పం" డన్నాడు సూతుడు.

## శివుణ్ణారాధించి శ్రీహరి సుదర్శన చక్రమును పొందుట

'శివారాధనవల్లనే విష్ణువు సుదర్శనం పొందాడని విన్నాం మేము. ఆ కథ వినిపించు' అని కోరారు ఋషులు. ప్రవచించసాగాడు పౌరాణికుడు - ఒకానొక సమయంలో-దైత్యులూ, దానవులూ అఖండ బలవంతులై త్రిలోకవాసులనూ హింసించసాగారు. దేవతలంతా కలిసి విష్ణువుని చేరి దైత్య దానవుల నణచివేయ వలసినదిగా ప్రార్థించారు. ఆలోచించాడు విష్ణువు" ఇది కాలమహిమేగాని, అన్యం గాదు. కావున కాలశాసనుడైన కంఠేకాలుణ్ణి ఆరాధించి యీ కష్టం గడిచే విధానాన్ని సాధిస్తాను" అని దేవతల నూరడించి పంపాడు.

అనంతరం విష్ణువు కైలాసం చేరువలో ఒక గుండాన్ని నిర్మించి అగ్నులు రగిల్చి వేద మంత్రయుక్తంగా హోమం చేయసాగాడు. నిత్యం పార్థివ లింగార్చన చేశాడు. మానస సరోవరం నుంచి పద్మాలను తెచ్చి - పార్థివ లింగాన్ని సహస్ర

కమలాలతో అర్చించేవాడు. ఒకనాడు విష్ణువు మానసానికి వెళ్ళి వెయ్యి కమలాలు తెచ్చి పెట్టుకున్నాడు.

శివ సహస్రనామ స్తోత్రం చదువుతూ పూవ్వులతో పూజ చేస్తూండగా - నామమునకు ఒక పువ్వు కొరపడింది. తొమ్మిదివందల తొంభైతొమ్మిది నామాలు పూర్తయ్యాయి. పువ్వులు అయిపోయాయి. మరొక నామం వుండిపోయింది. ఏం చెయ్యడమా అని ఆలోచించాడు విష్ణువు. లోకులందరూ తనని "పద్మాక్షుడు" అనీ అంటారుగదా! అందువల్ల, తక్కువ వచ్చిన పద్మం స్థానంలో తన నేత్రాన్ని పెకలించి వుంచబోయాడు. చటుక్కున ప్రత్యక్షమయ్యాడు ఈశ్వరుడు. విష్ణువును వారించాడు. "ఏం కావాలో కోరుకో" మన్నాడు.

"హే సర్వేశ్వరా! దైత్యదానవ వర్గాలు దుష్టతను సంతరించుకుని ముల్లోకాలను కల్లోలపరుస్తున్నాయి. ఆదిత్యులు అవస్థలపాలై పారిపోయారు. శత్రువులను నివారించేందుకు నా శస్త్రాస్త్రాలు సరిచాలడంలేదు. శరణ్యుడవని నిన్నాశ్రయించాను. నీ యనుగ్రహమే నా అభీష్టం' అని కేలుమోడ్చి ప్రార్థించాడు హరి.

తత్‌క్షణమే శివుడు తనచే నిర్మించబడిన 'సుదర్శనం' అనే చక్రాన్ని విష్ణువుకు యిచ్చాడు. నాటినుంచే విష్ణువునకు చక్రధరుడు, చక్రపాణి, చక్రి-అనేపేర్లు వచ్చాయి. అసలీ సుదర్శనాయుధం ఒకటేకాదు - శివార్చనా నిమిత్తం పెకలించుకోబోయిన పుండరీకాక్షానికి చిహ్నంగా చేత పద్మమును దాల్చి పద్మధరుడిగా ప్రసిద్ధి చెందాడా విష్ణువు, శంఖచూడ సంహారమప్పుడు-అతని అస్థికల ద్వారా ఆవిర్భవించిన వాటిలో శ్రేష్ఠ శంఖాన్ని శివుడి వల్ల పొంది, శంఖహస్తుడనే కీర్తిని సాధించాడు విష్ణువు.

ఇలా శివ ప్రసాదంగా అనేక అస్త్ర, శస్త్రాలను - ఆఖ్యలను పొందాడాయన. అనంతరం శివ దత్తమైన సుదర్శనంతో శత్రువులను దునిమి స్థితికర్తగా యెనలేని ఖ్యాతిగడించాడా హరి. ఇదీ సుదర్శనచక్రం సంగతి - సూతుడు చెప్పగా విన్న ఋషులు 'హే సూతర్షే! విష్ణు వంతటివాడు గనక యేదైనా చేయనూగలడు. ఈశ్వరుణ్ణి మెప్పించనూ గలడు. కాని, మాలాటి సామాన్యులు గూడా ఆచరించ గలిగేదీ సూక్ష్మంలో మోక్షం యిచ్చేదీ అయిన శివతంత్రం యేదైనా వుంటే చెప్ప"మని కోరడంతో, సూతుడిలా ప్రారంభించాడు.

# సూక్ష్మపూజ

శివ వ్రతాలలో ప్రధానమైనది మహాశివరాత్రి, ప్రతి సంవత్సరం మాఘబహుళ చతుర్దశి మహాశివరాత్రి అవుతుంది. బుద్ధిమంతుడైనవాడు ఆ రోజైనా ఉదయానే నిద్రలేచి స్నానాదికాలు ముగించుకొని శివధ్యానం చేయాలి. లింగదర్శనం చేసుకోవాలి. రాత్రి మొదటి ఝామ్ములో పూజా ద్రవ్యాలన్నీ - శివలింగానికి కుడి భాగంలో గాని, లేదా వెనుక భాగంలో గాని వుంచి - పునః స్నాతుడై శుభ్రమైన వస్త్రం ఒకటి ధరించి మరొకటి భుజాలపై ఆచ్ఛాదించుకోవాలి, భస్మరుద్రాక్షలు ధరించాలి. ముమ్మారు ఆచమించాలి. మంత్రంలేని శివపూజ అంతగా అంగీ కరించబడదు గనక - మంత్రంతోటే యధాశక్తి (శివ రాత్రినాటి విషయమది) పూజించాలి. ఆవాహనాది ఉపచారాలూ, సంగీత, నృత్యాదులు అన్నీ తప్పకుండా జరిపించి భక్తి యుతుడై తొలిఝామ్ము గడపాలి.

కొందరు ప్రదోషవేళనించి పార్థివలింగార్చన కూడా చేస్తారు. అయితే దానికి చాలా విజ్ఞత కావాలి, నాలుగుజాములూ నాలుగు పార్థివ లింగాల్నీ అర్చించాలి. మరుసటి ఉదయం అంటే అమావాస్యనాటి ప్రొద్దున్న ఐదో పార్థివ లింగార్చన చేయాలి. అది సాధారణ పూజ.

సాధారణపూజ ప్రతిష్ఠిత లింగానికే చేస్తే చాలు. వ్యక్తిగతముగా గాని, కుటుంబ సమేతముగా గాని, బంధుమిత్ర సపరివారముగా గాని లేదా జన సందోహంతో కలిసి సామూహికంగాగాని అయితే గోత్ర ప్రవరాదులన్నీ చెప్పుకుంటూ చేయాలి. శివారాధన చేసి, మరలా మరలా మృడుడికి నమస్కరించి-"హే ప్రభో! నీ అను గ్రహం వల్ల ఆరంభించిన యీ శివరాత్రి వ్రతాన్ని - యింతటితో ముగిస్తున్నాను. నీ అనుగ్రహం నాపై యెల్లవేళలా వుంచు స్వామీ!" అని వేడుకోవాలి, పుష్పాంజలి సమర్పించాలి. అనంతరం సాధువులకూ, సన్యాసులకూ, శైవబ్రాహ్మణులకూ యధావిధిగా భోజన తాంబూలాది సత్కారాలు గావించి ఆ తర్వాత కర్త తన కుటుంబ బంధు మిత్ర, పరివార సమేతముగా భోజనం చేయవచ్చు.

ఇలా ప్రతినెలా వచ్చే ప్రతీ కృష్ణచతుర్దశి (మాసశివరాత్రి) నాడు కూడా చేస్తే యింకా మంచిది. ఒకవేళ భక్తులైవుండి మంత్రాది విధులు తెలియనివారూ, రద్దీరోజులు కాబట్టి పూజానిర్వహణార్థం సద్బ్రాహ్మణులు లభించడం జరగనివారూ - ఏమాత్రం బాధ పడనక్కరలేదు. ఇందాకా మీరడిగారే - సూక్ష్మ మార్గం, అది

యిప్పుడు చెబుతున్నాను వినండి. పూజామంత్రాదికాలు రానివారు, గురుదత్తమైన శివ మంత్రం ఏదైతే - దాన్నే జపిస్తూ - శివారాధనం చేసేయవచ్చు.

# శివ నామాష్టకం

అలా గురుదత్తమైన శివ నామం కూడా లేనివారూ, శివుని యందు నిజంగా భయభక్తులున్నవారూ - 1. ఓం భవాయనమః, 2. ఓం శ్రీ శర్వాయ నమః, ఓం రుద్రాయ నమః, 4. ఓం పశుపతయే నమః, 5. ఓం ఉగ్రాయ నమః, 6. శ్రీ మహతేనమః, 7. ఓం భీమాయ నమః, 8. ఓం శ్రీ ఈశాయనమః, అనే ఈ ఎనిమిదంటే ఎనిమిదే నామాలను చెప్పుకుంటూ మంచిగంధం కమల పుష్పాలు, అక్షతలు, గన్నేరుపూలు, బిల్వదళాలు అనే ఐదింటిలో ఏవి లభ్యమైతే వాటితోనే శివార్చన చేయవచ్చు.

ఆఖరున "హే సాంబశివా! నాకు తెలిసినదింతే, దానితోటే నిన్ను అర్చించాను ఇది నీకు పూర్ణారాధనముగుగాక, నీ దయ మా యందు సదా నిలుచుగాక. నీకు నమస్కారము' అని చెప్పుకోవాలి అంతే. ఇక ఇంతకన్నా సూక్ష్మం ఏముంటుంది చెప్పండి!" అని ఆపాడు సూతుడు. మళ్ళా అడిగారు మునులు - 'శివరాత్రి గురించి ఇంత గొప్పగా చెప్పావు గదా! ఆ వ్రతం వల్ల ఉద్ధరించబడ్డ వాళ్ళెవరయినా వున్నారా? ఇక బాగుపడదనుకున్నవాడూ, శివారాధనయందు పూర్తి జ్ఞానం లేకుండానే తూతూ మంత్రంగా జరిపేసి తరించినవాడు అటువంటి వాడెవరయినా వుంటే చెప్పు" అని "వినండి" అంటూ అందుకున్నాడు సూతుడు.

# శివరాత్రి వ్రత మహిమ గుహుని కథ

చాలానాళ్ళకు పూర్వం గుహుడనే కిరాతుడొకడుండేవాడు. వేటతో జీవించే వాడు. వేటదొరకకపోతే దారి దోపిడీలకు తలపడేవాడు. ఇలా వుండగా శివరాత్రి వచ్చింది. ఆ రోజు శివరాత్రి గాని, అది పర్వదినం అని గాని ఆ గుహుడనేవాడికి తెలియదు.

కుటుంబపోషణార్థం యధావిధిగా ఆ రోజున కూడా విల్లమ్ములు తీసుకుని వేటకు బయలుదేరాడు. సాయంత్రమైంది గాని, జంతువు దొరకలేదు, వేట లేకుండా ఇంటికి వెళ్ళడానికి మనస్కరించక అడవిలోనే తిరుగుతూ ఒక చెరువు దగ్గర చేరాడు.

సంధ్యవేళ అయింది గనుక నీటికోసం జంతువులక్కడకు వస్తాయేమోనని ఆశతో అక్కడే ఆగదలిచాడు. తనవద్ద నున్న నీటి పాత్రతో నీళ్ళు పట్టుకుని, చెరువు గట్టునసే వున్న మారేడు చెట్టు నెక్కి కూర్చున్నాడు.

మొదటి ఝాము ముగియకుండానే ఒక లేడి వచ్చింది. దానిని చంపదలచి విల్లునెక్కు పెట్టబోయాడు, ఆ సందట్లో - అతని వద్ద నీటికుండ తొణికింది. అది మారేడుచెట్టు కావడం వలన - కొమ్మలు కదిలి కాసిన్ని బిల్వపత్రాలు కుండ లోంచి తొణికిన జలయుతంగా చెట్టు క్రిందనున్న శివలింగంమీద పడ్డాయి.

పగటి ఉపవాసం, శివరాత్రినాటినిశి- ప్రథమయామంలో శివపూజ చేసిన ఫలం కలగలపి సంక్రమించాయి. ఆ బోయవాడికి, కాని ఈ లోపల ఆ లేడి వేటగాణ్ణి పసిగట్టింది. 'ఓ కిరాతకా! నువ్వు నన్ను చంపి తింటానంటే నాకేం అభ్యంతరం లేదు, కాని, నాకు పసి కూనలున్నాయి. వాటిని నా భర్తకూ, సవతికీ అప్పగించి వస్తాను. నన్ను నమ్ము' అని ప్రార్థించింది. అప్పటికే పాపాలు తొలగి పోసాగాయి. బోయవాడివి అందువల్ల కాబోలు - సరేచూద్దాం వెళ్ళిరా' అన్నాడు. ఆ లేడి గృహోన్ముఖి అయ్యింది. దాని కోసం యెదురుచూస్తూ తొలిఝామంతా నిద్ర లేకుండా గడిపాడు బోయవాడు.

రెండవఝాము కూడా వచ్చేసింది. ఆ సమయాన మొదటి లేడి యొక్క సవతి ఆ చెరువుకు వచ్చింది. దానిని చూసి గుహుడు మళ్ళా విల్లూ బాణం తీశాడు. ఈ సారి కూడా కుండ తొణికి నీళ్ళూ కొమ్మ వణకి బిల్వదళాలూ దిగువ నున్న శివలింగం పైన వర్షించాయి. శివరాత్రి నాటి రేయి రెండవ ఝామున శివార్చన చేసిన ఫలం గుహుడికి జమపడిపోయింది. ఈ గలగలకా లేడికూడా బోయవాణ్ణి గుర్తించింది. అది కూడా తన పిల్లల్ని తన భర్తకు అప్పగించి వస్తాననీ మాట తప్పననీ మరీమరీ చెప్పి వెళ్ళింది. ఈ లేడి కోసం యెదురు తెన్నులు చూడటముతో గుహుడికి ఆ రెండవ ఝాముకూడా నిద్రలేకుండాపోయింది.

ఈ రెండు లేళ్ళూ కూడా మోసం చేశాయని అనుకున్నాడాబోయ. ఇంతలోనే మూడవ ఝాము సమీపించింది. ఆ సమయానికి - గతంలో వచ్చి వెళ్ళిన స్త్రీ హరిణాల భర్త - తన భార్యలను వెదకుతూ - అక్కడికి వచ్చాడు, దీన్ని వదల కూడదని గుహుడు మళ్ళా బాణం పుల్ల తీసేసరికి యథాప్రకారం కొమ్మనుంచి బిల్వ పత్రాలూ, కుండనుంచి నీళ్ళూ శివలింగంపై ఒలికాయి.

ఇంతలో మూడవ ఝాములో శివార్చన చేసిన పుణ్యాం కూడా గుహుడికి సంక్రమించింది, ఇంతలో మగలేడి కూడా గుహుడిని గుర్తించింది. తాను భార్యాన్వేషణలో వచ్చాననీ, యింటి దగ్గర పిల్లలు తల్లులకోసం అల్లాడిపోతున్నారనీ వాళ్ళని వాళ్ళకు వప్పగించి వస్తాననీ నమ్మబలికి వెళ్ళిపోయింది. యీ యెదురు చూపులో మూడో ఝాము కూడా నిద్రలేకుండా గడిపాడా బోయవాడు.

ఒకళ్ళోదారీ, మరొకళ్ళు మరొకదారిగా గృహం చేరిన దంపతులు కలిశారు. జరిగినదంతా ఒకరి కొకరు చెప్పుకున్నారు. పిల్లలను ఓదార్చారు/భార్యలూ, భర్తా కలసి సత్యవాక్పాలనమే పుణ్యంగా భావించి బోయవాడికి బలైపోవడానికి బయల్దేరారు. తల్లిదండ్రులు అలా వెళ్ళిపోతుంటే బిడ్డలు ఊరుకోడం జరగదుగదా! అందువల్ల లేడిపిల్లలు కూడా జననీ జనకులను అనుసరించాయి.

నాలుగో ఝాము అయ్యేసరికి బంధుమిత్ర కుటుంబ పరివార సమేతంగా వస్తున్న లేడి కుటుంబాన్ని చూసి ఆనందించి - పునః ధనుర్బాణాలు సంధించ బోయాడు బోయవాడు. మళ్ళా శివార్చన జరిగిపోయింది. శివరాత్రినాటి జాగరణ, నాలుగు ఝాములూ శివార్చనా ఫలంతో ఆ బోయవాడు జ్ఞానవంతుడయ్యాడు తన గతజీవిత పాపాలు తలుచుకుని దుఃఖించాడు. సత్యవ్రతాన్ని పాటించిన హరిణాలను చంపనని వదిలేశాడు.

తక్షణమే ఆ కిరాతకుడి కళ్ళముందు తోచాడు శివుడు. అతన్ని అనుగ్రహించాడు శివుడతనికి 'గుహుడు' అనే పేరు పెట్టాడు. శృంగబేరిపురం రాజధానిగా/ నిషాద రాజ్యం పాలించుకోమన్నాడు. విష్ణ్వవతారుడయిన రాముడితో మైత్రి కలుగుతుందని వరమిచ్చాడు. ఆడితప్పని లేడి కుటుంబానికి సాలోక్యాన్ని ప్రసాదించాడు. అద్భుతాచలమనే ఆ గిరిమీద ఆ భక్తుని పేర వ్యాధేశ్వరుడనే లింగంగా పరిణమించి జగత్ప్రసిద్ధుడయ్యాడు. ఇంత మాహాత్మ్యం వుంది శివరాత్రికి కాబట్టి మానవుడు తప్పక శివరాత్రి వ్రతం ఆచరించి తీరాలి. భక్తులారా! యింతటితో కోటిరుద్ర సంహిత పూర్తయింది" అంటూ ధ్యానమగ్నుడైనాడు సూతర్షి.

శ్రీ వేదవ్యాస మహర్షి రచించిన శ్రీ శివ మహాపురాణమున
కోటిరుద్ర సంహిత సమాప్తము.

✦ ✦ ✦



# శ్రీ శివ మహాపురాణము

## ఉమానామ పంచమ సంహిత

శ్లో॥ మత్సమః పాతకీనాస్తి - పాపఘ్నీ త్వత్సమా నహి
ఏవం జ్ఞాత్వా మహాదేవి! యథాయోగ్యం తథా కురు! ॥

అమ్మా పాపాలు చేసేవాళ్ళలో నన్నుమించినవాళ్ళు గాని, అయిన వాళ్ళ పాపాల నంతరింపచేయడంలో నిన్ను మించిన వాళ్ళుగాని - లేరు. ఈ విషయం దృష్టిలో వుంచుకుని యెలా ఉచితమో అలా చెయ్యి.

శ్లో॥ యోధత్తే భువనాని సప్తగుణవాన్ - స్రష్టారజస్సంశ్రయః
సంహర్తాతమసాన్వితో గుణవతీం - మాయా మతీత్యస్థితః
సత్యానంద మనంత బోధమమలం - బ్రహ్మాది సంజ్ఞాస్పదం
నిత్యం సత్త్వ సమన్వయా దధిగతం పూర్ణం శివం ధీమహి ॥

పరిపూర్ణమైన శివతత్త్వాన్ని ఆరాధిస్తున్నాను. రజోగుణాశ్రయుడై సర్వాన్నీ సృష్టించినవాడూ సత్త్వ ప్రధానుడై స్థితిని నిర్వహించేవాడూ, ఈ పంచకృత్యాలకూ తానే కర్తయైవుండీ కూడా - మలమాయాదులు లేని అమలుడూ, ఎప్పుడూ సత్త్వగుణోపేతుడై మాత్రమే ఉండేవాడూ, మాయను కల్పించేవాడూ, మాయతోనే నిత్యం కూడి వుండేవాడూ, మాయని యెడబాయనివాడూ, మాయకన్న ఇతరమైన వాడూ, పరిపూర్ణుడూ, అయిన భగవత్తత్త్వం యేదైతే వుందో ఆ శివతత్త్వాన్ని సన్నుతిస్తున్నాను.

# కృష్ణుడు ఉపమన్యుని కలియుట

**సూతఉవాచ :-** పూర్వ మొకప్పుడు శ్రీకృష్ణుడుపుత్రార్థియై శివుడికోసం తపస్సు చేయాలనే వుద్దేశ్యంతో కైలాసగిరికి వెళ్ళాడు. అక్కడున్న ఒకానొక శ్రేష్ఠ శిఖరంపై తపిస్తున్న ఉపమన్యు మహర్షిని చూసి భక్తి ప్రపత్తులతో నమస్కరించాడు. "శివుని గురించి చక్కగా తెలిసిన ఉపమన్యు మునీంద్రా! శివ మహిమను వివిపించవే" అని కోరాడు.

మహానందంతో బోధించసాగాడు ఉపమన్యువు "ముమ్మూర్తులా సుఖ ప్రదుడయ్యా ఆ ముక్కంటి, ఒంటికాలుపై నిలబడి కోటలూ, మంటలతో అలంకరింపబడిన ముఖాలతోను, అనేకానేకాలైన పాదాలూ బాహువులూ, నేత్రాల తోనూ, రెండువేల కాంతి కిరణాలతోనూ ప్రకాశించే ఆయన రూపం చాలా అద్భుతంగా వుంటుంది.

మహేశ్వరుడు తన భుజాలనుంచి దించబడ్డ ప్రపంచం మొత్తాన్నీ ప్రళయ వేళలో లయింపచేసే రుద్రుడి మహిమను అసలేవర్ణించలేము. సర్వ సంహారం చేత కూడా ఈశ్వరుడు ఆయన చేత చంపబడేవాడేగాని - ఆయనను వధించ గలవాడు గాదుగదా నిలిచేవాడుగాని - అసలు ఎదిరించి బరిమీద నిలబడ గలవాడు గాని లేనేలేడు యెవడూ.

మూడు శిగలతో పొగలేని నిప్పులా వుండే 'విజయం' అనే త్రిశూలంతో అక్షయ తూణీర సహితంగా అలరారే ధనుర్యుతుడిగా శతసహస్రాంశలతో విరాజిల్లే వజ్రపాణిగా, అద్భుత పరశుధారిగానూ, సుదర్శనపాణిగానూ అలరారుతుండగా చూశాను" అంటూ వర్ణించాడు ఉపమన్యుడు.

ఉపమన్యుడు చెప్పినది విని తాను కూడా శివ దర్శనాభిలాషతో ఉన్నానన్నాడు కృష్ణుడు. ఉపమన్యుడా కృష్ణునికి "నమః శివాయ" అనే మంత్రాన్ని ఉపదేశించాడు. "కృష్ణా! ఈ మంత్రాన్నేనిత్యం జపించు. త్రికరణశుద్ధిగా తపించు. నేటికి పదహారవ నెలలో నీకు పరమేశ్వర సాక్షాత్కారం లభిస్తుంది" అని చెప్పాడు.

# శివుడు సాక్షాత్కరించి వరములిచ్చుట

ఉపమన్యుడు చెప్పినట్లుగానే తపించాడు. సరిగ్గా పదహారవనెలలో ప్రత్యక్ష మయ్యాడు పార్వతీపతి. ఉమాసహితుడు, చంద్రమకుటలాంఛనుడు, దివ్యాభరణ



భూషితుడు. వ్యాఘ్ర చర్మాంబరుడు త్రిశూలపాణి, అమిత సుందరుడు, బ్రహ్మేంద్రాది బృందారక స్తుతి పాఠ యుక్తుడుగా దర్శనమిచ్చిన ఆ గంగా ధరుణ్ణి యెనలేని భక్తి శ్రద్ధలతో స్తుతిం చాడు కృష్ణుడు. అతని స్తోత్రపాఠాలని విని ఆనందించారు పార్వతీ పరమే శ్వరులు. ఏం కావాలో కోరుకోమన్నారు. "అసమాన మైన భక్తుడవు నీవు. కాబట్టి ఒక్క వరమే కోరుకోవాలనే నియమేమీ లేదు ఎన్ని వరాలు కావాలో అన్నీ కోరుకో" అన్నదా అన్నపూర్ణమ్మ తల్లి.

ఎనలేని వినయంతో చేతులు జోడించి - "హే ఉమా సహితా! నా హితవు నెంచి దర్శనమిచ్చిన నీకు పునః పునః నమస్కరిస్తున్నాను. 1. నీ సేవాభావము నుండి నా బుద్ధి మరలకుండునదియగుగాక. 2. నాకు నిత్యమూ నీ సన్నిధానము లభించుగాక 3. ఈ లోకంలో నా యొక్క సత్కీర్తి యేనాడూ చెక్కుచెదరనిదిగా అలరారుగాక, 4. మహావీరులు, ధీశాలులు, ఆయుష్మంతులు, ఆరోగ్యవంతులు, ఐశ్వర్యయుక్తులు, మీదు మిక్కిలి సుగుణవంతులు, నీయందు చెదరని భక్తి గలవారూ అయిన పదిమంది పుత్రులు నాకు కలిగెదరుగాక, 5. ఎంత బలవంతు డైనా సరే యుద్ధంలో నన్ను జయించలేకుండునుగాక - నా చేత నా శత్రు సమూహం సమస్తం నిహతమగునుగాక. 6. ఎన్నడూ ఎక్కడా, ఎవరివల్లా నాకు అవమానము తటస్థించకుండుగాక, 7. నిన్ను జపించువారూ, నీ ప్రాప్తికై యోగావల నంబనులైనవారూయైన శివ భక్తుల సర్వస్వానికీ నేను ప్రియుడనగుదును గాక. కరుణించి యీ వరాలనుగ్రహించ" మన్నాడు కృష్ణుడు.

"తథాస్తు శ్రీకృష్ణా! కర్మవశాన మునిశప్తుడైన ఘోర సంవర్తకుడనే ఆదిత్యుడు మహా బలశాలియైన సాంబుడనే పేర నీకు పుత్రుడౌతాడు. నీ తక్కిన కోర్కెలు కూడా ఈ క్షణం నుంచే సిద్ధించుతాయి."

అడిగినవన్నీ యిచ్చినా అమ్మవారికి తృప్తి కలగలేదు. 'ఇంకా ఏమైనా కావాలో ఏమో కోరుకో కృష్ణా" అందాప్యాయంగా.

"మహాప్రసాదం తల్లీ! నువ్వంత అనుగ్రహంతో కోరుకోమన్నావు గనుక కోరుకుంటాను" అంటూ యిలా కోరుకోసాగాడు హే జగన్మాతా! సత్యం పైనా, ధర్మం పైనా, తపస్సుపైనా, బ్రాహ్మణులతోనూ నాకేనాడు ద్వేషం యేర్పడకుండా వుండుగాక. బ్రాహ్మణులకు అత్యంత ప్రీతిపాత్రుడనగుదునుగాక.

తల్లిదండ్రులు నా వలన నిత్యతృప్తులు కావాలి, నేనేయే తావులలో యే గుణాలలో మసలినా ఆ సర్వస్వం నాకు సానుకూలపడాలి. ఇక, మున్ముందరి నా జన్మలన్నీ ఉన్నత వంశాలలోనే కలగాలి.

యజ్ఞశీలినై యింద్రాదులందరినీ తృప్తి పరచాలి, నిత్యం నా యింట అసంఖ్యాకులైన అతిధులు భోజనాలు చేయాలి, బంధువులతో విరోధం కలగ గూడదు. వేలాది భార్యలకు వల్లభుడనై వారందరినీ తృప్తి పరచగలగాలి. తిరుగులేని రతిసుఖాలు పొందగలగాలి ఇంతెందుకు తల్లీ నాకెప్పుడూ యేసద్బుద్ధి పుడితే అదల్లాసిద్ధించేలా అనుగ్రహించు' అని అర్థించాడు కృష్ణుడు. అడిగినవన్నీ యిచ్చి ఆ దంపతులు అంతర్హితులైపోయారు. కృష్ణుడు ఉపమన్యుడికీ శుభవార్త లను వినిపించి ద్వారకకు వెళ్ళిపోయాడు.

ఇలా ఒక్క కృష్ణుడే కాదు శివారాధన వల్ల ఎందరెందరో తరించిపోయారు. యాజ్ఞవల్క్యుడనే మహర్షి శివారాధనం చేయటంవల్లనే - సాటివారందరిలోనూ మేటివాడయ్యాడు. మా గురువుగారైన వ్యాసులవారు కూడా శివారాధనవల్లనే అంతటివారు కాగలిగారు. ఇంద్రుడిచే అవమానించబడిన 'వాలఖిల్యు'లనే మునులు శివానుగ్రహం వల్లనే గర్గుడి సాయంతో యజ్ఞాదులలోని స్వాహాకార భాగములను పొందగలిగారు, శివానుగ్రహం వల్లనే అనసూయ మూడువందల సంవత్సరాలు రోకళ్ళపై తపస్సు చేసి - చంద్ర, దత్త, దూర్వాసులను బిడ్డలుగా పొందింది.

పింగళ అనే వేశ్య మందరుడనే బ్రాహ్మణుడు - శివుని ఋషభావతారవేళ ఆరాధించి పాపవిముక్తులైనారు. బ్రహ్మ సృష్టికర్త కాగలిగాడన్నా, మార్కండేయుడు చిరంజీవి అయ్యాడన్నా, పరశురాముడు ప్రపంచ విజేత కాగలిగాడన్నా, దేవేంద్ర శత్రుడైన దేవలుడు విముక్తిని పొందాడన్నా - అన్నింటికి కారణము ఆ శివారాధనమే. చాక్షుష మనుపుత్రుడైన గృత్సమదుడనే వాణ్ణి వశిష్ఠుడు శపించాడు.

మృగముఖుడివి కమ్మన్నాడు. పాపం ఆ గృత్సమదుడు శివారాధన చేయడంతో వశిష్ఠుడంతటివాడి శాపమూ కూడా యెందుకూ పనికిరాకుండా

పోయింది. గార్గ్య మహర్షికి త్రికాల జ్ఞానం కలగటానికి కారణం శివుడి అనుగ్రహమే, ఆయన కరుణవల్లనే అష్టాదశ విద్యలూ అభ్యసించాడా గార్గ్యుడు. వెయ్యిమంది పుత్రులను పొంది, కడకాలంలో కైవల్యం పొందగలిగాడు. పరాశరులవారు శివ సేవనం వల్లనే అంతటి ఋషి కావడం, వ్యాసుడంతటివాణ్ణి పుత్రుడుగా పొందడం జరిగాయి. శూలానికి కొరతవేయబడిన మాండవ్యుడనే మహాఋషిని శివుడే కాపాడాడు.

కాబట్టి, ఓ ఋషీశ్వరులారా! శివారాధనమే చేయండి. శివ నామమే స్మరించండి. మనస్సులో యెల్లవేళలా ఆ సదాశివుణ్ణి మరచిపోకుండా వుండండి. అది సర్వ శ్రేయస్సులనూ ఒనగూరుస్తుంది. సమస్తమైన ఆపదలన్నీ తొలగిస్తుంది. పాపాలన్నీ నాశనం చేస్తుంది.

## పాపములు - ఉపపాపములు

తదనంతరం పాపాల గురించి చెప్పమన్నారు శౌనకాదులు. చెప్పసాగాడు సూతుడు - పరస్త్రీలను కామించేవారు. పరద్రవ్యాలని ఆశించేవారు, పరులకు కీడు తలపెట్టేవారు - వీరంతా మానసిక పాపులు. పొత్తులేకండా మాట్లాడడం, చాడీలు యివన్నీ, వాచక పాపాలు అభక్ష్యభోజనం, పరహింస, దుష్కృత్య నిర్వహణ, పరద్రవ్యాపహరణ అనేవి దైహిక పాపాలు, ఇవి పన్నెండూ మహాపాపాలు. అసంఖ్యాకమైన వివిధ రకాలయిన పాపాలన్నీ వీటి కోవలోవే. దైవ ద్వేషం అన్నిటినీ మించిన ఘోరపాపంగా భావింపబడుతోంది.

ఆపాత్ర దానం, అవిహిత వాక్యోచ్చారణం, నిషిద్ధ గ్రంథ పఠనం ద్రవ్యలోభ ప్రవర్తనం వాస్తుపూజాదికాలు - ఉదక శాంతీ జరపబడని గృహాలలో వుండడం, అసలు దానమే చేయకపోవడం - పాపాలు. బ్రహ్మహత్య సురాపానం, సువర్ణ స్తేయం, గురు శయ్యాగమనం (లేక) గురు భార్యానుభవం అనే నాలుగూ చేసేవాడు - అటువంటి వాడితో కలిసి తిరిగేవాడూ వీళ్ళు అయిదుగురూ మహాపాపులు నిర్దోషులను నిందించడం, దేవ భూసురద్రవ్యాపహరణం, నీతి బాహ్యంగాధనార్జన చేయడం, వ్రతమును నడుమలో విసర్జించడం, సాత్త్విక జంతు వధ-ఇవన్నీ కూడా పాతకాలే పంక్తి భేదం, పక్షపాతం, బ్రాహ్మణులకు కష్టం కలిగించడం, ఇంద్రియలోలత, లోభత్వం, వ్యభిచారం, జారత్వం, బలాత్కారవిధి - యివన్నీ ఉపపాతకాలు.

తనకు పెళ్ళిగాకుండానే తమ్ముడి పెళ్ళి జరిపితే - ఆ అన్నగారు పరివిత్తి అనేవాడవుతాడు. అటువంటి పరివిత్తితో కూడిన యజ్ఞాదులు కూడా పాపాలే అవుతాయి. వాడికి కన్యాదానం చేయడం అపాత్రదానం అవుతుంది. స్వధర్మ త్యాగం, పరధర్మానుసరణం, అల్పజ్ఞానముతో వైద్యం చేయబూనడం, చెరువులూ - చిల్లంగులూ చేయడం, ఆశ్రితుల కోరికలూ తీర్చకుండా హింసించడం, ఉద్యాన వనాలూ అవీ చెడగొట్టడం స్వామిద్రోహం చేయడం, అతిథుల్ని అవమానించడం, అవకాశముండి కూడా దానం చేయకపోవడం, బలమదంతో బలహీనుల్ని బాధించడం, పొలిమేరలుకాచి దోపిడీలు చేయడం-యివి కూడా ఉప పాతకాలు గానే గుర్తించాలి.

ఇంతెందుకు? రెండే రెండు ముక్కలు పరులకు క్షోభకలిగే పనులన్నీ పాపాలే, పరులకు హితవు చేయడం ఒక్కటే పుణ్యం, వ్యభిచారం వీటికి అతీతమైన పాపంగా చెప్పబడింది. పాపం బైటపడిన వారిని రాజు శిక్షిస్తాడు, బైటపడని వారిని యముడు శిక్షిస్తాడు.

# వివిధ (దశ) దాన ఫలములు



"కర్మ" అనేదంటూ ఆచరించిన వాడు అది పాపం అయినా, పుణ్యం అయినా ఫలితాన్ని అనుభవించక తప్పదు. పాపం చేసినవాళ్ళు నరకం పాలవుతారు. కాబట్టి, నరకానికి వెళ్ళ కూడదనేవాడు ఖచ్చితముగా పుణ్యమే చెయ్యాలి. ఈ పుణ్యం. పూజా, వ్రత, జప, తప, హోమ, దానాలుగా విభ జింపబడింది వీటిలో అత్యంత ఫల ప్రదమైంది దానం. పాపం చేయని వారికీ దానం పుణ్యం చేకూర్చు తుంది. పాపం చేసిన వారిని-కష్టకాలం లోనూ, నరకంలోనూ ఆదుకుంటుంది.

అందువల్ల పాపభీతులూ, పుణ్యకాములూ కూడా నిరంతరం యెంతో కొంత దానం ఆచరిస్తూ ఉండాలి. దానం చేసే వాళ్ళని ప్రోత్సహించాలి. దానం చెయ్య కుండా వుండటం, దానం చేసేవారిని ఆక్షేపించడం, దానక్రియకి అడ్డుపడడం అనేవి మహాపాతకాలుగా గుర్తించాలి.

బంగారము, తిలలు, ఏనుగు, ఆడపిల్ల, దాసి, యిల్లు, రథం, మణులు, గోరోజనం రంగులో వుండే ఆవులు, భూమి - అనే ఈ పది వస్తువులనూ కూడా దానం చేయడాన్నే "దశ మహాదానములు" అంటారు. మనకు అత్యంత ప్రియమైనదీ - దాన సమయంలో విముఖత చూపనిదీ అయిన దానిని దేనినైనా సరే - పాత్రుడైనవాడికి దానం చేయడం సర్వదా శ్రేయోదాయకం, వీటికి సమయ సందర్భాలు అక్కర్లేదు. దానం పట్టేవాడి పాత్రతా పాత్రతలు తెలిస్తే చాలును.

బంగారం దానంచేసిన వారికి-పూర్వజన్మ పాపాలు కూడా నశిస్తాయి. గోదానం చేసిన వారికి అన్ని వాంఛలూ నెరవేరుతాయి. భూదానం చేసినవారు యెన్ని జన్మలకైనా మానవులుగానే జన్మిస్తారు. నువ్వులతో ఆవును చేసి బంగారముతో దూడను చేసి - సవత్సతిల గోదానము చేసిన వాళ్ళు 14 మంది యింద్రులు మారేవరకూ స్వర్గంలోనే విహరిస్తారు. తు(తి)లాదానం చేసిన వాళ్ళ పాపాలన్నీ పటాపంచలైపోతాయి, బాల్యావస్థలో తెలియక చేసినవీ - తెలిసీ తెలియక చేసినవీ ఆ యౌవనంలోచేసే తెలిసి ఆచరించిన పాపాలూ అన్నీ నశించి పోతాయి ఇవిగాక సమయ సందర్భాలను బట్టి చేసే దానాలు ఇంకా ఫలప్రదాలుగా వుంటాయి.

ఎండాకాలం కాళ్ళు కాలుతున్నప్పుడో - లేదా - పాదరక్షల అవసరం యేర్పడి నప్పుడో - తమకన్నా ఉత్తముడికి పాదరక్షలను అర్పించాలి అలా దానం చేసిన వారి మరణానంతరం యమలోక మార్గంలో నడకకు యిబ్బంది కలుగదు. గొడుగులు దానం చేసిన వారిని నీడగా వుండే మార్గాలలో తీసుకువెళతారు దూతలు. పల్లకీని దానం చేసిన వారిని రథంపై తీసుకుపోబడతారు, కూర్చునేందుకు కుర్చీలు పడుకునేందుకు పాన్పులు దానం చేసిన వారు యమలోకానికి వెళ్ళినా సరే - విహారయాత్రలాగా వుంటుంది వాళ్ళకి. జిజ్ఞాసులారా! ఈ లోకంలో మనం చేసిన దానాలే ఆ లోకములో మనం అనుభవిస్తాం అందువల్ల 'కర్మ భూమి'గా పేరొందిన ఈ మర్త్యలోకంలో మర్త్యులుగా - జ్ఞానులుగా పుట్టిన వారందరూ కూడా తప్పనిసరిగా దానాలు చేయాలి. పరలోకంలో మనం బ్రతికేందుకు తగిన ఏర్పాట్లు యిక్కడే చేసుకోవాలి.

# అన్నదాన మహిమ

శ్లో॥ అన్నదః ప్రాణదః ప్రోక్తః ప్రాణదశ్చాపి సర్వతః
తస్మా దన్న ప్రదానేన సర్వదాన ఫలం లభేత్ ॥

అన్నం తినడం వల్లనే ప్రాణం నిలబడుతోంది. కాబట్టి, అన్నం పెట్టిన వాడు ప్రాణంపోసినవాడితో సమానుడుగా చెప్పబడుతున్నాడు ప్రాణాన్ని మించింది మరేది లేదు కనక - అటువంటి ప్రాణం నిలిపే అన్నదానం వల్ల అన్ని దానాలూ చేసిన ఫలం లభిస్తుంది. అందువల్ల యెల్లవేళలా అన్నదానం చేయాలి, పాత్రతా పాత్రతల నెరిగి మరీ అన్నదానం చేయాలి. ఎందుకంటే - చేసిన అన్నదానం వలన కలిగిన శారీరక శక్తితో అతడాచరించబోయే పాప పుణ్యాలలోసగభాగం-ఈ అన్నం పెట్టిన వాడికి చెందుతోంది. అందువల్ల పుణ్యకర్మాచరణ చేసేవారికి అన్నదానం చేయాలి.

కాని, యెంత పాపాత్ముడైనా సరే - ప్రాణావసానవేళ - అన్నంలేని కారణం గానే మరణించేలా వున్నప్పుడు అన్నం పెట్టడం వలన అతడు బ్రతుకుతాడనే విషయం ధృఢమైనప్పుడు - ఖచ్చితంగా వాడికి అన్నదానం చేయవలసిందే. పాత్రాతా పాత్రతల్నీ పాప పుణ్యాల్నీ తుంగలో తొక్కేసి 'ఆకలిగొన్నవాడికి అన్నం పెట్టి తీరాలి'.

నిష్కల్మషంగా అన్నదానం చేసినవాడు, స్వర్గంలోని నందనవనంలో, పారిజాత వాటికలో, కల్పవృక్షాల నీడల్లో ఆ కల్పాంతం ఆనందిస్తాడు.

# జల దానం

అన్నదానం తర్వాత చెప్పుకోతగ్గది జలదానం. మంచినీళ్ళియ్యకపోతే ఆహారాన్ని తినడం కష్టంగదా! అందువల్ల జలదానం కూడా ప్రముఖమైందే. ముఖ్యంగా వేసవికాలంలో దప్పికగొన్న వారి నిమిత్తమై చలువ పందిళ్ళు వేసి మంచినీళ్ళు అందించే వాళ్ళ జన్మ చరితార్థమైపోతుంది//నీటి కిబ్బందిపడే ప్రాంతా లలో నూతులు, చెరువులు త్రవ్వించడం మహాపుణ్యం-ఆ నుయ్యిగాని, చెరువు గాని ఎంత వైశాల్యంతో తవ్వబడుతోందో అన్ని జన్మల పాపం-అది త్రవ్వుతుండ గానే నశిస్తుంది ఎన్నాళ్ళు జనోపయోగకరంగా వుంటుందో అన్నాళ్ళూ స్వర్గంలో వుంటాడా యజమాని. తటాకం త్రవ్వినది లగాయితు కాలంచేసే వరకూగల ఆయువున్నన్ని నాళ్ళు నిత్యాగ్నిహోత్రం చేసిన పుణ్యం కలుగుతుంది.

ఎండాకాలం వానాకాలం అనకుండా అన్ని ఋతువులలోనూ కొరతబడని నీళ్ళతో నిండివుండే చెరువును త్రవ్వించిన యజమానికి - అశ్వమేధయాగం, అతి రాత్రక్రతువూ చేసినంత పుణ్యం లభిస్తుంది, కాబట్టి-ఏదానం చేసినా-చేయక పోయినా అన్నదానం, జలదానం మాత్రం తప్పనిసరిగా చేయవలెను.

ఇహంలో దానం చేయలేనివాడు - పరంలో దగాపడిపోతాడు. ఇక-హోమం యజ్ఞం, జపం, తపస్సు ఇవన్నీ కూడా అత్యంత ఫలప్రదాలేయైనా ఆ అనుష్ఠానాలు అవీ కష్టం గనక - వాటి సాధనకు అధికవ్యయం జరుగుతుంది. గనక - వాటికి అమితమైన జ్ఞానం కూడా కావాలి గనక - వాటికన్నా యీ దానాదులకే ప్రాధాన్యత కలుగుతుంది.

అందరూ జ్ఞానులు కాలేరు' గనక, వారు కూడా తరించే నిమిత్తమై ఈ దానాలను ఏర్పరచడమూ జరిగింది - అని చెప్పి ఋషులకోరికపై దేహమలాదుల విషయమై చెబుతూ అమ్మవారి నొక్కసారి స్మరించుకున్నాడు సూతుడు.

శ్లో॥ సవిత్రీభి ర్వాచాం శశిమణి శిలాభంగ రుచిభిః
వశిన్యాద్యాభి స్త్వాంసహ జనని సంచింతయతి యః
సకర్తా కావ్యానాం భవతి మహతా భంగి సుభగైః
వచోభి ర్వాగ్దేవీ వదన కమలామోద మధురైః ॥

# దేహ మలములు

ప్రాణికోటి గర్భపాత్రలో అన్నం జలం వేరుగా వుంటాయి నాడులనుండి వచ్చేగాలుల ద్వారా ప్రజ్వలించేజఠరాగ్ని వల్ల నీళ్ళువేడెక్కుతాయి. ఆ వేడికి అన్నం పచనమవుతుంది. పచనమైన ఆహారం కొంత రసపదార్ధంగానూ, కొంత మల పదార్థంగానూ, కొంత మలపదార్ధం గానూ మారుతుంది. ఆ మలం దేహేంద్రియాల ద్వారా 12 రకాలుగా వెలువడుతుంది.

శ్లో॥ కర్ణాక్షి నాసికా జిహ్వాదంతా శిశ్నో గుదం నఖాః
మలాశ్రయాః కఫః స్వేదో విణ్మూత్రం ద్వాదశస్తథా ॥

కఫము, స్వేదము, విణ్మూత్రము మున్నగు పన్నెండు రకాలైన మలములూ కూడా - చెవులు, కళ్ళు, ముక్కు, దంతాలు, శిశ్నం, గుదం, గోళ్ళు అనే యెనిమిది అవయవాల ద్వారా వెలువరించబడుతున్నాయి.

అన్నం వల్ల శుక్లం కల్గుతుంది, శుక్లం వల్ల దేహం యేర్పడుతుంది, వీర్యం స్త్రీ యోనిలో పడాలి, అలాపడేటప్పుడు ఆ యోని నిర్దోషమై (ఋతు స్నాత అయి) వుండాలి. అలా పడ్డ శుక్లం - వాయువుచేత - యోనిలోనికి శోణితంలో కలిసి జీవం ఉత్పత్తి అవుతోంది.

సమస్తమైన జీవులు, వారి వారి కర్మఫలాల ననుసరించి స్త్రీ గర్భాలలోకి శుక్లం ద్వారా ప్రవేశిస్తారు. రజస్సంగమం వల్ల శుక్లం గట్టిపడి 5 రోజులలో బుద్బుదాకారం ధరిస్తుంది. ఆ తరువాత మాంసపుముద్దగా మారుతుంది. రెండు నెలలల్లో తల, కంఠం, భుజాలు, పృష్ఠం, వక్షం, వుదరం, కాళ్ళు, చేతులు, నరాలు, డొక్కలు, కటి మొదలైన భాగాలు యేర్పడతాయి.

మూడోమాసం నిండాక-నరాలు సంధులు తయారవుతాయి. 4వ నెలలో వ్రేళ్ళు యేర్పడతాయి. 5వ నెలలో ముక్కు, చెవులు, పళ్ళు, గుహ్యం, గోళ్ళు - 6వ నెలలో కర్ణరంధ్రములు- 7వ నెలలో గుహ్యేంద్రియం, మూత్రద్వారం, యోని స్థానం నాభి, అంగ సంధులు వెలువడతాయి. అనంతరం అంగ ప్రత్యంగాదులు పూర్తియై పరిపక్వమై, మాతృగర్భంలో మావిచే కప్పబడి వుండి తల్లి భుజించిన షడ్రస పదార్థాల సారంతో - నాభినాళ బంధంలో దిన దిన ప్రవర్ధమానమవుతుంది. సర్వావయవాలూ సంపూర్తిగా వచ్చిన తర్వాత - పూర్వ జన్మ స్మృతి కలిగి సుఖ దుఃఖాలు చెందుతూ - గర్భనరకానికై దుఃఖిస్తూంటుంది. గత పాపం వల్ల ఈ గర్భ సంకటంలో పడ్డాను.

ఇప్పుడు తొందరగా పుట్టేస్తే బావుణ్ణు. ఈ సారి అన్నీ పుణ్యములే చేసి మళ్ళా ఇలా యెవరి కడుపులోనో పడి యేడ్చే కర్మ పట్టకుండా మోక్షం సాధిస్తాను" అని అనుకుంటూవుంటుంది. ప్రాణి మరణించిన తర్వాత కలిగే రౌరవాది నరకాలన్నీ ఏకమైనా సరే, ఈ గర్భ నరకం కన్నా కఠినమైనవిగాని, కష్టమైనవిగాని కావని గుర్తించుకోండి.

కాలానుసారంగా అతికష్టాన యోని మార్గం గుండా బయల్పడి విణ్మూత్ర రక్తసిక్త దేహుడై జన్మించి అస్థిపంజరంతో గూడిన కళేబరము గలవాడై 365 మాంస ఖండాలతోనూ, 1 కోటీ యాభై లక్షల రోమాలతోనూ కూడి- స్థూల సూక్ష్మ శరీరాలందు దృశ్యాదృశ్యరూపుడై కనబడుతూ వుంటాడు. ఈ రోమాల ద్వారా స్వేదం పైకిచిమ్మబడుతూ వుంటుంది. 32 దంతాలు, 20 గోళ్ళు కలిగి వుంటాడు.

జీవికి - పిత్తం 16 తులాలు, కఫం 256 తులాలు, వస 20 ఫలాలు, కఫత్వం 10 ఫలాలు మేద 9-1/2 తులాలూ, మహారక్తం 3 ఫలాలు, కొవ్వు 12 ఫలాలు, శుక్రం 8 తులాలూ లెక్కనవుంటుంది. ఈ శుక్రమే జీవులకు బలం. శరీరం మొత్తంలో 101 ఫలాలు మాంసం వుంటుంది. 100 పలాల రక్తం వుంటుంది. విణ్మూత్రాలలో ఒక్కక్కటి 4 దోసెళ్ళ లెక్కన వుంటాయి. ఇలాటి అపవిత్ర వస్తువులతో నింపబడిన ఈ శరీరంలోనే జీవుడు కర్మబద్ధుడై పడి వుంటాడు ఇదీ దేహోత్పత్తి.

# దేహ లక్షణము

అశుచిగా వుండడమే ఈ శరీరం యొక్క ప్రధాన లక్షణంగా వుంది/శుక్ల శోణిత సంయోగంలో ఆవిర్భవించిన ఈ శరీరం నిత్యం మలమూత్ర భూయిష్ఠమై అపవిత్రతకు ఆటపట్టుగా వుంటుంది. దర్భలతో దిగదుడిచినా, సుగంధ ద్రవ్యాలు పూసినా అది తాత్కాలికమే. తీర్థప్రసాదాలుగాని, పవిత్రాతి పవిత్రాలైన హవిస్సులు గాని - యేవి స్వీకరించినా సరే వాటికవి అశుద్ధరూపాన్ని పొందుతాయి. యీ దేహంలో ఎంతగా ప్రక్షాళనం చేసినా - పునఃపునః అశుచిని సంతరించుకునే ఈ శరీరానికి శాశ్వత పవిత్రతను చేకూర్చేదంటూ యేదీలేదు.

తన మలమూత్రాల వాసన తనకే తెలుస్తున్నా, తన మేని చెడు కంపు తనకే తెలుస్తున్నా కూడా - ఇంకా ఈ తనువు మీద మోహం చంపుకోలేకపోవడం జీవుల అమాయకత్వానికి తిరుగులేని ఋజువు/కాబట్టి పాపసంకలితమైన దుర్గంధ నివారణార్థం, సర్వమూలకమైన పాప పరిహారార్థం - దేహానికి అంతశ్శోధనయొక్క ఆవశ్యకతను పెద్దలు నొక్కి వక్కాణించారు. ఆ అంతశ్శుద్ధి లేకుండా పైపైన చేసే శోధనల వల్ల ప్రయోజనం లేదు. అందువల్ల, భోగలాలసతను తగ్గించుకుంటూ మనసును పరోన్ముఖం చేసి వైరాగ్య భావంతో జీవించాలి.

# వయో వేదనలు

ఇంద్రియాలు పూర్తిగా వ్యక్తం కాకపోవటం వల్ల బాల్యంలో దుఃఖితుల మౌతాము. దంతాలొచ్చేవేళ కూడా రోగార్తులమౌతాము. బాలారిష్టాలూ, బాలగ్రహ దోషాలూ వేలకు వేలు దాటాల్సి వుంటుంది. ఆకలిదప్పులు దుఃఖం - బాల్యం

తాలూకు అజ్ఞానం వల్ల స్వమలమూత్రాలనే తనువెల్లా అంటించుకోవడం - ఇవన్నీ బాల్యకష్టాలు, కుమారావస్థలో కర్ణవేథ, విద్యాభ్యాసాది విషయాలలో యాతన - యౌవనంలో యింద్రియాలు బలవంతాలవడం వల్ల కామోపభోగాలూ అవీ మరిగి రాత్రి నిద్దపట్టక - పగలు మనశ్శాంతి లేక వృధా తపనలు, అలా గానుగులో పడిన చెరుకుగడలా - వృద్ధాప్యం అనే పిప్పిగాపరిణమిస్తాడు పురుషుడు.

ఆ ముసలితనం పిప్పిమీద చేదస్తాల ఈగలు ముసురుతాయి. ఓపికున్నన్ని నాళ్ళూ చేయని మంచితనమంతా ఓపికలేనప్పుడు ఒక్కసారిగా చేసేయాలనే అర్థం లేని ఆలోచనలవల్ల యేర్పడేదే చేదస్తం. అసలే వృద్ధాప్యం సర్వులచేతా తిరస్కరింప బడే విషయంకాగా, ఈ చేదస్తంవల్లా - లోకాన్ని అతిగా పూసుకోవాలనే మోహాతి రేకం వల్లా పలువురి అసహ్యాలకు అపహాస్యాలకు కూడా గురి అవుతాడు.

## కాల సూచనలు

దేహం తయారవడం - దేహిగా జన్మించటం, జంజాటంలా అయ్యిందిగదా! తరువాతిది తరలిపోవడమే - కాలధర్మం చెందటమే. అయితే మరణానికి సూచన లేమిటి? రోగాలు రొష్టులూ అలా వుంచి - మరికొన్ని సూచనలున్నాయి యిక్కడ, అవి :- 1 శరీరంలోని పైభాగం ఎర్రగా కనబడుతూ, దిగువ భాగం హఠాత్తుగా తెల్లబడిపోవడం, 2. నోరు,చెవులు, కన్నులు, నాలిక స్తంభించిపోవడం, 3. చెవులు మూసుకున్నప్పుడు తనలోనుండి ఏ నాదమూ వినబడకపోవడం, 4. సూర్య చంద్రాగ్నులలో వెలుగుని చూడలేకపోవడం, 5 వరుసగా 15 రోజులుపాటు ముక్కు నుంచి 'ద్రవం' కారడం, 6. నాలుక మొద్దుబారడం, పళ్ళు సలుపూ, పోటూ వంటి పీడలకు గురికావడం, 7 నీళ్ళలోనూ, నూనెలోనూ, అద్దంలోనూ, నేతిలోనూ కూడా తన ప్రతిబింబంతనకే కనబడకుండా పోవడం, 8. సూర్యుడు కనబడుతున్న దిశలు గుర్తించలేకపోవడం, 9. ధృవమండలం అంతా మబ్బుపట్టినట్లు కనబడటం, 10. అర్ధరాత్రివేళ ఇంద్రధనుస్సు కనిపించడం, 11. పగటిపూట కొరవలు (చుక్కలు) రాలుతున్నట్లు కనపడటం, 12. కాకులూ గ్రద్దలూచేత చుట్టబడటం, 13. ఆకాశంకేసి చూస్తే సప్తర్షి మండలం కనబడకండా వుండటం, 14. సూర్యుడు గాని చంద్రుడుగాని - హఠాత్తుగా రాహుగ్రస్తులైనట్లుగా తోచడం, 15. దిక్కులు పరిభ్రమిస్తున్నట్లు - అనిపించడం ఇవి. ఈ పదిహేను లక్షణాలనూ శ్రద్ధగా గుర్తించు కోవాలి. ఆరు నెలల్లో మరణ మాసన్నమయ్యే వారి లక్షణాలు యివి.//

1. ఎడంచెయ్యి - ఎడతెరిపి లేకండా ఏడు రోజులపాటు అలా అదురుతూనే వుండడం. 2. శరీరంలో అవయవాలన్నీ పొంగుచూపడం. దౌడలు ఎండగట్టడం. 3. తన నీడ తను చూచుకుంటే - తలలేని మొండెముగా కనబడటం, 4. అసలు తన నీడే తనకు కనబడకుండా పోవడం, 5. బాగా నల్లగా వుండే ఈగలు అకారణంగా వళ్ళంతా ముసురుకోవడం - లేదా తన చుట్టూనే పరిభ్రమించడం, 6. కాకిగాని - పావురముగాని, లేదా రెండూ కలిసిగాని - లేదా, ఒకదాని తర్వాత మరొకటిగా గాని - పనిగట్టి వచ్చి తలపై వ్రాలడం, ఈ ఆరు లక్షణాలూ - ఒక నెలల్లో కన్ను మూయబోయే వారికి సూచనలు.

సూర్య చంద్ర మండలాలు రెండూ కాంతిహీనాలైపోతాయి. కేవలం తెల్ల రంగో, ఎర్రరంగో మాత్రమే కనబడతాయి. ఇలా కనిపిస్తే పదిహేను రోజులల్లో మరణం అని తెలుసుకోవాలి.

## కాల వంచన



అయితే మృత్యువునుండి బైటపడే మార్గమే లేదా అంటే ఉంది. అంతా నిద్ర పోతున్న వేళ-ఏ మాత్రపు దీపపు వెలుతురూ కూడా లేని చీకటిలో పరిశుభ్ర మైన ప్రక్కమీద సుఖాసీనుడై-చూపుడు వ్రేళ్ళతో రెండు చెవులూ మూసుకోవాలి అలా ముహూర్తకాలం (48 నిమిషాలు) వున్నట్లయితే శరీరంలోని ధ్వని వినిపిస్తుంది.

అలా ధ్వని వినబడినట్లయితే ప్రదోషకాలం తినిన ఆహారమంతా జీర్ణమై పోతుంది. జ్వరాది రోగాలూ నశించిపోతాయి. యీ వినబడే అంతశ్శబ్దం తొమ్మిది రకాలుగా వుంటుంది.

**1. సాధారణ మ్రోత** :- చిత్తశుద్ధి కలిగిస్తుంది. వ్యాధులు హరించి, జన వశీ కరణం కలిగించుతుంది.

**2. కంచుమ్రోగినట్లు వినబడుతుంది** :- విష జంతువులు, భూత ప్రేత పిశాచాదులు స్వాధీనాలవుతాయి.

**3. కొమ్ముబూరా ఊదినట్లుగా వుండే ధ్వని :-** సర్వశత్రువులపైనా విజయాన్ని ఆకర్షింపచేస్తుంది. యక్షకన్యలనీ, గంధర్వకన్యలనీ రాబట్టచేస్తుంది.

**4. గంట మ్రోగుతున్నట్లు వినిపించే శబ్దం:-** దేవతల్నీ, మానవుల్నీ ఆకర్షింప చేస్తుంది. యక్షకన్యలనీ, గంధర్వ కన్యలనీ రాబట్టచేస్తుంది.

**5. వీణ మీటినట్లుగా వుండే నాదం :-** దూరదర్శన శక్తి నొసగుతుంది.

**6. వేణు (వెదురుబొంగు వూదినట్లుగా) నాదము :-** తత్త్వజ్ఞానమును కలిగిస్తుంది.

**7. భేరీ మ్రోగించినట్లుగా వినబడే అంతర్నాదం :-** జరా మరణాలు లేకుండా చేస్తుంది.

**8. శంఖనాదంవలె వినబడేది:-** వివిధ రూపధారణము కలిగిస్తుంది.

**9. మేఘాలు గర్జిస్తునట్లుగా వినబడే నాదం:** అన్ని ఆపదలనీ తొలగింప చేస్తుంది.

ఇలా ప్రతిరోజూ క్రమం తప్పకుండా -చెవులు మూసుకుని ఆ ధ్వనిని విన్నట్లయితే మృత్యువును జయించగలుగుతాడని చెప్పబడింది. ఆ శబ్దం వినబడుతున్నకొద్ది సంసారబంధాలకు యెడమైపోతాడు.

ఐతే యీ మంత్ర తంత్ర యంత్రాదులు వేటితోటీ నిమిత్తంలేని యోగా వలంబకులు - మితాహారం తీసుకోవాలి. క్రమక్రమంగా ఆకలి దప్పులను జయించ గలుగుతారు. నిద్ర, ఆలస్యం అనే రెండు మహావిఘ్నాలనూ ముందస్తుగా పార ద్రోలాలి. ఈ విధంగా శబ్ద బ్రహ్మోపాసన చేసేవారు వందసంవత్సరాల వృద్ధులైనా సరే యువకులై ఆరోగ్యంతో జీవిస్తారు. శబ్ద బ్రహ్మమే శివుడని భావించాలి.

## మన్వంతరాలు - పదవులు - ఋషులు

ఇంకా ఇలా చెబుతున్నాడా సూతుడు. మనువులు పద్నాలుగుమంది. ఏ మన్వంత రానికా మన్వంతరం ఆ మనువు పేరుతోనే పిలవబడుతూ వుంటుంది. మొదటి మనువు స్వాయంభువుడు. ఇతని మన్వంతరం స్వాయంభువ మన్వంతరం.

ఈ మన్వంతరంలో-మరీచి, అత్రి,అంగీరసుడు, పులహుడు, క్రతువు పులస్త్యుడు, వశిష్ఠుడు అనే బ్రహ్మ మానసపుత్రులు యేడుగురూ - ఉత్తరదిశలో

సప్త మహర్షులుగా వుంటారు. "యాములు" అనబడే వాళ్ళు దేవతలగానూ-యజ్ఞుడనేవాడు యింద్రుడిగానూ వ్యవహరిస్తారు.

రెండవదైన స్వారోచిష మన్వంతరంలో మనువు పేరు స్వారోచిషుడు 'రోచను'డనేవాడు యింద్ర పదవిలో వుంటాడు. 'తుషితు'లన బడేవారు దేవతలు ఊర్జస్తంభ, పరస్తంభ, ఋషభ, వసుమంత జ్యోతిష్మంత, ద్యుతిమంత, రోచిష్మంతులనే యేడుగురూ సప్తఋషులు.

ఉత్తమ మన్వంతరము మూడవది. మనువు పేరు 'ఉత్తముడు' సత్య వేద శ్రుతాదులు దేవతలవుతారు. ఇంద్రపదవి సత్యజిత్తుది. ఊర్జస్తంభుడు మొదలైన వారే సప్తర్షులు.

నాలుగవ మనువు తామసుడు. అతని కాలం తామస మన్వంతరంగా చెలామణీ అవుతుంది. ఇంద్రుడిపేరు "త్రిశంఖుడు" సత్యులనే వాళ్ళు దేవతలు. గార్గ్య, పృథు, వాగ్మి, జన్య, ధాత, కపీనక, కపీవంతులు సప్త మహర్షులు.

మనువులలో ఐదవ వాడు రైవతుడు, ఇతని పేర రైవత మన్వంతరంగా కొనసాగుతుంది. దేవబాహుడు, జయముని, వేదశిర, హిరణ్యారోమ, పర్జన్య, ఊర్ధ్వబాహువులనబడే వారు సప్తర్షులు భూతరజస్కులు దేవతలు. విభువన బడేవాడు ఇంద్రుడవుతాడు.

ఆరవదైన చాక్షుష మన్వంతరాన మనువుపేరు చాక్షుషుడు. మేథాతిథి, పౌలస్త్యుడు, వసువు, కశ్యపుడు, జ్యోతిష్మంతుడు, భార్గవుడు ధృతిమంతుడు - అనే వాళ్ళు ఏడుగురూ సప్తర్షులు.

యేడవదైన వైవస్వత మన్వంతరమే యిప్పుడు నడుస్తున్నది. మనువు పేరు వైవస్వతుడు, కశ్యపుడు, అత్రి, వశిష్ఠుడు, విశ్వామిత్రుడు, గౌతముడు, జమదగ్ని, భరద్వాజుడు అనే ఏడుగురూ సప్తర్షులు. సాధ్వి, రుద్ర, విశ్వేదేవ, వసుమత్, ఆదిత్య, అశ్వినీ కుమారాదులు దేవతలుగా వుంటారు. పాకశాసనుడనబడేవాడు ఇంద్రుడిగా వ్యవహరిస్తాడు.

సావర్ణి ఎనిమిదవ మనువు. మన్వంతరం పేరు సావర్ణి మన్వంతరం అంగీరస, వాసిష్ఠ, అత్రేయ, హవ్య, పులహోదు, లనేవారు సప్తర్షులు. రోహితుని సంతానం దేవతలుగా ప్రవర్తిల్లుతుంది.

రుచి అనే తొమ్మిదో మనువుయొక్క కాలం రౌచ్య మన్వంతరం అనాగతు లనే వారు దేవతలు. రామ, వ్యాస, ఆత్రేయ, దీప్తిమంత, సుబాహు, శ్రుత, భారద్వాజ, అశ్వత్థామ లనేవారు సప్తర్షులు. ఈ మన్వంతరంలో బలిచక్రవర్తి యింద్రత్వాన్ని నెరపుతాడు.

బ్రహ్మ సావర్ణి మన్వంతరం పదోది. హవిష్మంత, పులహ, ప్రకృతి నార్గవ, అయుముక్తి, ఆత్రేయ, వసిష్ఠ, అవ్యయ, పౌలస్త్య, ప్రయతి భామార, కశ్యప అంగిర అనేక వసతుల్యఅనే పదహారుగురూ/సప్తర్షులు ద్విషమంతు లనబడేవారు దేవతలు. శంభువనే వాడూ యింద్రుడు.

తదుపరి ధర్మమన్వంతరం. హవిష్మంత, కశ్యప, వపుష్మంత వారుణి, ఆత్రేయ, వసిష్ఠ, అనయ, అంగిరచార, ధృష్యపౌలస్త్యనిఃస్వర అగ్ని తైజసులు సప్తర్షులు. వైధృతులు దేవతాగణం.

పన్నెండోది రుద్రసావర్ణి మన్వంతరం, ద్యుతి, వసిష్ఠ పుత్రుడు, ఆత్రేయుడు, సుతపుడు, అంగిరుడు, తపోమూర్తి తపోవస్వి, కశ్యపుడు తపోధనుడు, పౌలస్త్యుడు, పులహుడు, తపోరతి, భార్గవుడు అనే వాళ్ళు సప్తర్షులు. బ్రహ్మ మానసపుత్రులు దేవతలు, ఋతధాము డింద్రుడు.

దేవసావర్ణిక మన్వంతరం పదమూడోది. అంగిర, ధృతిమంత, పౌలస్త్య, అహవ్యవంత, పౌలహ, తత్త్వదర్శి, భార్గవ, నిరుత్సవ, నిష్ప్రపంచ,, ఆత్రేయ, నిర్దేహ, కశ్యప, వశిష్ఠులు సప్తర్షులు. త్రివిధులు దేవతాగణాలుగాను. దివస్పతి యింద్రుడుగానూ వుంటారు.

కడగొట్టుది ఇంద్రసావర్ణి మన్వంతరం. అగ్నీధ్ర, కశ్యప, పౌలస్త్య, మాగధ, భార్గవ, అతిబాహ్య, శుచి, అంగీరస, యుక్త, ఆత్రేయ, పౌత్ర, వాసిష్ఠ, అజిత, పులహులనే వారు సప్తర్షులు పవిత్రులు చాక్షుషులు అనేవారు దేవతలు శుచి - ఇంద్రుడు.//

# ఛాయాపురుష వర్ణనం

శుభ్రంగా స్నానాదులూ అవీ ముగించుకున్నాక - పరిశుభ్రాలైన తెల్లటి బట్టలు ధరించాలి. పూలమాల వేసుకోవాలి. శివపంచాక్షరిని గాని లేదా - "ఓం - హ్రీం -

నమః సదాశివాయ" అనే నవాక్షరీ మంత్రంగాని జపిస్తూ వుండాలి. సూర్యుడుగాని, చంద్రుడు గాని - మన వైపున వుండేలా చూసుకునిపైన చెప్పిన మంత్రం జపిస్తూ - తన నీడను చూసుకుంటూ వుండాలి.

కాస్సేపు చూసుకున్నాక - అదేనీడ తెలుపురంగులో ఆకాశంలో చూడగలుగు తాము. దానినే ఛాయాపురుషుడంటారు. అనుభవంలోకి వచ్చాక - ఆ నీడ ద్వారా శివదర్శనం లభిస్తుంది. తద్వారా ఫలం చెప్పుకోవాలి.

1. అయితే - తననీడ తల లేనిదిగా కనిపిస్తే మాత్రం ఆ వ్యక్తి - ఆరు నెలల్లో అంతరించిపోతాడు. 2. శరీరచ్ఛాయ తెల్లగావుంటే - ధర్మవృద్ధి అవు తుంది. 3. నల్లగా వుంటే - పాపాభివృద్ధి జరుగుతుంది. 4. ఎర్రగా వుంటే చిక్కులు కలుగుతాయి. 5. పసుపైతే శత్రుత్వం సంభవిస్తుంది. 6. వస్త్రహీనమైతే - బంధువులు నశిస్తారు. 7. వంకరగాకనిపిస్తే - భార్య మరణిస్తుంది. 8. పాదాలు ఆనకపోతే - విదేశీప్రయాణం ఏర్పడుతుంది. ఇది ఛాయాపురుష లక్షణం.

# పితృ శ్రాద్ధ ప్రశంస

అటు పై పితృ శ్రాద్ధాదికములు సత్యమేనా? అనే ప్రశ్నకు సమాధానమిస్తూ - సూతుడు ఇలా చెప్పసాగాడు.

"ఆహా! శ్రాద్ధ కర్మలన్నీ సత్యమే అయితే కల్పంలో చెప్పింది చెప్పినట్లుగా చేయాలి. పూర్వం - శంతను మహారాజు మరణించిన అనంతరం భీష్ముడు -పితృశ్రాద్ధం పెట్టాడు.

పిండాన్ని దర్భలపై వుంచాడు అదే సమయంలో శంతనుడి చెయ్యి భూమిని చీల్చుకుని పైకి వచ్చింది. పిండంకోసం చెయ్యి చాపింది. అప్పుడు భీష్ముడు - "హే తాతపాదా! క్షమార్హుడను - శ్రాద్ధపిండాన్ని తండ్రి చేతియందు వుంచుము. అని కల్పంలో లేదు కాబట్టి - కల్ప ప్రకారంగా దర్భలపై వుంచాను దయవుంచి అందుకో" అన్నాడు. శంతనుడతని ధర్మపాలనకు సంతోషించి - "ప్రలోభ రహితుడవైన గాంగేయా! స్వచ్ఛంద మరణాన్ని వరంగా యిస్తున్నాను స్వీకరించు" అని దీవించాడు అందువల్ల శ్రాద్ధకర్మలనెప్పుడూ కూడా కల్పోక్తరీత్యా యథా విధిగానే చెయ్యాలి.

పితరుల గణాలు స్వర్గంలోసప్త సంఖ్యాకంగా వున్నాయి. వాటిలో నాలుగు మూర్తిమంతాలు-మూడు నిరాకారాలు.

పితృకర్మలలో వెండిపాత్రలు వాడటం చాలా ఉత్తమం కనీసము వెండి కలిపి చేసిన వాడాలి. పితరులవల్లనైనా చంద్రాభివృద్ధి జరుగుతుంది. కర్తకు వంశాభివృద్ధి కలుగుతుంది.

"దేవ కార్యా దపి మునే పిత్ర్య కార్యం విశిష్యతే"

దేవతా పూజలకన్నా కూడా-పిత్ర్య కార్యమే అత్యంత ప్రధానం శ్రాద్ధకర్మ లలో స్వధాకారాన్ని ఉచ్చరిస్తూ అగ్నిలో హవనం చేయాలి. పిత్ర్య శ్రాద్ధం వలన సాగరవన పర్వత సర్వసస్య శోభితమైన స్థావర జంగమాలన్నీ సంతోష పడతాయి. పుష్టిని పొందుతాయి. కాబట్టి మానవులు సర్వదా తమ పితరులను తృప్తిపరుస్తూనే వుండాలి.

తండ్రికీ, తండ్రి తండ్రికీ వారి తండ్రిగారికీ గోత్రనామయుక్తముగా మూడు పిండాలు వదిలినట్లయితే వారు సంతృప్తులౌతారు.

# శ్రాద్ధకర్మలోని విధులు - వివరణ

సూతుడు చెప్పింది విని - ఋషులు మళ్ళా ప్రశ్నించారు.

"సూతర్షీ! జీవులు తమ తమ కర్మానుసారముగా స్వర్గనరకాది లోకాలు పొందుతారుగదా! మరికొందరు మళ్ళీ పుడతారు గదా! అటువంటప్పుడు యీ శ్రాద్ధకర్మలలో వదిలే పిండం వారివారి కెలా అందుతుంది?" అని. నవ్వాడు సూతుడు "మంచి ప్రశ్నే వేశారు మరణించిన వాళ్ళు - ఏ లోకానికి వెళ్ళారో యీ లోకంలో వుండేవాళ్ళకి తెలియదు. అందుకే శ్రాద్ధ పిండ ప్రదానవేళ - అగ్నీ కరణ, బ్రాహ్మణ భోజన, పిండ ప్రదాన, వికిర, దక్షిణ దాన భూరి భోజనాలచే ఆరు విధములు నిర్వహించాలి. వాటి వివరాలు ఏమిటంటే 1. అగ్నీకరణం - ఈ అగ్నీకరణం ద్వారా పంపబడిన కవ్యాలు - దేవలోకంలో వున్న పితరులకు చెందుతాయి. 2. యమలోకంలోనే వున్నట్లయితే - వాళ్ళకి 'పిండప్రదానం'గా తిలలో వదిలినవి చేరతాయి. 3. మరీ నరకంలో వున్న పితరులకైతే వికిరాన్నం వుంచాలి. అది వారి పరమౌతుంది. 4. స్వర్గములో విరాజిల్లుతున్న వారికి అన్నదానం (భూరిభోజనం) వల్లా తృప్తి కలుగుతుంది. 5. ఒక వేళ వారు మానవ

లోకంలోనే గనక వున్నట్లయితే (పునర్జన్మను పొంది వుంటే) మనం ఇచ్చే దక్షిణ వాళ్ళని తృప్తి పరుస్తుంది.

అందువల్ల - పితరులవునికి మనకు తెలియదు గనక - వారు ఎక్కడ వున్నా అదే నిమిత్తం పై ఆరు కర్మలనూ పాటించాలి. అందువల్ల పితరులు యే లోకాల్లో వున్నా తమకు అర్హమైన - అర్పించబడిన కవ్యాలను వారు అందు కుంటారు. పరమ పవిత్రమైన ప్రయాగ క్షేత్రంలో శ్రాద్ధం చేస్తే - ఏ లోక వాసులకైనా చేరిపోతుంది.

మనం ఒక్క విషయం గుర్తుంచుకోవాలి పితరులు ఎక్కడ వున్నా ఏ లోకంలో వున్నా-వాళ్ళు ఏ పరిస్థితిలో వున్నాసరే - నిత్యానుగ్రహ సమర్థులు వాళ్ళు, వాళ్ళు నరకం అనుభవిస్తున్నాసరే-అనుగ్రహం కలిగిందిరా అంటే స్వర్గ సుఖాలన్నీ మనకు అందించగల వాళ్ళు అందువల్ల - ఎల్లప్పుడూ పితరులను సంతోషపెడుతూనే వుండాలి. అని చెప్పాడు సూతుడు. అనంతరం సప్తవ్యాధ చరిత్రను చెప్ప నారంభించాడు.

# సప్త వ్యాధ చరిత్రం

భరద్వాజ వంశంలో కౌశికుడనే బ్రాహ్మణుడుండేవాడు. అతగాడికి వాగ్దుష్టుడు, క్రోధనుడు, హింస్రుడు, పిశునుడు, కవి, స్వపృష్టుడు, పితృవర్తి-అని ఏడుగురు కొడుకులుండేవారు. ఆ ఏడుగురూ గర్గుడి వద్ద శిష్యులుగా చేరారు. వేదవేదాంగాలూ, శాస్త్రాలూ శ్రద్ధగా నేర్చుకున్నారు. ఇలా వుండగా ఒకనాడు కౌశికుడు కాలధర్మం చేశాడు దాంతో కుర్రాళ్ళు ఏడుగురూ కూడా గురువునే ఆశ్రయించారు.

గురువుగారి చెంతనే వుంటూ గోరక్షణ చేస్తూ వుండేవారు. అక్కడ వుండగానే ఒకనాడు పితృతిథి జరిపేందుకు దారిలేదు. ఆ క్షణంలో వాళ్ళు గురువుగారి గోవుల్ని మేపుతున్నారు. అందువల్ల ఆ సోదరులలోని కవి, స్వపృష్టులనే ఇద్దరూ అభ్యంతరపరచినప్పటికీ కూడా - తప్పనిసరిగా తలచి - పితృభక్తితో ఆ గోవును చంపేసి పారణ పెట్టేశారు.

ఆశ్రమానికి వెళ్ళి ఆవును పులి చంపిందని చెప్పి దూడను మాత్రం గురువుకు వప్పగించేశారు. నమ్మాడా వెర్రి బ్రాహ్మణుడు. ఆయన్నమ్మితే సరిపోతుందా?

చేసిన పాపంవదలొద్దూ? గోహత్యా గురుద్రోహం అనే రెండు పాపాలకూగానూ - ఆ మరుసటి జన్మలో "మనస్వి" అనే బోయవాడికి కొడుకులుగా జన్మించారు.

అయినా కూడా పూర్వజన్మ కృతతీవ్ర ప్రయత్న పూర్వక పితృకార్య నిర్వహణా పుణ్యం వల్ల - గతజన్మ తాలూకు జ్ఞాపకాలలో వుండేవారు. ఆ కారణంగా బోయ వారై పుట్టినప్పటికి కూడా మద్య మాంసాలు త్యజించి నియమనిష్ఠలు పాటిస్తూ అప్పటి కులాచార రీత్యా శివారాధన చేస్తుండేవారు. ఈ జన్మలోని అహింసా వ్రత పుణ్యాదులవల్ల ఆ పై జన్మలో జక్కవ పక్షి సోదరులుగా పుట్టారు. స్త్రీ పక్షి సంగమ మెరుగకకుండా బ్రహ్మచర్యమును అవలంబించారు. ఆ జన్మలో సుమనసుడు, సువాక్శుద్ధుడు భద్రదర్శనుడు, స్వతంత్రుడు, సుయజ్ఞుడు, కులీనుడు అనే పేర్లతో జన్మించిన ఆ చక్రవాక సప్తకం సరిద్వీపంలో విహరించేది.

నీ ప్రదేశాధీశుడైన రాజు ఒకనాడు - పత్నీ పుత్ర పరివారయుతుడై ఈ పక్షులు సంచరించే వనానికి వచ్చాడు. అతని వైభోగం చూసిన ఒక చక్రవాకము తాను రాజుగా పుట్టాలని కోరుకుంది. తక్కినవి - రాజుకు మంత్రులుగనూ యితర రాజోద్యోగులుగానూ వుంటామని అన్నాయి. తీవ్రోపవాసాదులు - అతులిత బ్రహ్మ చర్యం పాటించిన పుణ్యంతో మరుసటి జన్మలో వారి కోరిక నెరవేరిపోయింది.

జన్మాంతరాన వారు బ్రహ్మదత్తాది శుభాధేయులై కాంపిల్య నగరంలో ఉత్తమ మానవులుగా జన్మించారు. ఛిద్రదర్శి, సునేత్రుడు అనే నామాంతరాలు గలిగిన ఆ పక్షులు - వేద వేదాంగ పారంగతులైన విప్రులుగానూ - బ్రహ్మదత్తుడనే క్షత్రియుడుగానూ ప్రభవించడం జరిగింది.

కాంపిల్య నగరాధీశుడు - బ్రహ్మదత్తుడికి పట్టంగట్టి తాను తపోవనాలకు వెళ్ళిపోయాడు. శుద్ధ విప్రులయిన మంత్రులు, తమ పుత్రులను, మంత్రులను చేశారు. ఆ విధముగా చక్రవాకాల కోరికలు తీరాయి. అయినా, యెడబాయని పూర్వజన్మ స్మృతులవల్ల తామాచరించిన పితృకార్యము, అహింస, బ్రహ్మచర్యోప వాసాలే యీనాటి యీ వుత్కృష్ట పదవులకు కారణంగా గుర్తించినవారై - మరు జన్మను గురించి ఆలోచించినవారై: జన్మరాహిత్యాభిలాషతో సత్క్రతుత క్రియలాచరించారు.

ఋషులారా! సర్వ విధ శరీరకృత దోషాలూ, మానసిక పాపాలూ, వాచిక కల్మషాలూ అన్నీ తక్షణమే నివారింపచేసి శరీర, వాక్, మనస్సులకు తగిన పుష్టినిచ్చే

యీ సప్తవ్యాథ చరిత్రం శ్రద్ధాళువులూ బుద్ధిమంతులూ ఐన వారంతా తప్పక తెలుసుకోవాలి. అని చెప్పి అనంతరం మునిగణ వాంఛితాను సారంగా సూతుడు తన గురువు గారైన వ్యాసుల వారి విషయమై బోధించసాగాడు.

## పరాశర వృత్తాంతము



బ్రహ్మ మానస పుత్రుడైన వశిష్ఠుల వారి మనుమడు పరాశరుడు. అఖండ జ్ఞానం సంపాదించాడాయన. ముఖ్యంగా ఖగోళ జ్ఞానప్రియుడైన ఆయన గొప్ప జ్యోతిషశాస్త్రవేత్తగా పరిణమించాడు. 'పరాశరహోర' అనే అద్భుతమైన జ్యోతి శ్శాస్త్రాన్ని రచించాడు. వశిష్ఠుడి మనుమడనో శక్తిగారి అబ్బాయ్ అనో గాకండా తనకుతాను స్వకీయమైన ప్రజ్ఞతో తపస్సుతో బ్రాహ్మణ శ్రేష్ఠులందరిలోనూ అగ్రగణ్యుడిగా ఆనాటి వారందరిచేతా ఆరాధించబడ్డాడు.

మహానుభావుడాయన, నిత్యం ఆ జ్యోతిశ్చక్రాన్నీ, దానిలోని గ్రహచారాదికాల్నీ లెక్కగడుతుండేవాడు. ఆయా గ్రహరీతులరీత్యా భావిని జరగబోయే వింతలను తెలుసుకోగలగడం వల్ల తనలో తనే నవ్వుకునేవాడు.

ఒకనాడు ఆయన యమునా నదిని తరించవలసి వచ్చింది. నావ నడిపే దాశరాజుకు కబురు పెట్టాడు. అది సరిగా దాశరాజుకు భోజన వేళ - అతను భోజనం చేస్తున్నాడు. అందువల్ల అతని కూతురైన సత్యవతి పరాశరుణ్ణి పడవెక్కించుకుని యమునలో గెడవేసింది.

## సత్యవతీ పరాశరీయం

మెల్లగా కదులుతోంది పడవ - నల్లగా మెదులుతున్నాయి. యమునా నదీ తరంగాలు. ఆ తరంగాల మీద చల్లగా వీస్తుంది గాలి. అవడానికి మధ్యాహ్న సమయమే అయినా మనోజ్ఞంగా వాతావరణం, అల్లీ బిల్లీ పాటలేవో పాడుతోంది

సత్యవతి తన నిత్యాలోచనయైన జ్యోతిశ్చ క్రగతులలోనే వుంది. పరాశరుడి ఆలోచన. అందుకు దోహదం చేస్తుంది. ఆ ప్రకృతి, ఉన్నట్లుండి "ఆఁ" అను కున్నాడు పరాశరుడు.

జ్యోతిశ్చక్రచాలనం రీత్యా విష్ణుసన్నిభుడైన పుత్రోదయానికి నిషేక సమయం చేరువలోనే వుంది. కాని - ఎలా? అలా ఆలోచిస్తున్న పరాశరుడి దృష్టి పడవ నడుపుతున్న పడుచుదానిమీద పడింది.

ఆమె కన్యకే అన్నది తెలుస్తోంది./తానా తాపసి - తనది తపోవీర్యం, పిల్ల యెవరైనా శుద్ధమైన కన్యే గనక క్షేత్రం బలీయంగానే వుంటుంది. బీజం తనదవడం అన్ని విధాలా మంచిది. ఈ ఆలోచనరాగానే మెల్లగా ఆమెను కదలేశాడు.

ముందరామె జంకింది. " నేను కన్యను కదా" అంది, "మరి అందుకేగదా!" అన్నాడాయన. "అందరికీ తెలిస్తే" అంది. 'ఎవరికీ తెలియనీయనన్నాడాయన. "మీ దారిన మీరు దులిపేసుకు వెళ్ళిపోతారు. కడుపొకంతో అయితే నా గతేంగాను?/ "మీ పేరు చెప్పినా యెవరూ నమ్మరుగదా!" అంది. ఆమె కన్యాత్వం చెడకుండా అనుగ్రహించాడా ముని. తను మేను చేపల కంపుకదా అన్నదా పిల్ల. నీ చేపల కంపు నశిస్తుంది. నువ్వున్న తావునుంచి యోజనం మేరవరకూ కస్తూరీ పరిమళాలు విరజిమ్ముతుంది" అని అనుగ్రహించాడు.

మత్స్యగంధి యోజనగంధిగా పరిణమించింది. ఆమెకోసం ఆ పట్టపగలే యమునలో ఒక ఇసుక తిప్పని సృష్టించాడు ఎవరికి కనపడకుండా వుండటం కోసం ద్వీపాన్ని అదృశ్యద్వీపం చేశాడు. తనకి సిగ్గంది ఆ తరుణి. మసక చీకట్లు సృష్టించాడు ముని. కన్నెపిల్ల ముగ్ధ - అని అనుకోవడమేగాని మహాప్రౌఢలు పురుషుణ్ణి ఎంతగా ఆడిస్తారో అంతగానూ ఆడించేసిందాపిల్ల. ఎట్టకేలకు అంగీ కరించింది నిత్యజ్యోతిశ్శాస్త్ర చింతనాపరుడైన ఆ పరాశరుడు - ఆయన తలుచు కున్న ముహూర్తానికి - మసక వెలుగుల మాయాసైకత స్థలం మీద - సత్యవతికి నిషేకం చేశాడు.

## వ్యాస జననం

సద్యోగర్భంలో సత్యవతికి బిడ్డ పుట్టాడు. పుడుతూనే శిశువు బాలరూపాన్ని ధరించాడు కృష్ణాజిన కుశకమండల త్రిదండాదులూ కాపీనమూ ధరించి వున్నాడు,

మసక చీకట్ల యిసుకతిప్పలో పుట్టడంవల్ల కృష్ణ ద్వైపాయననాము డయ్యాడు. బాలరూపాన్ని ధరిస్తూనే తల్లికి నమస్కరించాడు. తపస్సుకు అనుమతించు తల్లి! అని ప్రార్థించాడు. తన అవసరం యేర్పడినప్పుడు తలచుకో మన్నాడు. అలా తలచుకోవడం ఆలస్యంగా కనిపిస్తానన్నాడు. నల్లని మేనుని గారింపుతో సహా అదృశ్యుడయిపోయాడు.

జరుగుతున్న అద్భుతాలకి ఆశ్చర్యంలో మునిగిపోయి ఆ పిల్ల అక్కడనుంచి తానెప్పుడు అదృశ్యమైందో - తనజాలరిగూడెం ఎప్పుడు చేరుకుందో తనకే తెలియదు. యేమైనా అడుగుతారేమో ననుకుంది. కాని, ఎవరూ ఏమి అనలేదు, తను మునితో పడవ నడుపుకు వెళ్ళడం అవి ఏమీ జరగనట్లే అందరూ ప్రవర్తించారు.

ఋషీశ్వరులారా! మీరు తెలుసుకుంటున్న శివపురాణ గ్రంథరచయితా, వేదాలని విభజించినవాడూ విష్ణ్వాభుడూ, పూజనీయుడూ, అయిన ఆ వేదావ్యాసుల వారి జననం యిలా సంభవించింది.

# వ్యాసుడి కథ

"అలా పుడుతూనే తపోభూములకు తరలిపోయిన ఆ మహనీయుడు అనంతరాన యేం చేశాడు" అని అడిగారు ఋషులు.

"తపస్సు చేశాడు" సూతుడు చెబుతున్నాడు ఆ తపస్సిద్ధి విషయంలోనే - బ్రహ్మచే నియమితుడై వేదగుచ్ఛాన్ని-నాలుగువేదాలుగా విభజించాడు. మరుగున పడిపోతున్న మహత్తర విషయాలన్నిటినీ క్రోడీకరించి పురాణాలుగా వ్రాయసాగాడు.

ఆ రోజుల్లోనే ఆయనకు పిల్లలమీదకి మనసుపోయింది. అరణిమధిస్తూ -ఘృతాచి అనే అప్సరసను చూసి చలించాడు. ఋషికి భయపడి ఆమె చిలక రూపం ధరించింది. చిలకలాంటి ఆ చిలక గురించిన ఆలోచనలో మధిస్తున్న అరణిలోనే స్ఖలించిన వీర్యాన్ని చిలికేశాడు. మరింత మంధించాడు. అందులోంచి అగ్నికి బదులు అగ్నిసమతేజో విరాజమానుడైన బిడ్డ జన్మించాడు/ బ్రహ్మాదులా బిడ్డపై పుష్పవృష్టిని కురిపించారు. బ్రహ్మ స్వయంగా దిగివచ్చాడు ధర్బాసన కృష్ణా జిన, మౌంజీదండ, కమండలాలను ఆ బాలుడికి బహూకరించాడు శుకసౌందర్య మనన వేళ స్ఖలిత వీర్యసంజాతుడైన ఆ బాలుడికి 'శుకుడు' అని పేరు పెట్టారు.

ఓ పుణ్యాత్ములారా! ఆ గర్భయోగీ, అఖిల లోకారాధ్యుడూ అయిన శ్రీశుక యోగీంద్రుడి యీ దివ్యావతారఘట్ట శ్రవణంతో ఈ పుణ్యాలు ద్విగుణీకృతమయ్యాయి. ఆయనను తలచుకోవడం వల్లా మీకు తెలియ, చేయడం వలనా - నా పుణ్యాలు కూడా పంటకు వచ్చాయి.



శుకుడు బృహస్పతి దగ్గర విద్యాభ్యాసం చేసివచ్చాడు. వ్యాసుడతనికి పెళ్ళి చేయాలనుకున్నాడు. శుకుడంగీకరించలేదు. వ్యాసుడు కలతబడ్డాడు. పెళ్ళీ పెడాకులూ లేకుండా బిడ్డ యే బైరాగుల్లో కలిసి పోతాడోనని భయపడి పోయాడు.

నయానా భయానా చెప్పి చూశాడు. చెప్పొద్దూ - గురువుగారు విష్ణు భాగవతం వ్రాశాడన్నా, దేవీభాగవతం వ్రాశాడన్నా అదంతా మా శుకుడి కోసమే. అవన్నీ వ్రాసి - వాడిచేతా నాచేతా చదివించాడు. అయినాసరే శుకుడీ సంసార లంపటము లోకి 'దిగనుగాక! దిగ' నన్నాడు. చివరికి జనకుడి దగ్గరికి పంపించాడు వ్యాసుడతన్ని. మరా జనకుడేమ్మంత్ర మేశాడోగాని - అంతటి శుకుడూ మళ్ళా తండ్రి ఆశ్రమానికి చేరుకున్నాడు.

ఈలోగా నా చదువుముగిసింది. 'వ్యక్తుడవుక'మ్మన్న గురు ఆశీస్సులతో నేను బైటకి వచ్చేశాను. జనకుడి హితవుతోనిజ జనకుడి ఆశ్రమం చేరిన శుకుడు - అటు తర్వాత తండ్రి ఆశయం మేరకు 'పీవరి' అనే పిల్లను పెళ్ళాడాడనీ, పిల్లల్ని కూడా కన్నాడనీ, మనవలు పుట్టారనీ - మనుమడైన బ్రహ్మాదత్తుడు రాజయ్యాడనీ ఆ పిమ్మట శుకుడు సిద్ధి పొందాడనీ పంచభూతాలలలోనూ కలిసిపోయాడనీ చెప్పుకున్నారు.

అదంతా నాకు ప్రత్యక్షం కాదు. దృఢమైన వినికిడికాదు. ఏదో చెప్పారు. ఏదో విన్నాను. కాని - శుకుడు పంచభూతాలలోనూ లీనం అయిపోయాడన్నది మాత్రం నన్ను క్రుంగదీసేసింది. ఎలాంటి తేజస్సు ఎలాంటి వచస్సు - ఎంత ఒద్దికైన మనస్సు! ప్చ్-సరే...సిద్ధి పొందడమంటే మాటలా! అందునా యోగసిద్ధి

ఏమైనా మా శుకుడు జాతకుడు కాబట్టే యీ దౌర్భాగ్యాలన్నిటికీ అతీతంగా అద్భుతుడూ, సుందరుడూ, సుశీలుడూ ముక్తుడూ అయిపోయాడు.

అతనితోనే చదివాను నేను - వాళ్ళ నాన్నగారి శిష్యరికమే చేశాను నేను - ఇదిగో యిలా పురాణాలు పుక్కిటబట్టి చెప్పుకు బ్రతుకుతున్నాను - ఫ్చ్ కానివ్వండి సర్వం కాలాధీనం. అలా శుకుడు తనకి కాకుండా పోవడంతో ఓర్చుకోలేక పోయారు. మా గురువుగారు - ఘోడుఘోడున విలపించారు.

శివుడంతటివాడు స్వయంగా వచ్చి ఓదార్చాడు. పంచభూతాలలోకీ యధా రూపానికి విశీర్ణుడైపోయిన ఆ శుకుడు, వ్యాసుడెప్పుడు పిలిస్తే అప్పుడే ప్రతిధ్వనిస్తాడని అనుగ్రహించాడు. తన నీడనే తనయుడిగా గుర్తించుకోమని చెప్పాడు. ఇది జరిగిన వ్యాసుడు దుఃఖాత్ముడై వున్న రోజుల్లోనే సత్యవతి ఆయనను స్మరించింది.

వ్యాసుడామెను విడిచివచ్చేసిన కొన్నాళ్ళకి - చేపలకంపుపోయి కస్తూరి వాసనలు జిమ్మే తనువుతో యోజనగంధిగా వెలుగొందే ఆమెను శంతనుడు పెండ్లాడాడు.

శంతనుడు ఆమె యందు యిద్దరు బిడ్డల్ని కని మరణించాడు. అందులో ఒకడు తన పేరుగల గంధర్వుడితో తలపడి - తలపోగొట్టుకున్నాడు. రెండోవాడికి కాశీరాజు కూతురైన అంబిక అంబాలిక అనే యిద్దరు కన్యలనిచ్చి పెళ్ళిచేశాడు భీష్ముడు. విపరీత కామకలాపాల వల్ల రాజయక్ష్మకు గురై మరణించాడు. ఆ రెండో బిడ్డ. రాజ్యం అనాధ అయిపోయింది. తాను తన ప్రతిజ్ఞ తప్పి సింహాసన మెక్కనన్నాడు భీష్ముడు. వయసులో ఉన్న మరదళ్ళకు దేవరన్యాయం రీత్యా-సద్బ్రాహ్మణుడి వల్ల సంతు కలిగించమన్నాడు.

విధవలైన కోడళ్ళను యెవరో బ్రాహ్మణుడికి అప్పచెప్పడం అంతగా యిష్టం లేకపోయింది సత్యవతికి. "అయ్యో! నాకు మరో కొడుకుంటే బాగుణ్ణు కదా!" అనుకుందీ అనుకోవడం ఆలస్యంగా వ్యాసుడు స్ఫురించాడు. "ఉన్నాడు గదా తొలిసంతానం" అనుకుంది వ్యాసుణ్ణి తలుచుకుంది ఠక్కున వచ్చాడు వ్యాసుడు. యెదిగిన కొడుకుని చూసి సంబర పడిందా తల్లి.

వచ్చిన విపత్తు చెప్పి "నువ్వు కూడా నా కొడుకువే గనక - నా కోడళ్ళకి బావగారివవుతావు. తప శ్శాలివీ, పరాశరాత్మజుడీవీ గనుక నువ్వు బ్రాహ్మణుడివే

అవుతావు. ఉభయతారకంగా దేవర న్యాయాన నీ మరదళ్ళ యందు బిడ్డల్ని కనవయ్యా" అని చెప్పింది.

ఒక్కగానొక్క కొడుకూ తనకికాకండా పోయిన దుఃఖంలో తమునకలై వున్న వ్యాసుడు-తన ద్వారా పుత్రులు కలగడానికి అంగీకరించాడు పెద్దకోడలైన అంబికను అలంకరించి వ్యాసుడి చెంతకు పంపిందామె. వ్యాసుడామెతో క్రీడించాడు.

మరుసటిరోజు ఉదయం తల్లి వద్దకు వచ్చి అమ్మా నువ్వు చెప్పినట్లే చేశాను, నీ పెద్దకోడలు రతిసమయంలో వళ్ళు నాకు అప్పగించి తానుమాత్రం కళ్ళు మూసుకుంది. ఆ కారణంగా పుట్టే కుర్రాడు అంధుడై పుడతా" డని చెప్పాడు. సత్యవతి బాధపడిపోయింది. అంధుడు రాజ్యార్హుడుకాడు గనుక చిన్న మరదలి యందు ఓ నలుసును కనవయ్యా' అంది అంగీకరించాడు కృష్ణద్వైపాయనుడు.

చిన్న కోడలైన అంబాలికను అలంకరించి పంపింది సత్యవతి ఆ తదుపరి రోజు ఉదయం తల్లిని సమీపించి. 'అమ్మా! రతివేళ నీ చిన్న కోడలు నన్ను చూసి వెల వెలబోయిన కారణంగా పుట్టేవాడు తెలిమేనుతో పాండురోగిగా పుడతాడు" అని చెప్పాడు. సత్యవతి బాధతో సతమతమైపోయింది ఒకడు అంధుడు - ఒకడు పాండురోగీను ఇలా కాదు, మంచి మనవడు కావాలి, మరోసారి పెద్ద కోడలి ననుగ్రహించరా అబ్బాయీ" అంది. సరే నన్నాడు వ్యాసర్షి.

మళ్ళా పెద్ద కోడలిని నిషేకానికి పురమాయించింది సత్యవతి. ఆ పిల్ల వ్యాసుణ్ణి తలచుకుంటూనే కంగారు పడిపోయింది. ఆలోచనచేసి - తనబదులు తప దాసీదానిని అలంకరించి వ్యాసుడివద్దకు పంపింది.

తెల్లవారుతూనే తల్లి దగ్గరకు వెళ్ళాడు వ్యాసుడు-'అమ్మా! అపరిమిత పరాక్రమవంతుడు పుడతాడు. అసమాన ధర్మవేత్తవుతాడు, నీతికి హద్దుగా నిలుస్తాడు. ఎటొచ్చీ - రాత్రి నీ పెద్దకోడలు తను రాకుండా తన దాసీని పంపింది. అందువల్లనే చెప్పిన ఉత్తముడు ఆ దాసీదాని కడుపునపుడతాడు' అని విన్నవించాడు.

హతాశురాలైపోయింది సత్యవతి. ఇంకోసారి అంబాలికతో ప్రయత్నించమంది. 'ముమ్మారు నీమాట విన్నాను. నాలుగో ప్రయత్నం చెయ్యడం దోషమే అవుతుంది. కాబట్టి క్షమించ" మన్నాడు వ్యాసుడు. శౌనకాదులారా! ఆ విధంగా

వ్యాస వీర్యంతో అంబికయందు జన్మించిన అంధుడే ధృతరాష్ట్రుడు అంబాలిక యందు కలిగినవాడే పాండురాజు.

దాసీ పుత్రుడే విదురుడు. ఆ తర్వాత ధృతరాష్ట్రుడికి గాంధారియందు దుర్యోధన దుశ్శాసనాది వందమంది కొడుకులు కలగడం, పాండురాజుకు కుంతీ మాద్రులయందు యమ, వాయు, ఇంద్ర అశ్వినీ దేవతానుగ్రహాన ధర్మజ భీమార్జున నకుల సహదేవులావిర్భవించడం - గాంధారేయులు కౌరవులుగానూ - కౌంతేయులూ పాండవులుగానూ ప్రసిద్ధులు - గావడం, అనంతరం జరిగిన మహాభారత యుద్ధం అన్నీ మీకు తెలిసినవే గదా!

## వ్యాసుడు దక్షారామమున కేతెంచుట



తదుపరి కాలంలో-వ్యాసుడు కాశీలో వుంటుండగా - ఒకనాడు దురదృష్టవశాన ఆగ్ర హోన్మత్తుడై కాశీని శపించాడు. అన్నపూర్ణమ్మ తల్లి ఏమీ అనుకో లేదు. క్రుద్ధుడైన ఆయనను పిలిచి సాదరంగా భోజనము పెట్టింది.

శివుడు మాత్రం రవ్వంత చలించాడు. తనను దూషించినా పట్టించుకునే వాడు కాడా శివుడు. కాశీని తిట్టేసరికి కష్టపెట్టుకున్నాడు. మరొకడూ మరొకడూ అయితే విజయంతోనో విషమాక్షితోనో "హరీ" మనిపించేవాడే కాని - వ్యాసుడంతటి భక్తుణ్ణి అలా శిక్షించబుద్ధి కాలేదాయనకి.

అందుకే కాశీని వదిలిపెట్టి పొమ్మని మాత్రం శాసించాడు. ఘొల్లుమన్నాడు వ్యాసుడు. కాశీలాంటి దివ్యక్షేత్రం మరొకటి చూపిస్తే వెళ్ళిపోతా" నన్నాడు. 'డాకిరేమికి వెళ్ళు. ఉత్తరాన కాశీ ఎంతో దక్షిణాన దక్షారామం అంతటి పవిత్ర స్థలం" అని చెప్పాడు శివుడు. ఇక్కడ నేను విశ్వేశ్వరుడనైతే - అక్కడ భీమేశ్వరుడిని.

ఇక్కడ అన్నపూర్ణమ్మే అక్కడ మాణిక్యాంబ బయల్దేరు" అని తొందర పెట్టాడు శివుడు. అయినా సంకోచించాడు వ్యాసుడు. 'గంగో? అని నీళ్ళు

నమిలాడు గోదావరి వుందిలే" అన్నాడు శివుడు. 'గోదావరి గోదావరి గోదావరి' అంటూ మననం చేసుకున్నాడు వ్యాసుడు. చాలా మధురంగానూ, మధుర జలాల నాస్వాదించినట్లూ అనిపించింది శివ వాక్యానుసారంగా వ్యాసుడు కాశీనివదిలి దక్షిణాదిని గోదావరీ మహానదీతీరస్థ దక్షారామమనే మహాక్షేత్రం చేరాడు.

ఇలా మా గురువుగారి గురించి చెప్పుకుంటూ పోతే అంతూదరీ వుండదు. యెందుకంటే - ఆయన చిరంజీవి గనక, కొన్నాళ్ళు బ్రతికినవాళ్ళకైతే కొంతే చరిత్ర వుంటుంది. నిత్యుడి చరిత్ర కంతేమిటి? అని ఆపాడు సూతుడు.

## సృష్టి క్రమము



అనంతరం సూతుడు సృష్టి క్రమాన్ని వినిపించసాగాడు "సత్తు","అసత్తు" రెండూ కూడా తానే అయిన శివుడు ఓంప్రథమంలో నీళ్ళను పుట్టించాడు. అందులో "సంకల్పం" అనబడే రేతాన్ని స్థలించాడు. రేతమూ జలము సంగమించడం వల్ల నీటిలోంచి ఒక పురుషుడు జన్మించాడు. అతడే నారాయణుడు.

నారము అంటే నీళ్ళు అని అర్థం. నారోద్భవుడు గనక నారాయణుడైనాడు. అదే సమయంలో శివుడు ఒక గొప్ప అండాన్ని కల్పించాడు. అందులోంచి బ్రహ్మదేవుడు బయటపడ్డాడు. ఆ గ్రుడ్డును రెండు భాగాలు చేశాడు. పై భాగాన్ని స్వర్గంగానూ - దిగువభాగాన్ని భూలోకంగానూ విభజించాడు, నడిమి ప్రదేశం ఆకాశం అయ్యింది. క్రమంగా పై భాగం ఏడు లోకాలుగానూ క్రింది భాగం ఏడు లోకాలుగానూ, ఏడూ ఏడూ పద్నాలుగు లోకాలుగానూ ఆవిష్కరించబడ్డాయి.

పది దిక్కులు ఏర్పరచబడ్డాయి, ఆగ్నేయ, దక్షిణ, నైఋతీ, పశ్చిమ, వాయవ్య, ఉత్తర, ఈశాన్య, ప్రాకులనబడేవి ఎనిమిది, దిగువ ఒకటి, ఎగువ ఒకటీ కలిసి పది దిక్కులు. హద్దులు ఏర్పడగానే మనసు, వాక్కు, కామం, క్రోధం, ప్రేమ,

అనేవి పుట్టాయి. బ్రహ్మ మానసం నుంచి మరీచి, అత్రి, అంగీరసుడు, పులస్త్యుడు, పులహుడు, క్రతువు, వశిష్ఠుడు అనే ఏడుగురు మునులు పుట్టి సప్తర్షులుగా, సప్త బ్రహ్మలుగా సుప్రసిద్ధులయ్యారు. అనంతరం ఏకాదశ రుద్రుల ఆవిర్భావం జరిగింది.

ఆకాశంలో ఉరుములు, మెరుపులు, పిడుగులు, మేఘాలు, ఇంద్ర ధనుస్సు - యిత్యాదులు ఏర్పడ్డాయి. యజ్ఞ సిద్ధులకోసం వేదాలు పుట్టాయి. మంత్రాలు ప్రకటిత మయ్యాయి.

సర్వ జ్యేష్ఠుడు ప్రజాపతి అయినాడు బ్రహ్మ. అతని ముఖం నుంచి దేవతలు, రొమ్ము నుంచి పితృదేవతలు, ఉదరం నుంచి మానవులు, మొలలోంచి రాక్షసులు, ఇతరతరేలైన అనేక ప్రాణులూ - ఆవిర్భవించడం జరిగింది. అటు పిమ్మట - శివానుగ్రహం వల్ల కలిగిన అర్ధనారీశ్వరావతార దర్శన జ్ఞానంతో బ్రహ్మ స్త్రీ పురుష సృష్టికై పూనుకోగా 'మనువు' - అతనితోబాటే 'శతరూప అనే స్త్రీ నిర్మింప బడ్డారు. వారిద్దరినీ దంపతులుగా మసల మన్నాడుబ్రహ్మ.

ఆ తొలి మనువే స్వాయంభువ మనువు. అతని కాలం 71 మహాయుగాలు అంటే మన్వంతర సమయం 71 మహా యుగాలని తెల్సుకోవాలి. మనుశతరూపల మనుమడే ధ్రువుడు. ఇతడు 3వేల సంవత్సరాలు తపించి సప్తర్షిమండలంపైన శాశ్వతపదం సంపాదించుకున్నాడు. ఆ ధ్రువుడికి ముని మనుమడు చాక్షుషువు.

చాక్షుషుడి పెద్ద భార్య పుష్కరిణి. ఈమె కొడుకే వరుణుడు. రెండవ భార్యయైన 'నడల'కు ఆరుగురు పిల్లలు. వారిలో అంగుడు, సునీథ అనే ఆమెను వరించి - ఆమె యందు 'వేనుడు' అనే వాడిని కన్నాడు. ఈ వేనుడు మంచి వాళ్ళ నందరినీ నానారకాల బాధించడముతో సారస్వతులనే ఋషులు అతనిని వధించారు. కానీ, సునీథ దీనంగా ప్రార్థించడంతో సారస్వతులా వేనుడి మృతకళేబరపు కుడిచేతిని మథించగా దాన్నుంచి 'పృథువు' వెలువడ్డాడు.

ఈ పృథువు భూమిని-గోరూపాన మలచి పిదుకగా ఔషధులు ఆవిర్భ వించాయి. ఈ పృథువే దేవ, మానవ, రాక్షసాదులందరికి కూడా జీవన వృత్తులను ఏర్పాటు చేశాడు. ఇతని నలుగురి కొడుకులలో ఒకడైన ప్రాచీన బర్హిషుడు సముద్ర తనయ అనే భార్యయందు "ప్రాచేతసు" లనబడే పదిమంది కొడుకుల్ని పొందాడు. వారు సముద్ర మధ్యం చేరి రుద్రాధ్యాయం పఠిస్తూ లక్ష సంవత్సరాలు శివుడికై తపించారు.

ఈ లోపల భూమినిండా చెట్లు మొలిచేశాయి. ప్రజలు క్షీణించిపోసాగారు. ప్రజాక్షేమం కోరిన శివుడు ప్రాచేతసులకు దర్శనమిచ్చి, వరాలు అనుగ్రహించి - భూమి సంగతి చూడమని చెప్పి అంతర్హితుడయ్యాడు. అడవే అడవిగా వున్న అవనిని బాగుచేయాలన్న ఉద్దేశ్యంతో - ప్రజాక్షేమం విస్మరించి - అగ్నినీ, వాయువునీ సృష్టించారా సోదరులు.

గాలి వాటుకు చెట్లు పడిపోసాగాయి. అగ్ని వీవలన కవి కాలిపోసాగాయి. లోకులు హాహాకారాలు చేశారు. అప్పుడు చంద్రుడు వచ్చాడు. 'మీ అనిలానల విజృంభణంతో ఓషధులన్నీ కాలిపోతున్నాయి/ఓషధులకు నేను అధిపతిని గనక వచ్చి చెబుతున్నాను. ఇంతవరకూ తొలగించిన అడవులతో తృప్తిపడండి. ప్రతి ఫలంగా మీకు "అనుభూతి" అనే నా పెంపెడు కుమార్తెని యిస్తా" నన్నాడు. ప్రాచేతసులు శాంతించారు. అనుభూతిని పరిణయ మాడారు. అనుభూతి ప్రాచేతసుల దాంపత్య ఫలంగానే దక్షుడు పుట్టాడు.

అసమాన వీర్యుడా దక్షుడు. కేవలం మనస్సంకల్పమాత్రం చేతనే కొన్ని కొన్ని రకాల చరజీవులనూ, స్థిర జీవులనూ కల్పించాడు తదనంతరం మైథున సృష్టి నిమిత్తంగా వీరిణి అనే ఆమెను మనువాడాడు ఆ వీరిని యందు హర్యశ్వులు అనే పదివేలమంది కుమారుల్ని కని, ప్రజా పతయ్యాడు. కొడుకు లందర్నీ సృష్టి నియుక్తుల్ని చేశాడు. కాని నారదుడి బోధనలకు లోనయ్యి, వాళ్ళు పదివేల మందీ కూడా సన్యాసులలో కలిసి పోయారు.

ఇది తెలిసిన దక్షుడు బాధపడ్డాడు. మళ్ళా ప్రయత్నించి సుబలాశ్వులు అనే వెయ్యిమంది కొడుకుల్నిగని, వాళ్ళని, సృష్టి చేయమన్నాడు. నారదుడు వీళ్ళకి కూడా ముండనం చేయించి, కాషాయాలు కట్టబెట్టేశాడు.

అది భరించలేని దక్షడు నారదుణ్ణి కలిసి ' ఇక నీకు సంసారమనేది వుండదు. బ్రహ్మచారివైపో. ఓ స్థలం అంటూ లేకుండా ఈ లోకానా ఆ లోకానా బడి తిరుగు కలహ భోజనుడివైపో" అని శపించాడు. తాను తిరిగి సంసారంలో కలిసి పోయి 60 మంది అపురూపులైన ఆడపిల్లల్ని కన్నాడు.

వారిలో పది మందిని ధర్ముడికీ, పదముగ్గురిని కశ్యపుడికీ, ఇద్దరిని బ్రహ్మ పుత్రుడికీ, నలుగుర్ని అరిష్టనేమికీ యిచ్చి పెళ్ళి చేశాడు. యీ దక్ష పుత్రికలనుంచే దేవ రాక్షసాది జాతులవారంతా ఆవిర్భవించారు.

దక్షుడి కాలం వరకు కూడా సంకల్పంవల్లా, దర్శనంవల్లా, స్పర్శవల్లా కూడా ప్రాణుల జననం జరిగింది. ఆయన పిల్లల కాలం వచ్చేసరికి 'మైధునం' ఒక్కటే జన్మహేతువైంది.

ఆ విధంగా దక్ష పుత్రికలలో విశ్వ అనే ఆమె విశ్వేదేవతలను, సంధ్య అనే పిల్ల సాధ్యులను, మరుద్వతి మరుత్వంతులను, వసువు వసువుల్ని, భానువు భానుల్ని ముహూర్త ముహూర్తజుల్ని కన్నారు. లంబకు ఘోషుడు, యామికి నాగవీధి అనే పిల్ల, అరుంధతికి పృధ్వీలషముడు, సంకల్పకు సంకల్పుడు జన్మించారు.

ఆయుడు, ధ్రువుడు, సోముడు, ధర్ముడు, అనిలుడు, అనలుడు, ప్రత్యూషుడు, ప్రభానుడు అనే వారు అష్టవసువుల్లు వీరిలో అయుడికి-రైవతుడు, శ్రముడు, శాంతుడు అనే ముగ్గురు కొడుకులు. ధ్రువుడి కొడుకు కాలుడు. సోముడి కొడుకు పేరు వర్చధర్ముడి పుత్రుడు ద్రవిణుడు. అనిలుడికి యిద్దరు భార్యలు, ఐదుగురు కొడుకులు. వారుగాక, అనలుడి కారణంగా రెల్లులో పుట్టిన కుమారస్వామి కృత్తికలచే పెంచబడి కార్తికేయుడయ్యాడు.

ప్రత్యూషుడి కొడుకు దేవలుడు. దేవలుడి కొడుకు ప్రభాసుడు ఇతను బృహస్పతికి తోడబుట్టినదైన 'యోగ విద్ద' యనే యోషా మణిని పరిణయమాడాడు. వీరి సంతానమే విశ్వకర్మ.

## కాశ్యపేయ చరిత్ర - సృష్టి

కశ్యపుడి భార్యలు 13. వారిలో అదితి యందు కలిగిన కశ్యప సంతానమే ఆదిత్యులు. దితి యందు పుట్టిన పిల్లలు దైత్యులు. దనువునకు జన్మించిన వాళ్ళు దనుజులు, లేదా, దానవులు. అరుణుడు, గరుత్మతుడు ఆదిగాగల మహాతిర్యక్కులన్నీ వినతయందు ప్రభవించాయి. సురస కుమారులు సర్పాలు. ఇవి సాధారణ సర్పాలవలేగాక అనేకానేక పడగలతో అలరారుతూ - నిత్యం గగన విహారమొనరిస్తూ వుంటాయి.

సురసను 'నాగమాత' అంటారు, వాసుకి, తక్షకుడు వంటి సుప్రసిద్ధులందరూ సురసాతనయులే . 'క్రోధవశ' అనే ఆమెకు కోరలుగల వాళ్ళు పుట్టారు. వాళ్ళని గణులు అంటారు. సురభికి జన్మించినవి కుందేళ్ళూ - దున్నలూగా పరిణమించాయి. యిలకు-వృక్షములు, తీగెలు- యితర తృణజాతులూ సంభవించాయి.

మునికి పుట్టిన సంతానమంతా స్త్రీలే. వాళ్ళంతా అప్సరసలయ్యారు. కద్రువ కూడా పాములనే కన్నది. దేవతా సర్పాలు కావుగాని, మానవులకన్న మహిమగల పాములను అరిష్ట యనేయామె ప్రసవింపచేసింది.

ఖశ అనే ఆమెకు పుట్టినవాళ్ళే యక్షులూ, రాక్షసులుగా పరిణమించారు. తామ్ర అనే ఆమెకు షణ్ముఖాదులు పుత్రులుగా జన్మించారు. అలాగే కాకి, శ్యేని, భాసి, సుగ్రీవి, శుకి, గృధ్రిక, అశ్వి, ఉలూకి అనే 8 మంది పిల్లలవతరించారు. వీళ్ళలో కాకి కాకుల్ని కన్నది.

శ్యేని డేగలను ప్రసవించింది. భాసికి బాతులు పుట్టాయి. సుగ్రీవి అందమైన పక్షులనూ, శుకి చిలకలనూ కల్పించింది. గృధ్రిక గ్రద్దలకు తల్లియైనది. ఉలూకి వల్ల గుడ్లగూబలు జన్మించాయి. అశ్వి అనే ఆఖరిపిల్ల వలన లొట్టిపిట్టలూ, గుర్రాలూ, గాడిదలూ జన్మించాయి.

ఈ విధంగా లతాతృణాదులు మొదలుకొని, భూచర, జలచర, ఖేచర ఉభయచర, సర్వచరాలైన పశు, పక్షి, మృగ, క్రి కీటకాదులునూన, దేవదానవ దైత్య రాక్షస యక్ష సాధ్యాదులున్నూ, సృష్టికే ప్రాణాయమానమైన మానవ సంతతీ - ఈ సర్వస్వం కశ్యపుడికి ఆ 13 ముగ్గురు దక్ష కుమార్తెల యందునే కలిగింది. అందువల్లనే యీ భూమికి కాశ్యపఖండం అని పేరు వచ్చింది. సృష్టి మొత్తం కాశ్యపేయం అనబడుతోంది. మనమంతా కాశ్యపేయులమే అవుతున్నాం.

ఓ మహాపురుషులైన ఋషి ప్రముఖులారా! ఇంతవరకూ సృష్టి క్రమం గురించి చెప్పాను. ఇంకా మీకేం తెలుసుకోవాలని వున్నదో - అడగండి చెబుతాను" అన్నాడు సూతుడు. అమ్మవారి లీలలు వినిపించమన్నారు ఋషులు/ అందుకున్నాడా శుక సహాధ్యాయి.

## సుమేధముని దేవీ లీలలు చెప్పట

కాలవశాన రాజ్యభ్రష్టుడైన సురథ మహారాజు దారాపుత్రుల నెడబాపి దుఃఖితుడైన సమాధి అనే వైశ్యుడూ - సుమేధుడనే ముని ఆశ్రమంలో చేరారు. ఒకనాడు వాళ్ళు ఆ మునికి తమ కష్టాలన్ని చెప్పుకుని కన్నీరు పెట్టుకున్నారు. ఆ ముని వాళ్ళని ఓదార్చి 'నాయనలారా ఈ ప్రపంచమంతా సనాతనియైన ఆ 'శక్తి' అధీనంలో వుంది. ఆ మహామాయ కరుణకు పాత్రులవ్వడమే సర్వ కష్టాల నుంచీ

విముక్తిని కలిగిస్తుంది. హరి బ్రహ్మాదులైనా సరే ఆమె అనుగ్రహం లేకపోతే ఎందుకు కొరగానివారై పోతారు. ఉదాహరణకు మీకో కథ చెబుతాను వినండి' అని చెప్పసాగాడు సుమేధుడు.

## మధుకైటభుల కథ - వారి వధ



ఒకానొక ప్రళయవేళ- యోగ శాయియైన విష్ణువు యొక్క చెవి గులిమిలోంచి ఇద్దరు రాక్షసులు ఆవిర్భవించారు. మహా బలసంపన్నులైన వారిలో పెద్దవాడి పేరు మధుడు. రెండవవాడు కైటభుడు. వాళ్ళిద్దరూ కలిసి సముద్రమంతా అల్లకల్లోలం చేస్తుండగా - పద్మాసనస్థుడైన బ్రహ్మ కనిపించాడు. ఓం ప్రథమంగా వాళ్ళకో ప్రాణి కనబడేసరికి వుండబట్టలేక అతనిని పీడించబోయారు. బ్రహ్మ పారిపోయాడు.

వాళ్ళు తరుముకుంటూ రాసాగారు. పద్మగర్భుడు విష్ణువునాశ్రయించాడు. కాని, ఆయన యోగనిద్రలో వున్నాడు. అప్పట్లో లేచేలాలేడు. అందువల్ల బ్రహ్మ మహామాయను ప్రార్థించాడు. అనుగ్రహించింది ఆ తల్లి. ఓ ఆర్తులారా! సకలార్తి భంజనియైన ఆ జగన్మాత ఫాల్గుణ శుద్ధ ద్వాదశినాడు తనను తాను ప్రటించుకుంది. సర్వ మోహినియైన ఆవిడే మహాకాళిగా ప్రఖ్యాతి చెందింది.

దయామయములైన తన వాక్కులతో బ్రహ్మను ఓదార్చింది. విష్ణువంతటి వాణ్ణి కప్పివేసిన తన మాయావేశాన్ని తొలగించింది. తక్షణమే లేచాడు విష్ణువు. మధుకైటభులతో తలపడి 5 వేల సంవత్సరాలపాటు అనుపమానమైన పోరాటం చేశాడు. అయినా వాళ్ళు చావలేదు/ విష్ణువు విశ్వమాయను వేడుకున్నాడు కరుణించింది కాళి. తన మాయావేశాన్ని దానవులపై ప్రయోగించింది. మోహితులైపోయారు. మూర్ఖులు. తమంతటి బలవంతులు లేరన్న అహంకారంతో విర్రవీగారు.

విష్ణువంతటి వాణ్ణి పట్టుకుని 'ఏమైనా వరం కోరుకోవోయ్ యిస్తాం' అన్నారు. నవ్వుకున్నాడు నారాయణుడు.

"మీరిద్దరూ నా చేతిలో చచ్చిపోండి" అని కోరుకున్నాడు. కంగుతిన్నారా రక్కసులు. అయినా సత్యం తప్పరుకదా! అందువల్ల వాళ్ళా విష్ణువుచేత చావడానికి సిద్ధపడ్డారు. కాని, తడిలేనిచోట మాత్రమే చంపాలని కోరారు. అలాగే నన్నాడు విష్ణువు అమ్మవారి దయవల్ల తన తొడలను విశాలంగా పెంచాడు. ఆ రాక్షసులకు పిలిచాడు - తడిలేని తన పొడి తొడలమీదనే వాళ్ళ తలలు తరిగేశాడు. ఈ కాళికోద్భవం, మధుకైటభ సంహార గాథలు విన్న వాళ్ళకి మనశ్శాంతి లభిస్తుంద నడంలో యేమీ సందేహం లేదు.

ఓ సురథ, సమాధుల్లారా! శ్రద్ధగా వినండి. ఆ ఆదిశక్తియొక్క మహాలక్ష్మ్యవ తార గాథను కూడా ఆకర్ణించండి. ఎడతెరిపి లేకుండా ఆ ఒడయురాలి కథలు విన్నా చాలు - ఆమె అనుగ్రహం తప్పక కలుగుతుంది. ఆవిణ్ణి వదలి - అన్య దేవతలను ఆరాధించే వాళ్ళంతా అమాయకులేనని చెప్పుకోవాలి. లేదా, పూర్వకర్మ అని వదిలెయ్యాలి. త్రిభువనాలా త్రికాలాలా, త్రివర్ణాల వాళ్ళూ ఆరాధించి తీరాల్సిన తల్లియామె.

# మహాలక్ష్మి అవతారం

రంభుడనే రాక్షసుడికి - మహిషుడనే కొడుకుపుట్టాడు. మదోన్మత్తుడైన మహిషుడు బ్రహ్మకై తపించాడు. పురుషమాత్రుడిచేత చావులేని వరం కోరాడు. ఉన్నబలంతోటీ, తెచ్చుకున్న వరబలంతోటీ కన్నూ మిన్నూ కానకుండా ప్రవర్తిం చాడు. స్వర్గమర్త్యపాతాళ వాసులందర్నీ పీడించాడు. దేవహితులందర్నీ దండించాడు. అష్టదిక్పాలురని అలమటింపచేశాడు. మంత్రాధిష్ఠాతలచేత మట్టికరిపించాడు.

లోకపాలకులు రాక్షసుడికి తాళలేక తోకలుముడిచిపోయారు. ఇంద్రాది దేవతలకు చెమటలు పట్టించాడు. దిక్కు తోచని దేవబృందం బ్రహ్మను ఆశ్రయించింది. బ్రహ్మ వాళ్ళందరినీ వెంటబెట్టుకొని శివకేశవులు ఉభయుల్నీ కలిశాడు. మగవాళ్ళ చేతిలో చావులేకుండా వరం వుంది. వాడా అమిత బలశాలి. అంతటి బలవంతుణ్ణి యెదుర్కొని గెల్చుకురాగల స్త్రీ యెవరు?' అని ఆలోచించారు. అంతకంతకీ శివ కేశవ వదనాలు క్రోధఘూర్ణితాలయ్యాయి. వారి

వదనాలలోంచి అద్భుతమైన తేజాలను వెలువరించారు. తమతోబాటు బ్రహ్మాది దేవతలనుంచి గూడా తేజాలను వెలిదీసి ప్రోగు పెట్టారు.



ముక్కోటి దేవతలయొక్క, ముగ్గురు మూర్తుల యొక్క తేజస్సుల సమ్మేళనంతో-మహాతేజఃపుంజమైన దుర్గాదేవి ఆవిర్భవించింది. శివ తేజస్సుతో ముఖం, యమతేజంతో కేశపాశాలు, విష్ణుతేజంతో బాహువులు, చంద్రతేజంతో స్తనద్వయం, ఇంద్ర తేజంతో మధ్యభాగం,వరుణ తేజంతో తొడలు-పిక్కలు, భూమితేజంతో పిరుదులు, బ్రహ్మ తేజంతో పాదాలు, సూర్య తేజంతో పాదాలకు వ్రేళ్ళు, వాసవ తేజంతో చేతివ్రేళ్ళు, కుబేర తేజంతో ముక్కు, ప్రజాపతి తేజస్సు వల్ల దంతాలు, అగ్ని తేజంతో అక్షిత్రయం, సాధ్యుల తేజముతో భ్రూమధ్యం, వాయు తేజం వలన చెవులు, సమస్త దేవతల తేజం వల్లా తనువుతో పద్మాసనస్థయై ఆవిర్భవించిందా మహాదుర్గ అలా ఆవిర్భవించిన ఆ దేవతా దుఃఖ భంజనికి శివుడు త్రిశూలం యిచ్చాడు.

విష్ణువు శంఖసుదర్శనాల నిచ్చాడు. యింద్రుడు వజ్రాయుధ మిచ్చాడు. దానితో బాటే అక్షయతూణీరం ఘంటాదులను కూడా యిచ్చాడు, వరుణుడు పాశాన్నిచ్చాడు. అగ్ని శక్తినీ, గాలిదేవుడు కార్ముకాన్నీ అర్పించుకున్నారు. యముడు కాలదండాన్నీ, ప్రజాపతి అక్షమాలనీ, బ్రహ్మ కమండలాన్నీ, సూర్యుడు కిరణాలనీ, కాలుడు డాలు కత్తులనీ యిచ్చారు. రత్నాకరుడైన క్షీరసముద్రుడు హారాన్నీ బహూకరించాడు.

పట్టుబట్టలు, చూడామణి, కడియాలు, కుండలాలు, అర్ధచంద్రకేయూరాలూ యిచ్చాడు. కంకణ, నూపుర, అంగుళీయకాలను కూడా సమర్పించుకున్నాడు. విశ్వకర్మ అభేధ్యమైన కవచాన్నీ అస్త్రాలనూ యిచ్చాడు. సరసులన్నీ కలిసి కమలాల దండ నిచ్చాయి. హిమవంతుడు సింహాన్నీ, రత్నాలనూ యిచ్చాడు. కుబేరుడు సురతో నిండిన పాత్రనిచ్చాడు. శేషుడు విచిత్రమణిరత్నమైన నాగాభరణాన్ని

యిచ్చుకున్నాడు. ఈ విధంగా దేవతలంతా ఆయుధాలనూ, ఆభరణాలనూ ఆమెకు యిచ్చారు. కష్టాలు చెప్పుకున్నారు. కడగండ్లు తీర్చమన్నారు.

అభయమిచ్చిందా అంబ. అఖిలాండము అదిరిపడేలా అట్టహాసము చేస్తూ మహిషుడిమీదకు దండు వెడలింది. దేవతలంతా జయ జయ ధ్వానాలు చేశారు. అమ్మవారిని స్తుతించారు.

అమ్మవారి అట్టహాసం, దేవతల కలకలారావం విన్నాడు మహిషుడు. కోటికి పైగా సైన్యాన్ని తీసుకుని తానుకూడా బైటకు వచ్చాడు. చిక్షుర, చామర, ఉదగ్ర, కరాళ, ఉద్ధ, బాష్కల తామ్ర, ఉగ్రాస్య ఉగ్ర, వీర్య, బిడాల, అంధక, దుర్ధర దుర్ముఖ, త్రినేత్ర, మహావానులు అనే ప్రసిద్ధి చెందిన రాక్షసవీరులా మహిషుడి వెంట పోరుకు సాగారు.

## మహిష మర్దనం



రెండు సేనలూ తాకాయి. చిక్షురాదులని కొందరిని చిటికెతో చంపివేసింది దుర్గ ఆమె నిశ్వాసలోంచి ఆవిర్భవించిన దుర్గాగణాలు రాక్షస సేనలను చీల్చి చెండాడ సాగాయి. ఇదంతా చూసి చిర్రుబుర్రులాడిపోయాడు మహిషుడు. మహిష రూపంలో విజృంభించేశాడు కొమ్ములతో కుమ్మాడు. డెక్కలతో తన్నాడు. ముట్టెతో మోదాడు తోకతో ప్రహరించాడు. కుమ్ము కుమ్ముకీ కొండల్ని పెకలించి దుర్గా గణాలపై విసరసాగాడు. పుచ్ఛప్రహారాలతో చెలియలికట్టలని చెరపనారంభించినాడు. వాడి విజృంభణం చూసి, దేవతలంతా దుర్గా సంరక్షణలో వుండి కూడా భయపడిపోయారు.

గమనించింది తల్లి. తన గణాలపై దుమికిన మహిషరూపుణ్ణి-పాశం వేసి పట్టుకుంది. వెంటనే వాడు సింహ రూపం ధరించాడు. ఖడ్గమెత్తింది అమ్మవారు. వాడుకూడా కత్తినెత్తి రాక్షస రూపంలో ఆమె నెదిరించబోయాడు. అమ్మవారు వాణ్ణి చర్మ, బాణ, ఖడ్గములతో తాడించింది.

వెనువెంటనే వాడు పెద్ద యేనుగుగా మారిపోయాడు. తన తొండంతో అమ్మవారి వాహనమైన సింహాన్ని తాడించాడు. కినుక బూనిన తల్లి - ఖడ్గంతో వాడి తొండాన్ని నరికేసింది. గింగిర్లు తిరిగిన మహిషుడు రాక్షస రూపం ధరించి మాయా యుద్ధానికి ఒడిగట్టాడు. చూసింది అంబ. సురతో నిండివున్న అక్షయపాన పాత్ర పానం చెయ్యసాగింది. దివ్యమైన ఆ సుర తలకెక్కేదాకా తాగింది. ఘణ ఘణమంటూ తన ఘంటను మ్రోగించింది ఒక్క అట్టహాసం చేసింది. ఆ వారుణీ పాన సంజాత మదఘూర్ణిత వదనారవిందానికి నమస్కారం ఆ మూర్తికి నమస్కారం. ఆ ఘంటారావానికి నమస్కారం ఆ మూర్తికి నమస్కారం. తల్లికి నమస్కారం, సర్వదా ఆవిడ నన్ను రక్షించుగాక.

అలా వారుణీపానం చేస్తూ, ఘంట మ్రోగిస్తూ, అనూహ్యముగా విజృంభించిన ఆ మహాశక్తి ధాటికి మహిషుడు కంగుతినక తప్పలేదు. అమ్మవారి బాణాలతో కమ్మిన మాయ విడిపోయింది. ఘంటారావం రాక్షసుల గుండెల్ని చీల్చేసింది ఆమె అట్టహాసాలకి దళపతులు చెట్లమీంచి రాలే పిట్టల్లా రాలిపోయారు. గింజుకున్నాడు రాక్షసుడు. తెగబడి దుమికాడు తల్లిమీదకి. వాడి తెగింపుకా దేవతలంతా 'ఆఁఆఁ' అంటూనే వున్నారు. అదోలా చూసింది వాణ్ణి ఆవిడ మరొక్కసారి మధువు సేవించింది - గయ్ఁన గర్జించింది. తెగబడి వస్తున్న దనుజుణ్ణి యెగబడి ఒక్క తన్ను తన్నింది మట్టిముద్దపడ్డట్టు పడ్డాడు నేలమీద - ఆశ్రితుల చేత ఆరాధించబడేవీ, భక్తులందరికీ సర్వ సంపత్తులూ ప్రసాదించేవీ అయిన ఆ తల్లి పాదాలకు నమస్కారం.

మట్టిముద్దలా నేలబడ్డ మహిషుడి కంఠంమీద యెడంకాలేసి తొక్కిపట్టింది. చేతనున్న త్రిశూలంతో వాడి ముఖాన్ని గ్రుచ్చిపట్టి పెకలించి పైకెత్తింది - అంతే.

"జై మహిషాసురమర్దినికీ జై" అనే నినాదాలా దశదిశలా మ్రార్మోగిపోయాయి. మహిషుడి సైన్యం పరారైపోయింది. దేవకోటి విజయ నాదాలతో అమ్మవారిని స్తుతించింది. ఆ తల్లిపై పూలవానకురిపించింది. మహాలక్ష్మీ జననంగా శివ పురాణంలో వర్ణించబడిన, మహిషాసుర మర్ధిని గాథ యిది. పిరికి వాళ్ళకి ధైర్యం యిస్తుంది ఆమె. సర్వ శత్రు సంహారిణి. సకలవిధ దరిద్ర నివారిణి, భక్తరక్షకి అయిన ఆ తల్లి యొక్క ఈ చరిత్ర విన్నా, వినిపించినా, యే రకంగా తెలుసుకో గలిగినా వాళ్ళు ధన్యులే అవుతారు.

# కౌశికి - ధూమవతి

ఇక కౌశికి గాథను వినండి. శంభుడు, నిశుంభుడు అని యిద్దరు రాక్షసు లుండేవాళ్ళు. వీళ్ళు కూడా ఆ మహిషాసురుడంత కాకపోయినా, వాడిలాగే దుర్మార్గాలూ అవీ చేసి సజ్జనుల్ని హింసించేవారు. వాళ్ళ బాధపడలేక దేవతలంతా కైలాసం చేరారు. అమ్మవారిని దర్శించి, తమ కష్టాలన్నీ ఆ భవానీ దేవికి విన్నవించు కున్నారు. ఆమెను యథావిధిగా స్తుతించారు. వారి స్తోత్రాలన్నీ విని ప్రసన్న మయ్యింది పార్వతి.

తన కోశం నుంచి ఒక కన్యను సృష్టించింది. "మీకు శుభం చేస్తుందీమె" అన్నది గౌరి. గౌరీ కోశం నుంచి ఆవిర్భవించడంవల్లన ఆ కన్యకు కౌశికి అని పేరు పెట్టుకున్నారు దేవతలు. గౌరీ సముద్భూత కాబట్టి మాతంగిగా ఆరాధించబడ వలసిందిగా కోరారు. తమ కష్టాలు చెప్పుకున్నారు.

అన్నీ విన్నదా యమ్మ. ఇంతేకదా! మీరే మీభయపడకండి. గౌరీ ఆదేశాన్నను సరించి మీకు శుభం చేయడమే నా కర్తవ్యం' అని వాళ్ళకి ధైర్యం చెప్పింది. తక్షణమే అక్కడ అదృశ్యమై శుంభునిశుంభుల నగరపు యీవలి ప్రాసాదాన వెలసింది. అక్కడి సేవకులా జగదేకసుందరిని చూశారు. కన్నుల పండుగ చేసే కౌశికి సోయగాన్ని చూసి - చండముండులనే వారిద్దరు చరచరా వెళ్ళి శుంభ నిశుంభులకు చెప్పారు.

"సింహం మీద కూర్చుని వుంది. ఎవరెవరో దేవతా స్త్రీలంతా చేతులు కట్టుకు మరీ ఆమెను సేవించుకుంటున్నారు. కొందరు ఆమె పాదాలు సంవాహనం చేస్తున్నారు. కొందరు తల దువ్వుతున్నారు. ఇంకొందరు యేలాల వంగమిశ్రితమైన తాంబూలమందిస్తున్నారు. మరికొందరు ఆమెకు భూషణాల నలంకరిస్తున్నారు. అంత సందట్లోనూ కూడా ఆమె అందం మమ్మల్ని వెర్రెక్కించేసింది. //

బలిసిన పాముల్లా వున్నాయి ఆమె చేతులు. అరటిచెట్టు బొందలలా వున్నాయి తొడలు. ముక్కు చిలక ముక్కేననకో. అయ్యబాబోయ్! రాక్షస రాజుల్లారా! ఆమె అందాన్ని యెలా వర్ణించమంటారయ్యా! రాక్షస స్త్రీలాగా లేదు, గంధర్వకాంతలాగనూ లేదు.

మనకు తెలిసిన దేవతా స్త్రీలాగాలేదు, అమ్మవారిలా ఆయుధాలు ధరించిందే తప్ప - శచీదేవికన్న ఠీవి, రంభ కన్న ఆకర్షణ, ఊర్వశి కన్న అనురాగం, మేనక కన్న మమకారం పుట్టి పడిపోతున్నాయనుకోండి. పట్టుకుంటే ఆమె చెయ్యే పట్టుకోవాలి. కట్టుకుంటే ఆమె కొంగే మీ ఉత్తరీయాలకు కట్టుకోవాలి లేకపోతే చచ్చినా తప్పులేదు. అహఃఅలా అనిపించే అందం ఆ పిల్లది' అంటూ అదే పనిగా పొగిడి పెట్టారు.

కొసెక్కిపోయారు శుంభ నిశుంభులు. వెంటనే పెళ్ళికేర్పాటు చేయమని దూతలను పంపారు. దూతలు చెప్పినదంతా విన్నాక మెల్లగా యిలా అంది దేవి. "నాకో ప్రతిజ్ఞ వుంది - యుద్ధంలో నన్ను గెలిచినవాణ్ణి తప్ప యితరుణ్ణి మనువాడనని. అందువల్ల నాతో జగడమాడి గెల్చుకోవడానికి ప్రయత్నించుమని చెప్పండి" అన్నది. దూతగా వెళ్ళిన సుగ్రీవుడు వెనుదిరిగి వచ్చి. మాతంగి చెప్పిన మాటలు నాలుగూ రాక్షసుల చెవిలో వేశాడు. కోపం వచ్చింది రాక్షసులకి. ధూమ్రాక్షుడనే సేనాపతిని పిలిచి - "అయిందీవరాక్షి నెలాగైనాసరే మా ముందుకు లాక్కురా" అని చెప్పి పంపారు. ఆరువేల సైన్యాన్ని తీసుకుని అంబిక దగ్గరకు వెళ్ళాడా ధూమ్రాక్షుడు.

ధూమ్రాక్షుడు - కౌశికి వద్దకు వెళ్ళి-తన రాకకు గల కారణం చెప్పాడు. 'మర్యాదగా లొంగి రాకపోతే బలవంతంగా యీడ్చుకు పోతాను' అన్నాడు. వాడి కబుర్లు పూర్తవటం ఆలస్యంగా ఒక్క హుంకారం చేసింది కౌశికి. అంతే, అక్కడి కక్కడే వాడు బూడిదైపోయాడు. ధూమ్రాక్షుణ్ణి ధూళిలో కలిపేసినందువల్ల ఆవిడ ఆనాటినుంచి "ధూమావతి" అనే బిరుదుతో విరాజిల్లింది. శత్రునాశనం కోరేవారు ధూమావతిని ఆరాధిస్తారు. ఆమె ఉపాసకులకు శత్రుభీతి వుండదు. సరే - కథలోకి వద్దాము.

ధూమ్రాక్షుణ్ణి అలా చంపేయగానే - సైన్యానికి కోపం వచ్చింది. ఆమె వాహన మైన సింహాన్ని చంపెయ్యాలనే ఉద్దేశ్యంతో చుట్టుముట్టసాగారు. దగ్గరకొచ్చేదాకా వూరుకొని- ఒక్క గర్జన చేసిందా కౌశికి. దాంతో అరవై వేల సేనా అంతఃపురాలదాకా పరారైపోయింది ఈ వార్త తెలియగానే క్రుద్ధుడైపోయాడు. శుంభుడు, చండాసుర, ముండాసుర, రక్తబీజాదులను పంపించాడా ప్రమదమీదకు. వచ్చిన వాళ్ళను వచ్చినట్లుగా చంపేసిందా కౌశికి.

# నిశుంభ నిర్యాణము

ఓటమి నెరుగని పోటు మగలైన చండముండాదుల చావుకబురు చెవిని బడగానే చురచురలాడిపోయాడు శుంభ దానవేంద్రుడు. తక్షణమే మహాకర్కోటకులైన కాల కేయాదులను వెంటబెట్టుకుని సర్వ సేనా సమేతులై అన్నదమ్ములైన శుంభనిశుంభులిద్దరూ కూడా అమ్మవారిపై దండుకు కదిలారు. వారిరాకను తెలుసుకున్న మాతంగి తన ధనుస్సుకు నారి తొడిగి ఒక్క ఠంకారం చేసింది. అటుగా సాగాయి సైన్యాలు.



రయ్ రయ్‌మంటూ వచ్చిన రాక్షస రాజులయిన శుంభ నిశుంభులిద్దరూ ధనుష్పాణియై నిలబడ్డ ధూమావతి సౌందర్య సోయగాలకు స్తబ్ధులైపోయారు. "పిల్లా పిచ్చెక్కించే అందాలు నీవి. మహచెడ్డ సుకుమారివి నీవు. అనవసరంగా మాతో తలపడకు. మారణక్రీడలు మాని. మార క్రీడలాడుకుందాం రావే" అన్నారు.

ఖస్సుమంది కౌశికి. "చచ్చు సంభాషణలు మానేయండి. పౌరుషం వుంటే యుద్ధం చెయ్యండి లేదా, పాతాళానికి పారిపోండి మాటలనవసరం" అంది. వెంటనే దానవసైన్యం ఆమెపై బాణవర్షం కురిపించింది. శూలాలు, పరశువులు, భిందివాల, పరిఘు, పట్టిన భుశుండి, ప్రాస, క్షుర, నామక, ఖడ్గాదులను యిచ్ఛా పద్ధతిని ఆమెపై విసరసాగారు. వీటన్నింటినీ తన బాణాలతో తప్పించేసిందా తల్లి. ఇక సంహార కార్యక్రమం మొదలు పెట్టింది. ఎగిరే జెండాలూ రాక్షసులవే. రాలే తలలూ రాక్షసులవే అయిపోయాయి. దాపులకు చేరిన రాక్షస వీరులందరినీ - ఆమె వాహనమైన సింహం చప్పరించి వేస్తోంది.

ఇదంతా చూసి చూసి తల తిరిగినంత పనయ్యింది. దేవికీ నిశుంభుడికి యుద్ధం జరిగింది. ఆ యుద్ధంలో నిశుంభుడు భయంకరమైన గదను ప్రయోగించాడు. అమ్మవారు రెండు త్రిశూలాలందుకుని విసిరింది. ఒక త్రిశూలం గదనూ, రెండవ త్రిశూలం గజాభదేహుడైన నిశుంభుణ్ణి నేలకు పడగొట్టేశాయి. రాక్షసులు హాహాకారాలు చేశారు.

# కౌశికి శుంభుని వధించుట



తమ్ముడి చావు గురించి వినగానే తగని కోపం వచ్చిందా శుంభ దానవుడికి. తక్షణమే యుద్ధరంగం చేరాడు. దుర్నిరీక్ష్యమైన శక్తిని ప్రయోగించాడు అమ్మవారి మీద. తన బాణాల తోనే శక్తిని ముక్కలు ముక్కలు చేసేసింది శైవముగ్ధ. ఒకే ఒక్క శూలాన్ని గురిచూసి విసిరిందామె. ఫెల్లున చప్పుడైంది.

త్రిశూలం శుంభుడి వక్షాన గ్రుచ్చుకుని - వాడి ఉరఃకుహరపు టస్థుల పగిలిన చప్పుడది. మహా పర్వతంలా పడిపోయాడు నేలకు దేవతలు జయ జయ ధ్వానాలు చేశారు. రాక్షసులు హాహాకారాలు చేశారు. సింహవాహనానికి కోపం వచ్చింది. "జయధ్వానాలు అమ్మవారికి వినపడకుండా వీళ్ళగోలేమిటి?" అనుకున్నది కాబోలు! నోరెత్తిన ప్రతి రాక్షసుణ్ణీ చప్పరించేసింది. అమ్మవారి ఆశీస్సులతో అమరులు మళ్ళా తమతమ పదవులు పొందగల్గారు. రాక్షసపీడ నివారింపబడటంతో లోకాలన్నీ ఆనందంగా భాసించాయి అత్యంత శ్రేయోదాయకమైన యీ గాథ అఖండమైన అభ్యుదయమును సమకూరుస్తుంది.

ఆశలూ ఆశయాలూ అన్నీ తీర్చే తల్లి ఆవిడే. ఆరోగ్యాన్నీ ప్రసాదించే దేవతా ఆవిడే. అఖిలాండకోటి బ్రహ్మాండాలకీ ఆదిమూర్తి, ఆదిశక్తి, ఆది కారణమూ కూడా ఆవిడే. ఆవిడను తలచుకోండి, ధ్యానించండి. నమ్ముకోండి. అన్ని ఆపదలూ గడచిపోతాయి. దీర్ఘాయుష్మంతులవుతారు. ఆమె వినా ఆదుకునే వారెవరూ లేరు. సర్వేసర్వత్రా నిండి వున్నశక్తి ఆవిడే. ఆవిడ అనుగ్రహం లేకపోతే, పురందరుడే గావచ్చు పూచిక పుల్లకూడా కదల్చలేడు, సందర్భంవచ్చింది గనక చెబుతున్నాను.

# యక్షరూపం

ఒక పర్యాయం - దేవదానవుల మధ్య ఘోరమైన యుద్ధం జరిగింది. ఆ యుద్ధంలో దేవతలే గెలిచారు. రాక్షసులు పాతాళంపట్టిపోయారు. అదంతా తమ పెగ్గేననుకున్నారా అమరులు. ఏమాత్రం కష్టంవచ్చినా "అమ్మా అమ్మా"

అంటూ యెవరి దగ్గరకు పరుగిడతారో మర్చిపోయారు. నేనింతమందిని చంపానంటే 'అబ్బే! నేనింకో అంతమందిని చంపా'నని వాళ్ళలో వాళ్ళే గొప్పలు చెప్పుకోసాగారు. సర్వవ్యాపినీ, సర్వజ్ఞా అయిన అసనాతని పసిగట్టిందీ దేవతల ఆలోచనల్ని. వాళ్ళ అహంకారం అక్కడికక్కడే త్రుంచేయాలనుకుంది. వెంటనే తేజోమయమైన యక్షరూపంతో వారి కంతదూరాన తచ్చాడసాగింది.

ఆ వెలుగు చూసి ఆశ్చర్యపోయారు అమరులు. ఎవరో కనుక్కురమ్మని వాయువును పంపారు. వెళ్ళాడు వాయువు వివరాలడిగాడు. ఆ యక్షరూపం చెప్పలేదు. "ముందు నువ్వేమిటో చెప్పు అంది. తన గురించి చెప్పుకోనక్కర్లేనన్ని గొప్పలు కూడా చెప్పేసుకున్నాడు" గాలి దేవుడు. నవ్వింది యక్షమూర్తి.

అక్కడో గడ్డి పరకనుంచి - దానినికదపమంది, శతథాప్రయత్నించాడా వాయువు కాని దాన్ని కదపలేకపోయాడు. "ఇంతేనా నీ ప్రతాపం!" అంది యక్ష మూర్తి/గాలిదేవుడంతటివాడికి గాలితీసేసినట్లైపోయింది. సిగ్గుతో వెనుదిరిగాడు.

ఈ సారి అగ్ని వచ్చాడు 'ఏది! దీన్ని తగలెయ్యి చూద్దాం" అందా మూర్తి. చాలా ప్రయత్నించాడు వహ్ని. "శక్తి" వుంటేగా ఏమైనా చెయ్యడానికి! అతనూ ముఖం ముడుచుకుని వెనక్కి వెళ్ళిపోయాడు. //

ఈ సారి ఇంద్రుడే వచ్చాడు. దేవతల రాజుకదా అతను అతనుకూడా ఓడిపోతే సాటివారిలో పరువుపోతుంది. అతని పాలనను యెవరూ అంగీకరించరు. ఆ ఉద్దేశ్యంతో అమ్మవారు అతగాడు రాగానే అసలు తానే అదృశ్యమైపోయింది అయితే అది ఘోరావమానంగా భావించాడు వాసవుడు.

ఎవరై వుంటుందా అని ఆలోచనలో పడ్డాడు. ఆలోచించేసరికి అదే ధ్యాసయ్యింది. ధ్యాస అదే అయితే ధ్యానం కుదిరింది. ధ్యాన సులభ కదా తల్లి! లీలగా స్ఫురించింది. 'సందేహంలేదు ఈ యక్షరూప సతీదేవే. ఈవిడే రమ. ఉన్నదీ లేనిదీ అన్నీ యీవిడే, అయ్యయ్యో! ఆదిశక్తి, అనంతా, అనుగ్రహమూర్తీ, పరాభట్టారికా, సర్వమంగళా శారదా, విశారదా, కరుణానీరదాయైన ఆ మహా మాయను గుర్తించలేక పోయాను కదా!" అని యెంతగానో పరితపించాడు పవిపాణి.

ఏదో మనమేలు కోరి లీల చూపిస్తుందేగాని, మన మారాట పడితే అస్సలు తట్టుకోలేదా తల్లి. నలుదిక్కులా వెలుగై తోచిందామె. 'ఓ అమరులారా! మహా మాయనైన నా లీలావినోదంగా సాగే ప్రపంచమిది. ఓటమికి నిరుత్సాహం,

గెలుపుకు మితిమీరిన అహం అనేవి అస్సలు పనికిరావు, అహంవల్ల అజ్ఞానం, తద్వారా సర్వనాశనమూ సంభవిస్తాయి. కాబట్టి సర్వాధారనూ, సమస్తాన్నీ అయివున్న నన్ను విస్మరించకుండా వుండండి.

నేను కాని దేదీలేదని గుర్తించండి. నన్ను మర్చిపోయి అహంకరిస్తే - గాలి గడ్డి పరకని కదపలేకపోయాడు. అగ్ని దానిని అంటలేకపోయాడు. మీ అందరి యందు వుండి మిమ్మల్ని నడిపే మూలకారిణినైన నన్ను ఆరాధించేటంత కాలం మీకు యే కష్టమూ కలగదు. నావల్ల మీ సమస్త కష్టాలూ తొలగిపోతాయి.

కళలూ, శక్తులూ నా నుంచే ఉద్భవిస్తాయి సిరులూ, సిద్ధులూ నావల్లనే ఆవిర్భవించాయి. నా విలాసార్ధంగా నేనే స్త్రీగా - పురుషుడిగా అవ్యయగా భావి స్తుంటాను. అవినాశినైన నేను/నిర్గుణ సగుణత్వాలు వహించే లీలలోనే మీ రంతా గెలుపు ఓటములకు గురి అవుతున్నారు. ఆ విషయమై ఆనందమూ, ఆవేదనా అర్ధరహితంగా గుర్తించండి. అహం వదలండి" అని హితబోధ చేసింది. అమ్మవారి యొక్క ఈ యక్షరూప ప్రదర్శనగాధ - సర్వ సంపత్కరమూ, సర్వ బాధా నివారకమూ, సర్వానందదాయకమూ, జ్ఞానప్రదముగా తెలుసుకుని, ఆ తల్లినే ఆరాధించి తరించండి.

## శతాక్షి అవతారము

సూతుడు చెప్పినదంతా విని-మునులంతా ముగ్ధులైపోయారు ఆ మహా మాయ మహిమలు మరో యిన్ని చెప్పమని కోరారు. చిరునవ్వులు చిందిస్తూ చెప్పసాగాడు సూతర్షి - "దుర్గముడు అని ఒక గొప్ప దుర్మార్గుడైన రాక్షసుడు వుండేవాడు. వాడి బలమేబలం, అధోలోకాలు, ఊర్ధ్వలోకాలు, మధ్య లోకాలూ కూడా ఆక్రమించేశాడు. పైగా బ్రహ్మగారు వీడిననుగ్రహించి నాలుగు వేదాలు యిచ్చాడు. ఆ వేదాలన్నీ చదివాడు వాడు ఎలా ప్రవర్తిస్తే దేవతలు బలహీను లౌతారో పసిగట్టి అలా అలా ప్రవర్తించసాగాడు. యజ్ఞానికీ, తపస్సులకీ, బ్రహ్మత్వానికీ, దానధర్మాలకి అడ్డుకట్టు వేసేవాడు. "పదవులు పోతే పోయాయి. ప్రాణంమీదికి తెచ్చి పెడుతున్నాడీ దుర్గముడు. అమృతం త్రాగామన్న పేరేగాని - అట్టేకాలం బ్రతకనిచ్చేలా లేడు మనల్ని" అని దేవతలంతా కూడా బలుకు కున్నారు.

సర్వేశ్వరీ, జగదాధార, మహామాయా, శ్రీదేవియైన ఆ పరాభట్టారికను ప్రార్థించారు. "ఓ తల్లీ! నువ్వే దిక్కు. ప్రపంచంలో జీవనాధారం నీళ్ళు. అటువంటి నీళ్ళు మచ్చుకైనా దొరకకుండా చేసేశాడు దుర్గముడు. నీళ్ళు లేనిదే ఆచారం లేదు. నీళ్ళు లేనిదే ఆహారం లేదు. నీళ్ళు లేనిదే యేదీలేదు. ఓ కరుణాసాగరీ! శరణు శరణు శరణు శరణు శరణు" అని చేతులెత్తి మ్రొక్కారు. తక్కున ప్రత్యక్ష



మైంది ఆ మహామాయ, వందకళ్ళతో ప్రత్యక్ష మైంది. ధనుర్బాణాలూ, పద్మాలూ రెండు చేతులా వున్నాయి. తక్కిన చేతుల నిండా కూరగాయలూ, కందమూలాలు ధరించి ప్రత్యక్షమైంది. ఆమె వంద కళ్ళ నుండి కరుణారసం నీరై ధారలు గట్టినది. ఆమె చేతులతో యిచ్చిన అక్షయమైన ఆహారాలతో జనం వూపిరి తీసుకున్నారు. తొమ్మిది రాత్రుళ్ళూ తొమ్మిది పగళ్ళూ అలా వుండిపోయిందా తల్లి. ఆ తొమ్మిది నాళ్ళు ఆమె నేత్రాలనుంచి ప్రవహించిన నీళ్ళతో భూమినానిపోయింది.

పచ్చికలు మొలకెత్తాయి. సస్యాలు జీవం పోసుకున్నాయి. వాపీకూపతటాకాదులు జలభరితాలయ్యాయి. చతుర్వర్ణాల ప్రజలూ సంతోషించారు. దేవతలు మరీ ఆనందించారు. "పరిస్థితులన్నీ చక్కబరిచాను. ఇంకేమైనా కావాలంటే కోరుకోండి" అన్నదామె. దుర్గముడి వద్దనున్న వేదాలు తిరిగి యిప్పించు తల్లీ" అని ప్రార్థంచారు దేవతలు. బ్రాహ్మణులు. "తథాస్తు" అంటూనే అదృశ్యమై పోయిందా తల్లి.

కందమూలాదులను అనుగ్రహించడం వలన శాకంభరీదేవి' అనీ - వంద నేత్రాలతో ఆవిర్భవించడం వలన "శతాక్షి" అనీ ఆమెకు పేర్లు వచ్చాయి.

ఈ కోలాహలమంతా చూసిన దుర్గముడూ ఆశ్చర్యపోయాడు. దేవతలకు మళ్ళా బలమెలా వచ్చిందో తెలియదు. తక్షణమే సైన్యం తీసుకుని స్వర్గంపై దండెత్తాడు. అమరావతి కివతలే అమ్మవారు తేజోమయ చక్రం ధరించి నిలబడి

వుంది. దేవతలంతా ఆమె వెనుకనేవున్నారు. యుద్ధం ప్రారంభమైంది. ఆ మహా సంగ్రామంలో - అమ్మవారి శరీరము నుంచి కాళీ, తార, ఛిన్నమస్తక, భువనేశ్వరీ, శ్రీ విద్య, భైరవి బగళ, ధూమ్రా, త్రిపుర సుందరి, మాతంగి, మహావిద్యా స్వరూపాలైన దశ శక్తులు అవిర్భవించాయి.

సాయుధపాణులై అవతరించిన ఆ శక్తి గణం అగణితమైన మాతృగణాలను ఆవిర్భవింపచేసింది. చంద్రకళాపతంసలు చంద్రచండ ఆయుధపాణులు, విద్యుల్లేఖాసమతన్వంగులైన వాళ్ళందరూ కలసి దుర్గముడి యొక్క వంద అక్షౌహిణీల సైన్యాన్నీ నరికి అవతల పారేశారు.

అమ్మవారు ఒకే ఒక్క ప్రహారంతో దుర్గముణ్ణి చంపివేసింది. దుర్గముణ్ణి దునుమాడటంవల్ల ఆమె దుర్గగా కీర్తింపబడింది. అడవులూ, కొండలే అస్థానంగా కలిగి వుంటుంది గనుక కూడా ఆమెను దుర్గ అంటారు. భయంకరులైన రాక్షసుల్ని చంపింది గనుక భీమాదేవి అనీ, భ్రమరాల్ని నియమించి అరుణుడిని చంపింది గనుక భ్రామరీ అనీ, భ్రమరాంబా అనీ అంటూంటారు.

## అమ్మవారి ఆరాధన

శ్రద్ధగా వినండి. ప్రకృతియే మాయ. అదే సనాతన బ్రహ్మమని తెలుసుకోవాలి. రాళ్ళతోగాని, కలపతోగాని, మట్టితోగాని, దేవీ ఆలయం నిర్మించినట్లయితే వెయ్యితరాల పూర్వీకులు తరించిపోతారు. అలా గుడికట్టించిన వాడు సాలోక్యాన్ని పొందుతాడు. అటువంటి అమ్మవారి మందిరంలో శ్రీ చక్రాన్ని కూడా స్థాపించిన వారికి కోటి రెట్లు ఎక్కువ ఫలం కలుగుతుంది. పంచాయతన మధ్యంలో అమ్మ వారిని పూజించిన వారికి కలిగే ఫలం వర్ణించి చెప్పగలవారు ఈ సృష్టిలోనేలేరు.

శివ నామమము కోటి సార్లు జపించేకన్నా-అమ్మవారి జపం చేయడం వల్ల కోటిరెట్లు ఫలం వస్తుంది. మహా మాయయైన ఆ తల్లి అనుగ్రహం వుండాలేకాని - అసాధ్యమన్నదేదీ వుండదు. ఎవరైతే యీ పరాభట్టారిక నారాధిస్తారో వాళ్ళందరినీ దేవీ గణాలుగా గుర్తించాలి. లేచినా, కూర్చున్నా పడుకున్నా పనిచేసుకుంటున్నా కూడా "ఉమ" "ఉమ" అని స్మరించేవాళ్ళు ఖచ్చితంగా దేవీ గణాలలోవాళ్ళే. రోజూ అమ్మవారి గుడికి వెళ్ళి అర్చించే వారిని యెనలేని కరుణతో గారవిస్తుంది.

అమ్మవారి దివ్య మంగళ విగ్రహాన్ని స్థాపించి - మధుఘృతాలతో స్నానం చేయించిన వారికి అఖండమైన ఫలం లభిస్తుంది. అగరుచందనం, కర్పూరం, జటామాంసి, తుంగముస్తలు చూర్ణం చేసికలిపిన నీళ్ళతోనూ, ఒకే రంగుగల ఆవుల యొక్క పాలతోనూ అభిషేకంచేసి - నైవేద్యం సమర్పించి ఆవునేతితో తడిసిన వత్తులతోను, కర్పూరంతోనూ నీరాజనాలిచ్చి షోడశోపచారాలతోనూ పూజించాలి. కృష్ణాష్టమినాడుగాని, నవమినాడు గాని, అమావాస్యనాడు గాని, పంచపర్వములందుగాని, దేవీ సూక్తం లేదా శ్రీసూక్త విధిగా లేదా - మూలమంత్ర యుతంగా - ధాత్రీగంధపుష్ప పత్రాదులతో అర్చించినట్లయితే అమ్మవారు యెంతో ఆనందిస్తుంది.



చైత్రశుద్ధ తదియనాడు భవానీ వ్రతం చేయాలి. యీ రోజు ఉమాశంకరులను పూజించి డోలోత్సవం చేయించాలి. కుసుమ కుంకుమ వస్త్ర కర్పూరాగరు చందన ధూప దీప నైవేద్య పుష్పమాలికలతోనూ - సువాసనా ద్రవ్యములతోనూ దేవిని

అలంకరించి అర్చించి మహామాయా స్వరూపిణియైన శ్రీదేవికి డోలికోత్సవం జరిపించాలి.

వైశాఖ శుద్ధ తదియ రోజున అంబికా వ్రతమాచరించి మల్లికా మాలతీ మందార బంధూక పంకజ జపా పుష్పాలతో గౌరీ శంకరులను పూజిస్తే మనో వాక్కాయ కర్మలతో చేసినకోటి జన్మల పాపాలు నశిస్తాయి. జ్యేష్ఠశుద్ధ తదియ రోజున దేవీ పూజ చేస్తే సిద్ధించనివంటూ యేమీ వుండవు.

ఆషాఢశుద్ధ తదియ నాడు అమ్మవారికి రథోత్సవం చేయించాలి.

శ్రావణ, భాద్రపద శుద్ధ తదియలలో అమ్మవారిని ఆరాధించి పరమాన్నం మొదలైన పిండివంటలు నివేదించిన వారు ధైర్యవంతులై పుత్రపౌత్రాభివృద్ధి కలవారై, అంతంలో అమ్మవారి లోకం చేరతారు.

ఆశ్వీయుజ శుద్ధ పక్షంలో నవరాత్రోత్సవాలు చేస్తే సర్వ వాంఛలు తీరతాయి. కార్తీక, మార్గశిరి, పుష్యమాసాలలోని శుద్ధ తదియలలో లోహితవర్ణంగల కరవీరాది కుసుమాలతోనూ, సుగంధ ధూమాలతోనూ పూజిస్తే సమస్తమైన మంగళాలూ కలుగుతాయి. సౌభాగ్యాన్ని కోరుకునే స్త్రీలందరూ యీ వ్రతాన్ని ఆచరించాలి. విద్య డబ్బు, పుత్ర సంతతుల నాశించేవారూ, అభివృద్ధిని కోరేవారూ అయిన పురుషులు కూడా యీ వ్రతం చేయాలి.

మాఘ, ఫాల్గుణ మాసాలలో వచ్చే శుద్ధ తదియలలో దేవీ పూజ చేస్తే ఆవిడ సంతసించి సర్వసౌభాగ్యాలు ప్రసాదిస్తుంది.

అత్యంత పుణ్యవర్ధినీ - శివ భక్తి వివర్ధినీయైన - ఈ ఉమా సంహితా శ్రవణ పఠన స్మరణలు అత్యంత పుణ్యదాలు - ఏ భూతప్రేత పిశాచాదులూ పీడించవు. పుత్రపౌత్రాది సకల సంపత్తులూ కలుగుతాయి.

శ్రీ వేదవ్యాస మహర్షి విరచితమైన శ్రీ శివ మహాపురాణము నందు

ఉమా సంహిత సమాప్తము//

✦ ✦ ✦



# శ్రీ శివ మహాపురాణము

## కైలాస సంహిత

## (కైలాసో నామ షష్ఠ సంహితః)

## ప్రణవార్థ వివరణము

ఋషులంతా కలిసి 'ప్రణవార్థం' చెప్పమని కోరారు సూతుణ్ణి. అందుకున్నాడాయన - ప్రణవానికీ ప్రపంచానికి అట్టే తేడా యేమీలేదు. ప్రపంచం ముడుచుకుంటే ప్రణవం. ప్రణవంపరుచుకుంటే ప్రపంచం. ప్రణవార్థాన్ని తెలుసుకోవడమే జ్ఞానంగా చెప్పబడుతోంది. సమస్తమైన విద్యలకూ మూలమైన బీజమే ప్రణవం పరముడు 'ఓం' అనే యేకాక్షరమందే నివసిస్తాడు. గుణత్రయ సంబంధంచేత పదార్థమంతా కూడా ప్రణవార్థమే అవుతుంది, ఇంతెందుకు? శివుడే ప్రణవం ప్రణవమే శివుడు. ప్రణవం వాచకమయితే, శివుడు వాచ్యం అవుతాడు. వాచ్య వాచకాలకు భేదంలేదు. బ్రహ్మజ్ఞానులు ప్రణవాన్నే శివుడుగానో, లేదంటే శివుణ్ణే ప్రణవంగానో భావించి ధ్యానిస్తుంటారు.

కాశీలో అవసానదశలో వున్నవారి చెవులలో ఆ శివుడు బోధించేది యీ ప్రణవాన్నే. తృణం మొదలు బ్రహ్మ పర్యంతమూ గల జీవకోటి సమస్తానికీ కూడా ప్రాణమువంటిది కావడంచేత యిది ప్రణవం అనబడుతోంది. పంచాక్షర

సమన్వితమై జాపకులకు మోక్షమును ప్రసాదిస్తోంది, అకార, ఉకార, మకారములూ - చివరిలో నాదము వుంటాయి. అ,ఉ,మ-లు మూడు మాత్రలూ, బిందు నాదములు అర్థమాత్రయొక్క ప్రభావాన్ని చెప్పడం యెవరివల్లా అయ్యేపనికాదు.

అకారం రజోగుణాశ్రితం, అధిష్ఠాత చతుర్ముఖుడు. ఉకారం పురుషరూపం. తమోగుణాశ్రితం. అధిష్ఠాత విష్ణువు, మకారం బీజ సంపన్న పురుషరూపం. తమోగుణాశ్రితం. అధిష్ఠాత మహాదేవుడు. ఇక, బిందువు మహేశ్వరుణ్ణి, నాదం పరముణ్ణి ఆశ్రయించుకుని వుంటాయి. అదేవిధంగా - అకారంలో సద్యోజాతుణ్ణి, ఉకారంలో వామదేవుణ్ణీ, మకారంలో అఘోరుణ్ణీ, బిందువులో తత్పురుషుణ్ణి, నాదంలో ఈశానుణ్ణి తెలుసుకోవాలి. ఓంకారంలో వున్నాయి. వామదేవ జనితాలైన 13 కళలు ఉకారంలోనూ అఘోరమూర్తి కృత కళాష్టకం మకారంలోనూ వున్నాయి. తత్పురుష సంజాతాలైన కళలు 4 బిందువులోనూ, ఈశాన కళలు 5 నాదంలోనూ ఉన్నాయి.

మంత్రం, యంత్రం, దేవత, ప్రపంచం, గురుడు, శిష్యుడు - అనే యీ ఆరూ 'షట్పదార్థా' లనబడతాయి. అయిదక్షరాల కలయిక గల మంత్రమే యంత్రం అవుతుంది. యంత్రమే దేవతారూపం, ఆ దేవతయే ప్రపంచం - ప్రపంచ స్వరూపుడు గురువు గురువుకు శరీరం శిష్యుడు.

మానవ శరీరంలోని-లేదా-సాధకుల శరీరంలోని అధారచక్రములో 'అ' కారము, మణిపూరంలో 'ఉ' కారము, హృదయంలో 'మ' కారము, విశుద్ధచక్రంలో బిందువు, అజ్ఞానచక్రంలో నాదమూ విరాజిల్లుతుంటాయి. ఈ అయిదింటినీ మించిన శక్తి విశిష్టుడైన శివుడు సహస్రారంలో భాసిస్తుంటాడు. ఎటువంటి మినహాయింపులూ లేని (అనగా - ప్రాణంపట్లకూడా) వైరాగ్యం చెందినవాడే ప్రణవ స్వీకారానికి అధికారి అవుతాడు.

అటువంటివాడు బ్రహ్మచర్యం, అహింస, భూతదయ, సత్యం, అస్తేయం, పరిశుభ్రత, సదాచారం -యిత్యాది నియమాలు పాటిస్తూ భస్మరుద్రాక్ష ధారణ వ్రతావలంబనుడై వుండాలి. ఇవి సమకూడినప్పుడు - శివభక్తిమయుడూ, సర్వ శాస్త్రార్థవేత్త, వేదాంతజ్ఞాని, సమయోచిత వివేకీ అయిన వారిని గురువుగా యెంచుకుని - వారికి సాష్టాంగ ప్రణామాదులాచరించి ప్రసన్నులను చేసుకోవాలి.

శివుడికీ గురువుకీ భేదంలేదనే నిశ్చయంతో - జిజ్ఞాసను గురువు యొక్క అనుమతి ప్రకారం పన్నెండు రోజులపాటు ఒకసారి మాత్రమే ఆహారం స్వీకరిస్తూ - బ్రతకాలి.

అనంతరం సముద్ర తీరానగాని, నదీతీరానగాని, పర్వతాగ్రానగాని, శివాలయానగాని - శుద్ధ పంచమి - లేదా ఏకాదశీ తిథిగలనాడు ప్రాతః స్నానం చేసి నిత్యకర్మలు ముగించుకుని, గురువును ఆహ్వానించి 'నాందీశ్రాద్ధం' చేయాలి. అటుతర్వాత బాహుమూలాలూ పాదమూలాలూ విడిచి తక్కిన సర్వాంగాలు చక్కగా క్షౌరం చేయించుకోవాలి.

పునః స్నానంచేసి పేలపిండిని పాలతోగాని, మజ్జిగతోగాని స్వీకరించాలి. తిరిగి సాయంకాలం సంధ్యోపాసనాదులు ముగించి - సాయంకాల ఔపాసనం పూర్తిచేసి శివుడిగా భావింపబడిన గురువుకు మహా దక్షిణ సమర్పించాలి. తనదైన వేదశాఖానుసారంగా అగ్నిరగిల్చి ప్రాజాపత్యేష్టిని చేయాలి. పురుషసూక్త మంత్రంతో అగ్నిలో ఆహుతులు, వేయాలి. స్విష్టకృత హవనం చేయాలి. అనంతరం దర్భలు జింకతోలు, పట్టు బట్టతో యేర్పరచిన ఆసనంపై కూర్చుని తెల్లవారేదాకా గాయత్రీ మంత్ర జపించాలి.

మర్నాడుదయం స్నానాదులు ముగించి పురుషసూక్తంతోను, విరజా మంత్రాలతోనూ హవనం చేసి, హోమశేషాన్ని ముగించి, అగ్నిని ఆత్మారోపణం చేసుకుని ప్రాతః సంధ్యనాచరించాలి. పెళ్ళాం, పిల్లలూ, డబ్బూ - అనే మూడు లాలసతలనూ వదిలి వెయ్యాలి. తలపై వెంట్రుకలు లేకుండా "ముండనం" చేయించుకోవాలి. జందెం తీసివేయాలి. మొలత్రాడు కూడా తెంపెయ్యాలి. తూర్పు దిశగా గాని, ఉత్తరదిశగాగాని ప్రయాణం సాగించాలి. ఎంత విరాగులకైన రవ్వంత లోక భావన వుంటుంది కనుక అది వున్నవారు దండ, కౌపీనాదులు స్వీకరించాలి. పూర్తిగా విరాగి అయినట్లయితే అవికూడా లేకుండానే ప్రయాణించాలి.

గురువు విరజాహోమంలోని తెల్ల భస్మాన్ని శిష్యుడికి ఇచ్చి 'అగ్నిరితిభ' స్మాది మంత్రాలతో ధరింపచేయాలి. తరువాత గురువు శిష్యుడి తలపై తనచేతిని వుంచి, కుడిచెవిలో ప్రణవ మంత్రాన్ని మూడుసార్లు ఉపదేశించాలి. అలా ఉపదేశించినప్పుడు ఆ మంత్రం శిష్యుడికి తప్ప, యెవరికీ వినపడనంత మెల్లగా ఉపదేశించాలి. అనంతరము ప్రణవార్థాన్ని చెప్పాలి, శిష్యుడు గురువుకు 12 సార్లు నమస్కరించాలి.

# సన్యాసుల విధులు

ఇలా ఇలా స్వీకారమనే పేరు కలిగినదీ - పామరులను మోహనపరచేదీ అయిన ఈ సన్యాసాశ్రమాన్ని స్వీకరించినవాడు బ్రాహ్మీ ముహూర్తములో నిద్రలేవాలి. సహస్రారంలో గురువును ధ్యానించాలి. ఆయనకు మానసిక పూజను సమర్పించాలి. దినసరి బాధ్యత అంతా ఆయనపై మోపాలి. ప్రాణాయామం చేయాలి. శివధ్యానం చేయాలి.



ఆ తతంగం అయిన తర్వాత - గ్రామానికి బాహ్య ప్రదేశం చేరాలి అక్కడ నేలపై గడ్డి పరచి, తన తల పై గుడ్డ కప్పుకుని, ముక్కు మూసు కుని మలవిసర్జన, చేయాలి. తదుపరి పురుషేంద్రియాల్ని ఎడమ చేత బూని జల ప్రాంతం దగ్గరకు వెళ్ళి, చెంబుతో నీళ్ళు తీసుకుని గుదప్రక్షాళనం ముగించి కాళ్ళూ చేతులు కడుక్కుని 'ఓం' అని రెండుసార్లు ఉచ్చరిస్తూ ఆచమనం చేయాలి. అటు తర్వాత ఉత్తరాభిముఖుడై గడ్డి పుడకలతోనూ, ఆకులతోనూ దంతధావనం చేయాలి. అమావాస్యనాడూ, ఏకాదశినాడూ మాత్రం పన్నెండుసార్లు నీళ్ళు పుక్కిలించి వుమ్మితేచాలు. పళ్ళుతోమనక్కరలేదు. అనంతరం రెండుసార్లు ఆచమించాలి అరుణోదయ కాలానికల్లా - వంటికి మట్టి పూసుకుని నడుంలోతు నీళ్ళలో నిలబడి స్నానం చేయాలి.

అటు తర్వాత మంత్రయుక్తంగా భస్మను తడిపి మూడు రేఖలుగా - నొసలు, రొమ్ము, చేతులు, కడుపు మున్నగు అవయవాలమీద ధరించి గురువునీ, శివుణ్ణి స్మరించి సంధ్యావందనం ఆచరించాలి. శివుణ్ణి నాలుగు ముఖములు, ఎనిమిది చేతులూగల అర్ధనారీశ్వరుడిగానూ, సూర్యమండల మధ్యవర్తిగానూ, సర్వ తేజోమయుడిగానూ, సర్వ సద్గుణ - అద్భుతాలతో నిండివున్న వాడిగానూ, సర్వాలంకార భూషితుడుగానూ, భావించి ప్రణవంతో మూడుసార్లు అర్ఘ్యం యివ్వాలి.

ప్రణవ పంచాక్షరిని 108 సార్లు జపించాలి. 18 తర్పణలు, 3 ప్రాణాయామాలు చేయాలి. శివస్మరణ చేస్తూ పూజామందిరం చేరి, కుడికాలు ముందు పెట్టి లోపలికి వెళ్ళి, పూజాస్థలాన్ని మంచినీటితో అలకాలి. అటుమీదట ముగ్గుపిండితో ప్రణవం వ్రాసి ఆపైన పద్మం వేయాలి. శంఖాన్ని శుద్ధోదకంతో నింపి ప్రణవ స్మరణతో గంధ పుష్పాదులచేత పూజించి "ఓం" కారంతో ఏడుసార్లు అభిమంత్రించి, పూజా ద్రవ్యాలమీదా, తనమీదా చల్లుకోవాలి, అనంతరం సూర్యమంత్రం జపించాలి. ఈ సౌర మంత్రానికి ఋషిదేవభాగుడు, ఛందస్సు గాయత్రీ దేవత సూర్యాంతర్వర్తియైన మహేశ్వరుడు.

"హ్రాం హ్రీం హ్రూం హ్రైం హ్రోం (హ్రౌం)హ్రః" అరు అక్షరాలతో కరాంగన్యాసాలు చేసి కాలాగ్ని రుద్రునీ. ఆధారశక్తినీ, అనంతునీ, పృథ్వినీ, రత్నదీపాన్నీ, మణిమయ గృహాన్నీ, రత్నపీఠాన్నీ, భావించాలి. ధర్మ, జ్ఞాన, వైరాగ్య, ఐశ్వర్య, సత్త్వరజస్తమోగుణాలనూ, బ్రహ్మవిష్ణువులనూ కమల దళాలుగానూ - రుద్రుణ్ణి కర్ణికారం (ఆత్మ)గానూ భావించాలి. వామార్ధంలో దేవితో-జపమాల పాశం, మంచపు కోడు కపాలం, అంకుశం, కమలం, శంఖం, చక్రం, అనే వాటిని యెనిమిది చేతులా ధరించి - నాలుగు ముఖాలూ పన్నెండు నేత్రములతో విరాజిల్లుతున్న వాడిగా భావించాలి. తదితర దేవతా భావనాదులు కూడా ముగించుకుని - రాగిపళ్ళెంనిండా మంచినీళ్ళుపోసి, అందులో సుగంధ పుష్పాదులు వేసి మోకాళ్ళపై కూర్చుని, కనుబొమలవరకూ లేవనెత్తి మంత్రపూర్వంగా అర్ఘ్యం సమర్పించాలి.

**శ్లో॥ "నమః శివాయ సాంబాయ - సగణా యాది హేతయే**
**రుద్రాయ విష్ణవే తుభ్యం బ్రహ్మణే చ త్రిమూర్తయే॥**

అనే మంత్రంతో సూర్యుడికి నమస్కరించాలి. పునఃపరిశుద్ధుడై - విభూతి రేఖలు ధరించి - పంచోపచారాలతో గురుపూజచేసి "ఓం శ్రియే నమః" అని నమస్కరించుకోవాలి. గణపతికి, దుర్గాదేవికి, క్షేత్రపాలకులకు దోసిలి ఒగ్గి "ఓం అస్త్రాయ ఫట్" అనుకోవాలి. 'అపసర్పంతు' ఇత్యాది శ్లోకాలు చదువుకుని కుడికాలి మడమతో మూడుసార్లు నేలను తాడించాలి.

విఘ్నాలు దూరంకావడం కోసం 3 సార్లు కరతాళ ధ్వనిచేయాలి. విఘ్నాలన్నీ ఆకాశగతాలైనట్లు భావించి - అటుచూసి - కూర్చుని ప్రాణవాయువును పట్టాలి. హంస మంత్రం ఉచ్చరించాలి. హృదయ గతజీవాత్మను సహస్రారంలోని పరమాత్మతో యేకీభవింపచేసి, సహస్రార కమలంలోని అమృత ప్రవాహంతో

తడపబడినవాడై 'సో ౨హం' అనుకోవాలి. అలా అనుకుంటూ, సహస్రారగతమైన జీవాత్మను విడదీసి హృదయ కమలంలోనికి దింపి, పంచ ప్రాణాలను నెలకొల్పి, శంకరుణ్ణి స్మరిస్తూ, హృదయం గతవాంఛల్ని పరిహరించాలి.

ప్రణవానికి ఋషి బ్రహ్మ ఛందస్సు గాయత్రి - దేవత పరమాత్మయైన సదాశివుడు అకారం బీజం, ఉకారం శక్తి. మకారం కీలకం. మోక్షార్థం వినియోగం, "ఓంనమః" అని కరాంగన్యాసాలు చేసుకోవాలి. అకారం బ్రహ్మ స్వరూపంగానూ ఉకారం విష్ణు స్వరూపంగానూ మకారం రుద్ర స్వరూపంగానూ భావించుకోవాలి.

## ప్రత్యేక శివ పూజా విధి

యతులు - శివపూజ చేసేటప్పుడు ముందుగా గణపతిని రక్తాభుడుగా, మహాకాయుడిగా, సర్వాభరణ భూషితుడుగా, పాశాంకుశ వరదాభయముద్రలు దాల్చిన వాడిగా, గజవదనుడిగా సర్వ విఘ్ననాశకుడిగా ధ్యానించాలి. గంధ పుష్పాక్షతాదులు, కందళీఫల, నారికేళాదులూ అర్పించుకోవాలి.



అనంతరం స్కంద గాయత్రిని జపిస్తూ - కుమారస్వామిని ఉదయిస్తున్న బాల భాస్కరుడిలాగానూ, మయూరవాహనుడిలాగాను, చతుర్భుజుడుగాను, వరదాభయహస్తుడు, శక్తి కుక్కుటధారి, కిరీటమకుటాది మండితుడిగానూ ధ్యానించి గంధాద్యుపచారాలు చేయాలి.

ఆ పిదప అంతఃపురాధికారియైన నందీశ్వరుణ్ణి మేరు సమానుడి గానూ, సౌమ్యుడు, చతుర్భుజుడు, త్రినేత్రుడు, చంద్రధారి, త్రిశూలపాణి, హరిణటంకం బంగారుబెత్తం పట్టుకుని వున్నట్లుగా ధ్యానించి ఆయన కుడివైపున మరుత్తుల పుత్రికయైన సుయశ - అమ్మవారి పాదాలంకరణ నిపుణగా భావించి గంధ పుష్పాదులతో పూజించాలి.

అటుతర్వాత సద్యోజాతాది పంచ బ్రహ్మ మంత్రాలతోనూ శివ ధ్యానం చేయాలి. ఆ పిదప - స్వామివారి వామభాగాన అమ్మవారిని భావించి - ప్రణవ పూర్వకంగా 'గౌరీమ్మిమాయ' ఇత్యాది మంత్ర పఠనం చేయాలి. ఆమెను ధ్యానించాలి.

ఆ పిదప శక్తి శివాత్మకమైన లింగానికి "సద్యోజాతం ప్రపద్యామి" అంటూ ఆసనాన్నీ, సద్యోజాతాయవైనమః అంటూ పాద్యాన్నీ, 'భవేభవే నాతి భవే' మంత్రంతో అర్ఘ్యం, 'భవోద్భవాయ నమః' ఉచ్చరిస్తూ ఆచమనీయం - "వామ దేవాయ నమః" అంటూ శుద్ధోక స్నానం, 'జ్యేష్ఠాయ నమః' అని వస్త్రం, 'శ్రేష్ఠాయ నమః' అని యజ్ఞోపవీతం, 'రుద్రాయ నమః' అని విభూతి, 'కాలాయ నమః' అని మంచిగంధం (శ్రీగంధం) - "కలవికరణాయ నమః" అని శుభ్రాక్షతలు, 'బల వికరణాయ నమః' అని మారేడు పత్రీ పువ్వులూ. 'బలాయ నమః' అని ధూపం, 'బల ప్రమథనాయ నమః' అంటూ దీపం 'సర్వ భూతదమనాయ నమః' అంటూ నైవేద్యం, 'మనోన్మనాయ నమః' అంటూ తాంబూలాన్నీ, "అఘోరేభ్యః" ఇత్యాది మంత్రాన మంత్రపుష్పం, ఈశాన మంత్రంతో నమస్కారం - సమర్పించుకోవాలి.

## పంచావరణ పూజ

శివభక్తుడైన యతి ప్రథమావరణంలో - గణపతి, కుమారస్వామి సద్యోజాత, వామదేవ, అఘోర, తత్పురుష, ఈశాన - పంచ బ్రహ్మమూర్తులనూ పూజించాలి.

ద్వితీయావరణంలో-అనంతసూక్ష్మ శివోత్తమ ఏకనేత్ర ఏకరుద్రత్రిమూర్తి శ్రీకంఠశిఖండీశులను ఆరాధించాలి. మూడవ ఆవరణలో - భవశర్వ, ఈశాన,

రుద్ర, పశుపతి, ఉగ్రభీమ, మహాదేవులనబడే అష్టమూర్తులను అర్చించాలి. చతుర్థావరణంలో - విష్ణుమూర్తినీ, వాసుదేవుణ్ణి, అనిరుద్ధుణ్ణి, సంకర్షణుడినీ, బ్రహ్మ దేవుడినీ, హిరణ్యగర్భుడిని, విరాట్ పుష్కర-కాలాలనూ సేవించాలి. పంచమా వరణంలో లోకపాలకులనూ, ఖడ్గపాశాంకుశపినాక విజయ వజ్రాయుధ పరశు బాణాలనూ, క్షేత్రపాలుడినీ కొలుచుకోవాలి.

# నిత్యారాధన

ఇక-ఆశ్రమ స్వీకార దినాన గురువునుండి స్ఫటిక లింగాన్ని స్వీకరించి, దానిని నిత్యం ఆరాధించుతూ వుండాలి. చాతుర్మాస్యం మొదలైన పర్వకాలాలలో ఏకాదశ రుద్రాభిషేకాది విశేష విధానములో అర్చించవలసివుంటుంది. పూజా నంతరాన చండీశ్వరుడికోసం ప్రత్యేకంగా శివనిర్మాల్యం తీసి ఈశాన్యదిశయందు ఉంచాలి. శివ నిర్మాల్యం స్వీకరించ దగినదేగాని - చండీశ్వరుడి వంతుకు వచ్చే నిర్మాల్యము మాత్రం ఎవ్వరూ తీసుకోకూడదు.

ప్రాణ ప్రయాణం వరకూ కూడా నిత్యం యే రోజూ శివలింగార్చన జరుపనిదే, శివ తీర్థ ప్రసాదాలు తీసుకోనిదే భోజనం చేయనని గురు సన్నిధిని ప్రతిజ్ఞ చేయాలి. శివలింగం మీద ఉమామహేశ్వరుల విగ్రహాలను నెలకొల్పి పూజించవచ్చును. ఇది చాలాగోప్యం. కేవలం శుద్ధ విరాగులకు మాత్రమే బోధనీయమని గ్రహించాలి.

# శ్రీ కుమారస్వామివారి బోధనము

**సూతోవాచ:-** ఒకప్పుడు వామదేవుడు యీ సన్యాసాశ్రమ వైరాగ్యాదులను గురించి శ్రీ కుమారస్వామిని అడిగాడు. అప్పుడాస్వామి చెప్పిన సంగతులు కూడా తెలియచేస్తాను శ్రద్ధగా వినండి.

విజ్ఞానాభివృద్ధి నిమిత్తంగా కర్మవాద శాస్త్రీయ వాదాదులన్నిటినీ వినవల్సిందే తెలుసుకోవలసిందే కానీ - అవే లోకమని పట్టుకు వ్రేళ్ళాడకూడదు. పొగను బట్టి పర్వతంలో అగ్ని వున్నదని యెలా గుర్తించగలుగుతున్నామో - అదే విధంగా - జగత్తును బట్టి జగత్కర్తవున్నాడనే అనుమానం కలుగుతుందనీ, ఆ అనుమాన ప్రమాణంతో దైవాన్ని సాధించాలని చెబుతారు. అంతా పరిశుద్ధమైన తప్పు అని తెలుసుకో.



సాధకుడి ననుగ్రహించి సాక్షాత్కరిస్తాడేగాని, ఆ సర్వేశ్వరుడు అనుమాన గమ్యుడు ఏమాత్రం యేనాడు కాడు.

ఆరుకోశాలతో కూడుకుని వున్న శరీరంలో మూడు కోశాలు తల్లివలనా మూడు కోశాలు తండ్రి వలనా ఏర్పడుతున్నాయి. దానిని బట్టి సృష్టి అంతా కూడా యీ విధంగా స్త్రీ పురుష సంయోగ జన్యమేనని తెలియటంలేదా!

అసలు 'సచ్చిదానంద స్వరూపం' అనే మాటే - స్త్రీపురుష సమరసీ భూత సంయోగ మూర్తి' అనే అర్థాన్ని చాటుతుంది. అందువల్ల యెల్లవేళలా శివ శక్త్యాత్మకమైన శివ లింగాన్ని ఆరాధించటమే సర్వ శ్రేయస్కరంగా తెల్సుకోవాలి - అని కుమార స్వామి చెప్పినదంతా విన్న మీదట - వామదేవుడగిన మహా వాక్యార్థ నిరూపణ విషయమై కార్తికేయుడిలా చెప్పాడు అంటూ సూతుడు శౌనకాదులకు చెప్పసాగాడు.

# మహా వాక్యార్థ నిరూపణము

**1.** ఓం ప్రజ్ఞానం బ్రహ్మ-ప్రజ్ఞానం=పరిపూర్ణమైన జ్ఞానం (ఏవ=యే) బ్రహ్మ=బ్రహ్మ స్వరూపము.

**2.** ఓం - అహం బ్రహ్మాస్మి - అహం - నేను, (శివ శక్త్యనుగ్రహ జాతుడనగు నేను)

**3.** ఓం-తత్వమసి-తత్=బ్రహ్మము, త్వం నీవు (ఏవ=గా) అసి=వుంటివి

**4.** ఓం-అయ మాత్మా బ్రహ్మ-అయం=ప్రతిక్షణమూ లో నుండి-'నేనునే' ననుచు ప్రకటింపబడు, ఆత్మా=ఆత్మయే (శరీరమును ధరించి యున్నదే) బ్రహ్మ=బ్రహ్మము.

**5.** ఓం. ఈశావాస్యమిదం సర్వం ఇదం=ఈ యొక్క, సర్వం-సమస్త (విశ్వ)మును, ఈశా =ఈశుని చేత ఆవాస్యం=నివాసముగానై యున్నది.

6. ఓం-ప్రాణోఽ అస్మి - ప్రాణః=జీవము (జీవితము) కలవాడను. అస్మి=అగుదును.

7. ఓం ప్రజ్ఞానాత్మా-ప్ర+జ్ఞానాత్మా=ప్రతిదాని యొక్కయు రూపమును మొదటగానూ గుణము రెండవదానిగానూ, ప్రయోజనమును మూడవదాని గానూ తెలుసుకుని - మూటి సమ్మేళనముచే సంపూర్ణ విషయ జ్ఞానము గల వానిని ప్రజ్ఞానాత్ముడు అందురు.

8. తదేవాహంతదముత్ర. యదముత్ర తదన్విహ-ఇహ=ఈ మానవ లోకమున, యదేవ=ఏదైతే ఎద్దియో - తత్=అట్టి క్షణ భంగురమైన సుఖము, అముత్ర=పరలోకాన గలదు. యత్=ఏ సుఖమైతే, అముత్ర= స్వర్గాది యితర సర్వలోకము లందునా గలదో-తత్=అట్టిదేయైన అశాశ్వత సుఖసందోహము, అన్విహ= ఈ లోకమందే కలదు గదా!

9. ఓం-అన్యదేవతద్విదితాదథో అవిదితాదపి-విదితాత్=ప్రత్యక్షముగ, స్పష్టముగా తెలియబడుదానికంటె, తత్=అదియైన బ్రహ్మము అన్యదేవ= భిన్నమైనదియే, అథో-మరియునూ, అవిదితాదపి=ఎట్టి ప్రత్యక్షతా స్పష్టతా నిస్పందేహతాదులు లేనిదిగా వుండే పరోక్షమైన వినికిడికన్నా కూడా - (అన్యదేవ అనేదే యిక్కడ అన్వయించుకుని-) ఇతరమైనదే గదా అని అర్థం చెప్పుకోవాలి.

10. ఓం-ఏష ఆత్మాంతర్యామ్యమృతః- ఏష ఆత్మా=సర్వలోక వ్యవహార వేదాదుల యందునా ప్రసిద్ధుడగుటచే ఈ పరమాత్మ, అమృతః=అనాది ముక్తుడు. (కావుననే) తే అంతర్యామీ=(ఆ పరమాత్మ) నీయందే నిన్ను నియమించే వాడిగా వుంటున్నాడు.

11. ఓం-సయశ్చాయం పురుషేయశ్చాసావాదిత్యే స ఏకః-పురుషే= సూక్ష్మశరీరం అని చెప్పబడే మహానగర సంవాసుడైన పురుషునియందు, యశ్చ=యెవడో, సః+అయం=అటువంటి ఈ ప్రధాన (పరమ) పురుషుడు, ఆదిత్యే=సూర్యుని యందు. యశ్చ=యెవరో, సః+అసౌ= అటువంటి వాడైనటువంటి ఈ పరమ (ప్రధాన) పురుషుడు. ఏకః= ఒక్కరే, (అత్ర "ఓం నమో హిరణ్య బాహవే" ఇత్యాది శ్రుతి ప్రకీర్తితం).

12. ఓం-అహమస్మి పరబ్రహ్మ- అహం=జీవుడనైననేనే పరబ్రహ్మ= పర బ్రహ్మయును, అస్మి=అగుచున్నాను. (అత్రబ్రహ్మేతి-పరోవాచ్యః- అనగా - బ్రహ్మయే పరుడుగా చెప్పబడుచున్నాడు.)

(పరపరోవాచ్యోత్రవిష్ణుః=పరుడు అనగా బ్రహ్మకన్న పరుడైనవాడుగా శ్రీ మహావిష్ణువు చెప్పబడుచున్నాడు.

శివేనైవ పరపరాత్ పరం-ఇతి శివేనైవ=శివుడు మాత్రమే, పరపరాత్=ఆ విష్ణు దేవునికన్నను, పరం=అతీతునిగావున్నాడు. అనగా పరాత్పరం-పర బ్రహ్మము శివుడే.

13. ఓం-వేదశాస్త్రగురుత్వాత్తుస్వయమానంద లక్షణం - వేదశాస్త్ర=వేదములు - శాస్త్రములు యిత్యాది అపౌరుషేయములైన వానికి గురుత్వాత్తు= గురువు అగుటను సక్రమింప చేసుకున్నవాడు, స్వయం=తనను తనే, ఆనంద లక్షణం=శివునిదైవ నిత్యానందము అనుదాని ననుభవించు చున్నాడు.

14. ఓం సర్వ భూతస్థితం బ్రహ్మ- తదేవాహం న సంశయః-సర్వభూత స్థితం = ప్రాణులందరియందున్నూ వున్నట్టిది ఏదైతే ఉందో, తదేవ బ్రహ్మ = అటువంటి బ్రహ్మం, అహం = నే నగుట యందు'నసంశయః= అనుమానం లేదు. //

15. ఓం తత్త్వస్య ప్రాణోహమస్మి, పృథివ్యాః ప్రాణోహ మస్మి-పృథివ్యాః =భూమి మొదలగువాని యొక్క, తత్త్వస్య=సమస్త తత్వముల యొక్క - ప్రాణః- జీవము, అహం=అస్మి=నేనే యగుదును.

16. ఓం-అపాంచ ప్రాణోహమస్మి. తేజసశ్చప్రాణోహమస్మి-అపాంచ నీటియొక్క, తేజసశ్చ=తేజస్సులయొక్కయు, ప్రాణః=ప్రాణము అహం+అస్మి=నేనే యగుదును.

17. ఓం-వాయోశ్చ ప్రాణోఽహమస్మి+ఆకాశస్య ప్రాణోఽహమస్మి- వాయోశ్చ = గాలియొక్క ప్రాణః=మూలాధారమును, అహం+అస్మి=నేనే యగుదును ఆకాశస్య=ఆకాశము యొక్క, ప్రాణః=జీవమును, అహం+అస్మి=నేనే యగుదును.

18. ఓం-త్రిగుణస్య ప్రాణోఽహమస్మి-త్రిగుణస్య=సత్త్వము, రజస్సు, తమస్సు అనే మూడు గుణములయొక్కయు, ప్రాణః=జీవమును, అహం+అస్మి= నేనే యగుదును.

19. ఓం - సర్వోఽహం సర్వాత్మకోఽహం సంసారీ, యద్భూతం, యచ్చ భవ్యం, య ద్వర్తమానం, సర్వాత్మక త్వాదద్వితీయోఽహం - సర్వోహం = సర్వమునూ నేనే అగుదును. సర్వాత్మకోహం - అందరి అంతరాత్మల యందునా ఉండునది నేను అగుదును. సంసారీ=అపారమైన ఈ విశ్వ మంతటినీ పెంచి, పోషించు బాధ్యతలను ధరించిన యజమానిని నేనే యగుదును. యత్+భూతం=ఏది గతించిపోయినదో, యచ్చ భవ్యం= ఏది కానున్నదో, యద్వర్తమానం=ఏది గతించుచున్నదో, సర్వాత్మకత్వాత్ = అట్టి సర్వాత్మకత్వము కలిగిన, అద్వితీయం=రెండవ వాడు లేని బ్రహ్మము, అహం=నేనే యగుదును.

20. ఓం-సర్వంఖల్విదం బ్రహ్మ-ఖలు=కలిగివున్నట్టి -ఇదం సర్వం=ఈ సమస్తమునూ, బ్రహ్మ=బ్రహ్మయే యగును.

21. ఓం-సర్వోఽహం-విముక్తోఽహం-సర్వోఽహం=సర్వమున కూ 'అహం యైన శివుడే నేనే యగుదును. విముక్తోఽహం=సర్వస్వముచేతా విముక్తుడనగు వాడను నేనే.

22. ఓం-యోఽసౌ సోఽహం హంసః సోఽహమస్మి - యః=ఎవడైతే అసౌ= ఈ పరముడో, సః+అహం=అది నేనే యగుదును. హంసః=శివుని సూక్ష్మమైనదియు, సోఽహం=నేనే యగుదును.

ఈ 22 మహావాక్యాలుగా ప్రసిద్ధాలు, నిత్యమననార్హాలైన వీటిని ఉపదేశించిన వాడు శివాభుడేనని తెలుసుకోవాలి. గౌరవించాలి. ఆరాధించాలి, స్వసంప్రదాయ కంగా సాష్టాంగా దండ ప్రణామాలాచరించాలి. యతి అనేవాడు - పరిశుభ్రంగా స్నానంచేయాలి. భస్మరుద్రాక్ష ధారణ గావించుకోవాలి. ప్రణవం జపించాలి. శివారాధన చేయాలి భిక్షాటనం, ఏకాంతవాసం చేయాలి. ఇవి తప్ప ఇంకేమీ చెయ్యకూడదు.

తాంబూలంగాని, ఇత్తడి - రాగి మొదలైన లోహ పాత్రలుగాని రేతో విసర్జనం గాని, తెల్లని బట్టలుగాని, పగటి నిద్రగాని, రాత్రిభోజనంగాని యతి అనేవాడికి ససేమిరా సరిపడనివిగా తెలుసుకోవాలి.

సామాన్యుల మృతదేహానికి సంస్కారంచేయకపోతే దుర్గతులు కలుగుతాయి. యతియొక్క మృత కళేబరానికి సంస్కారం చేస్తే దుర్గతులు కలుగుతాయి. యతి మృతదేహం దూషించబడినా సరే అది రాజ్యానికి అరిష్టమవుతుంది.

యతుల మరణాంతరగతి ముక్తులవ్వడమే గనుక, వారిని దహనము చెయ్యనక్కరలేదు ఖననం చేస్తే చాలు. యతులకేకాదు - లింగధారులకు కూడా ఖననమే శివాజ్ఞయై వుంది.

యతికి-మరణ మాసన్నమైనప్పుడు - సహవ్రతులు సన్నిహితులై యితః పూర్వం చెప్పిన మహావాక్యాలను అర్థసహితంగా వినిపించాలి. పరంజ్యోతిః స్వరూపుడైన శివునకు నమస్కరించాలి.

యతి అనే వాడు మరణించగానే - 'నమ' 'ఇరిణ్యాయ చ' మొదలుకొని, 'నమ ఆమీవత్కేభ్యః' వరకూ జపించాలి. తుదిని 'ఓం' అనాలి.

నమక చమకాదులతో మృతస్నానాదులు సాధారణమే. స్మశానం చేరాక గాని - లేదా -/ఖననం చేయదలుచుకున్నచోటగాని - గుంట దీసి, నేలమీద నీళ్ళు జల్లి, జమ్మి ఆకులూ, పూలు, దర్భలూపరిచి ఆపై మృగచర్మం పరచాలి, దానిమీద పట్టుబట్ట వెయ్యాలి. గుంట - యతి యొక్క దండ ప్రమాణంగా ఉండాలి. మళ్ళా ప్రణవ సహిత పంచబ్రహ్మ మంత్రాలతోన్యూరుద్ర సూక్తంతోనూ పంచగ వ్యాభిషేకం చేయాలి శంఖోదకం జల్లాలి. శిరస్సున ఒకటైనా పుష్పం ఉంచాలి. తూర్పు ముఖంగా గుంటలో కూర్చోబెట్టి, గంధం పువ్వులతో అలంకరించాలి, సాంబ్రాణి ధూపం వెయ్యాలి, కుడిచేతిలో దండం, యెడమచేతిలో కమలం వుంచాలి.

"బ్రహ్మజ్ఞానం" ఇత్యాది మంత్రాలతో శిరస్సు (మాడు) తాకి - రుద్రసూక్తం పఠిస్తూ భ్రూమధ్యాన్ని స్పృశించాలి. "మానో మహాన్తం" మొదలయినవి చదువుతూ కొబ్బరికాయనుకొట్టి గుంటను మట్టితో పూడ్చాలి. దానిమీద నలుచదరం గద్దెవేసి,

పంచబ్రహ్మ మంత్రాలను చదువుతూ - మహాదేవుని స్మరించాలి. (యేదేవానాం' మొదలు 'యః పరః స మహేశ్వరః' వరకూ చదవాలి).

తదుపరి పీఠాన్ని గోమయంతో అలకాలి. దానిపై శివలింగం స్థాపించి - గంధ పుష్పాక్షతాదులుంచాలి. మారేడు దళాలతో పూజించాలి, ధూప దీపాలు నివేదించాలి. క్షీరం నివేదించాలి. అయిదు ప్రదక్షిణలు చెయ్యాలి. పన్నెండుసార్లు ప్రణవం ఉచ్చరించాలి తదనంతరం - కార్తికేయుడు-ఏకాదశాహ ద్వాదశాహ విధుల్ని వివరించాడు.

## ఏకాదశాహం



11వ రోజున- సమాధి వేదికమీద గుండ్రంగానూ, షట్కోణంగానూ, త్రికోణం గానూ, బింద్వాకారంగానూ, ముగ్గువేసి, పుణ్యాహవాచన మాచరించి, ప్రాణా యామం చెయ్యాలి. పూర్వోక్త అతివాహిత దేవతలు అయిదుగురినీ పూజించాలి. పంచ మండలాలలో ఒక్కొక్క పువ్వును ఆసనంగా నెలకొల్పి, "ఓం-హ్రీం - అగ్నిరూపా - ఆవాహయామి' అంటూ ఆ వాహనాన్నీ, తదితర సర్వోపచారాలనూ సమర్పించాలి. అతివాహిత దేవతలను అందగత్తెలు గానూ-అపురూపులుగానూ- అత్యున్నతులు గానూ భావించుకోవాలి. పాద్యాదులు అవీ సమర్పించుకోవాలి. ఆ విధానానంతరం - దోసిలి తలనొగ్గి-

"ఓయమ్మలారా ప్రసన్నులై-శివ పదాభిలాషితుడైన యీ యతిని పరమేశ్వర చరణ కమలాలకు చేర్చండి తల్లీ." అని ప్రార్థించాలి. పిదప విసర్జనంచేసి నివేదిత ప్రసాదాన్ని కన్యలకు యివ్వాలి. కన్యలు లభించకపోతే ఆవుకు పెట్టాలి. ఆవులు కూడా దొరకనప్పుడు నీటిలో కలిపి వేయాలి.

ఇక్కడ-పార్వణ శ్రాద్ధం చెయ్యాలేగాని, ఏకోద్దిష్టం పనికిరాదు. "ఆత్మనే-అంత రాత్మనే పరమాత్మనే అని యతిత్రయా న్నుద్దేశించి స్మరించాలి, శివ భక్తులైన

ఉత్తమ బ్రాహ్మణుల నాహ్వానించి, వారిని తూర్పుముఖంగా ఆసీనులను గావింప చేసి గంధాద్యుపచారాలతో కాళ్ళు కడిగి పూజించి పిదప ప్రదక్షిణ నమస్కారాలు చేసి దక్షిణ నియ్యాలి.

అది అయిన తర్వాత నారాయణ బలి కానివ్వాలి. అప్పుడు 12 మంది బ్రాహ్మణులను కేశవనామాలతో పూజించి పాదరక్షలు, గొడుగులు బట్టలూ మొదలైనవి సమర్పించాలి. ప్రియవాక్యాలతో మురిపించాలి. సంతోషింపచేయాలి. నేలమీద దర్భలు పరచి - "ఓం భూః స్వాహా, ఓం భువః స్వాహా ఓం సువః స్వాహా" అంటూ పరమాన్నం బలిగా పోయాలి. ఇదంతా ఏకాదశాహ కృత్యం.

## ద్వాదశాహం



ఇక ద్వాదశాహం చెబుతాను విను :- కర్త-పన్నెండో రోజు ఉదయమే లేచి, దంత ధావనాదులూ స్నానాలు చేసి-నిత్య కర్మ నాచరించి, శివభక్తులైన యతుల్ని గానీ/ గృహస్థులైన బ్రాహ్మణులనుగాని పిలిచి- మధ్యాహ్నవేళ వారు స్నానం చేయునట్లు చేసి రుచికర పదార్థాలతో భోజనం పెట్టాలి. అది వారు భుజించేలా చూడాలి.

మహా సంకల్పం చెప్పుకుని, "అస్మద్గురు పూజాం కరిష్యే" అని ఉచ్చరించి, కర్త - మౌనంగా పాదప్రక్షాళణం చేసుకుని, ఆచమించి, భస్మరేఖలు దాల్చి-భోక్తలను తూర్పుముకంగా ఆసీనుల్ని గావించాలి.

సదాశివ మహేశ్వర, రుద్ర, సద్యోజాత, వామదేవ అఘోర తత్పురుష, ఈశానాభులుగా భావించి 8 బ్రాహ్మణులను ఆవాహన, ఆసన, అర్ఘ్య పాద్యాది విధులతో అర్చించాలి. ఆచమనీయం, ధూపం దీపం కానివ్వాలి' సకలారాధనం సంపూర్ణమస్తు' అని నమస్కరించాలి.

తదుపరి అరటి ఆకులలో శుద్ధాన్నం, పాయసం, భక్ష్యాలు, పప్పుకూరలు మొదలైనవి వుంచి-"విష్ణోహవ్యం రక్షస్వ" అంటూ బ్రాహ్మణుల చేతులతో అన్నమును స్పృశింపచేసి, ఆపోశన మిచ్చి "సదాశివాదులు ప్రీతులై వరదుల గుదురు గాక" అని ప్రార్థించాలి.

"యేదేవా" ఇత్యాది మంత్రపూర్వకంగా సాక్షత జలాన్ని విడిచి "సర్వత్ర అమృతమస్తు" అంటూ నమస్కరించాలి. పిదప "గణానాంత్వా" ఇత్యాది నుపక్రమించి "యేవేదావే" మంత్రాల్నీ, నమక చమకాల్నీ, రుద్రసూక్తాన్నీ పఠించాలి. భోజనానంతరం బ్రాహ్మణులకు ఉత్తరాపోశనం, హస్తముఖప్రక్షాళనార్థం ఉదకాన్ని యివ్వాలి. బ్రాహ్మణులకు వారు శుద్ధోదకాన్ని ఆచమించి, సుఖాసీనులై వున్నప్పుడు తాంబూలాన్నీ, దక్షిణనూ, ఆసన దండపాదుకలనూ సమర్పించాలి.

సదాశివాదులు సంప్రీతులై యథాసుఖముగా వెళ్ళుదురుగాక. అంటూ - వారిని గడపదాకా సాగనంపి-అనంతరం 'కర్త' దీనులు - అనాథలు మొదలైన వారితో కలసి భోజనం చేయాలి.

ఇలా ప్రతీయేడూ గుర్వారాధనం చేసేవాడు, ఈ లోకంలో మహాభోగాలన్నీ అనుభవించి, అవసానకాలాన శివలోకం పొందుతాడు అంటూ కార్తికేయుడు వివరించి చెప్పిన యతుల ద్వాదవాహ విధిని సూతుడు శౌనకాదులకు బోధించాడు.

## ఏవం

*శ్రీ వేదవ్యాస మహర్షి విరచితమైన శ్రీ శివ మహాపురాణమున*
*కైలాస సంహిత సమాప్తము.*

★★★

శ్లో॥ ఇయం భగవతీ సాక్షాచ్ఛ్రీకంఠార్ధశరీరిణీ ।
పంచవక్త్రా దశభుజా - త్రిపంచనయనోజ్జ్వలా ॥

శ్లో॥ నవరత్న కిరీటోద్య - చ్చంద్రలేఖావ్రతం సినీ ।
శుద్ధస్ఫటిక సంకాశా - కింకిణీ నూపురాదిభిః ॥

శ్లో॥ హార కేయూరకటక - కింకిణీ నూపురాదిభిః ।
భూపితావయవా దివ్య - వసనా రత్న భూషణా ॥

శ్లో॥ విష్ణునా విధినా దేవ - ఋషి గంధర్వ నాయకైః
మానవైశ్చ సదా సేవ్యా - సర్వాత్మా వ్యాపినీ శివా॥

శ్లో॥ సదాశివస్య దేవస్య - ధర్మపత్నీ మనోహరా ।
జగదంబా త్రిజననీ - త్రిగుణా నిర్గుణాஉప్యజా ॥



# శ్రీ శివ మహాపురాణము

## వాయవీయ సంహిత

## వాయువు ఋషుల వద్దకు వచ్చుట

**సూతుడు చెబుతున్నాడు:-** సర్వ పాపాలూ పోగొట్టేదీ, సర్వ వాంఛలూ తీర్చేదీ, సర్వోత్కృష్టమైనదీ యైన శివ పురాణంలోని కడపటిదైన వాయవీయ సంహితను వినిపిస్తాను వినండి. ఒకప్పుడు కొందరు ఋషులకు పరబ్రహ్మతత్త్వం గురించి శంక కలిగింది. "నేతినేతి" విధానాన చూడగా ఏదీ మిగలలేదు. వాళ్ళు బ్రహ్మను ఆశ్రయించారు. బ్రహ్మ వారికి "రుద్రుడు పరబ్రహ్మ" అని చెప్పాడు. ఋషుల శివతత్త్వం' చెప్పమన్నారు.

అప్పుడు బ్రహ్మ మనోమయచక్రాన్ని సృష్టించి విసిరాడు. ఆ చక్రం ఎక్కడ పడితే అక్కడ సత్రయాగం చెయ్యమన్నాడు. 'అలా చేయగా చేయగా - వాయు దేవుడు వచ్చి శివతత్త్వం బోధిస్తాడు. అని అనుగ్రహించాడు ఋషులందరు కలిసి బ్రహ్మ విసిరిన చక్రం వెనకాలే బయలుదేరారు. అదృష్టవశాన ఆ చక్రం భూమి మీదనే పడింది.

అదీ భారతదేశంలోనే పడింది. ఆ చక్రం పడిన అరణ్యాం ఆనాటినుంచీ 'నైమిశ అరణ్యాం' అని పిలవబడుతుంది. చక్రం పడినచోట రాయి పగిలి ఒక తీర్థం ఏర్పడింది. దానినే 'చక్రతీర్థం' అంటారు. సరే. బ్రహ్మ ఆదేశానుసారం ఋషులంతా వాయువు రాకడనెంచి, దీర్ఘ సత్రయాగం కొనసాగించారు. యజ్ఞాంతంలో వాయువు - తన సహచర భూతములైన 49 వాయువులతో సహా కలిసి వచ్చివారికి దర్శనమిచ్చాడు. ఋషుల కోరికపై శివతత్త్వ జ్ఞానాన్ని విన్పించసాగాడు.

# "సృష్టి విధానము"

యోవై బ్రహ్మాణం విదధాతి
యోదేవానాం ప్రథమం పురస్తాత్
విశ్వాధిపో రుద్రో మహర్షిః" అని శ్రుతి.

ఆ ప్రకారంగా యీ సమస్తమూ రుద్రుడి సృష్టి. బ్రహ్మాదులంతా యీ రుద్రుడి వల్లనే జన్మించారు. ఈయనే అమృత రూపుడు. అచలుడు, ఆదిత్యవర్ణుడు, చీకటికి అతీతమైనవాడు. ఈ పరమేశ్వరుడికన్నా పెద్దవాడుగాని, చిన్నవాడుగానీ యెవడూలేడు. ఈయనతో సమానమైనవాడు అసలే లేడు. ఈయన సర్వత్రా నిండివున్నాడు. సర్వేంద్రియ గుణావాసుడాశర్వుడు. ఈశానుడే సర్వాధిపతి. ఆయనకు కళ్ళులేవు. కాని, అన్నీ చూస్తాడు. చెవులు లేవు. ఐనా అన్నీ వింటాడు.

ఆయనకు ఏదీ తెలుసుకోవలసిన అవసరం లేదు. అయినా తెలుస్తాయి. ఆయనను తెలుసుకోవలసిన అవసరం మనకు చాలావుంది. కానీ మనకు తెలియడు. సర్వజీవుల హృదయాంతరాళాల్లోనూ వుంటాడు శివుడు. కాని, ఆయనకు ఏవిధమైన కోరికలూ వుండవు. అణువులో అణువు, మహత్తులో మహత్తూయై శివుడు. ఎటువంటి అవస్థలూ లేనివాడాయన.

'అజా మేకాం లోహిత కృష్ణశుక్లాం' అనే వేద వాక్యం ప్రకారము సత్వరజస్తమో గుణాలనే లోహిత కృష్ణశుక్ల వర్ణాత్మకతలవలన కూడా శివుడు. స్వయం ప్రకాశకుడు; షోడశ కళాపూర్ణుడు. ఆయనకేపనీలేదు. అవసరంలేదు, సంజ్ఞలు లేవు. మోక్షం కోరుకునేవాళ్ళు తప్పనిసరిగా ఆయన్నే ఆశ్రయించాలి.

# కాల విభజన

కళా, కాష్ఠ, నిమిషం అనబడే ఈ కాలప్రమాణాలన్నీ కూడా శివ తేజస్సులుగా చెప్పబడ్డాయి. అటువంటి కాలాన్ని అతిక్రమించగలవారే ముక్తిని పొందుతారు. కాని, అదంత సులభం కాదు, చరాచర విశ్వమంతా కాలవశమై పరిభ్రమిస్తోంది. ప్రపంచంలో ఏ ఒక్కటీ కూడా, కాలాని కతీతంగాచరించలేదు కలిగినదంతా కాలానికి బానిసే. కాలం ఎవరిచేతా కట్టుబడదు. ఆ ఒక్క శివుడికే లొంగుతుంది యీ కాలం. ఆయనొక్కడే కాలాతీతుడు. తక్కిన వాళ్ళు యెంతెంత వాళ్ళయినా సరే కాలానికి తలవంచ వలసిందే.

అందంగాని, ఐశ్వర్యంగాని, అతీంద్రియతగాని, జితేంద్రియతగాని, విద్యగాని, గుణంగాని - యేదీ కాలాన్ని నిరోధించలేదు. అసలా కాలతత్వాన్ని కనిపెట్టడమే అసాధ్యం. అది యెప్పుడేం చేస్తుందో దానికైనా తెలుసో తెలియదో - యెవరికీ తెలియదు. ఆపదగానే వస్తుందో, ఆనందంగానే వస్తుందో, సుఖమే వస్తుందో, దుఃఖమే తెస్తుందో-దాని యధేచ్ఛాసంచారానికి తబ్బిబ్బు పడకుండా బ్రతగకలిగితే - బ్రహ్మజ్ఞానం కలిగినంత అదృష్టం.

ఎంత గొప్పవాడు గానీ - కాలం యెదురుతిరిగిందో - యెందుకూ కొరగాని వాడైపోతాడు . ఎంత హీనుడూ, దుర్బలుడూ, దుర్జాతుడూ అయినాసరే - ఆ కాలం అనుకూలించిందో వాడంతటివాడుండడిక.

## కాలమాన నియామకం

మా కాలం కలిసొచ్చి నువ్వీ విషయాలన్నీ చెబుతున్నావు మాకు. చాలా సంతోషంగా వుంది - ఇంతకీ కాలమానం యెలా ఏర్పడింది? ఆయు వెల నిర్ణయింపబడుతోందిట? అది చెప్పు" అన్నారు ఋషులు. వాయువు చెప్పసాగాడు.

కాలమానం అన్నదే 'ఆయుష్మానం' అని కూడా పిలువబడుతోంది. కనురెప్ప పాటు కాలాన్ని నిమిసం అంటారు. 15 నిమిషాలు ఒక కాష్ఠ అనబడుతున్నాయి. 30 కాష్ఠలు ఒక కళ. 30 కళలొక ముహూర్తం, 30 ముహూర్తములు - ఒక అహోరాత్రం, 30 రోజులు ఒక నెల.

నెలలో 15 రోజులు కృష్ణపక్షం-15 రోజులు శుక్లపక్షం. ఆరు నెలలు ఒక అయనం, 2 అయనాలు - అనగా ఉత్తరాయణం 6 నెలలు, దక్షిణాయనం 6 నెలలు - వెరసి 12 నెలలు ఒక మానుష సంవత్సరం. మనుషులకి ఒక సంవత్సరం అయితే దేవతలకు ఒక రోజుతో సమానం. మన సంవత్సరంలోని ఉత్తరాయణం దేవతలకి పగలు. దక్షిణాయనం రాత్రి. అలాటి 12 మాసాలు ఒక దివ్య సంవత్సరం అవుతుంది. అంటే మనుష్యులకు 360 సంవత్సరాలైతే - దేవతలకి ఒక దివ్య సంవత్సరం అవుతుంది.

ఈ లెక్కనే యుగ విభజన జరిగింది. యుగాలు నాలుగు. మొదటిది కృతయుగం. దీని నిడివి 4 వేల దివ్య సంవత్సరాలు సంధ్యాకాలం ఒక్కంటికి 400 దివ్య వర్షాల చొప్పున ఉభయ సంధ్యాంశలూ కలసి 800 దివ్య సంవత్సరాలు.

అంటే మన మానవ వర్షమాన రీత్యా అయినట్లయితే 17 లక్షల 28 వేల సంవత్సరాలు ఒక కృతయుగంగా భాసిస్తాయి. అదే విధంగా త్రేతాయుగం మొత్తం 3,600 దివ్య వర్షాలు మానవ మానవ గణన రీత్యా 12 లక్షల 96 వేల సంవత్సరాలు. ద్వాపరయుగం 2,400 దివ్యవర్షాలు. మానవవర్షాలు 8,64,000 కలియుగం 1,200 దివ్యవర్షాలు. మానవ వర్షాలు 4,32,000 నాలుగు యుగాలు కలిపి 12 వేల దివ్య వర్షాలు. అంటే 4 లక్షల 20వేల మానవ సంవత్సరాలు.

ఈ నాలుగు యుగాలూ కలిపి ఒక చతుర్యుగం, లేదా, ఒక మహా యుగం అనబడుతుంది. చిటమంత అటూ ఇటూగా 71 మహాయుగాలు ఒక మన్వంతరం. అటువంటి 14 మన్వంతరాలు (1000 మహాయుగాలు) ఒక కల్పం. వెయ్యి కల్పాలు బ్రహ్మకు ఒక సంవత్సరం. అలాంటి బ్రహ్మ వర్షాలు 8వేలు. ఒక బ్రహ్మ యుగం, అటువంటి బ్రహ్మ యుగాలు ఒక వెయ్యి గడిస్తే అది బ్రహ్మసవనం 8 వేల బ్రహ్మ సవనాలు-బ్రహ్మయొక్క ఆయుర్దాయం అంతా రుద్రుడి కొకరోజు.

రుద్రాయుర్దాయం అంతా కలిసి విష్ణువుకి ఒకరోజు. ఈ లెక్కన విష్ణ్వాయుర్దాయం అంతా రుద్రుడి కొకరోజు. రుద్రాయుర్దాయం మొత్తం మహేశ్వరుడికి ఒకరోజు. ఒక మహేశ్వరుడు లీనమయ్యాడూ అంటే అప్పటికి సదాశివుడికి ఒకరోజు గడిచినట్లు. ఇలా లెక్కలు పెట్టుకుంటూ పోగా పోగా మూల కారకుడైన పంచముఖేశ్వరుడికి కాలగణనమే లేదు. అసలు కాలాన్ని కల్పించేదే ఆయన. సృష్టివున్నంతకాలం ఆయనకు పగలు - ప్రళయమంతా రాత్రి. నిజానికి ఆయనకు రాత్రింబవళ్ళులేవు. మనకు అర్థం కావడం కోసం అలా చెప్పుకున్నాం అంతే.

# బ్రహ్మాదుల సృష్టి

ఆ సర్వేశ్వరుడే బ్రహ్మాదులను సృష్టించి, బ్రహ్మకు సృష్టి కార్యం వప్పగించాడు. మొదట్లో - శివానుగ్రహం వల్ల మనస్సృష్టిని కావించాడు. కాని, దానికి వ్యాప్తి కలగక పోవడం వలన - పురుషుడికి మరొక తోడును కల్పించి సృష్టి జరిపించాలనుకున్నాడు. ఆ నిమిత్తముగా పురుషేతర మానవరూపం కోసం ఆలోచించాడు. అంతు చిక్కలేదు శివుడికై తపించాడు. కళ్ళముందుతో చూడా కంఠేకాలుడు. బ్రహ్మ ఆయనను స్తోత్రం చేశాడు. తన యిబ్బంది చెప్పుకున్నాడు. పురుషేతరమూ, పురుషుడికి ఆధారమూ అయ్యే మరో మానవ రూపమును అనుగ్రహించమన్నాడు.

కరుణాళువైన శివుడు - తన నుండి శక్తిని వెలువరించాడు. ఆ మహామాయా దర్శనంతో మానవునకు తోడుగా "మానవి" స్ఫురించిందా తామర బొడ్డెకు. పురుషేతరమైన ఆ రూపమే స్త్రీ రూపం.

సంతుష్టుడైన బ్రహ్మ స్త్రీలను సృష్టించి పురుషులతో సంధానించాడు. దానితో మనస్సృష్టి కాస్తా మైధున సృష్టిగా పరిణతి చెందినది. అప్పటినుంచే మైధునం వల్ల సృష్టి జరగసాగింది. తదతీతమైన 'మనస్సృష్టి' దాదాపు అవతరించి పోయిందనే చెప్పాలి. అటుపై స్త్రీ పురుష సరసాలతో రాగాలుగా సాగింది సృష్టి.

## శివ పార్వతుల కలహం



మానవులూ, దేవతలేనని కాదు, పార్వతీ పరమేశ్వరులైనా అంతే - ఆ మైధున మాధుర్యమే అటువంటిది. అయితే, ఆ స్త్రీ పురుషుల సరసం ఒక్కొక్కసారి విరసంగా మారే ప్రమాదం కూడా లేక పోలేదు. ఉదాహరణకి ఒక సంఘటన చెబుతాను.

వరమేశ్వరుడు పార్వతీదేవిని తరచూ - "కాళీ కాళీ"! (నల్లనిదానా!) అని పిలిచేవాడు. ఏకాంతంలో అయితే అది ఆలుమగల సరదా! కాని అన్ని చోట్లా అదే పిలువడంతో ఆమె ఇబ్బంది పడింది. చివరికి ఒక రోజున 'అస్తమానూ అలా 'నల్లపిల్లా నల్లపిల్లా' అని పిలిచి నన్నెందుకు ఏడిపించడం? నా దేహ వర్ణం మీకు నచ్చకపోవచ్చుగాక! అది పెళ్ళికి ముందే చూసుకోవాలి.

ఇప్పుడిలా ఆక్షేపిస్తే నేనేం చేయగలను? 'కాళీ' అనీ 'కజ్జలా' అనీ, 'శ్యామా' అనీ, 'తమసా' అనీ పిలుస్తుంటే నా మనసుకెలా వుంటుందో ఒక్కసారైనా ఆలోచించారా! సరే - అవన్నీ యెందుకు భర్తకు తృప్తి కలిగించనిదీ, సంతోష పరచనిదీ యైన ఆడదానికన్నా మైనపు బొమ్మనయం.

అందువల్ల-నేను మీకు ఆనందాన్నే చేకూర్చదలిచాను. మీకు యిష్టం పుట్టించ లేకపోతున్న ఈ శ్యామల గాత్రం నాకు యిష్టంలేదు. అనుమతినిస్తే వెళ్ళి తపస్సు చేసుకుంటాను. ఈ కారు నలుపురంగు పోయి, కనకమయ ప్రభలీనే గౌరవర్ణం పొంది వస్తాను' అంది.

ముందుగా శివుడు అభ్యంతరపరచాడు. 'ఈ మాత్రానికి తపస్సెందుకు? నీకు గౌరవర్ణం కావాలంటే నేనే అనుగ్రహిస్తాను. నల్లరంగు నాకు నిజంగానే నచ్చక పోతే పచ్చగా మార్చుకోవడం యెంతపని చెప్పు, ఏదో సరసానికన్నాను. దేవతలంతా నా కోసం తపిస్తుంటే నువ్వు నన్ను కాదని వేరే యెవరికోసం తపిస్తావు?" అన్నాడు.

"బ్రహ్మ కోసం తపిస్తాను - మీరు నన్నేమీ పచ్చగా మార్చనక్కరలేదు భర్త కోరిక తీర్చడానికి నేనే తపించి సాధించుకుంటాను అప్పుడే నేను సాధ్వీమణులకు ఆదర్శప్రాయనవుతాను. భర్త యిష్టం నెరవేర్చడమే భార్యల ధర్మమనే పాఠాన్ని చాటి చెప్పిన దాన్నవుతా' నని శివుడికి నమస్కరించి తపోభూములకు వెళ్ళిపోయిందా తల్లి.

## కాళి గౌరి యగుట

అనితర సాధ్యమైన తపస్సు నారంభించిందాతల్లి. త్రిసంధ్యలా పార్థివ లింగార్చన చేస్తోంది. పరబ్రహ్మమైన పరముడు నన్ను గౌరవర్ణను చేయుగాక అనే సంకల్పంతో తమస్సమాధిలగ్న అవుతోంది.

అదే అడవిలో ఒక అతి క్రూరమైన పెద్దపులి వుంది. ఒకనాడు దానికి వేట లభించలేదు. ఆకలి కడుపుతో డొక్క లెగరేసుకుంటూ కాళి ఆశ్రమానికి చేరింది. 'అమ్మవారిని చూసింది. ఆమెను చంపుకు తినాలి అని అనుకుంది పులి. కాని - ఆమెను అందుకోగలిగేపాటి దూరం వెళ్ళలేకపోయింది. ఎగిరింది - దూకింది. చాటునుంచి మీద పడబోయి నేలను పడింది/ అమ్మవారి కిదంతా ఆశ్చర్యంగా వుంది. ఆ పులి తనని వినోదింపచేస్తూన్నట్లుగా వుంది. అద్వితీయమైన ఆ దీక్షా దినాలలో తనని వినోదింపచేసినందుకు ఆ పులిమీద ఎక్కడలేని కరుణా పుట్టుకొచ్చిందావిడకి - దయాసంభరితమైన చూపొకటి చూసింది పులికేసి.

అంతే - పులిలో వున్న ఆకలి తీరిపోయింది. అసలు ఆకలివేయడమే మానేసింది. క్రూరత్వం నశించిపోయింది. సాధుత్వం వచ్చేసింది. దాంతో ఆశ్రమాన్ని వదలకండా కొన్నాళ్ళు అక్కడే పరిభ్రమించినది. సర్వ జగద్రక్షకియైన

కాళీమాతకు కావలి కాయసాగింది. అమ్మవారు చేసే శివారాధనా, తపస్సులను రెప్పవాల్చకుండా చూసేది. అమ్మవారు అయ్యవారిని ఉపాసిస్తూ వుంంటే - ఈ పులి అమ్మవారిని ఉపాసిస్తున్నట్లుండేది.

ఆ రోజుల్లోనే శుంభ నిశుంభుల బాధ పెరిగిపోతోంది. తాళలేని దేవతలు తామరచూలికి మొరపెట్టారు. పరిష్కారాన్ని ఆలోచిస్తునే ఇక్కడ పార్వతి ముందు ప్రత్యక్షమయ్యాడు. పంకజాసనుడు 'అందరికీ అన్ని వరాలూ యిచ్చే తల్లీ! నీకు నమస్కారం. ఏ అవసరం వచ్చినా - చిన్న కబురుచేస్తే మేమే వచ్చి నీసేవ చేసుకు తరించుతాము. అటువంటి నీ దాసాన దాసులమైన మా నిమిత్తమై నువ్వు తపించి లోకంలో మాకో స్థితిని కల్పించావు. నీకు నమస్కారం. ఆజ్ఞాపించు తల్లీ!" అన్నాడు.

అమ్మవారు తన మనసులో మాట చెప్పింది. విని మందహాసం చేశాడు విరించి నీ యిచ్చ నెరవేరుతుంది తల్లి కాని - నీవు విడిచి వేయబోయే కాళీ రూపాన్ని మాత్రం వృధాపోనివ్వకు. శుభనిశుంభుల బాధ పడలేకపోతున్నాం మేము. మహా శక్తివైన నీవే వాళ్ళనివధింప సమర్థురాలవు. కాబట్టి నీ కాళీత్వాన్ని దేవతా రక్షణార్థం, రాక్షస సంహారార్థం అనుగ్రహించి, గౌరివై శివరమణార్థం కైలాసం చేరు కోవమ్మా' అని కోరాడు. అంగీకరించింది అంబ.

అప్పుడు అమ్మవారి నుండి వెలువడ్డ నల్లని కాళీతత్త్వం కన్యగా అవ తరించింది. ఆమెకు కౌశికి - అని పేరు పెట్టారు. బ్రహ్మ దేవుడామెకు సింహాన్ని వాహనంగా ఏర్పాటుచేశాడు. వింధ్యాచలముపై నివసించమన్నాడు. మధు మాంసాదులు భోజనంగానూ, తక్కిన పూజాద్రవ్యాలన్నీ అమ్మవారికి మల్లేనూ యేర్పరిచినాడు. ఆ కౌశికియే శుంభ నిశుంభులను దునుమాడిన కాళిక.

# సోమ నంది వృత్తాంతం

ఇక కాళీ తత్త్వాన్ని వదిలి గౌరిగా పరిణమించింది అమ్మవారు. కైలాసానికి బయలుదేరింది. తనతోబాటుగానే అన్నాళ్ళూ తననే నమ్ముకొని వున్న పులిని కూడా తీసుకు వెళ్ళింది.

నల్లగా వెళ్ళిన తల్లి - పచ్చగా బంగారం రంగులో వస్తుంటే ప్రమధులంతా ముందు తెల్లబోయారు తరువాత ఆనందించారు.



అసలా శివుడే అమ్మవారిని గుర్తించగలడా అని అబ్బురపడ్డారు. అమ్మవారు నిరాటంకంగా అయ్యవారి యేకాంత మందిరం చేరారు. ఆయన ఆనందించాడు. ఆమెను యెత్తుకొని గిరగిర త్రిప్పాడు. ముద్దుల వర్షం కురిపించాడు. అనంతరం అమ్మవారు కౌశికి వృత్తాంతమును చెప్పినారు. ఇంతో సేవకులు పులిని తెచ్చారు. అమ్మవారా పులిని గురించి శివుడికి వివరించారు.

'స్వామీ! మీ మందిరాలకా నంది యెలాగో - మా మందిరాలకీ పులి అలాటి కాపుదల కావాలి, అనుగ్రహించండి' అంది.

చిరునవ్వు నవ్వాడు శివుడు. ఒక్క చూపుచూశాడా పులికేసి - తక్షణమే పులి పుత్తడిబొమ్మవంటి స్త్రీగా మారిపోయింది వరవేత్ర హస్తగా, చిత్రవర్ణ కవచగా పరినమించిన ఆ వ్యాఘ్ర స్త్రీకి 'సోమ నంది' అని నామకరనం చేశారా గౌరీ శంకరులు.

# అష్టాంగ యోగ వివరణము

**వాయువు పలుకుచున్నాడు :-** ఓ ఋషులారా! శివశక్తి లేకపోతే యేదీ సాధించలేము. తన భక్తుల ననుగ్రహించేందుకు శివుడే - యమ, నియమ, ఆసన, ప్రాణాయామ ప్రత్యాహారాది అష్టాంగ యోగాలనీ సృష్టించాడు.

1. యమము :- అంటే సర్వేంద్రియాలనూ నిగ్రహించడం, లౌకిక వాంఛా యుతాలైన యింద్రియాలని ఆయా కర్మలనించి విరమింప చేయగలగడం.

2. నియమం :- అంటే కట్టుబాటు. క్రమశిక్షణ పాటించడం. అక్రమ శిక్షణ స్వేచ్ఛాయుతమైనది కారాదు. వేదాల్లో చెప్పినట్లుగా ప్రవర్తించాలనే కట్టుబాటు కలదిగా వుండాలి.

3. ఆసనం :- పద్మాసనాది వివిధ ఆసనాలలో అనువైన వాటిని, సుఖం కలిగించేంతగా అభ్యసించి - అనంతరమే ఆచరణలో నెట్టాలి. ఈ ఆసనాలు యోగాభ్యాస పరులకు అత్యంత అవశ్యకాలై - యోగాసనాలుగా ప్రఖ్యాతి చెందివున్నాయి.

4. ప్రాణాయామం :- అంటే వాయువును నిరోధించడం. అనగా మనం పీల్చే శ్వాసనూ, విడిచే నిశ్వాసనూ ఆపివేయడం అన్నమాట.

5. ప్రత్యాహారం :- అనగా విషయ వాంఛల యందున్న అవయవాలను వైదికతత్త్వం వైపు, కర్మలవైపూ మళ్ళచేయడం అని అర్థం మరి.

6. ధారణ :- సర్వదా భగవద్విషయాన్నే చింతనచేయడం, ఏకాగ్రంగా వుండడం.

7. ధ్యానం :- భగవద్విషయాన్నే చింతనచేయడం, ఏకాగ్రంగా వుండడం.

8. సమాధి :- ఆ చింతనా ఏకాగ్రతను స్వేచ్ఛను ఆచరిస్తూనే - కాలపరిమితిని పెంచుకుంటూ వెళ్ళడం, దానికదిగా నిలవరించబడినపుడు తప్ప మరే కారణం వల్ల కూడా లౌకికంలోకి చలించకపోవడం.

ఈ విధమైన అష్టాంగయోగం వల్ల శివ శక్తి ఉజ్వలమవుతుంది. అచిరకాలం లోనే జ్ఞానంవైపు ప్రయాణించడం జరుగుతుంది. ఇవన్ని చేయలేనివారు ఈ దిగువ యెనిమిది నామాలను నిత్యం స్మరిస్తూ వున్నట్లయితే తప్పని సరిగా శివశక్తి దృఢపడుతుంది. ఆ 8 పేర్లూ యివి.

## శివుని యెనిమిది పేర్లు



1. శివాయనమః :- సర్వమందు మంగళము కలిగించువాడా నీకు నమస్కారం.

2. మహేశ్వరాయనమః :- తిరోధాన కర్తవైన స్వామీ - నీకు నమస్కారం.

3. రుద్రాయనమః :- వర్తమాన సర్వాపన్ని వారకుడైన పరమాత్మ! నీకు నమస్కారం.

4. విష్ణవే నమః :- సర్వేసర్వత్రా వ్యాపించు యున్నవాడా! నీకు నమస్కారము.

5. పితామహాయ నమః :- సర్వులకూ మూలకారకుడైనవాడా! నీకు నమస్కారం.

6. సంసారభిషజే నమః :- చావు పుట్టుకలు, మోహ దుఃఖాదులూ అనే సమస్తమైన ప్రాపంచిక రోగాలనూ ఉపశమింపచేసే - వైద్యుడవైన తండ్రీ! నీకు నమస్కారం.

8. పరమాత్మనే నమః :- సమస్తానికి అతీతుడవై వుండీ కూడా - సర్వుల యందూ మానవ భావన గలిగి స్వీయమైందీ - యితరమైనదీ కూడా లేకుండా భాసించే భగవంతుడా నీకు నమస్కారం.

వీటిలో మొదటి వైదూ - పంచ సాధనలకు నెలవై జగధాదారాలుకాగా - కడపటి మూడు - శుద్ధ నివృత్తి కారకాలై - మోక్షాన్ని ప్రసాదిస్తాయి. ఉభయ ప్రదాలయిన ఈ నామాష్టకం గురించి-ఏపాటి తెలుసుకున్నా కూడా అది సత్ఫలాన్నే అనుగ్రహిస్తుంది. అదేవిధంగా నామాష్టకంవలెనే-భౌతిక పరమైన పూజాదులు చేయనివారికై మానసిక పూజార్థం పుష్పాష్టకం కూడా చెప్పబడింది.

# పుష్పాష్టక మానస పూజ

శ్లో॥ అహింసా ప్రథమం పుష్పం పుష్ప మింద్రియం నిగ్రహం
సర్వభూతదయా పుష్పం క్షమా పుష్పం విశేషతః
శాంతి పుష్పం తపఃపుష్పం ధ్యాన పుష్పం తథైనచ
సత్య పుష్పం విధి పుష్పం శివ ప్రీతికరం భవేత్ ॥



1. తొలిపుష్పంగా అహింసతో నిన్ను ఆరాధిస్తున్నాను.

2. మలి పువ్వుగా నా సర్వేంద్రియాల చాపల్యాన్నీ అరికట్టిన ఫలంతో సేవిస్తున్నాను.

3. అన్ని భూతాలయందూ కూడా దయా దృష్టులతో ప్రవర్తించడమనే గుణాన్ని ఒక పువ్వుగా నీకు సమర్పిస్తున్నాను.

4. నీ సేవలో వున్న నాకు యెటువంటి కష్ట నష్టాలు వాటిల్లవు కాని - పురాకృతమైన

యేసంచితార్ధంవల్లగాని, నీ లీలావిలాసం వల్ల గానీ, కాల హేలవల్లగానీ, వచ్చే సర్వవిధాలైన నష్ట కష్టాలను - నీ యందలి ఏకాగ్రతవల్ల ఓర్చుకో గలగడమే చతుర్ధ పుష్పంగా అర్పించుకుంటున్నాను.

5. ఎటువంటి అపకారినైనా ఘాతకుడినైనా - నిర్మలంగా స్వీకరించే - శాంతినే అయిదవ పువ్వుగా అర్చిస్తున్నాను.

6. తపస్సు ఆరవ పుష్పం

7. నిత్యం నీ గురించిన ధ్యానమే సప్తమ పుష్పం.

8. స్థితిగతుల వల్లగాని, యితరమైన యే వివాదాలవల్లగాని, శంభో, అసత్యం పలకకుండా - సత్యాన్నే పలకాలని, ఎరిగినవీ అయిన విషయాలన్నీ సత్య పుష్పరూపంలో సమర్పిస్తున్నాను.

ఇది పుష్పాష్టకం, నిజానికి ఈ ఎనిమిది గుణాలూ యెవరిలో వున్నాయో - వారు వేరే పూజలు చేయనక్కరలేదు. ఆ గుణాలని శివ పూజగా సంకల్పించడమే చాలునని భావం.

ఇక - శివారాధకులు సర్వదా చేయాల్సిన లింగపూజలూ - వ్రతాలలో - లింగ పూజలన్నింటిలో పార్ధివలింగ పూజ ఎంత శ్రేష్ఠమో, వ్రతాలలో పాశుపతవ్రతం అంత శ్రేష్ఠమైనది. ఈ వ్రత సంబంధిగా - సాధకులు వైశాఖమాసంలో వజ్రలింగాన్ని, జ్యేష్ఠ మాసంలో మరకతలింగాన్నీ, ఆషాఢంలో మౌక్తికలింగాన్నీ, శ్రావణ మాసంలో ఇంద్రనీలంతో నిర్మించిన లింగాన్ని, భాద్రపదంలో పద్మరాగలింగాన్నీ, ఆశ్వీ యుజంలో గోమేధిక లింగాన్ని కార్తీకంలో విద్రుమ లింగాన్నీ, మార్గశిరంలో వైడూర్య లింగాన్నీ, మాఘంలో సూర్యకాంత లింగాణ్ణీన్నీ, ఫాల్గుణంలో చంద్రకాంత లింగాన్నీ సేవించాలి. ఈ చెప్పబడిన రత్నాలు లభించనప్పుడు - అన్ని నెలలోనూ కూడా బంగారపు లింగాలను అర్చించవచ్చును.//

బంగారంకూడా లభించకపోతే వెండి లింగాల్నీ, వెండి కూడా దొరక్కపోతే రాగి లింగాన్నీ, అది కూడా కరువైతే రాతి లింగాన్నీ అందుకు కూడా గతిలేకపోతే మట్టి లింగాన్నీ ఆరాధించుకోవచ్చును. సుగంధ ద్రవ్యములతో చేసిన లింగాలు కూడా సేవనీయాలే.

వర్ణాశ్రమ ధర్మరీత్యానూ, ఆయా కుటుంబ ఆచారాలరీత్యాను వారివారి వేదశాఖల రీత్యాను ఏఏలింగాలు అర్హమో వాటినే పూజించాలి. పూజానంతరం తూర్పు, లేదా ఉత్తరదిక్కుగా ఆసీనులయి - దర్భలు పట్టుకుని దర్భాసనంమీద కూర్చుని ప్రాణాయామం చేస్తూ శాస్త్రానుసారం శివ నామం జపం చేసి "నీ ఆనతో ఈ వ్రతాన్ని యింతటితో పూర్తిచేశాను తండ్రీ" అని చెప్పి నమస్కరించుకుని అక్కడ వున్న దర్భలన్నీతీసి ఉత్తర దిక్కుకు విసర్జించాలి. దండలు నారబట్టలు, మేఖలం విసర్జించి ఆచమనం చేసి పంచాక్షరి జపించి - శక్తి వుంతులైతే జీవితాంతం వ్రతాచరణ చేయాలి గతంలో ధౌమ్యుడి సోదరుడైన ఉపమన్యుడు యీ వ్రతం వల్లనే అన్ని పాపములూ పోగొట్టుకున్నాడు.

## ఉపమన్యు చరిత్రం



వ్యాఘ్రపాదుడనే ముని వుండేవాడు ఆయన కొడుకే ఉపమన్యుడు. అతని పసితనంలోనే తండ్రికి దూరం కావలసి వచ్చింది. ఉపమన్యుడూ, అతని తల్లీ మేన మామల యింటి వద్దనే వుండేవారు.

మేనమామ బిడ్డలందరూ - యధేచ్ఛగా తృప్తిగా పాలు త్రాగుతుండే వారు. కేవలం ఆశ్రితులుగానే చూడబడుతుండటం వల్ల - ఉపమన్యుడికి తగినంత క్షీరం అందేదికాదు. శైశవం వల్ల క్షీరప్రియుడైన ఉప మన్యుడు పాలకోసం తల్లిని ఒత్తిడి చేసాడు. ఆమె వద్ద పాలేనాడో ఇరిగిపోయాయి. అందువల్ల పేలాలపిండి నీళ్లతో కలిపి - అవి 'పా'లని చెప్పి యిచ్చింది. బిడ్డకు, అతడు రుచి పసిగట్టాడు. అవి పాలుకానేకా' వన్నాడు.

తల్లి తమ దీనావస్థనంతా చెప్పి దుఃఖించింది, ఉపమన్యుడు పరిస్థితి నవ గాహన చేసుకున్నాడు. తల్లిని వోదార్చాడు. తాను శివునికై తపస్సుచేసి - పాల సముద్రాన్ని సంపాదించుకుంటానన్నాడు. తల్లి ఆనందించింది. శివ పంచాక్షరిని ఉపదేశించింది. "నాయనా! ఈ శివ పంచాక్షరిని అఘోరాస్త్రంగా వర్ణిస్తారు. శైవులకు

దీనినిమించిన ఆయుధం మరొకటి లేదు. నిత్యం దీనిని స్మరించు" అని చెప్పింది. తన భర్తనుండి లభించి - తనచే భద్రపరచబడిన విరజాభస్మాన్ని కుమారుడి కిచ్చింది. ఆ బూడిదా - ఓంకార పూర్వకమై అయిదు అక్షరాలూ మాత్రమే తోడుగా తపస్సుకు నడిచాడు ఉపమన్యుడు.

ఎనిమిది ఇటుకలు స్థాపించాడు. దానిపై మట్టి లింగాన్ని వుంచాడు గణ సహితంగా శివుణ్ణి ఆవాహనం చేశాడు. అందుకున్నాడు తపస్సు.

ఆ ప్రాంతాల్లో మసలే శాపగ్రస్తులైన రాక్షసులిది, చూసారు. అనేకరకాల విఘ్నాలు కల్పించబోయారు. ఉపమన్యుడు దేనినీ, ఎవరినీ కూడా ఖాతరు చేయ లేదు. తన తపస్సు నలాగే కొనసాగించాడు చివరికి ఆ రాక్షసులే మారిపోయారు. అతనికి కింకరులై పోయారు.

రాను రాను ఉపమన్యుడి తపస్తీవ్రత పెరగడంతో దేవలోక వాసులు సైతం హడలి పోయారు. విష్ణువును ముందుంచుకుని కైలాసం వెళ్ళారు. శివుణ్ణి ప్రార్థించారు. శివుడు ఉపమన్యుణ్ణి పరీక్షించ దలిచాడు, తాను యింద్రుడిలా మారి ఆ బాలుడి ముందు కనిపించాడు. ఏం కావాలో కోరుకో" మన్నాడు. ఉప మన్యుడు యింద్రుణ్ణి లెక్కచేయలేదు. 'నాకు నీతో పనిలేదు. నిత్యుడూ, శాశ్వతుడూ, శుద్ధ సత్వుడూ అయిన శివుడికై తపిస్తున్నాను. ఆ శివుడు అనుగ్రహిస్తే కానీ - తపస్సునాపను. నా కోర్కెలు నువ్వు తీర్చనక్కరలేదుపో'న్నాడు.

యింద్రుడి వేషంలో వున్న ఈశ్వరుడు నవ్వుకుని - తన లోపాలన్నీ తానే బైటపెట్టుకున్నాడు/ఆయన లోపాలు ఎవరికీ మాత్రం తెలియవు? ఎగుడుదిగుడు కళ్ళు, ఎద్దుమీద సవారి, బూడితపూత, స్మశాన విహారం వరసగా ఏకరుపెట్టాడు శివనింద భరించలేక పోయాడా చిన్నారి ఉపమన్యుడు.

'ఓహోహో! ఊరుకుంటే మరి మితిమీరిపోతున్నావే! ఉండు నీ పని చెబుతాను' అంటూ తల్లి యిచ్చిన పిత్రార్జితమైన విరజాభస్మ పిడికెడు తీసి - అఘోరాస్త్రం మంత్రించి యింద్రుడిపై ప్రయోగించబోయాడు. ఆనందించాడు నిత్యానందుడు. తక్షణమే తన నిజరూపం చూపించాడు. పార్వతీ సమేతంగా ఉపమన్యుడికి నేత్రానందం చేశాడు. ఆ పరాత్పరుడి దివ్యదర్శనంతో ఉపమన్యుడికి నోట మాట వచ్చిందికాదు. ఆనందరసానికి పరాకాష్ఠ నందాడు. అతడి తన్మయత నెరిగిన

తరుణేందు శేఖరుడు అడగకుండానే వరాలిచ్చాడు. పాల కడలితో బాటు పెరుగు కడలీ, నేతికడలీ కూడా ఉపమన్యుడి సొంతం చేశాడు అతనికి గణాధిపత్యా నిచ్చాడు. ముద్దు పెట్టుకున్నాడు. 'నువ్వు నా బిడ్డవే' నన్నాడు. 'మరి నా బిడ్డకాడా ఏమిటి? అంటూ అమ్మవారా బాలుణ్ణి అంకాన చేర్చుకుంది. తల నిమిరింది. కుమారస్వామినెలా గారం చేస్తుందో అలా గారం చేసింది. అమ్మవారి అంకం చేరాక ఇక చెప్పేదేముంది? నిత్య కుమారత్వం దానికదే సిద్ధించేసింది.

## ఉపమన్యుడు కృష్ణునకు శివుని గురించి చెప్పుట



అనంతరం ఉపమన్యుడు హిమవత్పర్వత ప్రాంతం చేరాడు. అక్కడకు ఒకనాడుశ్రీ కృష్ణుడు వచ్చాడు. ఉపమన్యుడికి నమస్కరించాడు. 'ఉపమన్యు మునీ! శివ భక్తులందరిలోకి సర్వ శ్రేష్ఠుడివయ్యా నువ్వు. పుత్ర సంతానార్థినై ఆ శివుడి గురించి తపస్సు చేయాలని వచ్చాను శైవవిధిని యిచ్చి, విధానాలు తెలియ'మన్నాడు.

ఉపమన్యుడు చెప్పసాగాడు. 'కృష్ణా! నువ్వెరోనాకు తెలుసు. నువ్వు శివధ్యానం చేయడం యిప్పుడు క్రొత్తేమీకాదు. నీకు తెలుసు. తెలిసిందే అయినా, అడిగావు గనుక పదిమందికీ తెలియడం కోసం మరోసారి చెబుతున్నాను. ఆ శివుణ్ణి మించి ఏదీ లేదు. అయినను ధ్యానించడం పరమోత్కృష్టకార్యంగా భావించి చేస్తే సర్వకామనలూ సిద్ధింపచేస్తుంది శివధ్యానం.

**శ్లో॥ పూజాకోటి సమంస్తోత్రం స్తోత్రకోటి సమోజపః**
**జపకోటి సమం ధ్యానం ధ్యానకోటి సమోలయః ॥**

కృష్ణా! కోటి సార్లు పూజించేకన్నా ఒక్కసారి స్తోత్రం చేయడము గొప్పది, కోటిసార్లు స్తుతించడంకన్నా ఒక్కసారి జపం చేయడము శ్రేష్ఠం కోటిసార్లు

జపించడం కన్నా ఒక ఒక సారి ధ్యానించడం చాలా మంచిది. కోటిసార్లు ధ్యానిస్తే ఒక లయ (జన్మ)తో సమానమౌతుంది.

అసలు దేనికైనా ప్రధానమైంది భక్తి. ఆ భక్తి - బాహ్యా, అనన్య, ఏకాంత - అనే మూడు విధాలుగా వుంది.

1. **బాహ్యాభక్తి** :- ఇది అత్యంత మందంగా సాగుతుంది. ఇది ప్రవర్ధమానం కాగా-రూపం మార్చుకుంటుంది. అది రెండవ రకం భక్తి.

2. **అనన్య భక్తి** :- ఇది కొంచెం చురుకుగా సాగుతుంది. కొందరు జన్మతః అనన్య భక్తి యుతులవుతారు. మరికొందరు బాహ్యా భక్తిలోంచి యిందులోకి వస్తారు. ఈ అనన్య భక్తి క్రమంగా 3వ తరహాలోకి పరిణమిస్తుంది.

3. **ఏకాంత భక్తి** :- ఇది అతిశీఘ్రమైన విధానం. యీ జన్మలోనే శివ సాయుజ్యాన్ని కల్పిస్తుంది. భక్తి 1, 2 గడిచిగాని - లేదా, పురాకృత సుకృతం వల్ల జన్మతఃగాని యీ యీ భక్తి అబ్బుతుంది.

వేగంలో భేదమేగాని - యీ భక్తి మార్గాలు మూడింటిలో దేనినను సరించినా కూడా - క్రమశః - శివలోకం చేరడం తథ్యం.



# జపం

జపం కూడా మూడు రకాలు. ఒకటి ఉదత్తా నుదాత్తస్వరాలతో అందరికీ వినబడేలా చేసేది. ఇది వాచక జపం అనబడుతోంది. పెదవులు కదుపుతూ, ధ్వని బైటవారికి వినపడ కుండా చేసేది వుపాంశువు. ఇది మధ్యమ ఫలాన్ని యిస్తుంది. పెదవులు కూడా కదపకుండా తనలో తనే జపించుకోవడం " మానస జపం ఇది అత్యుత్తమైన పద్ధతి.

ఇక-అగర్భజపం-సగర్భజపం అని మళ్ళా రెండు రకాలు. అగర్భజపం అంటే - జపానికి ముందు వెనుకలలో ప్రాణా యామం చేయడం. అంటే ప్రాణాయామం చేసి-జపించి-మళ్ళా ప్రాణాయామం చేయడం.

ప్రాణాయామం చేస్తూనే-అదే స్థితిలో వుండి 40 సార్లు జపించే పద్ధతిని సగర్భజపం అంటారు. 40 సార్లు జపించే శక్తిలేనివాళ్ళు 5 సార్లుగాని, మూడు సార్లుగాని, కనీసం ఒక్క పర్యాయమైనా జపించాలి. సగర్భంగా, మానసిక జపం ఒక్కసారి జపించినా అది అనేకరెట్లు సత్ఫలాన్నిస్తుంది. అలాగే వ్రేళ్ళమీదకన్నా - వ్రేళ్ళమీదనున్న రేఖలపై లెక్కిస్తూ చేస్తే 8 రెట్లు అధికఫలం కలుగుతుంది. పుత్రజీవి బీజాలతో జపించినట్లయితే అంతకు పది రెట్లు ఫలం కలుగుతుంది. అంతకన్న శంఖమణులు, వాటికన్న ప్రవాళాలు, వీటికన్న స్ఫటికలు, వాటికన్న ముత్యాలు, అంతకంటె పద్మబీజాలు అధిక ఫలదాలు. బంగారపు జపమాలతో చేస్తే చెప్పనలవి గాని ఫలం. కుశగ్రంధులుగాని, రుద్రాక్ష మాలలుగాని వాడినట్లయితే - ఆ ఫలాన్ని మనమే గాదు శివుడు కూడా చెప్పలేడు.

## జపమాలిక



జపమాలలో 30 రుద్రాక్షలుంచి జపించితే ధన ప్రాప్తి కలుగుతుంది. 27 రుద్రాక్షలమాలతో జపిస్తే పుష్టి కలుగుతుంది. 25 రుద్రాక్షలమాల ముక్తి హేతువవు తుంది. 15 రుద్రాక్షల జపం అభిచారికం సఫలం కావడానికి వినియోగిస్తుంది. 54 రుద్రాక్షలమాల హృదయానికి మంచిది. 108 రుద్రాక్షలమాల సర్వశ్రేష్ఠం.

అంగుష్ఠజపం మోక్షం కలిగిస్తుంది. తర్జనితో జపిస్తే శత్రునాశనం అనామికతో జపం శాంతి. కనిష్ఠాంగుళిపై జపం శుభప్రదం.

ఇంట్లో చేస్తే జపంకన్న గోశాలలో చేసే జపంమిన్న. అరణ్యాలు ఆలయాలు, పర్వతాలు, పుణ్యనదీతీరాలు, దేవాలయాలు, గురుబ్రహ్మగ్నులసన్నిధినీ జపం శ్రేయం. గోవు యెదుటగ జపం అత్యంత పుణ్య ప్రదం.

అభిచారాదికాలను దక్షిణాభిముఖంగా జపం చేయాలి. ధన నిమిత్తం చేసే వాళ్ళు పశ్చిమ దిశవైపు ముఖం పెట్టుకుని చేయాలి. శాంతిని కోరేవారూ, మోక్షం కోరేవారూ, యే కోరికలూ లేకుండా విధిగా జపించేవాళ్ళు ఉత్తరముఖంగా కూర్చుని

జపించాలి. కామ్యసిద్ధికోసం వశీకరణ-ఆకర్షణలకోసం లౌకిక విజయాల కోసం తూర్పు ముఖంగా కూర్చుని జపం చేయాలి.

మొలపై భాగంగా యజ్ఞోపవీతం తప్ప ఇతరమైన నూలుగాని లేదా, వస్త్ర విశేషంగాని (ఎప్పుడూ వుండే గొలుసులూ, కాశీతాళ్ళకు ఈ నియమం వర్తించదు) వుండరాదు. అంటే చొక్కా తొడుక్కుని తలపాగా చుట్టుకుని, గొంతుకకు గుడ్డచుట్టుకుని జపం చెయ్యకూడదు. కామ, క్రోధ వికారాది రహితంగా జపించాలి. స్నానం చెయ్యకుండానూ, చేసినా సరే అపవిత్రంగా వున్నప్పుడూ జపం చెయ్య కూడదు. తుమ్ములూ, దగ్గూ వస్తే జపం చెయ్యకూడదు. చేస్తుండగా వస్తే జపం ఆపెయ్యాలి. ఉమ్మి వచ్చినా, ఆవులింత వచ్చినా కూడా అంతే. కుక్క కనిపించినా, నీచులు కనిపించినా జపం ఆపెయ్యాలి.

జప సమయానికిగాని, జప మధ్యంలోగాని ఆటంకాలు కలిగితే రెండుకను రెప్ప పాటుల కాలం ఆగి - ఆచమించి - శివ పార్వతులను ధ్యానించి విఘ్నేశ్వరుణ్ణి స్మరించి - గురుస్మరణం చేసి - పునఃజపం కొనసాగించాలి. నడుస్తూ గాని, పడుకుని గానీ, యధాలాపంగా కూర్చుని గాని, రాజ వీధుల్లో గాని, అపవిత్ర స్థలాలలోగాని జపం చెయ్యకూడదు.

ఇంత వరకూ జపవిధి. అయితే ఈ జప విధానం - యోగులకి వర్తించదు, అలాగే కలియుగంలోని భక్తులకు కూడా వర్తించదు. యోగులూ, కలిజీవులూ - వాళ్ళ వాళ్ళ యిష్టానుసారంగా యధేచ్ఛగా పంచాక్షరిని జపించుకోవచ్చు, కూర్చున్నా, నిలబడ్డా, పడుకున్నా, నడుస్తున్నా - ఏ అవస్థలో వున్నా పంచాక్షరిని జపించుకోవచ్చును, అయితే 'యోగులు' కానివారు సదాచారాన్ని కూడా పాటించి నట్లయితే మరింత సత్ఫలం పొందుతారు. యెలాగంటావా!/వాళ్ళు అగ్నుల వంటి వాళ్ళు. అగ్నికి శుద్ధియేమిటి! /ఆజన్మ శుద్ధులు వాళ్ళు, యధేచ్ఛగా జపించు కోవచ్చు. ఎందుకంటే - వాళ్ళు ఎప్పుడూ ధ్యానంలోనే వుంటారు. ధ్యానానికి అవరోధం కలిగినప్పుడు ధ్యానానికి ధ్యానానికి నడిమికాలం వృధా కాకుండా వుండడం కోసం జపం చేస్తారు. అందువల్ల - వారి ధ్యాన జప తపాదులను ఆక్షేపించడం చేయకూడదు.

కాకపోతే ఒక్కమాట. ఈ పంచాక్షరిని - క్షుద్రమైన పనులకు మాత్రం ప్రయోగించకుండా వుండడం అత్యంత ఆవశ్యకమైన విషయం.



# యోగపంచకం

ఉపమన్యుడు చెప్పినదంతా విన్న కృష్ణుడు యోగ పంచకం గురించి చెప్పమని కోరగా-ఆమహర్షి యిలా చెబుతున్నాడు.

'యోగ': చిత్తవృత్త నిరోధకః అన్న ముక్క నువ్వు వినే వుంటావు. ఇష్టానురాజ్యంగా సాగే చిత్తప్రవృత్తి నరికట్టి, పరముడి యందే లగ్నం చేయడం యోగం అనబడుతోంది, ఈ యోగం ఐదు రకాలు

**1. మంత్రయోగం :** అంటే, నిరంతర మంత్రజపం వల్ల యితరేతరవృత్తుల నన్నిటినీ అరికట్టి - తన్మంత్ర వాచ్యుడైన దైవం యందే ఏకాగ్రుడు కావడం.

**2. స్పర్శయోగం :** మంత్రయోగాన్ని ప్రాణాయామ సహితంగా ఆచరించినట్లయితే అది స్పర్శయోగం అనబడుతోంది.

**3. భావయోగం :** మనసును దైవమందు నిలిపి మంత్రంగాని, ప్రాణాయామం గాని అవసరం లేకుండా చేసేది భావయోగం.

**4. అభావయోగం :** ఆ అభావంలోనే-విశ్వసమస్తం శివాంతర్లీనంగా తలచిచేయడం అభావయోగము.

**5. మహాయోగం :** ఉపర్యుక్త అభావయోగంలో శివమొక్కటే దర్శింపబడినట్లయితే అది మహాయోగం అనిపిలుచుకుంటుంది.

అహింస, సత్యం, దొంగిలించక పోవడం, బ్రహ్మచర్యం యితరుల నుండి ఏమీ దానం పట్టకపోవడం, అనేవి - యమం అనబడతాయి. శుచి శుభ్రాలు, తృప్తి, తపం, జపం, ప్రార్థన అనేవి నియమాలు. పద్మాదులు ఆసనాలు-ప్రాణవాయువు నిరోధమే ప్రాణాయామం. గర్భాం తర్గవాయువుని నాసాపుటాల ద్వారా వదలడాన్ని రేచకం అంటారు. బైటనుంచి గాలినిలోపలికి పీల్చడా

(ఉచ్ఛ్వాసా)న్ని పూరకం అంటారు. ఉచ్ఛ్వాస నిశ్వాసలు లేనిది కుంభకం అంటారు. ఇవి టూకీగా చెప్పాను సుమా!

ఈ రేచక పూరక కుంభకాలని యధేచ్ఛగా - యధాశక్తి అభ్యసించడం ద్వారా ప్రాణాయామానికి చేరుతారు. ప్రాణం అపానం - వ్యానం - ఉదానం సమానం నాగం/కూర్మ-కృకరం-దేవదత్తం-ధనం జయం-అని మనలో వాయువు పదిరకాలుగా వుంటుంది. ప్రయాణికత వల్ల ప్రాణవాయువయ్యింది. ఆహారాన్ని దిగువకు గ్రహించేది అపానం సర్వాంగాలనీ పెంచేది వ్యానం, మర్మస్థానాల్ని ఉద్రేకపరచేది ఉదానం సర్వాంగాల సమానంగా వర్తించేది సమానం.

త్రేనుపులూ అవీ కలిగించేది నాగవాయువు. వికాసాన్ని కలిగించేది కూర్మ వాయువు, కృకర వాయువు క్షుతదాయి. ఆవలింతకు మూలం దేవదత్తం. ఒళ్ళంతా వ్యాపించి వుండేది ధనంజయ వాయువు ఇది ఒక్కటేనయ్యా కృష్ణా! మనం చచ్చిం తర్వాత కూడా మన దేహాన్ని వదలకుండా వుండేది!

రోజు రోజు క్రమక్రమంగా సాధించినట్లయితే యీ ప్రాణాయామం సర్వ దోషాలనీ హరిస్తుంది. శరీరాన్ని సంరక్షిస్తుంది. ఎన్నితపస్సులు చెయ్యి, యజ్ఞాలు చెయ్యి, వ్రతాలు, దానాలు ఏమైనా చెయ్యి నువ్వు. వాటిన్నిటి ఫలం కలిపితే - సక్రమమైన ప్రాణాయామాభ్యాసంలోని పదహారోవంతుకి వస్తాయో రావో తెలియదు.

ఇక ధ్యానం ఇది కూడా యోగాభ్యాసంలో భాగమే గనక చెబుతున్నాను. "ధ్యైచింతాయాం" అనే వ్యుత్పత్త్యను సారంగా యెడతెరిపిలేని యేకబిగి చింతనమే ధ్యానం అనిపించుకుంటోంది.

యోగం ప్రారంభించదల్చుకున్నవాడు (ధ్యాత) ముందుగా ధ్యానం, ధ్యేయం, ప్రయోజనం అనేవి మూడు క్షుణ్ణంగా తెలుసుకొని - తర్వాతనే యోగాభ్యాసానికి సిద్ధపడడం సబబైన పని

## యోగ విఘ్నాలు

ఉపమన్యుడు కృష్ణుడికి చెప్పినట్లుగా - వాయుదేవుడు షట్కులీన మునులకూ చెబుతున్నాడు -"కృష్ణా! ఆలస్యం తీవ్రతరమైన వ్యాధులు, పొరపాట్లు, సందేహాలు, చిత్తచాంచల్యం, అశ్రద్ధ భ్రాంతి సంకటాలను పాటించడం, ఇంద్రియ సుఖాలమీద



విపరీతమైన వాంఛ మనసు బాగులేక పోవడం - అనే యీ పదీ కూడా యోగా భ్యాసానికి విఘ్నాలు.

మనశ్శరీరాలు ఉభయమూ కార్యోన్ముఖం కాకపోవడం ఆలస్యము, పురాకృత కర్మ - లేదా వర్తమాన దైహిక/ కఫవాత పిత్తాలలోని భేదాల వలన యేర్పడే యిబ్బందులే రోగాలు. అభ్యాసంలో కలిగించే అధిక సమయ విరామాలవల్ల వచ్చేవి - ప్రమాదాలు అనబడే పొరబాట్లు. ఈ పొరబాటువల్ల ధారణ తడబడి 'అటు- ఇటూ' అని ఎడతెగని ఆలోచనలో ముంచెత్తి భ్రష్టుపట్టించేది సందేహం.

విషయేతరాలపై మనసు చలిం చడం చిత్తచాంచల్యం. అభిరుచి కొరవడడం వల్ల వచ్చేది అశ్రద్ధ/బుద్ధికి అతిచారం పట్టడం అనే విపరీత బుద్ధిని భ్రాంతి అంటారు. అజ్ఞానపరమైన అంతర్వ్యధ సంకటం లేదా ఆధ్యాత్మిక దుఃఖం, శరీర తాపంగా సంభవించేది అధి భౌతిక దుఃఖం అస్త్రాలు, శస్త్రాలు, పిడుగుపాటు వగైరాల వలన లభించేవి/అధి దైవిక దుఃఖములు, ఈ దుఃఖత్రయమే "సంకటం" అనే ముద్దుపేరుతో పిలువబడుతోంది. ఇచ్ఛా విఘాతం వల్ల కలిగేది మనశ్చాం చల్యం, కడపటిది చెప్పేదేముంది; ఇంద్రియాలు బలవత్తరాలు గదా - తద్వారా లోలత్వం - దానివల్ల పతనం మామూలే.

ఇలాంటి యోగ విఘ్నాలు పదింటినీ/నెగ్గుకు రాగలిగితే-అభ్యాసము ఓ కొలిక్కి చేరుకుంటుంది. అప్పుడు ఆరు రకాలైన యోగ సిద్ధులు స్పష్టమౌతాయి. అవి

**1. ప్రతిభ:** ప్రతీది వున్నదీ వున్నట్లుగానే తెలుసుకోగలగడం.

**2. శ్రవణ:** వినేందుకు ప్రయత్నం చేయక పోయినా - వాటికవే శబ్దాలు వినబడడం.

**3. వార్త:** సర్వప్రాణుల విషయాలూ అవలీలగా తెలియబడడం.

**4. దర్శనం:** దివ్యమైన దృశ్యములు దర్శింపబడడం.

**5. ఆస్వాదం:** అద్భుతమైన రసములు ఆస్వాదింపబడడం.

**6. నివేదన:** ఈ యోగంలో- లోకపాలురు దివ్య సుగంధాలను అందజేస్తారు.

బ్రహ్మాది దేవతలు సాక్షాత్కరించి బహువిధ రత్నాదులను బహుకరిస్తారు. స్వచ్ఛందమైన మధురమైన వాక్పటిమ కలుగుతుంది. సురకాంతలు వినమ్రులై సర్వవిధ ఓషధులనూ - రసాయనాలనూ అందజేస్తారు.

ఇవే గాకుండా,పృధ్వీతత్త్వ, అగ్ని తత్త్వ, జలతత్త్వ, ఖేతత్త్వ వాయుతత్త్వాదులు, ప్రాజాపత్యాదిఐశర్యాలు, విష్ణు ఐశ్వర్యాదులూ గాణేశాది ఐశ్వర్యాదులు అనేకం వున్నాయి.

ఏ విధమైన ఆయాసాలూ, అనారోగ్యాలూ లేనివాడే యోగభ్యాసం చేయాలి, శుభ ప్రాంతాలలోనూ, అనపాయస్థలాలలోనూ, ఏకాంతమూ, నిశ్శబ్దతా, నిర్భీతి వున్న స్థలాలలోనూ మాత్రమే యోగాభ్యాసం చేయాలి. మంచి పరిమళాలు విరజిమ్మే పువ్వులూ, సమిధులూ, దర్భలూ, శుద్ధోదకం అందుబాటులో వుండే ప్రాంతాన కందమూలాదులు విరివిగా గల ప్రాంతాన మాత్రమే యోగాభ్యాసం చేయాలి.

అగ్నికీ, నీళ్ళకీ, దగ్గర్లో చేయకూడదు. ఎండుటాకు లెక్కువగా వున్నచోట, ఈగలూ దోమలూ సంగీతం పాడుతుండేచోట పాములూ మొదలయిన క్రూర జంతువులు స్వేచ్ఛావిహారాలుచేసే చోట, వ్యాఘ్రాదులున్న స్థలాలలోనూ, భయంకర ప్రదేశాలలోనూ, దుర్మార్గులు మసలేచోట, మరీ - నదీనదాల, సముద్ర తీరాల అంచునా, ఎత్తయిన కట్టడాల అగ్రభాగాన, పుట్టల దగ్గరా, పాడుబడ్డ యిళ్ళలోనూ, నాలుగుత్రోవల కూడలిలోనూ, రాజవీధిలోనూ, జీర్ణావాసాలలోనూ, పాతబడ్డ పశుశాలలోనూ, మలమూత్రాది విసర్జనా స్థలాలలోనూ, నిందిత స్థలాల లోనూ, వల్లకాట్లోనూ యోగా భ్యాసం చెయ్యకూడదు.

తనకు మనస్ఫూర్తిగా నచ్చినదీ, పెద్దలచే చెప్పబడిన వసతులు గలదీ అయిన చోటనే యోగాభ్యాసం చెయ్యాలి. తనకు నచ్చింది గదా అని - నిషిద్ధ స్థలాలలో చేయకూడదు. అర్హమైన చోటనే అభ్యాసం మొదలు పెట్టాలి.

# ధ్యానం



శివధ్యానం యెల్ల వేళలా చేస్తూనే వుండాలి. శివమూర్తులు మూడు రకాలుగా వుంటాయి. 1. ఘోరమూర్తి 2. మిశ్రమూర్తి 3. ప్రశాంతమూర్తి, వీటిలో ఘోర మూర్తిని ఆరాధించడం సద్యఃఫల ప్రదంగా చెబుతారు. రెండవదైన మిశ్రమూర్తిని ఆరాధించడం వల్ల కూడా తొందరలోనే గుణం కనిపిస్తుంది. కడపటిదైన ప్రశాంత మూర్తిని ఆరాధించడము కేవలం మోక్షం కోసమే.

**ధ్యానం రెండు రకాలు:-**

1. సవిషయం 2. నిర్విషయం. యీ రెంటిలో నిర్విషయం అనేది ఎందుకూ గొరగానిదని ఒక వాదం. అయితే సవిష యం సాకారో పాసనమనీ, నిర్విషయం నిరాకారో పాసనమనీ చెప్పేవారు కూడా వున్నారు. ఎలాగో అలాగ శివధ్యానం అంటూ మొదలుపెడితే - అదే మనల్ని సక్రమ మార్గానా, యోగ్యమార్గాన నడిపిస్తుంది.

ప్రాణాయామం చేయడం వల్ల దివ్యసిద్ధులు చేకూరతాయి, ఈ సిద్ధులు నాలుగు రకాలు.

1. **శాంతి** : సర్వాపదలూ సమసిపోవడం "శాంతిసిద్ధి"
2. **ప్రశాంతి** : ప్రత్యక్ష, పరోక్షాలనే - బాహ్యాభ్యంతర దుఃఖాలన్నీ దూదిపింజల్లా చెదిరిపోవడం ప్రశాంతి సిద్ధి.
3. దీప్తి : మన వెలుపలనే గాకుండా - మన అంతస్సులో కూడా వెలుగును కాంచగలగడం దీప్తి నామక సిద్ధి.
4. **ప్రసాద** : బుద్ధి స్వస్థంగా వుండుట.

బాహ్యాంతరాలైన సాధనాలన్నీ బుద్ధి ప్రసన్నత వల్లనే అనుకూలిస్తాయని తెలుసుకోవాలి. ధ్యానించదగ్గది శివుడొక్కడే - ఎల్లవేళలా శివధ్యానం చేస్తూ

వుండాలి. ధ్యానం లేనిదే శివజ్ఞానం సమకూరదు. ప్రాణాయామాది యోగ భ్యాసం లేనిదే ధ్యానం సిద్ధించదు.

అందువల్ల ధ్యానంతో తుల్యమైన తీర్థంగాని, యజ్ఞంగాని, తపస్సుగాని, లేవని తెలుసుకోవాలి. శివయోగులు ఏనాడూ పాపలిప్తులు కారు. అందువల్ల వారికి నివాసస్థలాలనీ, అన్నపానీయాలనీ, శయ్యా వస్త్రాలనీ ఇస్తూ ఉండాలి. తద్వారా వారు అనుగ్రహించడం వల్ల మనకు కూడా శివ తత్పరత కలిగే అవకాశం వుంది.

శివుని నిమిత్తం గాని, శివభక్తుల నిమిత్తం గాని - ప్రాణాలను సైతం విడవ గలిగిన వాడిని మించిన శైవోత్తముడు - ముక్తపురుషుడు మరి లేడనే చెప్పాలి. మృతి చెందిన శివయోగుల విషయంలో "మైలా గీలా" అంటూ అతి చారం చెయ్యనక్కర్లేదు/స్వల్ప శౌచం చాలు మృతదేహం ఖననం చేయాలి. లేదా, జలస్థాపితం కూడా చేయవచ్చును. అపరకర్మను కూడా శుభకార్యం వలెనే మహోత్సాహంతో చెయ్యాలి. శివయోగుల ఆస్తులు శివభక్తులే అను భవించాలి. అతని వారసులు శైవులు కాకపోతే దాన్ని శివభక్తులకే వినియోగించాలి అన్నాడు వాయువు.

## మంగళాంతం

ఆ విధంగా వాయువుచే బోధించబడిన/శైవసంహితనంతా వినినవారై మరునాటి వుదయం యజ్ఞ సమాప్తిని చేసి అవబృథ స్నాతు లైన మహర్షులందరూ సరాసరి బ్రహ్మలోకం వెళ్ళారు. బ్రహ్మను సందర్శించారు. నమస్కరించారు. తను చెప్పింది చెప్పినట్లుగా చేసుకు వచ్చిన మునులను చూచి ఆనం దించాడు బ్రహ్మ.



సనత్కుమారుడు నందికేశ్వనిరుకోసం యెదురు చూస్తున్నాడు. గతంలో ఒకప్పుడు శివమాయా మోహితుడైన సనత్కుమారుడు - తనే యోగి శ్రేష్ఠుడననే గర్వంతో నందికేశ్వరుడికి అభ్యుత్థాన, అభివాదుల నాచరించకపోవడంచేత - ఆయన అలిగి- "సనత్కుమారుడు ఒంటెగా మారిపోవా" అని శపించాడు. అది భరించలేని నేను శివుడి ద్వారా నందికేశ్వరునకు నచ్చచెప్పించగా ఆ మహానీయుడు శాపోపహారణం చేశాడు.

కాని మనసులో ఆ దుగ్ధవుండిపోయిందిగదా! అందువల్ల ఆ నందికేశ్వరుణ్ణి ప్రసన్నం చేసుకోవడం కోసం సనత్కుమారుడు మేరుగిరి మీద తపస్సు చేస్తున్నాడు. ఆయన ప్రత్యక్షమయ్యే తరుణం చేరువయ్యింది. నందికేశ్వర సాక్షాత్కారానికి పూర్వమే - మీరు వెళ్ళి సనత్కుమారుణ్ణి దర్శించండి" అని చెప్పి పంపించాడు.

బ్రహ్మ అనతి ప్రకారం మునులందరూ సనత్కుమారుణ్ణి చేరారు. అదే వేళకు దివ్యవిమానారూఢుడై, పార్షదసంసేవితుడై వచ్చాడు నందికేశ్వరుడు. సనత్కుమారుణ్ణి అనుగ్రహించాడు. తన ప్రసన్నతను తెలియజేశాడు. అనంతరం సనత్కుమారుడు నైమిశీయుల నా నందికేశుడికి పరిచయం చేశాడు. వారి కోరిక మన్నించిన నందికేశుడు వారికి శివతత్త్వం బోధించి వెళ్ళిపోయాడు.

నందిశ్వరుడి నుంచి శాంభవదీక్షను గ్రహించిన ఆ షట్కులీన మునులు తద్దీక్షా సాఫల్యార్థం ఇష్ట, ప్రాణ, భావలింగాలను వుపాసించి పరమపదాన శివ సాయుజ్యం పొంది శాశ్వత ముక్తులయ్యారు.

ఈ విధంగా శివ మహాపురానమనే ఈ శైవసంహితా సప్తకాన్నీ, - సనత్కు మారుడు వేదవ్యాసుడికి వుపదేశించాడు. ఆయన నాకు నేర్పారు. దానిని నేను మీకు చెప్పాను.

ఓ శౌనకాది పుణ్యభాగులారా! ఈ మహా పురాణాన్ని వేదాధికారం లేని వారికి, శివభక్తిలేని వారికీ, శిష్యులు కాని వారికీ, నాస్తికులకూ చెప్పకూడదు. అటువంటి వారికి చెప్పడం వల్ల 'దివ్యత్వం' ఆక్షేపణీయంగా పరిణమించి తద్వారా చెప్పిన వారికి నరకం సంభవించే ప్రమాదం కూడా వుంది.

గురు శుశ్రూషాసక్తులైన శిష్యులకు వుపదేశించినట్లయితే - ఇది తెలుసు కోవడం వలన వారూ, వారిని శిష్యులుగా పొందడంవల్ల వుపదేశులూ కూడా

తరిస్తారు. మీరు బహు పురాణ విషయశ్రోతులూ నాకు చిరకాల శ్రోతలూ, మీదు మిక్కిలి కపటమెరుగని జిజ్ఞాసువులూ గనుక - మీకీ నాలుగు మంచి మాటలు చెప్పాను. ఇక నాకు శలవిప్పిస్తే నా ప్రయాణం కొనసాగిస్తాను' - అంటూ సూతుడు మూర్తీభూత వినయుడై శౌనకాదులకు చేతులు జోడించాయి./

శ్రోతలైన శ్రోత్రియులా శ్రుత్యర్థవిదుడైన సూతుణ్ణి ఆశీర్వదించారు. పొలిమేరల వరకూ సాగనంపి, మరలిచ్చిన వారై 'సత్ర'మనే పేరుగల రుద్ర యాగాన్ని శుభావహంగా నిర్వర్తించారు. తదనంతరం సర్వపాపనాశియైన కాశీక్షేత్రం చేరారు. ఆయుష్కాలమంతా అక్కడే శివారాధనలో గడిపి - అంత్యంలో శివ సాయుజ్యాన్ని పొందారు.

శ్రీ వేదవ్యాస మహర్షి విరచితమైన శ్రీ శివమహాపురాణమున
వాయవీయ సంహిత సమాప్తము/

**శ్రీ వేదవ్యాస మహా మునీంద్రవిరచితమైన శ్రీ శివమహాపురాణమునకు**
**సంక్షేపాంధ్ర వచన సర్వస్వం సంపూర్ణము శివోరక్షతు సర్వదా/**

శా. నిన్నున్నమ్మినరీతినమ్మనొనరులన్ నీ కన్న నాకెన్న లే
రన్నల్దమ్ములు తల్లి దండ్రులు గురుండాపత్స హాయయుండు నా
యన్నా! యెన్నడు నన్ను సంసృతి విషాదాంభోధిదాటించియ
చ్ఛిన్నానంద సుఖాబ్ధిదేల్చెదొకదే శ్రీ కాళహస్తీశ్వరా ॥



# శ్రీ మహావిష్ణుకృత శివ సహస్రనామ స్తోత్రం

శ్రూయతాంభోః ఋషి శ్రేష్ఠాః యేనతుష్టో మహేశ్వరః
తదహం కథయామ్యద్యశైవం నామసహస్రకమ్ ॥
శివో హరో మృడో రుద్రః పుష్కరః పుష్పలోచనః
అర్థిగమ్యః సదాచారః సర్వ శ్శంభు ర్మహేశ్వరః ॥ 1
చంద్రాపీడ శ్చంద్రమౌళి ర్విశ్వం విశ్వంభరేశ్వరః
వేదాంత సార సందోహః కపాలీ నీలలోహితః ॥ 2
ధ్యానాధారోఽపరిచ్ఛేద్యో గౌరీ భర్తా గణేశ్వరః
అష్టమూర్తి ర్విశ్వమూర్తి స్త్రివర్గః సర్గ సాధనః ॥ 3
జ్ఞానగమ్యో దృఢప్రజ్ఞో దేవదేవ స్త్రిలోచనః
వామదేవో మహాదేవః పటుః పరివృఢో దృఢః ॥ 4
విశ్వరూపో విరూపాక్షో వాగీశః సురసత్తమః
సర్వప్రమాణ సంవాదీ వృషాంకో వృషవాహనః ॥ 5
ఈశః పినాకీ ఖట్వాంగీ చిత్రవేష శ్చిరంతనః
తమోహరో మహాయోగీ గోప్తా బ్రహ్మాండ హృజ్జటీ ॥ 6
కాలకాలః కృత్తివాసాః సుభగః ప్రణతా(వా)త్మకః ।
ఉన్నద్ధః పురుషోజుష్యో దుర్వాసాః పురశాసనః ॥ 7
దివ్యాయుధః స్కందగురుః పరమేష్ఠీ పరాత్పరః
అనాది మధ్య నిధనో గిరీశో గిరిజా ధవః ॥ 8
కుబేర బంధుః శ్రీకంఠో లోకవర్ణోత్తమో మృదుః
సమాధివేద్యః కోదండీ నీలకంఠః పరశ్వధీ ॥ 9
విశాలాక్షో మృగవ్యాధః సురేశఃసూర్యతాపనః
ధర్మాధ్యక్షః క్షమాక్షేత్రం భగవాన్ భగనేత్రభిత్ ॥ 10
ఉగ్రః పశుపతి స్తార్క్ష్యః ప్రియభక్తః పరంతపః
దాతా దయాకరో దక్షః కపర్దీ కామ శాసనః ॥ 11
శ్మశాన నిలయః సూక్ష్మః శ్మశానస్థో మహేశ్వరః ।
లోకకర్తా మృగపతి ర్మహాకర్తా మహౌషధిః ॥ 12

సోమపోఽమృతపః సౌమ్యో మహాతేజా మహాద్యుతిః
తేజోమయోమృత మయోఽన్నమయశ్చ సుధాపతిః ॥ 13
ఉత్తమో గోపతి ర్గోప్తా జ్ఞాన గమ్యః పురాతనః
నీతి సునీతిః శుద్ధాత్మా సోమః సోమతరఃసుఖీ ॥ 14
అజాత శత్రురాలోక సంభావ్యో హవ్యవాహనః
లోకంకరో వేదకరః సూత్రకారః సనాతనః ॥ 15
మహర్షిః కపిలాచార్యో విశ్వదీప్తి స్త్రిలోచనః
పినాకపాణి ర్భూదేవః స్వస్తిదః సుకృతః సుధీః ॥ 16
ధాతృథామా ధామకరః సర్వదః సర్వగోచరః
బ్రహ్మసృక్ విశ్వసృక్ సర్గః కర్ణి కార ప్రియః కవిః ॥ 17
శాఖో విశాఖో గోశాఖః శివోభిష గనుత్తమః
గంగాప్లవోదకో భవ్యః పుష్కలః స్థపతిః స్థిరః ॥ 18
విజితాత్మా విధేయాత్మా భూతవాహన సారధిః
సగణో గణకాయశ్చ సుకీర్తి శ్ఛిన్న సంశయః । 19
కామదేవః కామపాలో భస్మోద్ధూళిత విగ్రహః
భస్మప్రియో భస్మశాయీ కామీ కాంతః కృతాగమః ॥ 20
సమావర్తో నివృత్తాత్మా ధర్మపుంజః సదాశివః
అకల్మషశ్చ పుణ్యాత్మా చతుర్బాహు ర్దురాసదః ॥ 21
దుర్లభో దుర్గమోదుర్గః సర్వాయుధ విశారదః
అధ్యాత్మ యోగ నిలయః సుతంతు స్తంతు వర్ధనః ॥ 22
శుభాంగో లోకసారంగో జగదీశో జనార్ధనః ।
భస్మ శుద్ధికరోఽభీరు రోజస్వీ శుద్ధవిగ్రహః ॥ 23
అసాధ్యః సాధుసాధ్యశ్చ భృత్యమర్కట రూపధృక్
హిరణ్య రేతాః పౌరాణో రిపు జీవహరో బలీ ॥ 24
మహాహ్రాదో మహాగర్తః సిద్ధోబృందార వందితః
వ్యాఘ్ర చర్మాంబరో వ్యాళీ మహాభూతో మహానిధిః ॥ 25
అమృతోఽమృతపః శ్రీమాన్ పాంచజన్యః ప్రభంజనః
పంచవింశతి తత్వస్థః పారిజాతః పరాత్పరః ॥ 26

సులభః సువ్రతః శూరో వాఙ్మయైక నిధి ర్నిధిః
వర్ణాశ్రమ గురు ర్వర్ణీ శత్రుజి చ్ఛత్రు తాపనః ॥ 27
ఆశ్రమః శ్రమణః క్షామోజ్ఞానవానచలేశ్వరః
ప్రమాణ భూతో దుర్జ్ఞేయః సుపర్ణో వాయువాహనః ॥ 28
ధనుర్ధరో ధనుర్వేదో గుణః శశిగుణాకరః
సత్యః సత్యపరోఽదీనో ధర్మోగోధర్మ శాసనః ॥ 29
అనంత దృష్టి రానందో దండో దమయితా దమః
అభిచార్యో మహామాయో విశ్వకర్మ విశారదః ॥ 30
వీత రాగో వినీతాత్మా తపస్వీ భూత భావనః ।
ఉన్మత్తవేషః ప్రచ్ఛన్నో జితకామో జితేంద్రియః ॥ 31
కళ్యాణ ప్రకృతిః కల్పః సర్వలోక ప్రజాపతిః
తరస్వీ తారకో ధీమాన్ ప్రధానః ప్రభు రవ్యయః ॥ 32
లోకపాలోంతరాత్మాచ కల్పాదిః కమలేక్షణః
వేదశాస్త్రార్థ తత్వజ్ఞో నియమీ నియమాశ్రయః ॥ 33
చంద్రః సూర్యః శనిః కేతుః వరాంగో విద్రుమచ్ఛవిః
భక్తి వశ్యః పరంబ్రహ్మ మృగబాణార్పణోనఘః ॥ 34
అద్రి రద్ర్యాలయః కాంతః పరమాత్మా జగద్గురుః
సర్వకర్మాలయ స్తుష్టో మంగళ్యో మంగళా వృతః ॥ 35
మహాతపా దీర్ఘతపాః స్థవిష్ఠ స్థవిరో ధ్రువః
అహః సంవత్సరో వ్యాప్తిః ప్రమాణం పరమం తపః ॥ 36
సంవత్సర కరో మంత్రః ప్రత్యయః సర్వతాపనః
అజః సర్వేశ్వరః సిద్ధో మహాతేజా మహాబలః ॥ 37
యోగీ యోగ్యో మహారేతాః సిద్ధః సర్వాది రగ్రహః
వసుర్వసుమనాః సత్యస్సర్వ పాపహరో హరః ॥ 38
సుకీర్తిః శోభనః స్రగ్వీ వేదాంగో వేద విన్మునిః
భ్రాజిష్ణుర్భోజనం భోక్తా లోకనాథో దురా(ధరః) సదః ॥ 39
అమృతః శాశ్వతః శాంతో బాణహస్తః ప్రతాపవాన్
కమండలు ధరో ధన్వీ హ్యవాఙ్మానస గోచరః ॥ 40

అతీంద్రియో మహామాయః సర్వావాసశ్చతుష్పథః
కాలయోగీ మహానాదో మహోత్సాహో మహాబలః ॥ 41
మహాబుద్ధి ర్మహావీర్యో భూతచారీ పురందరః
నిశాచరః ప్రేతచారీ మహాశక్తి ర్మహాద్యుతిః ॥ 42
అనిర్దేశ్యవపుః శ్రీమాన్ సర్వాచార్యో మనోగతిః
బహు శ్రుతిర్మహామాయో నియతాత్మా ధ్రువోఽధ్రువః ॥ 43
తేజస్తేజో ద్యుతిధరో జనకః సర్వశాసనః
నృత్యప్రియో నిత్యనృత్యః ప్రకాశాత్మా ప్రకాశకః ॥ 44
స్పష్టాక్షరో బుధోమంత్రః సమానః సారసంప్లవః ।
యుగాది కృద్యుగావర్తో - గంభీరో వృషవాహనః ॥ 45
ఇష్టో విశిష్టః శిష్టేష్టః సులభః సారశోధనః
తీర్థ రూప స్తీర్థనామా తీర్థ దృశ్యస్తు తీర్థదః ॥ 46
అపాం నిధి రధిష్ఠానం దుర్జయో జయ కాలవిత్
ప్రతిష్ఠితః ప్రమాణజ్ఞో హిరణ్యకవచో హరిః ॥ 47
విమోచకః సురగణో విద్యేశో బిందు సంశ్రయః
వాతరూపోఽమలోన్మాయీ వికర్తా గహనో గుహః ॥ 48
కరణం కారణం కర్తా సర్వబంధ విమోచనః
వ్యవసాయో వ్యవస్థానః స్థానదో జగదాదిజః ॥ 49
గురుదో లలితో భేదో నవాత్మాఽఽత్మని సంస్థితః
వీరేశ్వరో వీరభద్రో వీరాసన విధిర్గురుః ॥ 50
వీరచూడామణి ర్వేత్తా చిదానందో నదీశ్వరః ।
ఆజ్ఞాధరస్త్రి శూలీ చ శిపివిష్టః శివాలయః ॥ 51
వాలఖిల్యో మహావీరస్తిగ్మాంశుర్బధిరః ఖగః
అభిరామః సుశరణః సుబ్రహ్మణ్యః సుధాపతిః ॥ 52
మఘవా కౌశికో గోమాన్ విరామః సర్వసాధనః
లలాటాక్షో విశ్వదేహః సారః సంసార చక్రభృత్ ॥ 53
అమోఘదండో మధ్యస్థో హరిణోబ్రహ్మ వర్చసః ।
పరమార్థః పరమాయః సంచయో వ్యాఘ్ర కోమలః ॥ 54

రుచిర్బహురుచి ర్వైద్యో వాచస్పతి రహస్పతిః
రవి ర్విమోచనః స్కందః శాస్తా వైవస్వతో యమః ॥ 55
యుక్తి రున్నత కీర్తిశ్చ - సానురాగః పురంజనః
కైలాసాధిపతిః కాంతః సవితా రవిలోచనః ॥ 56
విశ్వోత్తమో వీతభయో విశ్వభర్తాఽనివారితః
నిత్యోనియత కళా॰॰: పుణ్యశ్రవణ కీర్తనః ॥ 57
దూరశ్రవా విశ్వసహో ధ్యేయో దుస్స్వప్ననాశనః
ఉత్తారణో దుష్కృతిహా విజ్ఞేయో దుస్సహో ధవః ॥ 58
అనాది ర్భూర్భువో లక్ష్మీః కిరీటీ త్రిదశాధిపః
విశ్వగోప్తా విశ్వక(ర్తా)ర్మా సువీరో రుచిరాంగదః ॥ 59
జననో జన్మ జన్మాదిః ప్రీతిమా న్నీతిమాన్ ధ్రువః
వశిష్ఠః కశ్యపో భానుర్భీమో భీమ పరాక్రమః ॥ 60
ప్రణవః సత్పథాచారో మహాకోశో మహాధనః ।
జన్మాధిపో మహాదేవః సకలాగమ పారగః ॥ 61
తత్త్వం తత్త్వవి దేకాత్మా విభుః విష్ణుః విభూషణః
ఋషి ర్బ్రాహ్మణ ఐశ్వర్యం జన్మమృత్యు జరాతిగః ॥ 62
పంచతత్త్వ సముత్పత్తిః విశ్వేశో విమలోదయః
అనాద్యంతో హ్యాత్మయోని ర్వత్సలో భక్తలోకధృక్ ॥ 63
గాయత్రీ వల్లభః ప్రాంశుః విశ్వావాసః ప్రభాకరః
శిశు ర్గిరిరతః సమ్రాట్ సుషేణః సురశత్రుహా ॥ 64
అనేమి రిష్టనేమిశ్చ ముకుందో విగతజ్వరః
స్వయం జ్యోతిర్మ హాజ్యోతిస్తను జ్యోతి రచంచలః ॥ 65
పింగళః కపిల శ్మశ్రుర్భాల నేత్ర స్త్రయీ తనుః
జ్ఞానస్కంధో మహానీతి ర్విశ్వోత్పత్తి రుపప్లవః ॥ 66
భగో వివస్వా నాదిత్యోగత పారోబృహస్పతిః
కళ్యాణ గుణనామా చ పాపహా పుణ్య దర్శనః ॥ 67
ఉదారకీర్తి రుద్యోగీ సద్యోగీ సద సత్రపః
నక్షత్రమాలీ నాకేశః స్వాధిష్ఠానః షడాశ్రయః ॥ 68

పవిత్రః పాపనాశశ్చ మణిపూరో నభోగతిః
హృత్ పుండరీక మాసీనః శక్రః శాంతి ర్వృషాకపిః ॥ 69
ఉష్ణోగృహపతిః కృష్ణః సమర్థోఽ నర్థనాశనః
అధర్మ శత్రు రజ్ఞేయః పురుహూతః పురుశ్రుతః ॥ 70
బ్రహ్మాగర్భో బృహద్గర్భో ధర్మధేను ర్ధనాగమః
జగద్ధితైషి సుగతః కుమారః కుశలాగమః ॥ 71
హిరణ్యావర్ణో జ్యోతిష్మాన్ నానాభూతరతో ధ్వనిః
ఆరోగ్యోనమనాధ్యక్షో విశ్వామిత్రో ధనేశ్వరః ॥ 72
బ్రహ్మజ్యోతి ర్వసుర్ధామా మహాజ్యోతి రనుత్తమః
మాతామహోమాతరిశ్వా నభస్వాన్నాగహారధృక్ ॥ 73
పులస్త్యః పులహోఽగస్త్యో జాతూకర్ణ్యః పరాశరః
నిరావరణ నిర్వారో వైరించ్యో విష్టరశ్రవాః ॥ 74
ఆత్మభూ రనిరుద్ధోఽత్రి ర్జ్ఞానమూర్తి ర్మహాయశాః
లోకవీరాగ్రణీర్వీర - శ్చంద్రః సత్యపరాక్రమః ॥ 75
వ్యాలకల్పో మహాకల్పః కల్పవృక్షః కళాధరః
అలంకరిష్ణురచలో రోచిష్ణు ర్విక్రమోన్నతః ॥ 76
ఆయుః శబ్దపతి ర్వాగ్మీప్లవనః శిఖి సారథిః
అసంస్పృష్టోఽతిథిః శత్రుః ప్రమాథీ పాదపాసనః ॥ 77
వసుశ్రవాః కవ్యవాహః ప్రతప్తో విశ్వభోజనః
జప్యో జరాది శమనో లోహితశ్చ తనూనపాత్ ॥ 78
వృషభాశ్వో నభోయోనిః సుప్రతీపస్తమిస్రహా
నిదాఘుస్తపనోమేఘు భక్షఃపర పురంజయః ॥ 79
సుఖానిలః సునిష్పన్నః సురభిః శిశిరాత్మకః
వసంతో మాధవో గ్రీష్మో నభస్యోబీజవాహనః ॥ 80
అంగిరాగురు రాత్రేయో విమలో విశ్వవాహనః
పావనః పురజిచ్ఛక్ర స్త్రైవిద్యో నవవారణః ॥ 81
మనోబుద్ధి రహంకారః క్షేత్రజ్ఞః క్షేత్రపాలకః
జమదగ్నిర్జల నిధిర్వి(గా)లో(హో) విష్వ(శ్వ)గాలయః ॥ 82

అఘోరోఽనుత్తరోయజ్ఞః శ్రేష్ఠో నిశ్శ్రేయసప్రదః
శైలోగగన కుందాభో - దానవారి రరిందమః ॥ 83
చాముండో జనక శ్చారుర్నిశ్శల్యోలోకశల్యధృక్ ।
చతుర్వేద శ్చతుర్భావ - శ్చతురః చతుర ప్రియః ॥ 84
ఆమ్నాయోఽధసమామ్నాయ స్తీర్థదేవః శివాలయః
బహురూపో మహారూపః సర్వరూప శ్చరాచరః ॥ 85
న్యాయ నిర్ణాయకోనేయో న్యాయగమ్యో నిరంజనః ।
సహస్రమూర్ధాదేవేంద్రః సర్వశాస్త్ర విభాజనః ॥ 86
ముండీ విరూపో వికృతో దండీ దానీ గుణోత్తమః
పింగళాక్షో హి బహ్వక్షో నీలగ్రీవో నిరామయః ॥ 87
సహస్రబాహుః సర్వేశః శరణ్యః సర్వలోకదృక్
పద్మాసనః పరంజ్యోతిః పారంపర్యఫలప్రదః 88
పద్మగర్భోమహాగర్భో విశ్వగర్భో విచక్షణః
పరావరజ్ఞోవరదో వరేణ్యశ్చ మహాస్వనః ॥ 89
దేవాసురగురుర్దేవో దేవాసుర నమస్కృతః ।
దేవాసుర మహామిత్రో దేవాసుర మహేశ్వరః ॥ 90
దేవాసురేశ్వరో దివ్యోదేవాసుర మహాశ్రయః
దేవదేవోఽనయోఽచింత్యోదేవతాత్మాఽఽత్మసంభవః ॥ 91
సద్యోమహాసురవ్యాధో దేవసింహోదివాకరః ।
విబుధాగ్రచరః శ్రేష్ఠః సర్వదేవోత్తమోత్తమః ॥ 92
శివజ్ఞానరతః శ్రీమాన్ శిఖీశ్రీ పర్వత ప్రియః ।
వజ్రహస్తః సిద్ధఖడ్గోనరసింహనిపాతనః ॥ 93
బ్రహ్మచారీలోకచారీ ధర్మచారీ ధనాధిపః ।
నందీ నందీశ్వరోఽనంతోనగ్నవృత్తిధరః శుచిః ॥ 94
లింగాధ్యక్షః సురాధ్యక్షో యుగాధ్యక్షో యుగావహః ।
స్వధామాస్వగతః స్వర్గీ స్వరః స్వరమయః స్వనః ॥ 95
బాణాధ్యక్షో బీజకర్తా కర్మకృద్ధర్మసంభవః ।
దంభోఽలోభోఽధవైశంభుః సర్వభూత మహేశ్వరః ॥ 96

శ్మశాన నిలయస్త్ర్యక్షః సేతురప్రతిమాకృతిః
లోకోత్తరస్ఫుటోలోకః త్ర్యంబకోనాగభూషణః ॥ 97
అంధకారిర్మయద్వేషీ విష్ణుకంధర పాతనః ।
హీనదోషోఽక్షయగుణోదక్షారిః పూషదంతభిత్ ॥ 98
పూర్ణః పూరయితాపుణ్యః సుకుమారస్సులోచనః ।
సన్మార్గపః ప్రియోధూర్తః పుణ్యకీర్తిరనామయః ॥ 99
మనోజవస్తీర్థ కరోజటిలో నియమేశ్వరః ।
జీవితాంతకరోనిత్యో వసురేతావసుప్రదః ॥ 100
సద్గతిః సిద్ధిదః సిద్ధః సజ్జాతిః ఖలకంటకః ।
కలాధరోమహకాలోభూతః సత్యపరాయణః ॥ 101
లోకలావణ్యకర్తాచ లోకోత్తర సుఖాలయః
చంద్రసంజీవనః శాస్తాలోకగ్రాహోమహాధిపః ॥ 102
లోకబంధుర్లోకనాథః కృతజ్ఞః కృత్తి భూషితః ।
అనపాయోఽక్షరః కాంతః సర్వశాస్త్ర భృతాంవరః ॥ 103
అనపాయోక్షరః కాంతః సర్వశస్త్రభృతాంవరః
తేజోమయో ద్యుతిధరో లోకమానీ ఘృణార్ణవః ॥ 104
శుచిస్మితః ప్రసన్నాత్మా హ్యజేయోదురతిక్రమః ।
జ్యోతిర్మయో జగన్నాథోనిరాకారోజలేశ్వరః ॥ 105
తుంబవీణో మహాకాయో విశోకః శోకనాశనః ।
త్రిలోకప స్త్రిలోకేశః సర్వశుద్ధి రధోక్షజః ॥ 106
అవ్యక్త లక్షణోదేవో వ్యక్తావ్యక్తో విశాంపతిః ।
పరః శివః (పరగుణః) వసుర్నాసా సారోమానధరోయమః ॥ 107
బ్రహ్మా విష్ణుః ప్రజాపాలో హంసో హంస గతిర్వయః ।
వేధావిధాతా ధాతాచ స్రష్టా హర్తా చతుర్ముఖః ॥ 108
కైలాస శిఖరావాసీ సర్వావాసీ సదాగతిః ।
హిరణ్యగర్భో ద్రుహిణో భూతపాలోఽథ భూపతిః ॥ 109
సద్యోగీయోగవిద్యోగీ వరదో బ్రాహ్మణప్రియః ।
దేవప్రియో దేవనాథో దేవజ్ఞోదేవ చింతకః(నః) ॥ 110

విషమాక్షో విశాలాక్షో - వృషదో వృషవర్ధనః ।
నిర్మమోనిరహంకారో నిర్మోహో నిరుపద్రవః ॥ 111

దర్పహా దర్పదోఽ దృప్తః సర్వార్థ పరివర్తకః (నః) ।
సహస్రార్చిః భూతిభూషః స్నిగ్ధాకృతిరదక్షిణః ॥ 112

భూతభవ్య భవన్నాథో విభవో భూతి నాశనః ।
అర్థోఽనర్థో మహాకోశః పరకార్యైక పండితః ॥ 113

నిష్కంటకః కృతానందో నిర్వ్యాజ్యో వ్యాజమర్దనః ।
సత్త్వవాన్ సాత్త్వికః సత్యః కృతస్నేహః కృతాగమః ॥ 114

అకంపితో గుణ గ్రాహీ నై కాత్మా నైకకర్మకృత్ ।
సుప్రీతః సుఖదః(ముఖ్యః) సూక్ష్మః సుకరో దక్షిణానిలః ॥ ·115

నందీస్కందో ధరోధుర్యః ప్రకటఃప్రీతివర్ధనః ।
అపరాజితః సర్వసహో గోవిందః సత్త్వవాహనః ॥ 116

అధృత స్వధృతః సిద్ధః పూతమూర్తి ర్యశోధనః ।
వారాహ శృంగ ధృక్ శృంగీ బలవా నేకనాయకః ॥ 117

శ్రుతి ప్రకాశః శ్రుతిమానేక బంధు రనేకధృక్ ।
శ్రీవత్సలః శివారంభః శాంతభద్రః సమోయశః ॥ 118

భూశయో భూషణో భూతిర్భూతికృత్ భూతభావనః ।
అకంపో భక్తికాయస్తు - కాలహానిః కలావిభుః ॥ 119

సత్యవ్రతో మహాత్యాగీ నిత్యః శాంతి పరాయణః ।
పరార్థవృత్తిర్వరదో విరక్తస్తు విశారదః ॥ 120

శుభదః శుభనామా శుభకర్తా శుభః స్వయం ।
అనర్థితో గుణగ్రాహీ - హ్యకర్తా కనక ప్రభః ॥ 121

స్వభావభద్రో మధ్యస్థః శత్రుఘ్నో విఘ్ననాశనః ।
శిఖండీ కవచీ శూలీ జటీ ముండీచ కుండలీ ॥ 122

అమృత్యుః సర్వదృక్ సింహస్తేజోరాశి ర్మహామణిః ।
అసంఖ్యేయోఽ ప్రమేయాత్మా వీర్యవాన్ వీర్యకోవిదః ॥ 123

వేద్యశ్చనై వియోగాత్మా సప్తావరమునీశ్వరః ।
అనుత్తమో దురాధర్షో మధురః ప్రియదర్శనః ॥ 124

సురేశః స్మరణః శర్వః శాబ్దః ప్రతపతాంపరః ।
కాలపక్షః కాలకాలః సుకృతీ కృత వాసుకిః ॥ 125
మహేష్వాసో మహీభర్తా నిష్కళంకో విశృంఖలః ।
ద్యుమణిస్తరణిర్ధన్యః సిద్ధిదః సిద్ధిసాధనః ॥ 126
విశ్వతః సంప్రవృత్తస్తుర్వ్యూఢోరస్కో మహాభుజః ।
సర్వయోని ర్నిరాతంకో నరనారాయణ ప్రియః ॥ 127
నిర్లేపో యతిసంగాత్మా నిర్వ్యంగ్యో వ్యంగ్య నాశనః ।
స్తవః స్తుతిప్రియః స్తోతా వ్యాప్తమూర్తిర్ని రాకులః ॥ 128
నిరవద్యమయోపాయో విద్యారాశిశ్చసత్కృతః ।
ప్రశాంతబుద్ధి రక్షుణ్ణః సంగ్రహో నిత్యసుందరః ॥ 129
వైరాగ్య (యాగ్రు) ధుర్యో ధాత్రీశః సంకల్పః శర్వరీపతిః ।
పరమార్ధ గురుర్ధత్తః సూరిరాశ్రితవత్సలః ॥ 130
సోమోరసజ్ఞో రసదః సర్వసత్వావ లంబనః ।
ఏవం నామ్నాం సహస్రేణ తుష్టావహి హరంహరిః ॥ 131
ప్రార్ధయామాన శంభుంవై పూజయామాస పంకజైః ।
తతఃస కౌతుకీ శంభు శ్చకారచరితం ద్విజాః ॥ 132
మహాద్భుతం సుఖకరం తదేవ శ్రుణుతా దరాత్

ఇది శ్రీ మహావిష్ణుకృత శివసహస్రనామ స్తోత్రం. దీనిని యధాతథంగా పఠించినా, అర్ధయుక్తంగా గాని, అర్ధం తెలుసుకొని గాని పఠించినా - గానం చేసినా పూజలో ఉపయోగించినా -అఖండమైన పుణ్యఫలం లబ్బుతుంది.

ఈశ్వరుడిలా చెప్పాడు. దీనిని వందసార్లు పఠిస్తే రోగాలు తొలగిపోతాయి. విద్య అభివృద్ధి అవుతుంది. ద్రవ్యం సమకూరుతుంది. సత్కామనలన్నీ సఫలమవు తాయి. శివభక్తి పెరుగుతుంది. నారాయణా! నా ఈ వేయి నామాలూ తలబోసే వారు ముందుగా వీటి కర్తవైన నీకు కృతజ్ఞతలు తెలియచేసుకోవాలి. అనంతరమే వీటిని పఠించాలి. అలా చేయకపోతే యివి వారికి ఫలించవు" అని కూడా విష్ణువును అనుగ్రహించాడు.

★★★

శ్రీ:
శివాయగురవే నమః

## శివ పురాణాంతర్గత

# శ్రీ శివ సహస్రనామ స్తోత్ర వివరణము

1. శివః = ఇహపరములు రెండింటా మంగళమును కలిగించువాడు.
2. హరః = సర్వసృష్టిని హరించువాడు.
3. మృడః = సజ్జనులకు సుఖమును కలిగించువాడు.
4. రుద్రః = భయంకరమైన బాధాకర మైన సంసార ధుఃఖ సమూహాన్ని నశింప జేయువాడు.
5. పుష్కరః = ఆకాశమే తన రూపము అయినవాడు.
6. పుష్పలోచనః = పుష్పములవలె కృపా సుగంధమును ప్రసరించు నేత్రములు కలవాడు. సూర్యచంద్రులను పుష్ప వంతు లనియందురు. అట్టి సూర్య చంద్రులే నేత్రములుగ -కలవాడు - దివారాత్రములు రెంటను దయా సుగంధమును ప్రసరించు నేత్రములు కలవాడని భావము.
7. అర్థిగమ్యః =కోరికలు కలవారు అర్థులు అట్టివారికి చేరదగినవాడు-అనగా అందరి కోరికలను తీర్చువాడని భావము.
8. సదాచారః = ఉత్తమమైన, స్థిరమైన, ఆచారము - నడవడిక - కలవాడు.
9. సర్వః =సమస్తము తానే అయిన వాడు.
10. శంభుః = భక్తులకు శుభమును కలి గించువాడు.
11. మహేశ్వరః = తిరోధానకర్త. గొప్ప వారిలో నుత్తముడైన శ్రీ మహావిష్ణువు నకు - అధిపతి.
12. చంద్రాపీడః = చంద్రుని పూల మాల వలె ధరించినవాడు.
13. చంద్రమౌళిః = సిగలో జాబిల్లిని ధరించినవాడు.
14. విశ్వం = చరాచర రూపమైన విశ్వము తానే అయినవాడు.
15. విశ్వంభరేశ్వరః = ఈ విశ్వమును భరించు విష్ణువునకు అధిపతి.
16. వేదాంతసారసందోహః = వేదాంత సారములైన ఉపనిషత్తులు మొదలైన వాని రూపమైనవాడు.
17. కపాలీ = బ్రహ్మ కపాలమును చేత ధరించినవాడు.
18. నీలలోహితః = నలుపు యెరుపు కాంతులు కలవాడు.
19. ధ్యానాధారః = ధ్యానముచేయు వారికి ధ్యేయముగ నాధారమైనవాడు.
20. అపరిచ్ఛేద్యః = దేశకాలాదులచే విభజింపరానివాడు.
21. గౌరీభర్తా = గౌరీదేవికి భర్త.
22. గణేశ్వరః = ప్రమధ గణములకు అధిపతి.
23. అష్టమూర్తిః=శర్వుడు, భవుడు, రుద్రుడు, ఉగ్రుడు, భీముడు, పశు పతి, ఈశానుడు, మహాదేవుడు అను యెనిమిది మూర్తులతో నందరికిని కనిపించువాడు. లేదా నేలా, నింగీ, ఆకాశం అనే అయిదు తత్త్వములు కలవాడు. సూర్యచంద్రులూ,

మరియు ఆత్మ లేక యజమాని, అని యెనిమిది రూపములు కలవాడు.

24. విశ్వమూర్తిః = ఈ ప్రపంచమే తన రూపముగ కలవాడు.

25. త్రివర్గః = ధర్మార్థ కామములను త్రివర్గమని యందురు. వాని స్వరూపుడు - లేదా వానిని భక్తులకు కలిగించువాడు.

26. సర్గసాధనః = సృష్టిని సృష్టించుటకు సాధ్యమైనవాడు.

27. జ్ఞానగమ్యః=జ్ఞానముచే చేరదగినవాడు.

28. దృఢప్రజ్ఞః = స్థితప్రజ్ఞుడు చలింపని తెలివికలవాడు.

29. దేవదేవః = దేవతలకు దేవుడై వరముల నిచ్చువాడు.

30. త్రిలోచనః=మూడు నేత్రములు కలవాడు.

31. వామదేవః = సర్వాంగ సౌందర్యము కల దైవము.

32. మహాదేవః = సర్వోత్కృష్టుడైన దేవుడు.

33. పటుః = సర్వవిధముల సమర్థుడు.

34. పరివృఢః = యాజమాన్యమును నిర్వహించుటయందు సమర్థుడు.

35. దృఢః = స్థిరమైనవాడు, బలవంతుడు వశిష్టుడు.

36. విశ్వరూపః = సమస్తరూపములు కలవాడు.

37. విరూపాక్షః = పరస్పర సంబంధము లేని, విరుద్ధములైన నేత్రములు కలవాడు. సూర్యుడు చంద్రుడు అగ్ని నేత్రములుగ కలవాడు.

38. వాగీశః = వాక్రూపములోన్ను వేద శాస్త్రాదులకు ప్రభువు.

39. సురసత్తమః = దేవతలందరిలో నుత్తముడు.

40. సర్వప్రమాణ సంవాదీ = అనుమానము, ఉపమానము మొదలగు సర్వ ప్రమాణములను నిలుపువాడు.

41. వృషాంకః = వృషభము ధ్వజ చిహ్నముగ కలవాడు.

42. వృషవాహనః = వృషభము లేక ధర్మము వాహనముగ కలవాడు.

43. ఈశః = సమస్తమునకు అధిపతి.

44. పినాకీ = పినాకమను విల్లు కలవాడు.

45. ఖట్వాంగీ = గదలేక - మంచము యొక్కకోడు ఆయుధముగ కలవాడు.

46. చిత్రవేషః = విచిత్రమైన వేషము కలవాడు.

47. చిరంతనః = చిరకాలముండువాడు.

48. తమోహరః = అజ్ఞానము అను చీకటిని పోగొట్టువాడు. తమోగుణమును హరించువాడు.

49. మహాయోగీ = ఉత్తమమైన యోగము కలవాడు. యోగులందరిలోను నుత్తముడు.

50. గోప్తా = హరిబ్రహ్మాదులను రక్షించువాడు.

51. బ్రహ్మాండహృత్ = ప్రళయకాలమున రుద్రరూపముతో - బ్రహ్మాండము లన్నింటిని హరించువాడు.

52. జటీ = జటలుకలవాడు.

53. కాలకాలః = మృత్యువునకు మృత్యువైనవాడు. కాలమును శాసించువాడు.

54. కృత్తివాసాః = గజ/వ్యాఘ్ర చర్మమును ధరించినవాడు.

55. సుభగః = ఆయురారోగ్య ఐశ్వర్య, విద్యాధి కారానుగ్రహ సమస్త సంపన్నుడు. అందమైనవాడు.

56. ప్రణతా(వా) త్మకః = తనకు నమస్కరించినవారికి సర్వమూ తానే అయిన వాడు. లేదా - ప్రణవము - ఓంకారము ఆత్మగ కలవాడు.

57. ఉన్నద్ధః = ఉన్నత శరీరుడు.

58. పురుషః = పురుష స్వభావుడు. సర్వదేహములయందును సూక్ష్మరూపమున నుండువాడు.

59. జుష్యః = మనస్సు మాట శరీరము అను మూడింటిచేతను సేవింపదగినవాడు.

60. దుర్వాసాః = ధరింపరానివైన - దిక్కులే వస్త్రములుగ కలవాడు. దుర్వాసుడను మునిరూపమైనవాడు.

61. పురశాసనః = ప్రాణస్వరూపుడు - మేధారూపుడు. త్రిపురములను గెలిచినవాడు. స్థూల సూక్ష్మ కారణములను మూడు - దేహపురములను శాసించినవాడు.

62. దివ్యాయుధః=దివ్యములైన శక్తిమంతములైన ఆయుధములు కలవాడు.

63. స్కందగురుః = స్కందుడను కుమారస్వామికి గురువు-తండ్రి అయిన వాడు. స్కాంద సిద్ధాంతము ప్రకారము స్కందుడే గురువుగ గలవాడు.

64. పరమేష్ఠీ = మిక్కిలి ఉత్తమమైన చిదాకాశమున నున్నవాడు.

65. పరాత్పరః = పరమనగా శ్రీమహావిష్ణువు - ఆయనకంటె పరమైనవాడు - గొప్పవాడు - అధిపతి.

66. అనాదిమధ్య నిధనః = మొదలు, మధ్య, అంతము లేనివాడు.

67. గిరీశః = కైలాసమును పర్వతమునకు అధిపతి. లేదా అన్ని పర్వతములకు అధిపతి.

68. గిరిజాధవః = పర్వతరాజకుమారి అయిన పార్వతికి భర్త.

69. కుబేరబంధుః = కుబేరునితో బంధుత్వమును - స్నేహమును పాటించువాడు.

70. శ్రీకంఠః = విషముచే నల్లబడిన అందమైన కంఠము కలవాడు.

71. లోకవర్ణోత్తమః = లోకములో అన్ని వర్ణముల కంటె-రంగులకంటె ఉత్తమమైన స్ఫటికవర్ణము కలవాడు. బ్రాహ్మణాది వర్ణములకంటె ఉత్తముడు.

72. మృదుః = మృదు స్వభావము కల వాడు.

73. సమాధివేద్యః = సమాధి, ధర్మచింతన ఏకాగ్రత - వీనిచేతనే తెలియదగినవాడు.

74. కోదండీ = పినాకమను విల్లును పట్టినవాడు.

75. నీలకంఠః = హాలాహల విషమును త్రాగుటవలన నల్లనైన కంఠము కలవాడు.

76. పరశ్వధీ = గండ్రగొడ్డలి ఆయుధముగ గలవాడు పరశ్వమనగా నెల్లుండి అట్టి బుద్ధి కలవాడు. రాబోవు కాలమునకు చెందిన బుద్ధి స్వరూపుడు.

77. విశాలాక్షః = విశాల నేత్రుడు.

78. మృగవ్యాధః = మృగరూపమున నున్న యజ్ఞమును వేటాడినవాడు. రోహిణి

శకటచ్ఛేదనమున మృగమును కిరాతుని వలె వేటాడుచు వెంటనంటిన కిరాతుని రూపుడు.

79. సురేశః = దేవతలకు అధిపతి.

80. సూర్యతాపనః = సూర్యుని కూడ తపింపజేయువాడు. సూర్యునివలె తపింపజేయు కాంతి కలవాడు. శివుని భయముచే సూర్యుని గూడ యెండగాయునట్లు చేయువాడ నియు భావము.

81. ధర్మాధ్యక్షః = ధర్మమునకు అధిపతియై పరిశీలించువాడు.

82. క్షమాక్షేత్రం = మిక్కిలి ఓర్పుగల వాడు. భూమియే తన క్షేత్రముగ కలవాడు.

83. భగవాన్ = సంపూర్ణమైన మాహాత్మ్యము, ధైర్యము, కీర్తి, సంపద, జ్ఞానము, వైరాగ్యము, భగమనబడును. పై గుణములు కలవాడు.

84. భగనేత్రభిత్ = భగుడను సూర్యుని నేత్రములను హరించినవాడు.

85. ఉగ్రః = సంహార సమయమున భయంకరావేశముతో నుండువాడు. విష్ణువు మొదలైనవారికంటె పై నుండువాడు.

86. పశుపతిః = జీవులు అను పశువు లకు పతియైనవాడు.

87. తార్క్ష్యః = సాటిలేని వేగము కల గరుడుని రూపమైనవాడు.

88. ప్రియ భక్తః = భక్తులను ప్రేమించువాడు.

89. పరంతపః = గొప్ప తపస్సు కలవాడు. తపస్స్వరూపుడు.

90. దాతా = వరములను భక్తులకు దానము చేయువాడు.

91. దయాకరః = దయాగుణమునకు నిధి వంటివాడు.

92. దక్షః = అన్నింటికిని సమర్థుడు.

93. కపర్దీ = జటాజూటముకలవాడు.

94. కామశాసనః = మన్మథుని - లేదా - కోరికను నియమించువాడు.

95. స్మశాననిలయః = శ్మశానమునందు ఎత్తు పల్లములగు భూమియందు వుండు వాడు.

96. సూక్ష్మః = సూక్ష్మరూపమున అన్నింట యందు నుండువాడు.

97. శ్మశానస్థః= శ్మశానమునందు యెత్తు పల్లములగు భూమియందు వుండు వాడు.

98. మహేశ్వరః = నిగ్రహానుగ్రహ సమర్థుడు అందరికంటె గొప్పవాడు.

99. లోకకర్తా = లోకములను సృష్టించు వాడు. లోకములో జరుగు పనులకు కర్త.

100. మృగపతిః = సింహమువలె గంభీరుడు. మృగరూపమైన యజ్ఞమునకు పతి.

101. మహాకర్తా = గొప్ప పనులను చేయు వాడు. మహత్ పదార్థమును సృష్టించినవాడు.

102. మహౌషధిః = మూలికా స్వరూపుడు.

103. సోమపః = యజమాని స్వరూప మున సోమరసమును ఆస్వాదించు వాడు.

104. అమృతపః =అమృతరసమును దేవతా రూపమున ఆస్వాదించినవాడు.

105. సౌమ్యః = తొందరపాటు లేనివాడు, మంచివాడు.

106. మహాతేజాః=గొప్ప తేజస్సు కలవాడు.
107. మహాద్యుతిః = గొప్ప తేజస్సు కలవాడు.
108. తేజోమయః = తేజస్సుతో నిండిన వాడు.
109. అమృతమయః = అమృతముతో నిండినవాడు.
110. అన్నమయః = అన్న స్వరూపుడు.
111. సుధాపతిః = అమృతమునకు అధిపతి.
112. ఉత్తమః = అందరికంటె-అన్నింటి కంటె ఉత్తముడు.
113. గోపతిః = గోవులకు-వేదములకు-భూమికి-స్వర్గమునకు-శబ్దములకు-కాంతికి-కిరణములకు అధిపతి.
114. గోప్తా = రక్షకుడు.
115. జ్ఞానగమ్యః = జ్ఞానముచే చేరదగిన వాడు.
116. పురాతనః = అన్నింటి కంటె అందరి కంటె ప్రాచీనుడు.
117. నీతిః = న్యాయ ప్రవర్తకుడు.
118. సునీతిః = వేదాదులననుసరించు న్యాయ స్వరూపుడు.
119. శుద్ధాత్మా = నిర్వికారమగు మనస్సు కలవాడు.
120. సోమః = ఉమతో కలసి యున్న వాడు - చంద్రస్వరూపుడు.
121. సోమతరః=చంద్రునికంటె మరింతగా కళలతో ప్రకాశించుచు సంతోష పరచువాడు.
122. సుఖీ = సుఖవంతుడు - ఆత్మారాముడు.
123. అజాతశత్రుః = శత్రువులు లేని వాడు.
124. ఆలోకసంభావ్యః = కాంతిచేత - అంతర్దృష్టి - వీనితో భావింపదగిన వాడు.
125. హవ్యవాహనః = అగ్నిరూపమున హవిస్సులను పొందువాడు. అట్టి హవిస్సును భరించువాడు.
126. లోకంకరః = జగదావిర్భావకర్త.
127. వేదకరః = వేదములను వెలువరించినవాడు.
128. సూత్రకారః = బ్రహ్మసూత్రములు, ధర్మసూత్రమ్ములు మున్నగు వానిని రచించినవాడు.
129. సనాతనః = ఎప్పటివాడో తెలియని అంత ప్రాచీనుడు. ఎప్పటికిని మారని వాడు.
130. మహర్షిః = ఋషులలో గొప్పవాడు-మహర్షి స్వరపుడు.
131. కపిలాచార్యః = మహర్షియైన కపిలునకు గురువు.
132. విశ్వదీప్తిః = విశ్వమున కాంతి స్వరూపుడుగా నున్నవాడు. అన్ని కాంతులును తానే అయినవాడు.
133. త్రిలోచనః = మూడు నేత్రములు కలవాడు.
134. పినాకపాణిః = పినాకమను విల్లును చేతబట్టినవాడు.
135. భూదేవః = బ్రాహ్మణ స్వరూపుడు.
136. స్వస్తిదః = శుభముల నిచ్చువాడు.
137. సుకృతః = పుణ్య స్వరూపుడు.
138. సుధీః = మంచి బుద్ధి తానే అయిన వాడు. పండితుడు.

139. ధాతృధామా = బ్రహ్మకు స్థానమై - ఆధారమైనవాడు.
140. ధామకరః = నివాసము నిచ్చువాడు. సర్వ శరీర కర్త.
141. సర్వదః = అన్నింటిని యిచ్చువాడు.
142. సర్వ గోచరః = అన్నింటియందును స్పష్టమగువాడు.
143. బ్రహ్మసృక్ = బ్రహ్మలను సృష్టిం చిన వాడు. నవబ్రహ్మలను సృష్టిం చినవాడు.
144. విశ్వసృక్ =సర్వము సృష్టించిన వాడు.
145. సర్గః = తానే సృష్టి అయినవాడు.
146. కర్ణికార ప్రియః = కొండ గోగులపై నిష్టము కలవాడు.
147. కవిః = కల్పనలు చేయు కవి స్వరూపుడు.
148. శాఖః = కొమ్మలు లేదా ఊడలు అంతట వ్యాపించి నట్లుగా అంత టను వ్యాపించి యుండువాడు.
149. విశాఖః = కుమారస్వామి రూపమున నున్నవాడు.
150. గోశాఖః = గోవులయందు వ్యాపించి యున్నవాడు.
151. శివః = శుభ స్వరూపుడు.
152. భిషక్ = వైద్యస్వరూపుడు.
153. అనుత్తమః = తన కన్న ఉత్తము డుగా వేరొకడు లేనివాడు.
154. గంగాప్లవోదకః = గంగాప్రవాహ మును ఉదకముగా ధరించినవాడు.
155. భవ్యః = భవిష్యద్రూపుడు.
156. పుష్కలః=సమృద్ధి-సంపూర్ణత కలవాడు.
157. స్థపతిః = చిత్ర విచిత్రమైన జగ మును సృష్టించిన శిల్పి.
158. స్థిరః= శాశ్వతుడు. చపలత లేనివాడు.
159. విజితాత్మా = జీవాత్మను గెలిచిన పరమాత్మ - తనను తాను మాత్రమే గెలిచినవాడు.
160. విధేయాత్మా= అన్ని ఆత్మలు తనకు వశవర్తులగునట్లుగానున్న పరమాత్మ.
161. భూతవాహన సారథిః = ప్రాణుల సముదాయమునందు వాయువును నడిపించు సారథి.
162. సగణః = ప్రమథ గణములతో కలసి యుండువాడు.
163. గణకాయః = పరివారమే శరీరముగా కలవాడు.
164. సుకీర్తిః = శోభన ప్రదమైన కీర్తి కలవాడు.
165. ఛిన్న సంశయః = సందేహములేని వాడు. సంశయములను నశింప జేయువాడు.
166. కామదేవః = మన్మథుని లేదా కోరి కలను జయించినవాడు వానికి వర ములనిచ్చి యనుగ్రహించు దైవము.
167. కామపాలః = మన్మథుని-నిగ్రహాను గ్రహములచే పాలించినవాడు. ప్రాణుల కోరికలను పాలించువాడు.
168. భస్మోద్ధూళిత విగ్రహః = విభూతిని శరీరమున పూసికొన్నవాడు.
169. భస్మప్రియః = విభూతి యందిష్టము కలవాడు.
170. భస్మశాయీ=విభూతుల యందు శయనించువాడు.
171. కామీ=కోరిక కలవాడు, కామ స్వరూపుడు.
172. కాంతః = మనోహరమైనవాడు.

173. కృతాగమః = ఆగమములను సృష్టించినవాడు.

174. సమావర్తః = విద్యలన్నింటి సంపూర్తియే స్వరూపముగ కలవాడు సుడిగుండమువలె ప్రాణులను సంహరించువాడు.

175. నివృత్తాత్మా = ఆత్మలను మరల్చిన వాడు, ఆత్మను నియమించిన వాడు.

176. ధర్మపుంజః = ధర్మసముదాయము తానే అయినవాడు.

177. సదాశివః = కాలభేదము లేకుండా శుభముల నిచ్చువాడు.

178. అకల్మషః = మాలిన్యము లేనివాడు.

179. పుణ్యాత్మా = పవిత్రకరమైన ఆత్మ కలవాడు.

180. చతుర్బాహుః = నాలుగు భుజ ములు కలవాడు, ధర్మార్థ కామ మోక్షము లనెడి బాహువు కలవాడు.

181. దురాసదః = సమీపించుటకు వీలు కానివాడు.

182. దుర్లభః = సులభుడు కానివాడు.

183. దుర్గమః = పొందరానివాడు.

184. దుర్గః = దుర్గమువలె చేరరానిచోట నున్నవాడు.

185. సర్వాయుధ విశారదః = అన్ని విధములైన ఆయుధములను ప్రయోగించుటలో నేర్పరి.

186. అధ్యాత్మయోగ నిలయః = భూమికలు అన్నియును తొలగగా మిగిలిన ఆత్మయోగమే నివాసముగ గలవాడు.

187. సుతంతుః = చక్కని సూత్రవిధానము కలవాడు.

188. తంతువర్ధనః = సూత్రతను - బంధనమును పెంపొందించువాడు

189. శుభాంగః = శుభప్రదములైన అవయవములు కలవాడు.

190. లోకసారంగః = లోకములను చిత్ర విచిత్ర గతులతో నడిపించెడివాడు.

191. జగదీశః = జగములన్నింటికి ని ప్రభువు.

192. జనార్దనః = ప్రళయ కాలమున జనులను బాధించువాడు, విష్ణువును తన యంశగా సృష్టించినవాడు, సముద్ర గర్భమున దాగియున్న 'జను'లను రాక్షసులను చంపిన వాడు.

193. భస్మశుద్ధికరః= పవిత్రమైన విభూతిని మరింత పవిత్రమైన దానిగ చేయు వాడు, ప్రాణులను వారి బంధనములను భస్మము చేసి పరిశుద్ధులనుగ చేయువాడు.

194. అభీరుః = పిరికితనము లేనివాడు.

195. ఓజస్వీ = శరీరమునకు, హృదయమునకు, ఆత్మకు, బలమునిచ్చువాడు, నిత్యనూతనోత్సాహి.

196. శుద్ధవిగ్రహః = పరిశుద్ధమైన రూపము కలవాడు.

197. అసాధ్యః = సాధింపరానివాడు.

198. సాధు సాధ్యః = సజ్జనులచేత సాధింపదగినవాడు.

199. భృత్యమర్కటరూపధృక్ = ఉత్తమ సేవకుడని చెప్పదగిన హనుమంతుని రూపమును ధరించినవాడు.

200. హిరణ్యరేతాః = సువర్ణమే వీర్యముగా కలవాడు.

201. పౌరాణః = అతి ప్రాచీనుడు, గతము తానే అయినవాడు.

202. రిపుజీవహరః = శత్రువుల ప్రాణములను తీయువాడు.

203. బలీ = సమగ్రమైన బలము కల వాడు.

204. మహాహ్రదః = జలములకు చెరువు స్థానమైనట్లుగా అన్నింటికిని చెరువు వలె తానే స్థానమైన స్వరూపమైన వాడు.

205. మహాగర్తః = అంతులేని లోతుగల పెద్ద అగాధము - గోయి స్వరూపముగా కలవాడు. తెలియరానివాడు.

206. సిద్ధః = అన్నింటిని సిద్ధింపజేసి కొన్నవాడు.

207. బృందారవందితః=దేవతలచే నమస్కరింపబడినవాడు.

208. వ్యాఘ్రచర్మాంబరః=పులిచర్మమును వస్త్రముగా ధరించినవాడు.

209. వ్యాళీ=సర్పములను ధరించు వాడు.

210. మహాభూతః = మహావిష్ణువు తానే అయిన వాడు, (ఏకో విష్ణుః మహద్భూతం)

211. మహానిధిః = సర్వమును యిచ్చెడి వినాశము లేని గనివంటివాడు.

212. అమృతః = అమృతస్వరూపుడు.

213. అమృతపః = అమృతమును త్రాగి వారి స్వరూపమును కూడ తానే అయినవాడు. నాశనము లేనివాడు.

214. శ్రీమాన్ = సర్వైశ్వర్యములు కల వాడు.

215. పాంచజన్యః = శంఖములలో గొప్పదైన - విష్ణువు శంఖమైన - పాంచజన్య స్వరూపుడు.

216. ప్రభంజనః = మహావేగముగల వాయువే స్వరూపముగ గలవాడు, సర్వమును నశింపజేయువాడు.

217. పంచవింశతితత్త్వస్థః = భూమి మొదలుకొని - పరమాత్మ వరకును గల యిరువదియైదు తత్త్వముల యందును వున్నవాడు.

218. పారిజాతః = అందరి, అన్ని కోరికలను తీర్చు - పారిజాత పుష్ప స్వరూపుడు.

219. పరాత్పరః = విష్ణువుకంటె తరువాతి వాడు. గొప్పవాడు.

220. సులభః = భక్తికి సులభముగా లోబడువాడు.

221. సువ్రతః = మంచిని కలిగించు వ్రతములు తానే అయినవాడు. లేదా శుభములను కలిగించుటయే వ్రతముగ కలవాడు.

222. శూరః = శూరుడు.

223. వాఙ్మయైకనిధిః = సమస్త వాఙ్మయమునకు తానొక్కడే నిధి అయిన వాడు.

224. నిధిః = నవనిధులును తానే అయిన వాడు.

225. వర్ణాశ్రమగురుః = నాలుగు కులములకును నాలుగు ఆశ్రమములకును గురువు.

226. వర్ణీ = బ్రహ్మచారిగ భాసించువాడు.

227. శత్రుజిత్ = శత్రువులను గెలిచిన వాడు.

228. శత్రుతాపనః = శత్రువులను తపింపజేయువాడు.

229. ఆశ్రమః = మునుల ఆశ్రమ స్వరూపము తానే అయినవాడు.

230. శ్రమణః = యతి వేషమున నుండు వాడు.
231. క్షామః=కరువు రూపమున నుండువాడు.
232. జ్ఞానవాన్ = జ్ఞానవంతుడు.
233. అచలేశ్వరః = పర్వతముల కధిపతి.
234. ప్రమాణభూతః = ఇది యిట్లు అని చెప్పుటకు ప్రమాణమైనవాడు, మర్యాదాస్వరూపుడు.
235. దుర్జ్ఞేయః = తెలిసికొనుటకు వీలు కానివాడు.
236. సుపర్ణః = మంచి రెక్కలు కలవాడు, గరుత్మంతుని రూపము తానే అయినవాడు.
237. వాయువాహనః = వాయువే వాహనముగ కలవాడు.
238. ధనుర్ధరః = విల్లును ధరించినవాడు.
239. ధనుర్వేదః = వింటికి సంబంధించిన జ్ఞానమే స్వరూపముగా గల వాడు.
240. గుణః = గుణస్వరూపుడు. వింటి నారియు తానే అయినవాడు.
241. శశిగుణాకరః=చంద్రునిలోనున్న శైత్యాది గుణములకు స్థానమైనవాడు.
242. సత్యః = సత్యస్వరూపుడు.
243. సత్యపరః = సత్యముకంటె గొప్పవాడు. సత్యమే గొప్పదని దాని యందాసక్తుడు.
244. అదీనః = దైన్యము లేనివాడు.
245. ధర్మః = ధర్మ స్వరూపుడు.
246. గోధర్మశాసనః = వేదాదులు ప్రతిపాదించెడి ధర్మమును పాలించు వాడు.
247. అనంతదృష్టిః = హద్దులు లేని చూపులు కలవాడు.
248. ఆనందః = ఆనంద స్వరూపుడు.
249. దండః = దండనీతి స్వరూపుడు.
250. దమయితా = శిక్షింపజేయువాడు, అదుపులో నుండునట్లు చేయు వాడు.
251. దమః = విగ్రహ స్వరూపుడు.
252. అభిచార్యః = అభిచార స్వరూపుడు.
253. మహామాయః = మాయకంటె గొప్పదైన మహామాయా స్వరూపుడు.
254. విశ్వకర్మ విశారదః = అన్ని విధములైన పనులయందు నేర్పరి.
255. వీతరాగః = రాగమును, ఇష్టమును విడిచినవాడు.
256. వినీతాత్మా = వినయవంతుల స్వరూపమున నున్నవాడు, ఆత్మనిగ్రహము కలవాడు.
257. తపస్వీ = తపమాచరించు మునుల రూపమున నున్నవాడు, తపము చేయువాడు.
258. భూతభావనః = భూతములను సంభవింప జేయువాడు, ప్రాణుల గతమును భావించువాడు.
259. ఉన్మత్తవేషః = పిచ్చివాని వేషమును ధరించినవాడు.
260. ప్రచ్ఛన్నః = రహస్యముగ - కనిపించకుండా - వున్నవాడు.
261. జితకామః = మన్మథుని జయించిన వాడు, కోరికలను జయించినవాడు.
262. జితేంద్రియః = ఇంద్రియములను జయించినవాడు.
263. కల్యాణ ప్రకృతిః = శుభప్రదమైన స్వభావము కలవాడు.
264. కల్పః = కల్పమనగా కాల విశేషము, ఆలోచనా విశేషము, అట్టి కల్పరూపమున నున్నవాడు.

265. సర్వలోకప్రజాపతిః = అన్ని లోకము లను సృష్టించిన బ్రహ్మస్వరూపుడు.
266. తరస్వీ = అన్నింటిని మించిన వేగము కలవాడు.
267. తారకః = సర్వ సృష్టిని అందరిని తరింపజేయువాడు.
268. ధీమాన్ = బుద్ధి విశేషము కలవాడు, ధీన స్వరూపుడు.
269. ప్రధానః = అన్నింటిలో ప్రధానుడు.
270. ప్రభుః = అన్నింటికిని ప్రభువు.
271. అవ్యయః = నాశనము లేనివాడు.
272. లోకపాలః=లోకములను పాలించు వాడు.
273. అంతరాత్మా = మనస్సు అను గుహ యందుండువాడు, అంతరాత్మ స్వరూపుడు.
274. కల్పాదిః = కల్పము-అను కాల విశేషము కంటె ముందరివాడు.
275. కమలేక్షణః = పద్మములవంటి నేత్రములు కలవాడు.
276. వేదశాస్త్రార్థ తత్త్వజ్ఞః = వేదములు, శాస్త్రములు అర్థము అనువాని తత్త్వము నెరిగినవాడు.
277. నియమీ = నియమము కలవాడు.
278. నియమాశ్రయః = నియమములకు ఆశ్రయమైనవాడు.
279. చంద్రః = చంద్రస్వరూపుడు. సంతోష పరచువాడు.
280. సూర్యః = సూర్య స్వరూపుడు.
281. శనిః = శని స్వరూపుడు
282. కేతుః = కేతు స్వరూపుడు.
283. వరాంగః = శ్రేష్ఠమైన శరీరము, అవయవములు కలవాడు.
284. విద్రుమచ్ఛవిః = శ్రేష్ఠమైన శరీరము, అవయవములు కలవాడు.
285. భక్తివశ్యః = భక్తికి మాత్రమే స్వాధీన మగువాడు.
286. పరంబ్రహ్మ = పరబ్రహ్మ స్వరూపుడు.
287. మృగబాణార్పణః = లేడి రూపమున నున్న యజ్ఞ దేవతపై బాణమును ప్రయోగించినవాడు.
288. అనఘః = పాపము లేనివాడు.
289. అద్రిః = పర్వత స్వరూపుడు.
290. అద్ర్యాలయః = పర్వతములకు స్థానమైనవాడు.
291. కాంతః = ఇష్టమైనవాడు.
292. పరమాత్మా=పరమాత్మ స్వరూపుడు.
293. జగద్గురుః = జగములకు గురువు.
294. సర్వకర్మాలయః = అన్ని రకములైన కర్మలకు స్థానమైనవాడు.
295. తుష్టః = సంతోషించినవాడు, సంతోష స్వరూపుడు.
296. మంగళ్యః = మంగళ స్వరూపుడు.
297. మంగళావృతః = మంగళములతో కూడినవాడు.
298. మహాతపాః = గొప్ప తపస్సు కల వాడు తన స్వరూపుడు.
299. దీర్ఘతపాః = అత్యధిక తపోరూపుడు.
300. స్థవిష్ఠః = పెద్ద అయినవాడు.
301. స్థవిరః = అందరికంటె పెద్దవాడు.
302. ధ్రువః = ధ్రువ స్వరూపుడు, నిశ్చిత మైనవాడు.
303. అహః = పగలు లేక రోజు స్వరూ పము కలవాడు.
304. సంవత్సరః=సంవత్సర స్వరూపుడు.

305. వ్యాప్తిః = వ్యాప్తి స్వరూపుడు.

306. ప్రమాణం = ప్రమాణ స్వరూపుడు.

307. పరమంతపః = సర్వాధికమైన తపస్సే స్వరూపముగ కలవాడు.

308. సంవత్సరకరః = సంవత్సర స్వరూపమును సృష్టించినవాడు.

309. మంత్రః = మంత్ర స్వరూపుడు.

310. ప్రత్యయః = అధీనము, శపథము, జ్ఞానము, విశ్వాసము, హేతువు, అవకాశము. వ్యాకరణ శాస్త్రమున, ప్రాతిపదిక మున్నగువానికి వచ్చునది - అను నర్థములు కలవు. ఇన్ని అర్థములు తానే అయినవాడు.

311. సర్వతాపనః = అన్నింటిని, అందరిని తపింపజేయువాడు.

312. అజః = పుట్టుక లేనివాడు. బ్రహ్మ.

313. సర్వేశ్వరః = అందరికిని, అన్నింటికిని అధిపతి.

314. సిద్ధః = సిద్ధులను దేవజాతి స్వరూపుడు. అనుకొన్నది సిద్ధించినవాడు.

315. మహాతేజాః = గొప్ప తేజస్సు కల వాడు.

316. మహాబలః=గొప్ప బలము కలవాడు. శిక్ష వ్యాకరణం, ఛందస్సు, జ్యోతిష నిరుక్తం కల్పము అను వేదాంగము లాంటి స్వరూపుడు.

317. యోగీ = యోగము కలవాడు. యోగ స్వరూపుడు.

318. యోగ్యః = తగినవాడు.

319. మహారేతాః = మహత్తరమైన వీర్యము కలవాడు.

320. సిద్ధః = ఉడికిన అన్నము తన స్వరూపమైనవాడు.

321. సర్వాదిః = అందరికిని అన్నింటికిని మొదటివాడు.

322. అగ్రహః = నిర్బంధము మున్నగు నవి లేనివాడు.

323. వసుః = వసు స్వరూపుడు - వసు అనగా దేవతలలో నొకజాతి అగ్ని కిరణము రత్నము మున్నగు అర్థములు కలవు. వీని అన్నింటి స్వరూపము తానే అయినవాడు.

324. వసుమనాః = వసువువంటి మనస్సు కలవాడు. వసువే మనస్సుగా కల వాడు.

325. సత్యః=సత్యమనగా ప్రతిజ్ఞ. నిజము. సత్పురుషుని యందు పుట్టినది అని అర్థములు కలవు. అట్టి సత్యమే స్వరూపముగ కలవాడు.

326. సర్వపాపహరః = అందరియొక్క పాపములను, అన్ని పాపములను హరించువాడు.

327. హరః = అన్నింటిని ప్రళయకాలమున హరించువాడు.

328. సుకీర్తిః = మంచిని కలిగించు కీర్తి కలవాడు.

329. శోభనః = శుభ స్వరూపుడు.

330. స్రగ్వీ = పుష్పమాల కలవాడు. శిరమున ధరించు పుష్పమాలను స్రక్ అని అందురు. అట్లు తలపై పుష్పమాల కలవాడు. లేదా అట్టి పుష్పమాలా స్వరూపుడు. పూజార్హుడు.

331. వేదాంగః = వేదములే అవయవము లుగా, శరీరముగా కలవాడు.

332. వేదవిత్ = వేదముల నెరిగినవాడు.

333. మునిః = ముని స్వరూపుడు.
334. భ్రాజిష్ణుః = ప్రకాశించువాడు.
335. భోజనం = ఆహారరూపము తానే అయినవాడు.
336. భోక్తా = భుజించువాడును తానే అయినవాడు.
337. లోకనాథః = లోకములకు అధిపతి - లోకముల కీష్టుడు.
338. దురాధరః (సదః) = అతి కష్టముచే పొందదగినవాడు. సమీపింప శక్యము కానివాడు.
339. అమృతః = అమృతస్వరూపుడు - మరణము లేనివాడు.
340. శాశ్వతః = శాశ్వతుడు.
341. శాంతః = శాంత స్వరూపుడు.
342. బాణహస్తః = బాణమును చేత బట్టినవాడు.
343. ప్రతాపవాన్ = ప్రతాపముకలవాడు.
344. కమండలుధరః = కమండలమును ధరించినవాడు, కమండలమును ధరించు మునులు, ఋషులు తానే అయినవాడు.
345. ధన్వీ = వింటిని చేతబట్టినవాడు.
346. అవాక్మా(ఙ్మా)నస గోచరః = మాటలకు, మనస్సుకు కూడా అందనివాడు.
347. అతీంద్రియః = ఇంద్రియముల నతిక్రమించినవాడు. ఇంద్రియముల వలన కలుగు జ్ఞానమును మించిన శక్తి కలవాడు.
348. మహామాయః = గొప్ప మాయ కలవాడు.
349. సర్వావాసః=అంతటను నివసించు వాడు.
350. చతుష్పథః = నాలుగు మార్గములుగా విడిపోవు, కలియు, కూడలి అయిన వాడు. కలసినట్లును విడి పోయినట్లును వున్నవాడు. భిన్నత్వము సమైక్యము తానే అయినవాడు.
351. కాలయోగీ = మృత్యువుతో, కాలముతో - సంబంధము కలవాడు.
352. మహానాదః = నాదస్వరూపుడు.
353. మహోత్సాహః = గొప్ప ఉత్సాహము గలవాడు.
354. మహాబలః = త్రికాలాబాధితమైన గొప్ప బలము కలవాడు.
355. మహాబుద్ధిః = గొప్ప బుద్ధి కలవాడు. గొప్ప బుద్ధియె తన స్వరూపమైన వాడు.
356. మహావీర్యః=గొప్ప వీర్యము కల వాడు.
357. భూతచారీ = భూతములతో తిరుగువాడు భూతములయందు సంచరించువాడు.
358. పురందరః = ఇంద్ర స్వరూపుడు మూడు పట్టణములను నశింప జేసినవాడు.
359. నిశాచరః = రాత్రులందు తిరుగువాడు, రాక్షస స్వరూపుడు.
360. ప్రేతచారీ = ప్రేతరూపమున, ప్రేతములతో తిరుగువాడు.
361. మహాశక్తిః = గొప్ప శక్తి కలవాడు. లేదా శక్తి స్వరూపుడు.
362. మహాద్యుతిః = గొప్ప కాంతి కలవాడు.
363. అనిర్దేశ్యవపుః = ఇట్టిది అని చెప్పరాని శరీరము కలవాడు.
364. శ్రీమాన్ = సంపద, ఒప్పిదము కలవాడు.

365. సర్వాచార్యః = అందరకును, అన్నింటి యందును ఆచార్యుడు.
366. మనోగతిః = మనస్సుకంటె వేగము కలవాడు.
367. బహుశ్రుతిః = అనేక విషయములు నెరిగినవాడు.
368. మహామాయః = మహత్తరమైన మాయా స్వరూపుడు.
369. నియతాత్మా = నియమింపబడిన జీవాత్మలు కలవాడు, నియమిత మైన ఆత్మ కలవాడు.
370. ధ్రువః = స్థిరమైనవాడు స్థాణు రూపుడు.
371. అధ్రువః = అస్థిరములైన వాని రూపముల యందును వున్నవాడు.
372. తేజః = తేజ స్స్వరూపుడు.
373. తేజోద్యుతిధరః = తేజస్సును కాంతిని ధరించినవాడు.
374. జనకః = అందరిని పుట్టించినవాడు, అందరికిని తండ్రి.
375. సర్వశాసనః = అందరిని శాసించు వాడు.
376. నృత్యప్రియః = నృత్యముపై యిష్టము కలవాడు.
377. నిత్యనృత్యః = నిత్యము నృత్యము చేయువాడు.
378. ప్రకాశాత్మా = ప్రకాశస్వరూపుడు.
379. ప్రకాశకః = ప్రకాశింప జేయువాడు.
380. స్పష్టాక్షరః = ఓంకారవాచ్యుడు, స్పష్టమైనవాడు. అక్షర (నాశములేని) స్వరూపము కలవాడు.
381. బుధః = పండితుడు, బుధగ్రహ స్వరూపుడు.
382. మంత్రః = మంత్ర స్వరూపుడు.
383. సమానః = ఎల్లప్పుడు ఒకే విధముగా నుండువాడు, పట్టుదల కలవాడు.
384. సారసంప్లవః = సంసారమును దాటించువావ.
385. యుగాదికృత్ = యుగములను ప్రారంభము చేయువాడు.
386. యుగావర్తః = యుగముల నడి పించువాడు, యుగములను అక్ర మించి యున్నవాడు.
387. గంభీరః = గంభీర స్వరూపుడు.
388. వృషవాహనః = ధర్మమే వాహన ముగ గలవాడు, ఎద్దు వాహనముగా గలవాడు.
389. ఇష్టః = ఇష్టమైనవాడు - పూజింప బడినవాడు.
390. విశిష్టః = గొప్పవాడు.
391. శిష్టేష్టః = గొప్పవారికిష్టమైనవాడు, గొప్పవారిచే పూజింపబడినవాడు.
392. సులభః = భక్తి విశ్వాసములచే సులభుడు.
393. సారశోధనః = సాక్షిగా నుండి సార మును గమనించువాడు.
394. తీర్థరూపః = పవిత్ర జలస్వరూపుడు.
395. తీర్థనామా = పవిత్ర జలమే తన పేరు కలవాడు.
396. తీర్థదృశ్యః = తీర్థములయందు చూడదగినవాడు.
397. తీర్థదః = పవిత్రజలము నిచ్చువాడు.
398. అపాంనిధిః = నీటికి నిధియైన సముద్ర స్వరూపుడు.
399. అధిష్ఠానం = అన్నింటికిని పై నుండు వాడు.

400. దుర్జయః = జయింపరానివాడు.
401. జయకాలవిత్ = విజయము నందించు కాలము నెరింగినవాడు.
402. ప్రతిష్ఠితః = సుస్థిరునిగ నున్నవాడు.
403. ప్రమాణజ్ఞః = ప్రమాణము నెరిగిన వాడు.
404. హిరణ్యకవచః = బంగారపు కవచము కలవాడు.
405. హరిః = యముడు, వాయువు, ఇంద్రుడు, చంద్రుడు, సూర్యుడు, విష్ణువు, సింహము, కిరణము, అశ్వము, చిలుక, పాము, కోతి, కప్ప, బంగారపు చాయ కలిగినది - ఇవి హరి శబ్దమునకు అర్థములు - వీని స్వరూపమైనవాడు.
406. విమోచకః = బంధములనుండి విడిపించువాడు.
407. సురగణః = దేవతల సముదాయ రూపమున నున్నవాడు.
408. విద్యేశః = విద్యలకు అధిపతి.
409. బిందు సంశ్రయః = ఓంకారము లోని బిందువు నాశ్రయించి యున్న వాడు.
410. వాతరూపః = వాయురూపమున నున్నవాడు.
411. అమలోన్మాయీ = ఆణవమాయిక కార్మికాది మాలిన్యములు లేనివాడు మాయను అతిక్రమించి యున్న వాడు.
412. వికర్తా = ఆశ్చర్యకరములగు వానిని చేయువాడు.
413. గహనః = అర్థము కానివాడు.
414. గుహః = కుమారస్వామి రూపమున నున్నవాడు, పర్వత గుహవలె, లో నున్నవాడు.
415. కరణం = ప్రతిదానికి సాధనమైన వాడు.
416. కారణం = ప్రతిదానికి కారణమైన వాడు.
417. కర్తా = చేయువాడు.
418. సర్వబంధవిమోచనః = అన్ని బంధములను విడిపించువాడు.
419. వ్యవసాయః = ప్రయత్న స్వరూపుడు.
420. వ్యవస్థానః = వర్ణాశ్రమాదుల ధర్మములను నిర్ణయించువాడు.
421. స్థానదః = స్థానము నిచ్చువాడు.
422. జగదాదిజః = జగములకంటె ముందుగా నున్నవాడు.
423. గురుదః = గురువును ప్రసాదించువాడు.
424. లలితః = సుందరమైనవాడు.
425. భేదః = భేద స్వరూపుడు.
426. నవాత్మా = నూతనతయే ఆత్మ కలవాడు, నిత్య నూతనమైన ఆత్మ కలవాడు.
427. ఆత్మని సంస్థితః = జీవుని ఆత్మ యందున్నవాడు.
428. వీరేశ్వరః = వీరులకు అధిపతి.
429. వీరభద్రః = వారులకు భద్రములను శుభములనిచ్చువాడు, వీరులనగా సాధకులు అనియు అర్థమున్నది.
430. వీరాసనవిధిః = వీరాసనవిధి స్వరూపుడు.
431. గురుః = గురు స్వరూపమున నున్నవాడు.

432. వీరచూడామణిః = వీరులకు శిరోమణి వలె మాన్యుడు.

433. వేత్తా = తెలిసినవాడు.

434. చిదానందః= జ్ఞానము వలన కలిగిన అలౌకికానందము కలవాడు.

435. నదీశ్వరః = నదులకు అధిపతి సముద్ర స్వరూపుడు.

436. అజ్ఞాధరః = ఆజ్ఞను ధరించినవాడు, పోషించినవాడు.

437. త్రిశూలీ = త్రిశూలము కలవాడు.

438. శిపివిష్టః = జీవులయందు ప్రవేశించి యున్నవాడు.

439. శివాలయః = శుభములకు స్థానము.

440. వాలఖిల్యః = వాలఖిల్యులు అను మునురూపమును నుండువాడు.

441. మహావీరః = మహావీరుడు, సర్వోత్తమమైన వీరరస స్వరూపుడు.

442. తిగ్మాంశుః = వాడియైన కిరణములు కలవాడు, సూర్య స్వరూపుడు

443. బధిరః = చెవిటివాడు. భక్తుల ప్రార్ధనలను వినుచున్నను విననివానివలె నుండువాడు.

444. ఖగః = ఆకాశ గమన స్వరూపుడు.

445. అభిరామః = మనోహరుడు.

446. సుశరణః = శరణు పొందదగిన వారిలో నుత్తముడు.

447. సుబ్రహ్మణ్యః = పరిశుద్ధజ్ఞాన స్వరూపుడు కుమారస్వామి స్వరూపుడు.

448. సుధాపతిః = అమృతమున కధిపతి.

449. మఘవా = ఇంద్ర స్వరూపుడు. వర్షముల నిచ్చువాడు.

450. కౌశికః =కుశికుని వంశమున పుట్టినవాడు - కౌశికుడు. విశ్వామిత్రుడు. అనగా విశ్వామిత్ర స్వరూపుడు. నిఘంటుస్వరూపుడు. సర్వ జీవుల కర్మలు - వాని అర్ధములు తెలిసినవాడు. కర్మవశులైన - జీవులు అను -పాములను-పట్టి/పోషించువాడు.

451. గోమాన్ - గో - శబ్దమునకు - ఆవు-యెద్దు - కాంతి - కిరణము - సంపద - మున్నగు అర్థములు యెన్నియో కలవు. వివిధ అర్థము లను చెప్పెడి - గో - రూపము కలవాడు.

452. విరామః = సంహారమునుండి సృష్టి వరకును గల తిరోధాన రూప విరామము రూపమున నుండువాడు.

453. సర్వసాధనః = సర్వ కార్యముల సాధనమున సాధనమైనవాడు.

454. లలాటాక్షః = నుదుట కన్ను కల వాడు.

455. విశ్వదేహః = ప్రపంచమే తన దేహముగ కలవాడు.

456. సారః = సార స్వరూపుడు.

457. సంసారచక్రభృత్ = సంసారమను చక్రమును భరించువాడు.

458. అమోఘదండః = వ్యర్థముకాని - దండము - ఆయుధ విశేషము దండన - శిక్షణ - కలవాడు.

459. మధ్యస్థః = పక్షపాతము లేని మధ్య వర్తి.

460. హరిణః= బంగారపు లేడియైనవాడు.

461. బ్రహ్మవర్చసః = వేదజ్ఞాన రూపమైన తేజస్సు రూపముగ కలవాడు.

462. పరమార్థః = పరమ - సర్వోత్తమ - అర్థస్వరూపుడు.

463. పరమాయః = మాయను మించిన మాయా స్వరూపుడు.

464. సంచయః = ధర్మాచరణ వలన వచ్చిన ఫలస్వరూపుడు.

465. వ్యాఘ్రకోమలః = పులివలె మృదువైనవాడు - మెత్తని పులి.

466. రుచిః కాంతి, ఇష్టము మొదలైనవాని స్వరూపమున నున్నవాడు.

467. బహురుచిః = బహు విధరుచి స్వరూపుడు.

468. వైద్యః = వైద్యస్వరూపుడు - వైద్యుడు - శారీరక రోగములు యేర్పడినప్పుడు వైద్యము చేయును పరమేశ్వరుడు-శారీరక -మానసిక - కార్మిక -(కర్మలకు చెందిన) జ్ఞాన సంబంధములైన-అన్ని విధముల వ్యాధులకును - వైద్యము చేయు వాడు.

469. వాచస్పతిః = అనగా బృహస్పతి - దేవగురువు - బుద్ధిశాలి. వాక్కులకు - పరా - పశ్యన్తీ, మధ్యమా, వైఖరీ - రూపములగు చతుర్విధ వాక్కులకు - అధిపతి - వాక్ - శబ్దము - సరస్వతీదేవినిగూడ చెప్పును. ఆ విధముగా - వాచస్పతి - సరస్వతీపతి - బ్రహ్మ. ఇన్ని రూపములు తానే అయినవాడు.

470. అహఃపతిః = అహన్ శబ్దము - పగలు - దినము - అను రెండు అర్థములు కలది. పగటికి పతి-అనగా సూర్యుడు -దినమున కుపతి - ఇదియును సూర్యునే చెప్పును. కాలనిర్ణయమునకు హేతు వైన-తేజోమయుడైన- సూర్యుడు- శివుని రూపమని భావము.

471. రవిః=రవియనగా సూర్యుడు- జీవుడు-రవము -ధ్వని- అట్టి రవము కలవాడు - రవి. వీని స్వరూపము తానే అయినవాడు.

472. విమోచనః = మోక్ష స్వరూపుడు. విడిపించువావాడు.

473. స్కందః = కుమారస్వామి స్వరూపుడు.

474. శాస్తా = ఆజ్ఞాపించువాడు.

475. వైవస్వతః = సూర్యపుత్రుడైన యముని రూపమున నున్నవాడు.

476. యమః = అంతరింద్రియ నిగ్రహ స్వరూపుడు. యమ స్వరూపుడు.

477. యుక్తిః = యుక్తి స్వరూపుడు.

478. ఉన్నతకీర్తిః = అత్యున్నత కీర్తి కలవాడు.

479. సానురాగః = ప్రేమ కలవాడు.

480. పురంజనః = నాగరిక జనస్వరూపుడు.

481. కైలాసాధిపతిః = కైలాస పర్వతమునకధిపతి.

482. కాంతః = ఇష్టుడు

483. సవితా = మేలుకొలుపువాడు, జ్ఞాన ప్రదాత.

484. రవిలోచనః = సూర్యుడు నేత్రముగ కలవాడు.

485. విశ్వోత్తమః = సమస్తమున నుత్త ముడు

486. వీతభయః = భయములేనివాడు.

487. విశ్వభర్తా = సమస్తమును భరించువాడు.

488. అనివారితః = ఎవరిచేతను అడ్డగింపబడనివాడు.

489. నిత్యః = ఎల్లప్పుడు నుండువాడు.

490. నియత కల్యాణః = తప్పనిసరిగా, నియమితముగ శుభములను కలిగించువాడు.

491. పుణ్యశ్రవణకీర్తనః = విన్నను కీర్తించినను, పుణ్యమును కలిగించువాడు.

492. దూరశ్రవాః = ఎంత దూరమున నున్నను భక్తుల ప్రార్థనలను, మిగిలినవారి మాటలను వినగలిగినవాడు.

493. విశ్వసహః = అన్నింటిని సహించువాడు.

494. ధ్యేయః = ధ్యానింపదగినవాడు.

495. దుస్స్వప్ననాశనః = చెడును కలిగించు కలలను, వాని వలన ఫలితములను నశింపజేయువాడు.

496. ఉత్తారణః = భక్తులను తరింపజేయువాడు.

497. దుష్కృతిహా = పాపములను పోగొట్టువాడు.

498. విజ్ఞేయః = ఎరుగదగినవాడు.

499. దుస్సహః = సహింపరాని తేజస్సు కలవాడు.

500. ధవః = అందరికి భర్త.

501. అనాదిః = మొదలు అనునది లేనివాడు.

502. భూర్భువోలక్ష్మీః = భూర్భువర్లోకములకు - ఆత్మ విద్యాప్రభావమున సంపదల నిచ్చువాడు.

503. కిరీటీ = సర్వోత్తమమైన కిరీటము కలవాడు.

504. త్రిదశాధిపః = దేవతలకధిపతి లేదా బాల్య కౌమార యౌవనములను మూడు దశలకును అధిపతి.

505. విశ్వగోప్తా = సర్వమును రక్షించువాడు.

506. విశ్వకర్మా (ర్తా) = విశ్వకర్మ స్వరూపుడు. సర్వమునకు కర్త. అన్ని పనుల స్వరూపము తానే అయిన వాడు.

507. సువీరః = శుభములను కలిగించు వీరుడు.

508. రుచిరాంగదః = ప్రకాశించునట్టి - మనోహరములైన భుజకీర్తులు కలవాడు.

509. జననః = పుట్టుకలు కలిగినవాడు - వంశ స్వరూపుడు.

510. జన్మజన్మాదిః = ఎన్ని జన్మలకైనను ముందటివాడు.

511. ప్రీతిమాన్ = ప్రేమ కలవాడు.

512. నీతిమాన్ = నీతి (పొందించుట) కలవాడు.

513. ధ్రువః = నిశ్చయు- లేక నిత్య స్వరూపుడు.

514. వశిష్ఠః = ఇంద్రియ నిగ్రహము కల వారిలో నుత్తముడు. వశిష్ఠ మహర్షి రూపమున నున్నవాడు.

515. కశ్యపః = కశ్యప మహర్షి అవతారమున నున్నవాడు.

516. భానుః = సూర్యుడు, చంద్రుడు, కిరణములు, ఈ రూపమున నున్న వాడు.

517. భీమః=భయమును కలిగించువాడు.

518. భీమపరాక్రమః = భయంకరమైన పరాక్రమము కలవాడు.

519. ప్రణవః = ఓంకార స్వరూపుడు.

520. సత్పథాచారః = సన్మార్గ ప్రవర్తయే ఆచారముగ గలవాడు.

521. మహాకోశః = అన్న, ప్రాణ, మనో, విజ్ఞాన, ఆనంద మయములను అయిదు కోశములును తానే అయిన

మహాకోశ స్వరూపుడు, కోశమనగా మొగ్గ, కత్తిని ఉండు ఒర, ధన సముదాయము, దివ్యకాల ప్రమాణ భేదము, అను నర్థములు కలవు. వీని స్వరూపము దానే అయినవాడు.

522. మహాధనః = నాశనము, పరిమితి లేని ధనము కలవాడు.

523. జన్మాధిపః = అన్ని జన్మలకును అధిపతి.

524. మహాదేవః = సుస్థిరమైన దివ్య త్వము కలవాడు.

525. సకలాగమపారగః = వేదవేదాంతములన్నియును పూర్తిగా తెలిసిన వాడు, వాని స్వరూపమున నున్న వాడు.

526. తత్త్వం = తత్త్వ స్వరూపుడు.

527. తత్త్వవిత్ = తత్త్వమును తెలిసిన వాడు.

528. ఏకాత్మా = వేదాదులచే నిరూపించబడిన-ఏకత్వము-తానే అయిన వాడు.

529. విభుః = సర్వ సమర్థుడు, సర్వ వ్యాప్తుడు.

530. విష్ణుః = విష్ణు స్వరూపుడు.

531. విభూషణః = అలంకారస్వరూపుడు. అన్నింటిని అందముగా చేయు వాడు.

532. ఋషిః = ఋషి స్వరూపుడు.

533. బ్రాహ్మణః = బ్రాహ్మణ స్వరూపుడు, బ్రహ్మనుసంబంధి.

534. ఐశ్వర్యం = ఐశ్వర్య స్వరూపుడు, అణి మాది స్వరూపుడు.

535. జన్మ మృత్యు జరాతిగః = పుట్టుక, చావు, ముసలితనము వీనిని దాటినవాడు. వీనికి లోబడనివాడు.

536. పంచతత్త్వ సముత్పత్తిః = పృధివి మున్నగు తత్త్వము లైదింటిని సృష్టించినవాడు.

537. విశ్వేశః = విశ్వములకు అధిపతి - సర్వమునకు అధిపతి.

538. విమలోదయః = విశ్వములకు అధిపతి - సర్వమునకు అధిపతి.

539. అనాద్యంతః = మొదలు తుది లేనివాడు.

540. ఆత్మయోనిః = ఆత్మ పదార్థమునకు పుట్టుక కలిగించువాడు.

541. వత్సలః = ప్రాణులయందు వాత్సల్యము కలవాడు.

542. భక్తలోకధృక్ = భక్త సముదాయ మును రక్షించువాడు-పోషించు వాడు.

543. గాయత్రీవల్లభః = గాయత్రీదేవికి భర్త, గాయత్రీదేవికి యిష్టమైనవాడు, గాయత్రిని యిష్టపడువాడు.

544. ప్రాంశుః= అన్నింటికంటె ఉన్నతుడు

545. విశ్వావాసః = ప్రపంచమే తన నివాసముగా గలవాడు, విశ్వమంతట నుండువాడు.

546. ప్రభాకరః = కాంతిని నిరపేక్షముగా కలిగించువాడు.

547. శిశుః = శిశు స్వరూపుడు.

548. గిరిరతః = వాక్కునందు శబ్దము నందు ఆసక్త కలవాడు, పర్వత నివాసమునకు యిష్టపడువాడు.

549. సమ్రాట్ = చక్రవర్తి స్వరూపుడు.

550. సుషేణః = కలివిచెట్టు రూపమున నుండువాడు సుషేణుడను కపి శ్రేష్ఠుని రూపమున నున్నవాడు. మంచి సైన్యము కలవాడు.

551. సురశత్రుహా = దేవతల శత్రువులను చంపువాడు.
552. అనేమిః = పరికరము లేనివాడు.
553. ఇష్టనేమిః = సంకల్పమే పరికరముగా కలవాడు.
554. ముకుందః = ముక్తినిచ్చువాడు.
555. విగతజ్వరః = పాపము లేనివాడు.
556. స్వయంజ్యోతిః = తనకు తానుగా ప్రకాశించువాడు.
557. మహాజ్యోతిః = సర్వోత్తమైన కాంతి తానే అయినవాడు.
558. తనుజ్యోతిః = అతి సూక్ష్మమైన కాంతియు తానే అయినవాడు. శరీరములయందుండు కాంతి - జీవాత్మ స్వరూపుడు.
559. అచంచలః = చాంచల్యము లేనివాడు.
560. పింగళః = పింగళ వర్ణము కలవాడు.
561. కపిలశ్మశ్రుః=కపిలవర్ణములో నుండు మీసములు గడ్డము కలవాడు.
562. ఫాలనేత్రః = నుదుటియందు నేత్రము కలవాడు.
563. త్రయీతనుః = ఋగ్యజుస్సామములను మూడు వేదములే శరీరముగ కలవాడు. వేదపురుష స్వరూపుడు.
564. జ్ఞాన స్కంధః = జ్ఞానమే భుజశిఖరముగ కలవాడు. కొమ్మలు విడిపోవునట్టి వృక్ష భాగమును కూడ స్కంధమందురు. కావున వివిధ రీతులలో విడిపోకముందున్న అఖండజ్ఞాన రూపుడు.
565. మహానీతిః = సుస్థిరమైన సర్వోన్నతమైన నీతి స్వరూపుడు.
566. విశ్వోత్పత్తిః = అన్ని విశ్వముల యుత్పత్తికి కారణమైనవాడు.
567. ఉపప్లవః = లోపముల నుండువాడు.
568. భగః = ఐశ్వర్యము, కోరిక, గొప్పతనము, శక్తి, ప్రయత్నము, సూర్యుడు, కీర్తి - వీని రూపమున నుండువాడు.
569. వివస్వాన్ = వివస్వంతుడను సూర్యరూపుడు.
570. ఆదిత్యః = ఆదిత్యుడను సూర్యుడు.
571. గతపారః = పద్ధతిని దాటియుండువాడు.
572. బృహస్పతిః = దేవగురువైన బృహస్పతి స్వరూపుడు.
573. కళ్యాణగుణనామా = శుభకరములైన గుణములు పేర్లు కలవాడు.
574. పాపహా =పాపమును పోగొట్టు వాడు.
575. పుణ్యదర్శనః = పుణ్యమును కలిగించు దర్శనము కలవాడు.
576. ఉదారకీర్తిః = అత్యున్నతమైన కీర్తి కలవాడు.
577. ఉద్యోగీ = ఉన్నతిని కలిగించు యోగము కలవాడు.
578. సద్యోగీ = సత్పదార్థముతోడి యోగము కలవాడు.
579. సదసత్త్రపః = ఉండియు లేనట్లున్న సిగ్గు కలవాడు.
580. నక్షత్రమాలీ = నక్షత్రములను హారముగ ధరించినవాడు.
581. నాకేశః = దుఃఖము లేని లోకమునకు (స్వర్గమునకు) అధిపతి.
582. స్వాధిష్ఠానః = స్వాధిష్ఠానమను చక్ర స్వరూపుడు.

583. షడాశ్రయః=స్వాధిష్ఠానము మొదలైన ఆరుచక్రములకును ఆశ్రయమైన వాడు.

584. పవిత్రః = పవిత్రతా స్వరూపుడు.

585. పాపనాశః = మనోవాక్కాయ గత ములైన - త్రివిధ పాపములను నశింపజేయువాడు.

586. మణిపూరః =మణిపూర చక్రస్వరూపుడు.

587. నభోగతిః = ఆకాశసంచారి, వాయు స్వరూపుడు.

588. హృత్ పుండరీమాసీనః = మనస్సను తెల్ల తామర పూవు నందాసీనుడై యుండువాడు.

589. శక్రః = ఇంద్ర స్వరూపుడు, దుష్టు లను జయించు శక్తిమంతుడు.

590. శాంతిః = కామక్రోధాదులు లేని శాంతి స్వరూపుడు.

591. వృషాకపిః = ధర్మశీలురను రక్షించు వాడు, ఇంద్రుడు, అగ్ని, విష్ణువు, వీరి రూపమున నున్న శివుడు.

592. ఉష్ణః = ఉష్ణ స్వరూపుడు, అకార్య మును నశింజేయువాడు.

593. గృహపతిః = యజమాని స్వరూపుడు ప్రపంచమను యింటికి యజమాని.

594. కృష్ణః = శ్రీకృష్ణుని స్వరూపమైన వాడు.

595. సమర్థః = సమర్థుడు సమర్థతా స్వరూపుడు.

596. అనర్థనాశనః = ఆపదలను నశింప జేయువాడు.

597. అధర్మశత్రుః = అధర్మమే శత్రువుగ కలవాడు. అధర్మమునకు శత్రువు. దానిని నశింపజేయువాడు.

598. అజ్ఞేయః = ఏ ప్రమాణము చేతను యెరుగరానివాడు.

599. పురుహూతః = ఇంద్ర స్వరూపుడు, అనేకులచే గౌరవింపబడినవాడు.

600. పురుశ్రుతః = గొప్పజ్ఞాని.

601. బ్రహ్మగర్భః = జ్ఞానము గర్భములో నున్నవాడు. బ్రహ్మను (లేక వేదము లను) తనలో నిముడ్చుకొన్నవాడు.

602. బృహద్గర్భః = సమస్తమును తన యుదరములో నిముడ్చు కొన్నవాడు.

603. ధర్మధేనుః = ధర్మ మనపాలనిచ్చు ధేనువు.

604. ధనాగమః = ధనప్రాప్తి స్వరూపుడు.

605. జగద్ధితైషీ = అన్ని జగము హితమును కోరువాడు.

606. సుగతః = శుభమును కలిగించు గమనము కలవాడు.

607. కుమారః = మన్మధుని జయించిన వాడు. కుమారస్వామి స్వరూపుడు.

608. కుశలాగమః = కుశలమును కలి గించు రాకడ కలవాడు.

609. హిరణ్యవర్ణః = బంగారపు రంగులో నున్నవాడు. అతి స్వచ్ఛమైన వర్ణము కలవాడు.

610. జ్యోతిష్మాన్ = కాంతిని కలిగించు సూర్య చంద్రాదుల స్వరూపమైన వాడు.

611. నానాభూతరతః = అనేక భూత ములయందు - ప్రాణులయందు, పృధి వ్యాధుల యందు యిష్టుడు.

612. ధ్వనిః = ధ్వని యనగా శబ్దము అంతరార్థము అని రెండర్థములు కలవు.

613. ఆరోగ్యః =వాక్కు మనస్సు శరీరము - వీని ఆరోగ్యస్వరూపుడు.

614. నమనాధ్యక్షః = వినయవంతులను దయతోచూచి కాపాడువాడు.

615. విశ్వామిత్రః = విశ్వామిత్రమహర్షి స్వరూపుడు.

616. ధనేశ్వరః = సర్వ ధనములకు అధిపతియగు కుబేర స్వరూపుడు.

617. బ్రహ్మజ్యోతిః =జ్ఞానజ్యోతి స్వరూ పుడు.

618. వసుః = అష్టవసువుల రూపమైన వాడు. విలువైనవాడు.

619. ధామా = అన్నింటికిని గృహమైన వాడు.

620. మహాజ్యోతిః = అనుత్తమమైన కాంతి స్వరూపుడు.

621. అనుత్తమః = తనకంటె ఉత్తముడు మరొకడు లేనివాడు. అందరికంటె నుత్తముడు.

622. మాతామహః = సర్వజీవుల తల్లులకు తండ్రి - తల్లికి తండ్రి - తాత.

623. మాతరిశ్వా = వాయుస్వరూపుడు.

624. నభస్వాన్ = ఆకాశమునందున్న వాయు స్వరూపుడు.

625. నాగహారధృక్ = సర్పహారములను ధరించినవాడు.

626. పులస్త్యః = పులస్త్యుడను బ్రహ్మర్షి స్వరూపుడు.

627. పులహః = పులహుడు - అను మహర్షి స్వరూపుడు.

628. అగస్త్యః = అగస్త్య మహాముని స్వరూపుడు.

629. జాతూకర్ణ్యః = జాతుకర్ణి మహర్షి కుమారుని రూపమున నున్నవాడు.

630. పరాశరః = పరాశర మహర్షి స్వరూపుడు.

631. నిరావరణనిర్వారః = ఆవరణము, అడ్డగింపు రెండును లేనివాడు. సర్వాకారుడు.

632. వైరించ్యః = బ్రహ్మ సంతాన రూపమున - సనకసనందనాదుల రూపమున నున్నవాడు.

633. విష్టరశ్రవాః = విష్ణు స్వరూపుడు.

634. ఆత్మభూః = బ్రహ్మస్వరూపుడు. తననుండియే తానుగ పుట్టినవాడు.

635. అనిరుద్ధః = ఎవరినుండియు దేని నుండియు నెట్టి అడ్డగింపు లేనివాడు.

636. అత్రిః = అత్రిమహర్షి స్వరూపుడు, త్రిమూర్తులలో నొకడుగ అనిపించి నను తానొకడే వారికిని ప్రధానుడు.

637. జ్ఞానమూర్తిః = జ్ఞాన స్వరూపుడు.

638. మహాయశాః = త్రికాలాబాధితమైన నిత్యమైన కీర్తి కలవాడు.

639. లోకవీరాగ్రణీః = వీరులందరిలో నుత్తముడు.

640. వీరః = వీరుడు, వీరరస స్వరూపుడు.

641. చంద్రః = చంద్ర స్వరూపుడు - ఆహ్లాదమును కలిగించువాడు.

642. సత్యపరాక్రమః = సత్యమైన పరాక్రమము కలవాడు, సత్యమునందు పరాక్రమము కలవాడు.

643. వ్యాళకల్పః = సర్ప సమానుడు.

644. మహాకల్పః = అనంతమైన కాలము గడపినవాడు, దేవబ్రహ్మాదుల కాలమును మించినవాడు.

645. కల్పవృక్షః = కల్పవృక్ష స్వరూపుడు, కోరిన కోరికలనిచ్చువాడు.

646. కళాధరః = చంద్రకళను ధరించిన వాడు, ఆనందకరములగు 64 కళలను ధరించినవాడు.

647. అలంకరిష్ణుః = అందమైన మనోహరమైన అలంకారములను సృష్టికి చేయువాడు.

648. అచలః = కదలికలేనివాడు, పర్వత స్వరూపుడు.

649. రోచిష్ణుః = ప్రకాశించువాడు.

650. విక్రమోన్నతః = నడకయందు, పరాక్రమమునందును ఉన్నతుడు - గొప్పవాడు.

651. ఆయుః = ఆయుర్దాయ స్వరూపుడు.

652. శబ్దపతిః = వ్యక్త శబ్దములకు, అవ్యక్తములైన ధ్వనులకును అధిపతి.

653. వాగ్మీ = మాటల నేర్పరి.

654. ప్లవనః = దాటించువాడు నౌకా స్వరూపుడు.

655. శిఖిసారథిః = అగ్నియే సారధిగా కలవాడు.

656. అసంస్పృష్టః = మమకారాది వికారములచేత స్పృశింపబడనివాడు.

657. అతిథిః = అతిథి స్వరూపుడు. తిథి లేనివాడు - కాలాతీతుడు.

658. శత్రుః = అధర్మ ప్రవర్తన గల వారికి - ధర్మ ప్రవర్తన కలవారికి పరీక్షించుటకును - శత్రువైనవాడు.

659. ప్రమాధీ = సర్వమును నశింప జేయువాడు.

660. పాదపాసనః = చెట్టు ఆసనముగ గలవాడు, చెట్టువలె నిర్భయముగ నుండువాడు.

661. వసుశ్రవాః = ఉత్తమైన దాని నెచట నున్నను వినగల శక్తి కలవాడు.

662. కవ్యవాహః = పితృదేవతలకిచ్చు కవ్యమును వహించువాడు.

663. ప్రతప్తః = ఉత్తమమైన తపము చేయువాడు, చేసినవాడు.

664. విశ్వభోజనః=సర్వమును భోజ నము చేయువాడు, అన్నింటిని భుజించువాడు. సర్వాహార స్వరూపుడు.

665. జప్యః = జపింపదగినవాడు.

666. జరాదిశమనః = ముసలితనము మొదలగువానిని తగ్గించువాడు.

667. లోహితః=ఎఱ్ఱనివాడు, చందనరూపి.

668. తనూనపాత్ = మాలిన్యమును హరింప జేయు అగ్నిస్వరూపుడు.

669. వృషభాశ్వః = ధర్మరూపమైన వృషభమే వాహనముగా గలవాడు.

670. నభోయోనిః = ఆకాశమునకు మూల కారణము.

671. సుప్రతీపః(కః)=వక్రముగ నుండువాడు -సుప్రతీకమను దిగ్గజ స్వరూపుడు.

672. తమిస్రహా = చీకటిని పోగొట్టువాడు.

673. నిదాఘః = వేసవికాలమే స్వరూపముగ గలవాడు.

674. తపనః = తపింపజేయువాడు, సూర్య స్వరూపుడు.

675. మేఘభక్షః = మేఘములను భక్షించువాడు.

676. పరపురంజయః=పరుల-శత్రువుల పురములను, లేదా-పర- గొప్పవైన-పురములను జయించినవాడు, జయించువాడు.

677. సుఖానిలః = సుఖమును కలిగించు వాయుస్వరూపి ప్రాణవాయు స్వరూపుడు .

678. సునిష్పన్నః = సువ్యక్తుడు ఉత్సాహ శీలి.

679. సురభిః = పరిమళించువాడు. కామ ధేను స్వరూపుడు.

680. శిశిరాత్మకః = శిశిరర్తురూపుడు. చల్లని స్వభావము కలవాడు.

681. వసంతః = వసంతస్వరూపుడు.

682. మాధవః = వైశాఖమాస స్వరూపుడు.

683. గ్రీష్మః = గ్రీష్మర్తు స్వరూపుడు.

684. నభస్యః = శ్రావణ స్వరూపుడు.

685. బీజవాహనః = జీవుల కర్మబీజము లను వహించి తదనుసారముగ వానిని చేర్చువాడు.

686. అంగిరాః = అంగీరసుడను ముని స్వరూపమున నున్నవాడు.

687. గురుః = గురుస్వరూపుడు బృహస్పతి రూపుడు.

688. ఆత్రేయః = అత్రిమహర్షి సంతానము - చంద్రుడు దత్తాత్రేయుడు దుర్వాస మహర్షి. వీరి రూపము తానే అయినవాడు.

689. విమలః = కార్మిక మాయా ఆణవ మలములు లేనివాడు.

690. విశ్వవాహనః = విశ్వమును మోయు వాడు - విశ్వమే వాహనముగ గల వాడు. సర్వాధిష్ఠాత.

691. పావనః = దేనినైనను తన దర్శన శ్రవణ స్పర్శాదులచే పవిత్రముగ చేయువాడు.

692. పురజిత్ = త్రిపురములను గెలిచిన వాడు.

693. శక్రః = ఇంద్రస్వరూపుడు.

694. త్రైవిద్యః = ఋగ్యజుస్సామముల నెరిగినవాడు, అవిద్యా స్వరూపుడు.

695. నవవారణః = నిత్య నూతన నవోత్సాహియైన గజస్వరూపుడు. అరిషడ్వర్గము, ఈషణ త్రయమును అను నీ తొమ్మిదింటిని నివారించు వాడు.

696. మనోబుద్ధిః = మనస్సు బుద్ధి వీని స్వరూపమైనవాడు.

697. అహంకారః=అహంకార స్వరూపుడు.

698. క్షేత్రజ్ఞః=క్షేత్రమనగా శరీరము- పొలము -దానిని బాగుగా తెలిసినవాడు.

699. క్షేత్రపాలకః = శరీరమను క్షేత్రమును పాలించువాడు.

700. జమదగ్నిః = మండుచున్న అగ్ని వంటివాడు, జమదగ్ని మహాముని స్వరూపుడు.

701. జలనిధిః = సముద్రస్వరూపుడు.

702. వికా(గా)లః(హః) = నలుపురంగు లేనివాడు.(విగాహః విశేషముగ లోనికి ప్రవేశించువాడు) ప్రవేశింపరాని వాడు.

703. విష్వ(శ్వ)గాలయః = సమస్తమునకు స్థానమైనవాడు, సర్వ విశ్వమును పొందు సర్వభావములకును స్థానమైనవాడు.

704. అఘోరః = సమాధానము లేనివాడు. అఘోరమను ముఖము కలవాడు.

705. అనుత్తరః = సమాధానము లేని వాడు.తనకంటె గొప్పవాడు లేని వాడు.

706. యజ్ఞః = మనోవాక్కాయములచే చేయబడు మానసిక కాయిక యజ్ఞ స్వరూపుడు.

707. శ్రేష్ఠః = అందరికంటెను అన్నింటి లోను ఉత్తముడు.

708. నిశ్శ్రేయసప్రదః = మోక్షమునిచ్చు వాడు.

709. శైలః = పర్వత స్వరూపుడు.

710. గగనకుందాభః = ఆకాశపు మొల్ల అను పుష్పమువలె నుండువాడు.

711. దానవారిః = దానవులకు శత్రువు. వారిని నశింపజేసినవాడు.

712. అరిందమః= శత్రువుల నణుచువాడు.

713. చాముండః = చాముండయను దేవీ స్వరూపుడు.

714. జనకః = అందరిని అన్నింటిని పుట్టిం చినవాడు.

715. చారుః = సుందరమైనవాడు.

716. నిశ్శల్యః = ఏ బాధలు లేనివాడు. ఎముకలు లేనివాడు. అనగా మంత్ర స్వరూపుడు.

717. లోకశల్యధృక్ = అన్ని లోకముల బాధలను భరించువాడు.

718. చతుర్వేదః = ఋగ్యజు స్సామాథ ర్వణములను నాలుగు వేదముల స్వరూపమైనవాడు.

719. చతుర్భావః = ధర్మార్థ కామ మోక్ష ములను నాలుగు పురుషార్థము లకు భావమైనవాడు.

720. చతురః = సర్వలోకముల నిర్వహణ యందు, సంహారమునందును నేర్పరి.

721. చతురప్రియః = చాతుర్యమును నేర్పరితనమును చూపువారి యందు ప్రేమ కలవాడు.

722. ఆమ్నాయః = వేదముల స్వరూప మైనవాడు.

723. సమామ్నాయః = వేదము-సంప్రదా యము - ఉపదేశము - నిశిత పరిశీలన మున్నగు వాని స్వరూపమైనవాడు.

724. తీర్థదేవః = ఆయా తీర్థముల యందున్న ఆయా దేవతల స్వరూప మైనవాడు.

725. శివాలయః=శివములకు-శుభము లకు ఆలయమైనవాడు. శివాలయ స్వరూపుడు.

726. బహురూపః = స్థావరజంగమాత్మక ములైన అన్నింటి రూపములును తానే అయినవాడు.

727. మహారూపః = త్రికాలా బాధితమైన శాశ్వతమైన ఉత్తమమైన రూపము కలవాడు.

728. సర్వరూపః=సర్వ విధములైన ప్రాణుల, వస్తువుల రూపమున నుండువాడు.

729. చరాచరః = కదలునట్టి, కదలనట్టి సర్వప్రాణుల రూపమున నున్న వాడు కదలియు కదలనివాడు.

730. న్యాయనిర్ణాయకః= జీవుకర్మలను, పుణ్యాపాపములను పరిశీలించి తగిన న్యాయమును నిర్ణయించు తిరుగు లేని సర్వోత్తమ న్యాయాధి కారి.

731. నేయః = భక్తి ధర్మము మొదలగు వానిచే పొందదగినవాడు.

732. న్యాయగమ్యః = న్యాయముచేతనే చేరదగినవాడు.

733. నిరంజనః = ఎవరియందును దేని యందును పక్షపాతము లేనివాడు.

734. సహస్రమూర్ధా=వేయి తలలు కల వాడు.

735. దేవేంద్రః = సర్వ దేవతలలో శ్రేష్ఠుడు దేవేంద్ర స్వరూపుడు.

736. సర్వశాస్త్ర విభాజనః = అన్ని శాస్త్ర ములను విభజించినవాడు.

737. ముండీ = నున్నని గుండుతల కల వాడు. తలలో నేవిధమైన ఆలోచన లేనివాడు. నిష్కాముడు.

738. విరూపః = అన్నింటికిని, అందరికిని విరుద్ధమైన వికారరూపము కలవాడు.

739. వికృతః = వికారము కలుగునట్లు చేయబడినవాడు - చేయువాడు - శరీరము-మనస్సునకు, జ్ఞానము-వా క్కు-మున్నగువానియందు-వికారము కలుగునట్లు చేయువాడు. జీవులన్ను భక్తులను- వికారము కలిగించి - పరీక్షించువాడు.

740. దండీ = దండమును ధరించిన వాడు. సన్యాసి. దండించువాడు - యముడు. ప్రాణహారియైన శివుడు.

741. దానీ = సర్వజీవులకు వారివారి కర్మల ననుసరించి అధిక ఫలముల నిచ్చు దానశీలి.

742. గుణోత్తమః = తనలోని గుణముల చేతనే ఉత్తమత్వమును పొందిన వాడు.

743. పింగళాక్షః = పింగళవర్ణముగల సింహము నేత్రములవంటి నేత్ర ములు కలవాడు.

744. బహ్వక్షః=అనేకములైన కన్నులు కలవాడు.

745. నీలగ్రీవః = హాలాహల విషపానముచే నల్లనైన మెడ కలవాడు.

746. నిరామయః=ఏ బాధయు లేనివాడు.

747. సహస్రబాహుః = వేలకొలది చేతులు కలవాడు. ఒకేసారి యెన్నో పనులను చేయగలవాడు.

748. సర్వేశః = అందరికి అన్నింటికి అధిపతి.

749. శరణ్యః = శరణు కోరదగినవాడు. ఎవరినుండి యైనను యెవరికైనను శరణు - రక్షణ నీయగలిగినవాడు.

750. సర్వలోకదృక్ = అన్ని లోకముల చూపు తన చూపే అయినవాడు. అన్ని లోకములను చూచువాడు.

751. పద్మాసనః = 'పద్మ'మను ఆసన విశేషమున కూర్చున్నవాడు.

752. పరంజ్యోతిః = అన్నింటి కాంతులను మించి ప్రకాశించు సర్వోత్తమ స్థిరము అయిన కాంతి అయిన వాడు.

753. పారంపర్య ఫలప్రదః = ఒకదాని వెంబడి మరొకటిగా వరుసగా జీవు లకు వారి వారి కర్మలను బట్టి శుభా శుభ ఫలములను పుంఖాను పుంఖ ముగ నిచ్చువాడు.

754. పద్మగర్భః = పద్మగర్భములో నున్న బ్రహ్మ. సర్వలోక సముదాయమును పద్మము తన గర్భమున నిముడ్చు కొన్నవాడు.

755. మహాగర్భః = మహత్ - అనగా దొర తనము-బుద్ధితత్వము-గొప్ప-ప్రభావము. ఇట్టివి గర్భమున కలవాడు.

756. విశ్వగర్భః = విశ్వములన్నింటిని తన గర్భములో నిలుపుకొన్నవాడు.

757. విచక్షణః = సృష్టిలోని చరాచరము లన్నింటిని చక్కగ పాలింపగల పండితుడు. వివేకవంతుడు.

758. పరావరజ్ఞః = పెద్ద, చిన్న వీని భేదముల నెరిగినవాడు.

759. వరదః = భక్తులకు కోరిన వరముల నిచ్చువాడు.

760. వరేణ్యః = అందరిలో అన్నింటిలో నుత్తముడు.

761. మహాస్వనః = త్రికాలాబాధితము అత్యున్నతము అయిన నవ్వడి కలవాడు.

762. దేవాసురగురుః= దేవతలకు అసురు లకు గురువైనవాడు. బృహస్పతి, శుక్రాచార్యుల స్వరూప మైన వాడు.

763. దేవః = సర్వదేవ స్వరూపుడు.

764. దేవాసుర నమస్కృతః = దేవతలకు రాక్షసులకు సుస్థిరుడైన మిత్రుడు.

765. దేవాసుర మహామిత్రః= దేవతలకు, రాక్షసులకు గొప్ప ఉత్తముమైన మిత్రుడు- స్నేహితుడు.

766. దేవాసుర మహేశ్వరః=దేవతలకు, రాక్షసులకు గొప్ప అధిపతి.

767. దేవాసురేశ్వరః = దేవతలకు రాక్ష సులకు అధిపతి - దేవాసురులే రఃశ్వరులుగా కలవాడు - భక్త పరా ధీనుడు.

768. దివ్యః = దివ్యత్వము కలవాడు.

769. దేవాసుర మహాశ్రయః = దేవాసురు లకు స్థిరమైన ఆశ్రయము.

770. దేవదేవః = దేవతలుకును వరముల నిచ్చు దేవుడు.

771. అనయః = నీతి తప్పినట్లున్నను నీతిని విడునివాడు.

772. అచింత్యః = దేవత్వము కలవాడు. దేవతలకు ఆత్మ అయినవాడు.

773. దేవతాత్మా = దేవత్వము కలవాడు. దేవతలకు ఆత్మ అయినవాడు.

774. ఆత్మసంభవః = తన నుండియే పుట్టినవాడు.

775. సద్యః = భూమి, ఆకాశము, వీనితో కూడినవాడు.

776. మహాసురవ్యాధః = భయంకరమైన రాక్షసులను వేటాడు కిరాతుడు.

777. దేవసింహః = దేవతలలో శ్రేష్ఠుడు.

778. దివాకరః = పగటిని కల్పించు సూర్యుడు.

779. విబుధాగ్రచరః = దేవతలలో ముందుండువాడు.

780. శ్రేష్ఠః = సర్వశ్రేష్ఠుడు. శ్రేష్ఠ స్వరూపుడు.

781. సర్వదేవోత్తమోత్తమః = దేవత లందరిలోను అత్యున్నతుడు.

782. శివజ్ఞానరతః = శివ (శుభకర) జ్ఞాన మునందు ఆసక్తుడు.

783. శ్రీమాన్ = కాంతి కలవాడు కంఠ మున హాలాహలమను విషము కలవాడు.

784. శిఖీ = అగ్ని స్వరూపమున నుండు వాడు.

785. శ్రీ పర్వతప్రియః = శ్రీశైలము నంది ష్టము కలవాడు.

786. వజ్రహస్తః = ఇంద్రస్వరూపుడు. వజ్రమువలె కర్కశమైన హస్తము కలవాడు.

787. సిద్ధఖడ్గః = తలచినంతనే సిద్ధమగు ఖడ్గము కలవాడు.

788. నరసింహనిపాతనః = నృసింహ రూపమును పడగొట్టినవాడు.

789. బ్రహ్మచారీ = జ్ఞాన సంచారి. జ్ఞానముకొరకు ప్రవర్తించువాడు. బ్రహ్మచారి స్వరూపుడు.

790. లోకచారీ = అన్ని లోకముల యందును సంచరించువాడు.

791. ధర్మచారీ = ధర్మవంతమైన ప్రవర్తనతో నుండువాడు.

792. ధనాధిపః =అన్ని విధములైన ధనము లకు అధిపతి - కుబేర స్వరూపుడు.

793. నందీ = ఆనందము కలవాడు.

794. నందీశ్వరః = నంది శివుని వాహనము దానికి అధిపతి లేదా నందీశ్వరుడు - నంది విద్యా స్వరూపుడు.

795. అనంతః = అంతము లేనివాడు. అనంతుడను సర్పరాజ స్వరూపుడు.

796. నగ్నవృత్తిధరః = దిగంబరముగా నుండుట యను వ్రతము కలవాడు.

797. షుచిః = పరిశుద్ధుడు -అగ్ని స్వరూ పుడు.

798. లింగాధ్యక్షః= లింగములకు పైవాడు.

799. సురాధ్యక్షః=దేవతలకు పైవాడు.

800. యుగాధ్యక్షః = యుగములన పర్యవేక్షించు అధిపతి.

801. యుగావహః = యుగములను కల్పించు - సృష్టించువాడు.

802. స్వధామా = అంతయు తన యిల్లు అయినవాడు.

803. స్వగతః = తనను తానే పొందిన వాడు. సర్వాత్మకుడు.

804. స్వర్గీ = స్వర్గము కలవాడు.

805. స్వరః = స్వరరూపుడు.

806. స్వరమయః = స్వరపూర్ణుడు.

807. స్వనః = సూక్ష్మమైన సవ్వడి రూపమున నుండువాడు.

808. బాణాధ్యక్షః = బాణ ప్రయోగమునకు అధిపతి. బాణుడను రాజునకు భక్తివశ్యుడైన శివుడు కావలి కాయుటయే - బాణుడు అధ్యక్షుడుగ కలవాడు.

809. బీజకర్తా = సృష్టికి మూలమైన బీజమును సృష్టించినవాడు.

810. కర్మకృత్ = కర్మలను సృష్టించువాడు తెగకొట్టువాడు.

811. ధర్మసంభవః = ధర్మమును సంభవింపజేసినవాడు. ధర్మమునందు పుట్టువాడు.

812. దంభః = ఆడంబర స్వరూపుడు. లేని ఆచారమును నటించువాడు.

813. అలోభః = లోభము లేనివాడు.

814. శంభుః = శుభమును కలిగించు వాడు.

815. సర్వభూత మహేశ్వరః=అన్ని భూతములకును అధిపతియైనవాడు

816. శ్మశాననిలయః = మూడు కన్నులు కలవాడు.

817. త్ర్యక్ష్యః=మూడు కన్నులు కల వాడు.

818. సేతుః = ఇహపరముల రెండింటి కిని వంతెన వంటివాడు.

819. అప్రతిమాకృతిః = సాటిలేని ఆకారము కలవాడు.
820. లోకోత్తరస్ఫుటః = అన్ని లోకముల కంటె పైవాడుగ స్పష్టమగువాడు.
821. లోకః-జగములు-జననము-స్వర్గము మున్నగు లోకములు, సమూహము, చూపు, సప్తసంఖ్య - కాంతి మున్నగు వాని స్వరూపమైన వాడు.
822. త్ర్యంబకః = మూడు నేత్రములు కలవాడు.
823. నాగభూషణః = సర్పములను అలంకారముగ ధరించినవాడు.
824. అంధకారిః = అంధకుడను రాక్షసుని చంపినవాడు.
825. మయద్వేషీ = మయుడను రాక్షసుని చంపినవాడు.
826. విష్ణుకంధరపాతనః విష్ణువు శిరస్సుని నరికినవాడు.
827. హీనదోషః = దోషములు లేనివాడు.
828. అక్షయగుణః = సుస్థిరములైన అంతులేని గుణములు కలవాడు.
829. దక్షారిః = దక్షునకు శత్రువై శిక్షించిన వాడు.
830. పూషదంతభిత్=పూషుడను సూర్యుని దంతముల నూడగొట్టిన వాడు.
831. పూర్ణః = అన్నింటిచేతను నిండినవాడు.
832. పూరయితా = శూన్యమగు దానిని తన శక్తిచే నింపువాడు.
833. పుణ్యః = పుణ్యస్వరూపుడు.
834. సుకుమారః = మృదువైనవాడు.
835. సులోచనః = మంచి కన్నులు కల వాడు.
836. సన్మార్గపః = మంచి ప్రవర్తనము కలవారి జీవన మార్గమును రక్షించు వాడు.
837. ప్రియః=అందరికి యిష్టుడైనవాడు
838. ధూర్తః = దుడుకుతనము కలవాడు.
839. పుణ్యకీర్తిః = పుణ్యమును కలిగించు కీర్తి కలవాడు.
840. అనామయః = యెట్టి బాధలు లేని వాడు.
841. మనోజవః = మనస్సుకంటె వేగము రూపమైనవాడు.
842. తీర్థకరః = పుణ్యతీర్థములను పుట్టించినవాడు.
843. జటిలః = జటలు కలవాడు. ఎవరికిని అర్థముకానివాడు.
844. నియమేశ్వరః = అన్ని నియమముల కును అధిపతి.
845. జీవితాంతకరః = జీవితముల ముగింపును చేయువాడు.
846. నిత్యః = నిత్యస్వరూపుడు.
847. వసురేతాః = బంగారము వీర్యముగా కలవాడు.
848. వసుప్రదః = విలువైనదానిని, బంగారము నిచ్చువాడు.
849. సద్గతిః = సన్మార్గ స్వరూపుడు.
850. సిద్ధిదః = సిద్ధుల నిచ్చువాడు.
851. సిద్ధః = సిద్ధి స్వరూపుడు.
852. సజ్జాతిః = ఉత్తమజాతి స్వరూపుడు.
853. ఖలకంటకః = దుర్మార్గులను పీడించువాడు.
854. కళాధరః = చంద్రకళను లేదా 64 కళలను ధరించినవాడు.

855. మహాకాలః = మహామృత్యు స్వరూపుడు. కాలాతీతుడు. త్రికాలాబాధిత కాలరూపి.

856. భూతః = పంచభూత స్వరూపుడు.

857. సత్యపరాయణః = సత్యమే ప్రధానముగ కలవాడు.

858. లోకలావణ్యకర్తా = అన్ని లోకములకును సౌందర్యమును సృష్టించిన వాడు.

859. లోకోత్తర సుఖాలయః = ఏ లోకములోను లభ్యముకాని సుఖమునకు స్థానమైనవాడు.

860. చంద్రసంజీవనః = శాపవశమున కృశించిన చంద్రుని బ్రతికించిన వాడు. చంద్రునివలె ప్రాణులన్నింటిని ఉజ్జీవింప జేయువాడు.

861. శాస్తా = సర్వ చరాచరములను అజ్ఞాపించువాడు.

862. లోకగ్రాహః = అన్ని లోకములను పట్టుకొని నిలిపియుంచువాడు.

863. మహాధిపః = సర్వోత్తముడైన ప్రభువు.

864. లోకబంధుః = అన్ని లోకములకు బంధువు. లోకములన్నియు బంధువులుగ కలవాడు. లోకములచే ప్రేమింపబడువాడు. లోకములను ప్రేమించువాడు.

865. లోకనాథః = లోకములకు అధిపతి. ఇష్టుడు.

866. కృతజ్ఞః = ప్రతిప్రాణియు చేసిన సర్వ కార్యములును తెలిసినవాడు.

867. కృత్తిభూషితః = చర్మముచే నలంకరింపబడినవాడు. చర్మమును వస్త్రముగ ధరించినవాడు.

868. అనపాయః = తొలగిపోనివాడు. అపాయములు లేనివాడు.

869. అక్షరః = నాశనము లేనివాడు.

870. కాంతః = సర్వమనోహరుడు.

871. సర్వశస్త్రభృతాంవరః = అన్ని ఆయుధముల ప్రయోగములందును శ్రేష్ఠుడు. వీరులందరిలో నుత్తముడు. అన్ని ఆయుధముల ప్రయోగమునందు సాటిలేనివాడు.

872. అనపాయః= విడువని వాడు అపాయములు లేనివాడు.

873. అక్షరః= అక్షర స్వరూపుడు,

874. ఇష్టమైనవాడు

875. సర్వశాస్త్రభృతాయరః= శాస్త్రజ్ఞులు అందరిలో గొప్పవాడు.

872. తేజోమయః = తేజస్స్వరూపుడు.

867. ద్యుతిధరః=కాంతిని ధరించిన వాడు.

868. లోకమానీ = లోకములను గౌరవించువాడు. లోకములను -వాని వాని కర్మలను బట్టి పుణ్యాపాపముల మానమును నిర్ణయించువాడు. లోకముల విషయమున పట్టుదల అభిమానము కలవాడు. లోకములు తానే యని తలచువాడు.

869. ఘృణార్ణవః = కరుణాసముద్రుడు.

870. శుచిస్మితః = పరిశుద్ధమైన - యే వికారము లేని నవ్వు కలవాడు.

871. ప్రసన్నాత్మా = దయాపూర్ణమైన ఆత్మ స్వభావము కలవాడు. ప్రసాద గుణవంతమైన ఆత్మ కలవాడు.

872. అజేయః = యెవరిచేతను, యెప్పుడును, దేనిచేతను జయింపరాని వాడు.

873. దురతిక్రమః = అతిక్రమింపరాని వాడు.
874. జ్యోతిర్మయః = కాంతిస్వరూపుడు.
875. జగన్నాథః = జగములకు అధిపతి - జగములకిష్టుడు. జగములయందిష్టము కలవాడు.
876. నిరాకారః = కరచరణాదికముగు ఆకారము లేనివాడు.
877. జలేశ్వరః = జలములకు అధిపతి. సముద్రరూపుడు.
878. తుంబవీణః = అడవి సొరకాయతో చేసిన వీణ కలవాడు.
879. మహాకాయః = పెద్ద శరీరము కల వాడు.
880. విశోకః = శోకములేనివాడు.
881. శోకనాశనః = దుఃఖమును నశింప జేయువాడు.
882. త్రిలోకపః = ముల్లోకములను రక్షించువాడు.
883. త్రిలోకేశః = మూడు లోకములను రక్షించువాడు.
884. సర్వశుద్ధిః = అన్నింటిని శుద్ధి చేయువాడు.
885. అధోక్షజః = ఇంద్రియములను గెలిచినవాడు.
886. అవ్యక్త లక్షణః = స్పష్టముకాని లక్షణములు కలవాడు. లక్షణమెట్టిదో తెలియరానివాడు.
887. దేవః = దేవస్వరూపుడు.
888. వ్యక్తావ్యక్తః = వ్యక్తము అగుచు వ్యక్తము కానివాడు. అనగా కనిపించియు కనిపించనివాడు.
889. విశాంపతిః = ప్రజలకు అధిపతి.
890. పరః = అన్నింటికంటె అందరికంటె గొప్పవాడు.
891. శివః = శుభ స్వరూపుడు.
892. పరగుణః = సర్వోత్తములైన గుణములు కలవాడు.
893. వసుః = అష్టవసు స్వరూపుడు. బంగారము, ధనము, కిరణము రత్నము అగ్ని తీపి మున్నగు వాని స్వరూపుడు.
894. నాసాసారః ధ్వని సముదాయ స్వరూపుడు. ముక్కుయొక్క గుణము వాసన చూచుట స్వరూపమైనవాడు.
895. మానధరః = అభిమానము - పట్టుదల కలవాడు.
896. యమః = యమస్వరూపుడు.
897. బ్రహ్మ = బ్రహ్మ స్వరూపుడు.
898. విష్ణుః = విష్ణు స్వరూపుడు.
899. ప్రజాపాలః = ప్రజలను పాలించువాడు.
900. హంసః = హంస స్వరూపుడు. జీవబ్రహ్మైక్యత-స్వరూపము కలవాడు.
901. హంసగతిః = హంసగమన స్వరూపుడు.
902. వయః = వయస్సుయొక్క స్వరూపమైనవాడు.
903. వేధాః = బ్రహ్మ స్వరూపుడు.
904. విధాతా=విధానమును నిర్ణయించువాడు.
905. ధాతా = పోషించువాడు.
906. స్రష్టా = సృష్టించువాడు.

907. హర్తా = అన్నింటిని సంహరించువాడు. ఆ విధముగా హరించువాడు.
908. చతుర్ముఖః=నాలుగు ముఖములు కలవాడు. బ్రహ్మ స్వరూపుడు.
909. కైలాసశిఖరావాసీ = కైలాస పర్వతమున నివసించువాడు.
910. సర్వావాసీ = అన్నింటి యందును నివసించువాడు.
911. సదాగతిః = నిత్య సంచారము గల వాయుస్వరూపుడు.
912. హిరణ్యగర్భః = బంగారము గర్భమున కలవాడు. బ్రహ్మస్వరూపుడు.
913. ద్రుహిణః = పరబ్రహ్మ స్వరూపుడు.
914. భూతపాలః = పృథివ్యాది భూతములను పాలించువాడు.
915. భూపతిః = భూమిని పాలించువాడు. రాజస్వరూపుడు.
916. సద్యోగీ = ఉత్తముడైన యోగి. సత్పదార్థములో యోగము కలవాడు.
917. యోగవిత్ = యోగస్వరపము నెరిగినవాడు.
918. యోగీ = యోగము కలవాడు.
919. వరదః = వరముల నిచ్చువాడు.
920. బ్రాహ్మణప్రియః = బ్రాహ్మణుల కిష్టమైనవాడు. బ్రాహ్మణులయందు ప్రేమ కలవాడు.
921. దేవప్రియః = దేవతలకిష్టుడు. దేవతలయందిష్టము కలవాడు.
922. దేవనాథః = దేవతలకు అధిపతి.
923. దేవజ్ఞః = దేవతల నెరిగినవాడు.
924. దేవచింతకః = దేవతలను గూర్చి ఆలోచించువాడు.
925. విషమాక్షః = బేసిసంఖ్య కన్నులు కలవాడు.
926. విశాలాక్షః = విశాలములైన కన్నులు గలవాడు.
927. వృషదః = ధర్మసంపదల నిచ్చువాడు.
928. వృషవర్ధనః = ధర్మమును పెంపొందించువాడు.
929. నిర్మమః = మమకారములేనివాడు.
930. నిరహంకారః = అహంకారము లేనివాడు.
931. నిర్మోహః = మోహములేనివాడు.
932. నిరుపద్రవః = ఎట్టి ఆపదలు లేనివాడు.
933. దర్పహా = గర్వమును పోగొట్టువాడు
934. దర్పదః = గర్వము నిచ్చువాడు.
934. అదృప్తః = గర్వించనివాడు.
935. సర్వార్థపరివర్తకః = అన్నింటిని, అందరియొక్క పురుషార్థములను ప్రయోజనములను, మార్చువాడు.
936. సహస్రార్చిః = వేలకొలది కిరణములు కలవాడు.
937. భూతిభూషః = విభూతియే అలంకారముగ కలవాడు.
938. స్నిగ్ధాకృతిః = స్నేహయుక్తమైన ఆకారము కలవాడు.
939. అదక్షిణః = దాక్షిణ్యము లేనివలె నుండును.
940. భూతభవ్యభవన్నాథః = భూతభవిష్యద్వర్తమానములకు అధిపతి.
941. విభవః = అన్నింటికిని మూలకారణమైనవాడు. నిత్యుడు వైభవము కలవాడు.

942. భూతినాశనః = పుట్టుకను నశింపజేయువాడు.

943. అర్థః = ప్రయోజనము, పురుషార్థ ములు మొదలైనవాని స్వరూపుడు.

944. అనర్థః = అధర్మవర్తనులకు - ఆపదల - రూపమున నున్నవాడు.

945. మహాకోశః = అన్నమయాది పంచ కోశములకు అతీతుడు.

946. పరకార్యైక పండితః = ఇతరుల - పరుల కార్యములను చేయుటలో విద్వాంసుడు.

947. నిష్కంటకః=ఎట్టి యిబ్బందులును లేనివాడు.

948. కృతానందః = ఆనందమును సృష్టించువాడు.

949. నిర్వ్యాజ్యః = సమాధానము చెప్పరానివాడు. మాటలు లేనివాడు - మౌని.

950. వ్యాజమర్దనః = మోసమును నశింపజేయువాడు, పాపకర్మలను చేయుటయను నెపమున ప్రాణు లను బాధించువాడు.

951. సత్త్వవాన్ = బలవంతుడు, సత్త్వ గుణము కలవాడు.

952. సాత్త్వికః = సాత్త్వికమైనవాడు.

953. సత్యః = సత్యస్వరూపుడు.

954. కృతస్నేహః = స్నేహముగ నుండువాడు. చేసిన కర్మనుబట్టి స్నేహమును చూపువాడు.

955. కృతాగమః = ఆగమములను నిర్మించినవాడు.

956. అకంపితః = భయపడనివాడు.

957. గుణగ్రాహీ = జీవుల గుణములను గ్రహించువాడు.

958. నైకాత్మా = బహు విధములైన ప్రాణులస్వరూపమున నుండువాడు.

959. నైకకర్మకృత్=అనేక కర్మలనేక కాలమున బహురూపముల చేయువాడు.

960. సుప్రీతః = మంచిచే సంతోషపడినవాడు.

962. సుఖదః = సుఖములనిచ్చువాడు.

963. ముఖ్యః = ముఖ్యమైనవాడు.

964. సూక్ష్మః = సూక్ష్మస్వరూపుడు.

965. సుకరః = సులభమైనవాడు.

966. దక్షిణానిలః = మలయవాయు స్వరూపుడు. సమ భావముల కల వాయు స్వరూపుడు.

967. నందీ = ఆనందము కలవాడు.

968. స్కందః=కుమారస్వామి స్వరూపుడు.

969. ధరః = ధరించువాడు.

970. ధుర్యః = బరువును మోయువాడు.

971. ప్రకటః = స్పష్టమైనవాడు.

972. ప్రీతివర్ధనః = ప్రేమను పెంచువాడు.

973. అపరాజితః = ఓడింపబడనివాడు.

974. సర్వసహః=అన్నింటిని సహించు వాడు.

975. గోవిందః = వాక్కులచే వేదములచే తెలియువాడు.

976. సత్త్వవాహనః = సత్త్వగుణమే వాహనముగ గలవాడు.

978. అధృతః = ఎవరిచేతను ధరింపబడనివాడు.

979. స్వధృతః = తనచేతనే-తాను ధరింపబడిన వాడు. తనను తానే మోయువాడు.

980. సిద్ధః = సిద్ధ స్వరూపుడు.

981. పూతమూర్తిః=పవిత్రమైన రూపము కలవాడు.

982. యశోధనః = కీర్తియే ధనముగ కలవాడు. (భక్త రక్షకుడను కీర్తి).

983. వారాహశృంగధృక్ = వరాహ రూపమునయున్న విష్ణువు కోరలను పట్టి నిలిపినవాడు.

984. శృంగీ = శృంగములు - కొమ్ములు కలవాడు. నందీశ్వర స్వరూపుడు.

985. బలవాన్ = బలవంతుడు.

986. ఏకనాయకః = నాయకుడుగ తానొక్కడే వున్నవాడు.

987. శ్రుతిప్రకాశః = వేదములచే ప్రకాశించువాడు.

988. శ్రుతిమాన్ = వేదస్వరూపుడు.

989. ఏకబంధుః = తనకు తానే బంధువు లేదా ధర్మాచారు డొక్కడే బంధువుగ గలవాడు.

990. అనేకధృక్ = అనేకములైన నేత్రములు కలవాడు.

991. శ్రీవత్సలః = లక్ష్మీదేవి యందు వాత్సల్యము కలవాడు. శ్రీని కలిగించు వాత్సల్యము కలవాడు.

992. శివారంభః = శుభప్రదమైన ఆరంభములు కలవాడు.

993. శాంతభద్రః = శాంతులైన వారికి భద్రములు నిచ్చువాడు.

994. సమః = అందరియందును సమముగా నుండువాడు.

995. యశః = కీర్తి స్వరూపుడు.

996. భూశయః = భూమియందు పరుండు యోగి వ్రత స్వరూపుడు.

997. భూషణః = అలంకార స్వరూపుడు

998. భూతిః = ఐశ్వర్య స్వరూపుడు.

999. భూతికృత్ - సంపదను కలిగించువాడు - సంపద, బూడిద - ఉనికి - పుట్టుక, క్షేమము. అలౌకికశక్తి - వీనిని కలిగించువాడు.

1000. భూతభావనః = భూతములను పుట్టించినవాడు.

1001. అకంపః = కంపము లేనివాడు.

1002. భక్తికాయః = భక్తియే శరీరముగ కలవాడు.

1003. కాలహానిః = మృత్యువునకు హాని కలిగించువాడు.

1004. కళావిభుః = చంద్రకళకు అధికారి చంద్రకళాధరుడు. 64 కళల స్వరూపుడు.

1005. సత్యవ్రతః = సత్యమును పలుకుట యను వ్రతము కలవాడు.

1006. మహాత్యాగీ = ఉత్తమమైన, సుస్థిరమైన త్యాగము కలవాడు.

1007. నిత్యః = నిత్యుడు.

1008. శాంతిపరాయణః = శాంతియే పరముగ కలవాడు.

1009. పరార్థవృత్తిః = పరులప్రయోజనములను సాధించుటయే ప్రవృత్తిగ గలవాడు.

1010. వరదః = వరముల నిచ్చువాడు.

1011. విరక్తః = విరక్త స్వరూపుడు.

1012. విశారదః = పండితుడు నేర్పరి.

1013. శుభదః = శుభముల నిచ్చువాడు.

1014. శుభనామా = శుభముల నిచ్చు పేరు కలవాడు.

1015. శుభకర్తా = శుభములను చేయువాడు.

1016. శుభఃస్వయం = తానే శుభము అయిన వాడు కోరబడనివాడు.
1017. అనర్థితః = భక్తులచే అడుగబడక పోయినను - వారిని రక్షించువాడు.
1018. గుణగ్రాహీ = గుణములను తెలిసి కొనువాడు.
1019. అకర్తా = దేనికి కర్త కానివాడు.
1020. కనకప్రభః = బంగారపు కాంతి కలవాడు.
1021. స్వభావభద్రః = స్వభావములచేతనే శుభముల నిచ్చువాడు.
1022. మధ్యస్థః = జీవులకు - వారి కర్మలకు - మధ్యనున్నవాడు. ఇహ పరములకు మధ్యస్థుడు.
1023. శత్రుఘ్నః = శత్రువులను చంపువాడు.
1024. విఘ్ననాశనః = విఘ్నములను పోగొట్టువాడు.
1025. శిఖండీ = అగ్ని స్వరూపుడు.
1026. కవచీ = కవచము కలవాడు.
1027. శూలీ = శూలము కలవాడు.
1028. జటీ = జడలు కలవాడు.
1029. ముండీ = జుట్టులేకుండ గుండు చేయించుకొన్నవాడు. ఎట్టి భావ ములు లేనివాడు.
1030. కుండలీ = కుండలములను ధరించినవాడు. సర్ప స్వరూపుడు.
1031. అమృత్యుః = మృత్యువు లేనివాడు.
1032. సర్వదృక్ = లోపల వెలుపల క్రింద, పైన - అన్ని వైపులను చూచువాడు.
1033. సింహః = సింహస్వరూపుడు.
1034. తేజోరాశిః = కాంతి పుంజముల ప్రోగు.
1035. మహామణిః = త్రికాలాబాధితమైన సర్వాతిశాయియగు సర్వోత్తమ మణి స్వరూపి.
1036. అసంఖ్యేయః = లెక్కింపవీలుకాని వాడు.
1037. అప్రమేయాత్మా = ఇంత-యిట్టిదని చెప్పరాని ఆత్మ కలవాడు.
1038. వీర్యవాన్ = వీర్యవంతుడు - పరా క్రమశాలి.
1039. వీర్యకోవిదః = పరాక్రమము నెరిగిన వాడు. మహావీరుడు.
1040. వైద్యః = తెలియదగినవాడు.
1041. వియోగాత్మా = వియోగ స్వరూ పుడు.
1042. సప్తావరమునీశ్వరః = సప్తర్షులకు మిగిలిన మునులకు యీశ్వరుడు. సప్తర్షులు మునులు వీరి రూపమున నున్నవాడు.
1043. అనుత్తమః = తనకంటె ఉత్తముడు లేనివాడు. సర్వోత్తముడు.
1044. దురాధర్షః = సమీపింపరానివాడు.
1045. మధురః = మధురమైనవాడు.
1046. ప్రియదర్శనః = ప్రియమైన దర్శ నము కలవాడు.
1047. సురేశః = దేవతలకు అధిపతి.
1048. స్మరణః = స్మరణ స్వరూపుడు.
1049. శర్వః = అన్నింటిని నశింపజేయు వాడు.
1050. శాబ్దః = శబ్ద స్వరూపుడు.
1051. ప్రతపతాంవరః = ప్రతాపము కల వారిలో నుత్తముడు. ప్రకాశించు వానిలో నుత్తముడు.

1052. కాలపక్షః = కాలము భాగముగ గల వాడు.
1053. కాలకాలః = మృత్యువునకు మృత్యువు.
1054. సుకృతీకృతవాసుకిః = వాసుకి యను మహాసర్పమును అలంకార ముగ చేసికొన్నవాడు.
1055. మహేష్వాసః = గొప్ప విలుకాడు.
1056. మహీభర్తా = భూమిని భరించు వాడు. రాజస్వరూపుడు.
1057. నిష్కలంకః = కళంకములేనివాడు.
1058. విశృంఖలః = సంకెళ్ళు - బంధనము లేనివాడు. స్వేచ్ఛావర్తనుడు.
1059. ద్యుమణిః = ఆకాశమున ప్రకా శించు సూర్య స్వరూపుడు.
1060. తరణిః = సూర్యస్వరూపుడు.
1061. ధన్యః = అనుకొన్నవానిని చేసిన వాడు. విలువైనవాడు.
1062. సిద్ధిదః = సర్వసిద్ధులనిచ్చువాడు.
1063. సిద్ధిసాధనః = కార్యసిద్ధికి సాధన మైనవాడు.
1064. విశ్వతః సంప్రవృత్తః = సర్వతో ముఖ ముగ ప్రవర్తించువాడు.
1065. వ్యూఢోరస్కః = విశాలమైన వక్ష స్థలము కలవాడు.
1066. మహాభుజః = అన్నింటికిని మూల కారణమైనవాడు.
1067. నిరాతంకః = ఎట్టి ఆటంకములు లేనివాడు.
1068. నరనారాయణప్రియః = నరనారా యణులను మునుల కిష్టుడు.
1069. నిర్లేపః = మమకారాదులు లేని వాడు.
1070. యతిసంగాత్మా = నియమాదుల యందు సంబంధమున్న ఆత్మ కలవాడు.
1071. నిర్వ్యంగ్యః = అధిక్షేపమములు లేని వాడు.
1072. వ్యంగ్యనాశనః = ఆక్షేపములను నశింపజేయువాడు.
1073. స్తవః = స్తుతి స్వరూపుడు.
1074. స్తుతిప్రియః = స్తుతులయందిష్టము కలవాడు.
1075. స్తోతా = స్తోత్రముచేయువాని స్వరూ పుడు.
1076. వ్యాప్తమూర్తిః = అంతటను వ్యాపిం చిన మూర్తి కలవాడు. సర్వవ్యాపి.
1077. నిరాకులః = వ్యాకులపాటు లేనివాడు.
1078. నిరవద్యమయోపాయః = ఉత్తమ మైన మోక్షమునందుట కుపాయ మైనవాడు.
1079. విద్యారాశిః = విద్యల సముదాయ మైనవాడు. సర్వవిద్యా స్వరూ పుడు.
1080. సత్కృతః = గౌరవింపబడినవాడు.
1081. ప్రశాంతబుద్ధిః = ప్రశాంతబుద్ధి స్వరూపుడు.
1082. అక్షుణ్ణః = బాగుగ దెలియనివాడు.
1083. సంగ్రహః = సంగ్రహ స్వరూపుడు.
1184 నిత్యసుందరః = శాశ్వత సుందరుడు.
1085. వైరాగ్యధుర్యః = వైరాగ్యవంతులలో గొప్పవాడు./వైయాఘ్రధుర్యః- పులి చర్మమును ధరించినవాడు.
1086. ధాత్రీశః = భూమికి అధిపతి.

